శ్రీరామ

# శ్రీ ప్రార్థనాభాగవతము

## ద్విపదలు

## ద్వితీయ భాగము

దశమస్కంధము నుండి ద్వాదశస్కంధము వఱకు

రచయిత :

విద్వాన్, మధురకవి

కనుమలూరు శివరామయ్య




ప్రచురణ:

కార్యనిర్వహణాధికారి,

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

1983

SRI PRĀRTHANĀ BHĀGAVATAMU

By

*Vidwan, Madhurakavi Kanumaluru Sivaramaiah*

T. T. D. Religious Publications Series No. 134

First Edition : 1983

Copies 1,000



*Published by* :
Sri G. Kumaraswamy Reddy, I.A.S.,
Executive Officer,
T. T. Devasthanams,
Tirupati.



*Printed at* :
Tirumala Tirupati Devasthanams Press,
Tirupati - 517 501.

# ముందుమాట

భారత భాగవత రామాయణాలు వేదాల తరువాత చెప్పదగ్గ రసామ్నాయాలు. వేదవేదాంత సుస్నాతుడైన వ్యాసభగవానుడి ప్రణీతమూ, భగవల్లీలా ప్రతిపాదకమూ అయిన శ్రీమద్భాగవతం మన అందరికీ పరమపవిత్రమైన గ్రంథం. అష్టాదశ మహా పురాణాలలో రాణకెక్కిన శ్రీ మద్భాగవతం వేదోపనిషత్తుల సారమే. శ్రీ శుక మహర్షి ముముక్షువైన పరీక్షిత్తుకు ఈ గ్రంథాన్ని ఉపదేశించాడు.

పరమ దయాళువైన భగవానుడు ఈ లోకంలో వాసుదేవుడిగా మానవరూపంలో అవతరించి, తన దర్శన స్పర్శన ఆలపనాదుల మూలంగా లోకాన్ని అనుగ్రహించి సమకాలికులకే కాకుండా భావి తరాల వారికి కూడా తమ అనుగ్రహాన్ని ప్రసరింపచేయడానికి శ్రీమద్భగవద్గీతను అర్జునుడిద్వారా అందించి, అంతటితో తృప్తి పొందకుండా కలియుగంలో లోక రక్షణకోసం శ్రీ మద్భాగవతంలో తన దివ్యతేజాన్ని సంక్రమింపచేశాడు. అందువల్ల శ్రీ మద్భాగవతం వాఙ్గ్రూపమైన భగవదవతారం.

భాగవతం విష్ణుకథా ప్రధానమైన ప్రబంధం. వేదాంత విజ్ఞాన బంధురమైన ఈ గ్రంథం పునరావృత్తిరహితమైన శాశ్వత మోక్షాన్ని ప్రసాదిస్తుంది. ఎన్ని జన్మలకో కాని సాధించబడని మోక్షపురుషార్థాన్ని భాగవతం సులభమార్గంలో కైవసం చేస్తుంది. ఇంతకంటే మానవుడికి ఇంకేమి కావాలి?

ఈ పురాణాన్ని పరమ భక్తాగ్రేసరుడూ, శ్రీ పరమేశ్వర కరుణా కటాక్ష లబ్ధ పాండితీ విరాజమానుడూ అయిన శ్రీ బమ్మెర పోతనామాత్యుడు పదిహేనవ శతాబ్దంలో ఆంధ్ర భాషలోకి అనువదించిన విషయం అందరికీ తెలిసిందే. పోతన భాగవతం సంస్కృత భాగవతం కంటే పరిమాణంలోనూ, పరిపాకంలోనూ మిన్న. తెలుగు నాట భాగవత కల్ప తరువును నాటిన పోతన తెలుగు జాతికీ, తెలుగు కవిత్వానికీ సుకృతం పంట.

ప్రాచీన సాహిత్యమంతటిలోనూ రెండే రెండు కృతులను గురించి చెప్పాలంటే ఒకటి కవిత్రయం వారి భారతం, రెండోది పోతన భాగవతం. ఆంధ్ర భాగవతం శబ్ద స్వరూపం పొందిన శ్రీ కృష్ణ తత్త్వామృతం. భాగవతశైలి అంత గ్గూఢరసోదయం; నారి కేళపాకం.

భాగవతంలో ధ్రువోపాఖ్యానం, పురంజనోపాఖ్యానం, జడభరతోపాఖ్యానం, అజామిళోపాఖ్యానం, చిత్రకేతూపాఖ్యానం, ప్రహ్లాదోపాఖ్యానం, గజేంద్రమోక్షగాథ, అంబరీషోపాఖ్యానం, కుచేలోపాఖ్యానం, రుక్మిణీకల్యాణం, వామన చరిత్రలాంటి ఎన్నో ఉపాఖ్యానాలు వున్నాయి. పోతన భాగవతం అవతరించిన తరువాత ఈ ఉపాఖ్యానాలకు సర్వజనీనమైన ప్రఖ్యాతి లభించింది.

పోతన భాగవతం ఆధారంగా దేశీయమైన ద్విపద ఛందస్సులో ఈ ప్రార్థనా భాగవతాన్ని విద్వాన్, మధురకవి శ్రీ కనుమలూరు శివ రామయ్యగారు వ్రాశారు. భక్తి జ్ఞాన వైరాగ్య తత్త్వాలకు పెన్నిధి అయిన భాగవతాన్ని రచించడానికి ప్రతిభ, పాండిత్యం మాత్రమే కాకుండా గుణశీలాలు కూడా వుండాలి. పరమ భాగవతులైన శ్రీ శివ రామయ్యగారు పండితులూ, కవులూ మాత్రమే కాకుండా విద్యా వినయ సంపన్నులు కూడా.

కథా కథనానికి బహువిషయ పరిజ్ఞానం, లౌకికజ్ఞానం, శాస్త్ర పాండిత్యాలను జోడించి కళామయంచేసిన కవి ఈయన. వీరికవిత్వం ద్రాక్షాపాక శోభితం. కీర్తినీ, జ్ఞానాన్నీ, సర్వాభీష్టాలనూ సిద్ధింపజేసే ఈ గ్రంథం మూలంగా శ్రీ శివరామయ్యగారు ధన్యజీవనులయ్యారు.

చక్కని కవితాధార, సరళమైనభాష, పాడడానికి అనువైన రీతిలో వుండటంవల్ల ప్రార్థనాభాగవతం ప్రజాబాహుళ్యంలో ప్రచారం పొందగలదని మా విశ్వాసం.

జి. కుమారస్వామిరెడ్డి, ఐ.ఏ.ఎస్,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు.

తిరుపతి,
ఏప్రిల్ 29, 1983

# విషయసూచిక

## దశమస్కంధము : పూర్వభాగము

## దశమస్కంధము – ఉత్తరభాగము

## ఏకాదశస్కంధము

## ద్వాదశస్కంధము





# శ్రీ ప్రార్థనా భాగవతము

(ద్విపదలు)

## దశమస్కంధము

### పూర్వభాగము

శ్రీ మనోహర, భక్త చిత్తవిహార
సామజారివిదార, సాధుమందార
గరుడవాహన, జగత్కల్యాణమూర్తి
సురచక్రవర్తి, భాసురదివ్యకీర్తి
భూభార మణఁగించి భూప్రజకెల్ల
శోభనంబులను గూర్చుచునుందు వీవు
భవదీయ మహిమలు బ్రహ్మకునైన
నవగతములు గావు యతిలోకవంద్య

### మహావిష్ణువు భూదేవికి దేవతలకు అభయ మొసంగుట

మును రాజలాంఛనమ్ములతోడ మిగిలి
దనుజులు బువిఁబుట్టి ధర నాక్రమింప
భూదేవి యాభారమును మోయలేక
ఖేదమ్ము నొంది రక్షించెడు వేల్పుఁ
గానక పరమేష్ఠి కడకు గోరూప
మూని యరుగుదెంచి యుద్వేలమైన
తన గోడు వినిపించి తన బాధ తీఱు
ననువగు మార్గమెయ్యది తెల్పు మనుఁడు
కరుణాళుఁ డగుచు నా కమల గర్భుండు
ధరణీసతిని దేవతలఁ దనవెంటఁ

గొని నినుఁ గన్గొను కోరికతోడఁ
జనుదెంచి భక్తి నిశ్చల మానసమున 10
పురుషసూక్తమును విబుధులును దానుఁ
బరమ శ్రద్ధాళువై పఠియించి నంత
శ్రీరమానాథ యదృశ్యరూపమున
కారుణ్యమతి వారిఁ గని యిట్టులంటి

"వినుఁడు దేవతలార, వినిపింతు నిజము
మనుఁడు నాహితము నెమ్మనముల నమ్మి
యాదవకులమున నమరు లెల్లరును
మేదిని బుట్టుఁడు: మిగుల ధర్మాత్ముఁ
డగు వసుదేవున కాత్మజుండనయి
తగ వెలుంగుచు నేను ధరణి భారమ్ము
నణఁచఁ గలాఁడ నన్నర్చించ విబుధ
వనితలు పుట్టంగ వలయును భువిని.
ఆదిశేషుండు నా కగ్రజుఁడగుచు
నా దివ్యకళఁ బుట్టు నాకుఁ దోడ్పడఁగ
ఏ మాయచేత మోహిత మౌను జగతి
యామాయ రూపొంది యవనిపైఁ బుట్టు
నీ రీతి సన్నాహ మేర్పడ నేను
ధారుణిపైఁ బుట్టి, ధర్మమ్ము నిల్పి
జగతికి నిశ్చల శాంతమ్ము గూర్తు
వగమానుఁ" డని వారి భయము వాపితివి. 20

సర్వరక్షకుఁడవు సర్వాత్మకుఁడవు
సర్వదాతవు సర్వసాక్షివి, నన్ను,
పాపాత్ము, భవదీయ భక్తునిగాఁగఁ
జేపట్టి ప్రోవుమా శ్రితజనపాల.

## కంసుఁడు బయలాడు మాటలు విని దేవకిని జంప నుంకించుట

శ్రీ పుండరీకాక్ష, శ్రితజనపక్ష
పాపవిపక్ష, సుపర్వసంరక్ష
గోవింద, మానవుల్ గొందఱు తమకు
భావిఁ బ్రాపించు విపత్తు లెట్టివియొ
తామెఱింగియును సత్పథమునఁ బోక
యామున క్రూరులై యక్రమచర్య
లెత్తఱి సల్పుదు రేమాత్రమేని
చిత్తానఁ దలఁపరు శిష్టమార్గంబు —

మును మధురాపురమ్మున శూరసేనుఁ
డనురాజు నాత్మజుఁ డలఘు మానసుఁడు
వసుదేవుఁ డానంద భరితాత్ముఁ డగుచు
వసుమతీ తుల్య దేవకి యనుదాని
పరిణయమాడి, యా పడఁతియు నాతఁ
డరద మారోహించి యరిగెడు వేళ
ఉగ్రసేను కుమారుఁ డురుతరగర్వి
ఆగ్రహమతి కంసుఁ డతి వేడ్కతోడ 30
చెల్లెలు, మఱఁది హృత్సీమలయందుఁ
బెల్లు మోదమునొందు విధమున రథము
నెక్కి పగ్గముల చే నిమిడిచి, ఘాత
నక్కజంబుగవేసి, యదలించి, హరులఁ
గదలించి యా తేరు గడపుచునుండ
చదలున నుండి విస్పష్టమ్ము గాఁగ
ననయుఁడౌ నా కంసుఁ డదరెడు నట్లు
వినఁబడె నొకమాట వింతగా నిట్లు.

"ఓరి, నీ సోదరి యుబ్బెడునట్లు
తేరుఁ దోలెదు మీదు తెలియకున్నాఁడ
వీమె కేర్పడునట్టి యెన్మిదోచూలు
నీ మృత్యుమూలమ్ము నిజమిది సుమ్ము."

అనుచు నున్నటులుండి యతి భీకరముగ
వినవచ్చు వాక్కుల విని వాఁడొకింత
వడినూరకుండి, యాపయి నడిదంబు
వడి నొఱనుండి సంభ్రమమునఁ బెఱికి,
చెలియ లనియెడి దాక్షిణ్యమ్ము గూడఁ
దలఁపున నుంప కా తన్వి దేవకిని
కొప్పు చప్పునఁ బట్టి కుపితుఁడై నఱుక
రొప్పుచు నుండ నా క్రూరుని డాసి 40
వసుదేవుఁ డనునయ వాక్యామృతమున
వెసరేఁగు నాతని భీమ కోపాగ్నిఁ
జల్లార్చి యల్లన సరసనఁ జేరి
మెల్లగా నిట్లనె మిత్రత్వ బుద్ధి

## కంసుఁడు వసుదేవుని ప్రార్థనపై దేవకిని జంపక వదలుట

"భోజేశ్వరా! కంస భూపతీ! యేల
ఈ జోటిఁ జంప నూహించితి వీవు
అన్నలు చెల్లెండ్ర నాదరించెదరు
మన్నన తోడుత మర్యాద గూర్తు
రెపుడీ నెలఁత నీదు హితమె కాంక్షించు
నపరాధినియె యీమె యాగ్రహింపంగ
బయలాడు మాటలు పథ్యమ్ము లగునె
నయవేది విట్టి యన్యాయమ్ము తగునె?

ఏల నీకీ భ్రాంతి. యీ తన్వి గనెడు
బాలల నీకిత్తుఁ బరిమార్పువారి
నంతియేగాని యీ యబల నవోఢ
స్వాంతమ్మునందు మచ్చరమును బెంచి
చంపఁబూనుట భవచ్చరితకు నింద
నింపుకార్యమ్మని నెఱనమ్ముమయ్య."
అని పెక్కు విధముల నా యదురాజు
చనవున నాభోజు శాంతుఁ గావింప 50
ఆ నయోక్తులఁ గొంత యలరి కంసుండు
మానసంబునఁ గిన్క మఱుపడఁ జేసి
చెలియలి విడిచి చెచ్చెఱఁ దాను జనియె.
తొలఁగె నూతన దంపతులకు నా యిడుమ.

తొలి కాన్పు కొమరుని దుఃఖమ్ము మాని
ఖలు కంసు చెంతకుఁ గట్టడ విడక
తెగి కొని చనె వసుదేవుఁ డా బాలుఁ
దెగటార్పఁ బూనక ధీరుఁడై కంసుఁ
డానకదుందుభి కానంద మొదవ
తానిట్లు వచియించె తన నిశ్చయమ్ము.
"వసుదేవ! వినుము దేవకి కనునట్టి
నిసువులలోన నెన్మిదియవ కాన్పు
బిడ్డను నాకు నర్పింపుము: వాని
జడ్డనఁ దెగటార్చి. శత్రుభయమ్ము
వదల జీవింతు. నీ పాపని నీదు
సదనమ్మునకుఁ గొని చనుము మోదమున."
అని పంపె. వసుదేవుఁ డతి ముదమందె
చనుచుండె కాలమ్ము చల్లగా. నంత —

నారదముని యొక్కనాఁడు విచ్చేసి
తీటీక నీ రీతిఁ దెలిపె కంసునకు 60

## నారదుని వలన కంసుఁడు కృష్ణావతారముం గూర్చి విని దేవకీ వసుదేవుల చెఱనుంచుట

"వినుమోయి కంస, నా వివరించు పల్కు
లనుమానపడకు సత్యములుగా నమ్ము
నందాదులును వారి నందనుల్ సతులు
మందలో నున్నట్టి మనుజు లందఱును
దేవకి మొదలగు స్త్రీ జనమ్ములును
భావింప మీ బావ వసుదేవుఁ డాది
యాదవోత్తములెల్ల నమరులే గాని
కాదు మానవు, లెఱుంగవు మరి వినుము –
నీవును నినుఁ జేరు నీవారు పూర్వ –
దేవాంశజులరని తెలియు మింకైన
దేవకి గర్భాన దేవాదిదేవుఁ
డావిర్భవించి, యీ యవనికిఁ గీడుఁ
గలిగించు చెనఁటి రక్కసులను బట్టి
పొలియించు, శుభములఁ బొరయించి మించు."

అమ్మాటలను విని యా కంస విభుఁడు
నెమ్మనమ్మున దిగుల్ నెక్కొన మిగుల
నారట మొందుచు యాదవుల్ తనకు
వైరి వర్గముగాఁగ భావించి వారి
కులము సమూలము గూల్పంగ నెంచి
చెలియలి, వసుదేవుఁ జెఱను బంధించి 70

వారికి గల్గెడు పాపలనెల్లఁ
గ్రూరబుద్ధిని బొరిగొనుచుండె జనన —
మందిన యాక్షణ మాలసింపకయు
నిందకు వెఱతురే నెఱిలేనివారు.
తన భవిష్యము నెల్లఁ దగ వినిపించె
వినువీథిః యద్దాని వివరించి చెప్పె
నారదుఁ డరుదెంచి నమ్ముమటంచుఁ
గ్రూరులు హితము గైకొందురే యెందుఁ
దన చావు తెలిసియుఁ దానందు నిందు
ననుపమ సౌఖ్యమ్ములందు సత్పథము
లెవ్వియో గుర్తింపకే వైరబుద్ధి
నివ్వటిల్లఁగఁ జేసె నిక్కి కంసుండు —

పెద్దల సూక్తుల వినుమంచు బుద్ధి
తద్ద నాకుం గూర్చి, ధర్మమార్గమున
నను దిద్దవే జగన్నాయక, దేవ,
నిను నమ్మినానయ్య నిత్యసద్భావ!

## భగవంతుఁడు యోగమాయకుఁ జేసిన యాజ్ఞ

## బలరామ జననము

జగదీశ, భక్తవత్సల, పరమేశ
నిగమవేద్య చరిత్ర, నీరజనేత్ర
శౌరి, ముకుంద, నీ సంకల్పమునకు
మారున్నదే రమా మహిళాధినాథ! 80
ఖలుని కంసుని దుష్టకార్యముల్ ప్రజల
నలయించుచుండె సహ్యముగాని యట్లు

దేవకి బిడ్డలఁ దెగి యారుగురను
కావరమ్మునఁ గడుఁ గఠినాత్ముఁ డగుచు
పురుటింటిలోననే పుట్టిన యపుడ
పొరిగొనె పితరులు పొగులుచు నుండ
నీ రీతి కంసు దుష్కృత్యమ్ములెల్ల
మేర మీఱుట, ప్రజల్ మిడుకుట గాంచి
యోగమాయాదేవి నొయ్య రావించి
యీ గతి నానతి నిచ్చితి వీవు.

"ఓ యోగమాయ, మహోన్నత శక్తి
నా యాజ్ఞ పాటించి నాకుఁ దోడ్పడుము.
గోపాలు రుండెడు గోకులమునకు
నేపార భద్ర! నీ వేగంగ వలయు
వసుదేవుసతి కంసువలనఁ దా వెఱచి
వెస, రోహిణీ నామ విఖ్యాత చరిత
మందవారెల్లరు మా భాగ్యమనఁగ
నందుని యింట నున్నది గుణగణ్య
శేషాఖ్యమై నా ప్రసిద్ధ తేజమ్ము
యోష శ్రీదేవకి యుదరమ్మునందుఁ 90
గలదు తత్తేజమ్ముఁ గడునేర్పు వెలయఁ
గలకంఠి రోహిణి గర్భమ్మునందుఁ
జొనుపుము: దేవకి సుతుఁడగా నేను
జనియింతు: నందుని సతి యశోదకును
బుట్టుము నీ వొక పొలఁతి రూపమున
దిట్టవై సాధింపు దీని నంతయును.
నిను భువి ప్రజలు పునీతగాఁ దలఁచి
ఘనముగా పూజలు గావించుచుంద్రు,

కానికల్ బలులును గడమలే కొసఁగి
నీ నామధారులై నిన్ను సేవింత్రు
సర్వసంపదలకు స్థానంబ వగుచు
సర్వకామదవయి సకల లోకులకు
నభిమత కార్యంబు లమరుపఁ గలవు.
విభవ సంపత్తితో విలసిల్లఁ గలవు—
పదునాల్గు పేరులఁ బలు దేశములను
గుదిరి పూజలను గైకొనుచుండఁ గలవు."
అనుచు నాజ్ఞాపించి, ఆశీర్వదించి
పనిపితి మాయను భద్రంబుగోరి.
భవదాజ్ఞఁ దలఁ దాల్చి భద్ర యమ్మాయ
సవినయమ్ముగ నమస్కారముల్ నీకు 100
ప్రవిమల మతిఁజేసి, వసుమతిఁ జేరి
యవితథమగు మాయ యచ్చువడంగ
దేవకి కడుపున తేజు మీఱంగ
భావుకమై దీప్తి వరలు గర్భంబు
నిమ్ముగఁ దివిచి రోహిణి కడ్పునందు
నెమ్మిఁ జేరిచె మాయ నివ్వటిలంగ
దేవకి గర్భంబు దిగెనంచు భ్రాంతి
భావించి రప్పుడు పౌరులెల్లరును.

అంత రోహిణి గర్భమందుండి పుట్టె
కాంతిదినేశు డొక్కం డర్భకుండు
ఆతఁడే బలభద్రుఁ డాతఁడే రాముఁ
డాతఁడే సంకర్షణాది నామముల
నలరుచు నీవు కృష్ణావతారమున
వెలయు వేళల నిను౯ విడనాడ కుండి

నీకు నగ్రజుఁడయి, నిఖిల కార్యముల
వీఁకఁ దోడ్పడుచుండె విబుధులు మెచ్చ.

మాయ జగమ్ము సంభ్రాంత మొనర్చి
వేయు రీతుల మార్పు వెలయింపఁ జేయు
ఆ మాయయే భవదాజ్ఞానువర్తి
యై మలయును నీదు నభిమతమట్లు 110
దేవ! మాయాతీత దివ్య ప్రభావ!
యీవె సర్వనియంత వీవె యాద్యుఁడవు
నను మాయ ముంపక జ్ఞానిగాఁ దీర్చి
కనికరింపవె జగత్కల్యాణదాత!

## శ్రీకృష్ణ జననము

శ్రీ వనమాలి, శార్ఙ్గి వాసుదేవ,
దేవాదిదేవ, సుస్థిర దివ్యభావ
అర్థుల కొసఁగిన యభయదానమ్ము
వ్యర్థమ్ము గాకుండునటు భువిఁ బుట్టి

ధర్మమ్ము నిల్పి యధర్మమ్ము దుల్పి
శర్మమ్ము జగతికి సమకూర్చు నీదు
మహిమల నెఱిఁగి నెమ్మది గొనియాడ
నహివల్లభునకేని నలవిగాదయ్యె.

పరమపవిత్ర దేవకి గర్భమందు
హరి! నీవు పిండమై యభివృద్ధిఁ జెందు
నవసరమ్మున జగమందున నెందు
వివిధమ్ములైనట్టి వింతలేర్పడియె
అరులకెల్లను గుండె లవియుటేగాక

తిరమగు కీరితి దిగజారిపోయె.
గృహములందున ధూమరేఖలు పుట్టె
సహియింపవయ్యె భోజన పదార్థములు 120
తలవని తలఁపుగాఁ దమ మానసములఁ
గలఁకవిచారమ్ము కడువడిహెచ్చె.
మునులకు సురలకు ముద మావహిల్లె
మనముల శాంతిసంపద నివ్వటిల్లె
దేవకి చూల్దిన దిన మభివృద్ధి
భావితమౌచుంట భావించికంసుఁ
డది తన మిత్తిగా నాత్మఁ దలంచి.
యెదిరి వైకుంఠుఁడా యింతిగర్భమున
పదిలమ్ముగాఁ జేరి. పట్టి రూపమున
నెదుగుచున్నాఁడని యెద భీతి భ్రాంతి
పెనఁగొన. నూఱడువిధ మొండులేక
జననమైనట్టి తత్క్షణమ యా శిశువు
హననమ్ము గావింతు నని నిశ్చయించి
కినుక లో లోఁ బెంచి కిమ్మనకుండెఁ
గాని యా క్రూరుఁడు కళవళపాటు
పూనిన మనసునఁ బొగులుచునుండు
తిరుగునప్పుడు. తిండి తినునప్డు. లేచి
యరుగునప్పుడు. నీర మానెడునపుడు
మరి తన నిత్యకర్మలు సల్పునపుడు
హరియని మదిలోన ననుచు సర్వమ్ము 130
హరిమయమ్మని యాత్మ నరసియు. నలుక
కరము నీపైఁ బెంచెఁ గమలాక్ష. మరియు
కన్నది విన్నది ఘ్రాణించునదియు
పన్నుగాఁ దాఁ బొందు ప్రతిపదార్థమ్ము

నీదిగా, నీవుగా, నీవుండునదిగ,
నీదు సంబంధమొందినదిగ నతఁడు
వైరానుబంధంబు వరల నీ రీతి
కారుణ్యనిధి నిన్నుఁ గనుచుండె నెందు.

కాలమిట్టులు గొంత గడవ దేవకికిఁ
జూలు నిండుటయు, ప్రసూతియౌ వేళ
యాసన్నమగుట భవాబ్జగర్భులును
వాసవాద్యమరులు భక్తి నేతెంచి
దేవకీగర్భస్థు, దీనమందారు
పావన చరితుని పద్మాక్షు నిన్ను
పలువిధంబులవేఁడి ప్రాంజలుల్ సేసి
ఖలులు కంసాదిదుష్కర్ములు జగతి
నిడుమలపాల్సేసి యేఁపుచున్నారు
తడవేల దయచేసి దయఁబ్రోవుమయ్య
అని మొఱలిడి తమ యావాసములకుఁ
జని రెల్లరును సంతసము మీఱ, నంత 140

దేవకి నీళ్లాడు దినమున మిగుల
భూవలయమ్మునఁ బొదలె శుభాలు
జలధు లేడును బొంగె స్వచ్ఛంబు లగుచుఁ
గలనాదమొప్ప మేఘములెల్లనుఱిమెఁ
జుక్కలతోఁగూడి శోభిల్లెఁ జదలు
దిక్కులు మిక్కిలి తెలివితో వెలసెఁ
జల్లకమ్మనిగాలి సన్నఁగా వీచె
పెల్లుగా హోమాగ్ని విశదమై వెలిఁగెఁ
గమల సంపద తటాకములు రంజిల్లె
నమల నీరమ్ములై యలరారె నదులు

జనపద నగర ఘోషముల మేలయ్యె
వనములు ఫలపుష్ప భరితమ్ములయ్యె
వివిధ జంతుచయమ్ము వేడుక గనియె
పువులసోనలు దివమ్మునసుండి పడియె
పాడిరి గంధర్వవరు లుబ్బి మీఱ
నాడిరి రంభాదు లాశలు దీఱ
ఈ రీతి నుత్సవ మెసఁగంగ సృష్టి
తీఱని మోదానఁ దేలుచునుండ
నడురేయి గ్రహములు నక్షత్రములును
గడు శుభస్థలములఁ గడుకొనియుండ 150
నుత్తమోత్తమ లగ్న మొనరిన వేళ
నత్తలోదరి పూజ్య, యతి సుస్వభావ
దేవకి కనె నిను దేవాదిదేవు
శ్రీవిలసద్దేహు జిష్ణుని విష్ణు
నిను జలదశ్యాము, నీరజనేత్రు
ఘన చతుర్బాహుని కాంచనచేలు
హార కిరీట రత్నాంగదహారు
శ్రీరమా ధ్యాసిత శ్రీవత్సవక్షు
మంగళాకారుని మహితాత్ము వరదు
నంగము లుప్పొంగ నా దేవకియును
వసుదేవుఁడును గాంచి, ప్రాంజలుల్ చేసి
వెస నుతియించిరి వేర్వేర నిట్లు,

## వసుదేవుఁడు బిడ్డఁడై పుట్టిన భగవంతుని ప్రార్థించుట

"నిన్ను జ్ఞానానందు నిఖిల దర్శనుని
వెన్నుని భవదూరు విశ్వమయాత్ముఁ

దనయుగాఁ బడసితి ధన్యుండనైతి
మునుపుట్టువున నెట్టి పుణ్యవ్రతములు
సలిపితినో వాని సత్ఫలమిద్ది
యలఁతియే నాదు భాగ్యము సర్వరక్ష
మిన్నుపల్కు లెడంద మేంద్రింప మొదల
ఖిన్నుఁడై యావల, కెరలి కంసుండు 160
నీవు నా యందు జన్మింతు వటంచు
వావిరి యలుక నీ పయిఁ బెంచి, నీకు
నెదురు చూచుచు, హింస కే మాత్ర మేని
కొదుకక విదళించెఁ గూనల, నీదు
నన్నల నార్గుర నంతటఁబోక
యున్నాఁడు నిద్దురయును మాని, నీవు
జనియించు టెఱుఁగఁ దత్క్షణము నిన్నెదుర
మునుకొని వచ్చు నా మూర్ఖుఁడు దేవ."
అనుచు నా వసుదేవుఁ డచ్యుతా, నీకు
మనవి సేయుచునుండ, మానిని సాధ్వి
దేవకి, దేవాధిదేవు నిన్గాంచి
భావంబు పొంగఁగఁ బ్రార్థించె నిట్లు.

## దేవకి ప్రార్థనము

"శ్రీలలనామణీ చిత్తవిహార
పాలిత సురబృంద, పాహి గోవింద
పుట్టుటే యెఱుఁగని మొదటి దేవుఁడవు
పుట్టితి నా పూర్వపుణ్య వశాన
పట్టివై నాకు, నా వ్రతములు పండె
నిట్టులమౌ మోద మెంతయో నిండె

జగము లన్నింటి నీ జఠరము నందు
తగనుంచి కాపాడు దైవమ్ము నీవు 170
నా లఘు జఠరమ్మునన నెట్టులుంటి
నీ లీలలివి చెప్ప నేరరెవ్వరును
నినుఁగంటి మందు రెన్నికగన్న యోగి
జనములు. కాని. యీ చక్కని రూపుఁ
గనుఁగొని యుండరు కంజాక్ష! నేను
కనుగొంటి నా జన్మ కడు ధన్యమయ్యె.
అపవిత్రములు నాదు నక్షులు వీన
నపురూపమగు భవ దనఘ రూపంబుఁ
దిలకింపఁ బోల దీ దివ్యరూపంబుఁ
దలఁగంగఁ బెట్టుమా తామరసాక్ష
ఈవు మాకు జనించు టెఱిఁగి కంసుండు
కావరమున మము కారఁ బెట్టించె
ఆ పాపి దండించి యార్తుల మమ్ము
కాపాడవే లోక కల్యాణమూర్తి."

ఈ రీతి నిను నుతియించిన యట్టి
వారికి దేవకీ వసుదేవులకును
వారల తొలిపుట్టు వార్తలు సెప్పి
మీరు ధన్యులరుసుమీ. మీకు జన్మ
లిఁక లేవనుచు వరమిచ్చి యోదార్చి
అకలంకచరిత! మహాత్మ! ఆ రూపు 180
విడిచి మాయను బూని పృథివిని నపుడ
పొడమిన పాపని పోల్కి గన్పడితి.

## వసుదేవుఁడు కృష్ణుని మందలో నందుని మందిరమునఁ జేర్చుట

జననాదు లెఱుఁగని శాశ్వతమూర్తి,
వనఘుడ, వాద్యుఁడ, వగు దేవ నీవు
తన పుత్రుఁ డగుట కెంతయుఁ బొంగి, యర్థ
జనులకు మదిలోన సకలదానముల
నిచ్చి యా వసుదేవుఁ డెచ్చిన భక్తి
యిచ్చ నీ యాన తా నేర్పడ మున్నె
వినియుంట నీ రీతి వేగ కార్యమ్ము
లొనరింప తమకమ్ము నూని యాతండు
నిను ముద్దుబాలుని నీరదశ్యాము
తన యక్కునందునఁ దగ నడ్డముగను
నిడుకొని యా పురుటింటిని వదలి
యడుగుల మెలమెల్ల నవనిపై నిడుచు
నడువంగఁ దొడఁగె, గ్రన్నన కవాటముల
నిడియున్న తాళమ్ము లెల్లను వీడె
నిదురలో మునిఁగి కన్దెరువరు భటులు.
పదపడి శేషుండు పదిలమ్ముగాఁగ
తలుపులనెల్ల యథారీతి మూసి
విలసిత ఫణములు విప్పి ఛత్రముగ 190
నిన్ను సేవించుచు నీరజనాభ
తెన్నున నా వసుదేవు వెన్నంటి
చనుచుండె. నడుత్రోవ జమున వారలకు
ననుకూలముగ పాయయై దారి యిచ్చె
అంతట వసుదేవుఁ డా నది దాటి
స్వాంతముప్పొంగ వేచని మందఁజేరె

కాలాత్మ నీదు సంకల్పమ్మునట్లు
ఆలోన నావేళ నామందయందు
చూలాలు నందునిసుదతి యశోద
బాలికఁ బ్రసవించి ప్రక్కపైఁ బండి
యుండె. నీ మాయ తా నొండేమి యెఱుఁగ
కుండె. నిద్దుర మున్గియుండె శ్రీనాథ!
అంతట వసుదేవుఁ డా నందగోపు
కాంత యశోద సంగడికిఁ దా నేఁగి
బాలకు నిను నామె ప్రక్కను జేర్చి
ఆ లలనాసుత నప్పుడె తెచ్చి
చెఱఁజేరి. దేవకి చెంతను జేర్చి
స్థిరమతిఁ దానుండె దీనమందార.

## కంసుఁడు శిశురూపమున నున్న యోగమాయను జంపఁ బూనుట

కావు కావనుచు దక్షణమ రోదనము
గావించె నా బాల కావలి వార 200
లా చప్పుడాలించి. యపుడు మేల్కాంచి
వే చని కంసభూవిభునకు మ్రొక్కి
"దేవకి నీళ్లాడె దేవర! మీరు
రావలె" ననుచు ప్రార్థనము సేయంగ
నాతఁడు తనదు పర్యంకమ్ము నుండి
బీతు. సంబరమును బెనఁగొన లేచి.
తాలిమిమాలి. క్రోధమ్మును బెంచి
వేళమ యటనుండి వెడలి. కేశములు
వీడ. పై చేలమ్ము వ్రేలాడ. పగయె
తోడుగాఁ జని. కడు దుడుకున పురుటి

యిలుదూరి యా పాప నెగదిగఁ జూచి
కలుషాత్ముఁడయి చంపఁగాఁ బూనుటయును
వాని పూనికకు దేవకి యడ్డమగుచు
దీనయై యిట్టు లర్థించె నాతనిని

## బిడ్డను చంపవలదని దేవకి కంసుని వేడుట

"అన్న! శాంతము నొందుమన్న. యీ బిడ్డ
యెన్న నల్లుఁడె? కను మిది కోడలౌను
మగువఁ జంపుట రాచమరియాద గాదు
తగను మన్నించుటే ధర్మమౌనన్న.
పెద్దల మార్గమ్ము విడనాడకన్న
తద్ద నీ ముద్దు సోదరినేఁ గదన్న 210
పొరిగొంటి వార్గుర పుత్రుల. దీనిఁ
బరిమార్చెదే యాడుపడుచును. నిసువు
బాలుఁడుగద నీదు ప్రాణాంతకుండు
బాలికఁ జంపిన ఫలమేమి గలుగు?
శత్రుభావము మాని శాంతించినాకు
పుత్రిక నిమ్మన్న. పుణ్యమౌనన్న"
అనుచు నిజాత్మజ నక్కునఁ జేర్చి
పొనరఁ జెక్కునఁ జెక్కుమోపి సంవ్యాన
చేలాంచలమ్మున శిశువును మూసి
కూళు కంసునిగని కుములుచు నుండెఁ

## యోగమాయ నిజరూపముంబొంది కంసుని భయపెట్టుట

గాని యాతఁడు కడుకఠినాత్ముఁ డగుట
మానిని. దేవకి. మాన్య. కనిష్ఠ

గోడుఁ జూడక యామెఁ గోపించి తిట్టి
పాడి పాటింపక బలిమి నా శిశువు
కాళులఁ బట్టి యక్రమముగ లాగి
నేలపై వేయ నా నిసువు తత్క్షణమ
బువి మీఁదఁ బడక చప్పున దివి కెగసి
వివిధాభరణములు, వివిధ మాల్యములు
వెలయంగఁ దాలిచి వివిధాస్త్రశస్త్ర
ముల నష్టబాహుల పొందుగఁ బట్టి 220
యచల విద్యున్నిభమగు దేహకాంతి
ప్రచురమై దశదిశల్ ప్రబ్బికొనంగ
భీకరరూపమ్ము వెలయఁ గన్పించి
వీఁక నా కంసుండు విన నిట్టు లనియె.
"ఓరి దుర్మార్గ, మహోగ్ర పాతకుఁడ,
పారమ్ముగలదె భవద్దౌష్ట్యమునకు?
తెంపరివై నీవు దేవకి సంతుఁ
జంపితి వందఱ చలపట్టి వరుస
అంత నాఁగక నన్ను హతమార్పనెంచి
తెంత వీరుఁడవయ్య, యెఱుఁగు మింకైన
నినుఁ జంపువాఁడు జనించియున్నాఁడు
మనుచు నున్నాఁడు సుమా! యెందుచోట"
అనుచు నంతర్హితయయ్యె నాదేవి
మనమున వెఱ యినుమడియౌట కంసుఁ
డంతట తెలివొంది యాత్మగతమున
నంతయు నొక్కమా రాకళించుకొని
తనదు దుర్మార్గవర్తనకు విచార
మును బొంది, బావను ముదుచెలెలిని

క్షమియింపఁ బ్రార్థించి సంకెలల్ డుల్చి
శమిత మనస్కుఁడై సదనమ్ముఁ జేరె 230

## కంసుఁడు భటులకుఁ జేసిన యాజ్ఞ

మరునాఁ డతం డాప్తమంత్రులఁ బిలిచి
యొరు లెఱుంగని యట్టు లొక్క యేకాంత
మందిరమ్మును జేరి మంత్రాంగ వేళ
ముందటి నడురేయి పురుటింటఁ దనకు
వింతగా నొకశక్తి వినిచిన వార్త
నంతయు వినిపింప, నాలించి వార
లొక్కమాటగఁ జెప్పి రొక్కటై యిట్టు
లుక్కుమీఱఁగ కంసుఁ డుత్సాహమొంద –
"అధిప, అట్లగునేని యాలస్యమేల
విధియింపు మమ్మింక వేవేగ మేము
పట్టణమ్ముల పల్లె పట్టుల వెదకి
పుట్టిన బిడ్డలఁ బొరిగొంట గాక
పుట్టి పెరుగుచున్న బొట్టెలఁగూడఁ
బట్టి వధింతుము భయమేల మనకు"
అను పల్కులకుఁ గంసుఁ డానంద మొంది
తనకు మృత్యుభయంబు తప్పెనటంచు
మదిఁ దృప్తినొంది యా మంత్రుల నెల్ల
ముదమార గౌరవమున సత్కరించి
"మీ రాజభక్తికి మిగుల మెచ్చొదవె
నా రీతి గావింపుఁ"డం చాజ్ఞ నొసఁగె 240
దామోదరా, భవత్సంకల్పమునకు
నే మాత్రమును విఘ్న మెందును లేదు.




కనకవసన, యమోఘం బద్ది, దానిఁ
గనలేరు నీరజగర్భాదులేని —
కాని యజ్ఞానాంధకారానఁ గనులు
గానని మూర్ఖులు కడు గర్వయుతులు
తమ కడ్డులేదను తలఁపున నిన్ను
విమతుగా భావించి విఱ్ఱవీఁగుదురు
నీ నిశ్చయము మాన్ప నిలుతురు పూని
కాని విఫలులయి కడుఁ బగఁ బెంత్రు.
నీరజ దళనేత్ర, నీదు సంకల్ప
మే రీతియో, దాని నెఱిఁగింప లేదె
నభముదేవతయును, నారదమౌని,
ప్రభ యోగమాయయు వరుస కంసునకు:
కాని యాతఁడు మంచికై పూనుకొనెనె
మానెనే నీ పయి మలయు వైరమ్ము:
చెడువేళ హితవాక్కు చేఁదుగా నుండు
కడుతీయగా నుండు ఖలుల హితమ్ము.

న న్నపమార్గమ్మునను బోవనీక
మన్నించి కడు ఋజుమార్గమ్మునందు 250
నడపుచుఁ బెద్దల నయభాషితముల
నెడలేక నా యెద నిముడంగఁ జేసి
నీ నామ చింతన నిరతమ్ము నాదు
మానసవీథిని మలసెడు నట్లు
కాపాడవే నన్ను కరుణా సముద్ర,
నీ పాదములె దిక్కు నీరజ నేత్ర!

## వ్రేపల్లెయందు నందుఁడు పుత్రజననోత్సవము జరిపించుట

శ్రీ మానినీ సమర్చిత పూజ్యపాద,
సామగాన వినోద, సత్యానుమోద,

దేవ, జగమ్ము దుఃస్థితిఁ బాపి, శుభము
లావరింపఁగఁ జేయ, నవనిపై మాయఁ
బూని, మానవుఁడవై పుట్టుచునుందు
నీ నియమమ్మును నెఱవేర్చుచుందు
నినుఁ గన్న పుత్రుఁగా నెమ్మదిఁ దలఁచి
తనిసి నిన్ బెంచెడు తలిదండ్రు లెట్టి
పున్నెముల్ సేసిన పూజ్యులో వారి
నెన్ని నుతింపంగ నేఁ దగనయ్య
ఇవి నీదు లీల లో యిభరాజరక్ష,
నవసరసీజాక్ష, నతజనపక్ష.

మంద నందుఁడు కడుమాన్యుఁడు తాను
నందనప్రాప్తి కెంతయు మోదమంది 260
తన యింట నందనోత్సవ మొనరింప
నను వగు నేర్పాటు లన్నియుఁజేసి
బంధుగులను బిల్చి పరిమళవారి
యందున జలకమ్ము లాడి మడుంగు
వలువలు ధరియించి, వరపురోహితులఁ
బిలిపించి వారిచేఁ బెద్దల యెదుట
స్వస్తి పుణ్యాహవాచనము లాలించి
శస్త్ర దానమ్ములు సమ్మతిఁ జేసి
జాతకర్మంబులు జరిపించి దేవ
తాతతి మ్రొక్కులఁ దన్పి పూజించె —
బంధుగుల్ భూసురవర్గ మానంద
మొంది యీ బాలకుఁ డూర్జిత సత్త్వుఁ
డరివీర భీకరుఁ డగుచు దీర్ఘాయు
వురు భోగభాగ్యంబు లొనర జీవించు

నని దీవెన లొసంగి యరిగి రా మీఁద
ననుపమానందమ్ము నంది యా మంద
నాడిరి పాడిరి యఖిల వాద్యముల
కూడికఁ జెలరేఁగి గొల్ల లందఱును
మరియు నాభీరసద్మములెల్ల మివుల
సురుచిరాలంకార శోభల వెలసె 270
పసుపు కుంకుములతో పశుగణమెల్ల
నసమాన శృంగార మమరంగ నొప్పె
వరహేమ భూషణాంబరధారిణు లయి
గరితలు గుంపులుగాఁ గూడి వేడ్క
"ఏ నోము ఫలమొకో యిప్పు డీ వార్త
వీనుల విందుగా విను భాగ్య మబ్బె
మన యశోదకుఁ జిన్ని మగబిడ్డ పుట్టె
కనివత్త మమ్మలు కదలుఁడు మీరు" –
అని పరస్పరము తా మటు పల్కరించు
కొనుచు వచ్చి యశోదకొమరుని నిన్నుఁ
గని తాము దెచ్చిన కానికలెల్ల
మనము లుప్పొంగ సమర్పించి. మరియు
నూనెతోఁ దలయంటి నులివెచ్చ నీట
స్నానమ్ము చేయించి. చలువ పొత్తిళ్లఁ
దడియార్చి తిలక మందముగాఁగ దిద్ది
బుడి బుడి తొడవుల పొందికఁ దొడిగి
బంగరు టుయ్యెలఁ బవళింపఁ జేసి
యంగముల్ పొంగ నా యతివ లందఱును
ఒయ్యనొయ్యనఁ డోల నూపుచు జోల
తియ్య తియ్యనఁ బాడి తృప్తి వహించి 280

మరియాదలను బొంది మరలి రిక్కలకు
పరమ కల్యాణ మా పండుగు దినము

అత్తటి నా నందుఁ డతి భక్తి తోడ
చిత్తమ్ము పొంగార స్త్రీరత్నమైన
రోహిణీదేవి పుత్రుని గనియుంట
నీహ నామెను తన గృహమున కమిత
గౌరవమ్మునఁ బిల్చి కమనీయచేల
హార భూషణముల నర్పణసేసె
నీ నాటినుండియు నీ బాలు రిద్ద
ఱానంద మొప్పార నభివృద్ధిఁ గనుచు
జత విడువక యుండి జగతికి శుభము
లతులముగా గూర్తు రంచు దీవెనలు
పలికిరి పెద్దలు పరమ మోదమున
జలజాక్ష, జగమెల్ల సంతస మొందె.

దామోదరా, యశోదానందు లెప్పు
డే మహనీయు సత్కృతుల నొనర్చి
నారొ, తచ్ఛుద్ధి పుణ్యవిశేష మిపుడు
వారు నిన్ పుత్రుఁగా భావించి, నిన్నుఁ
బెంచెడు వ్యాజాన వివిధ శుశ్రూష
లంచితముగఁ జేయునట్టి భాగ్యంబుఁ 290
గనినారు, మందలోఁగల గొల్లలెల్ల
నిను, నీదు మహిమల నిరతమ్ము గనెడు
పున్నెముఁ గనిరి, యా పూజ్యుల భాగ్య
మెన్నంగఁ దరమె, సర్వేశ, లక్ష్మీశ
అట్టి మహాభాగ్య మరవింద నేత్ర,
యెట్టు లబ్బెడిని నా కీ జన్మమందు?

కాని యేజన్మ నేకాలమందేని
మానక మఱువక మన్ననఁ జూచి
నీదు సన్నిధిఁ జేర్చి నీ సేవలెల్ల
మోదానఁ జేసెడు పుణ్యమ్ముగూర్చి
నన్నుఁ గాపాడరా నందకుమార!
నిన్ను నమ్మితినిరా నిగమసంచార!
శ్రీవత్సకౌస్తుభ చిహ్నితవక్ష.
దేవనివహపక్ష. దీనసంరక్ష.
నందనందన. జగన్మాన్యచరిత్ర.
ఇందిరాసుందరీహృదయాబ్జమిత్ర!

జగతిని గొందఱు జాల్ములు మిగుల
పొగరున మిట్టాడి భువి దివి గనక
పరనిజశక్తి ప్రభావాదికముల
తరతమభావముల్ దలఁపక యెడఁద 300
పరులుచెప్పినబుద్ధి పరమార్థ మనుచు
కరము నమ్ముదురు. దుష్కార్యముల్ సేయ
మునుకొందు రద్దానఁ బొందెడు నిడుమ
లను గూర్చి తొలుత తలంపరు బుద్ధి
స్వామి! నీపయిఁ బగఁబట్టుచుఁ దమకు
తామె నశింతు రే దారియులేక.

పూతనను బాలకృష్ణుడు చంపుట

కంసుని పంపునఁ గదలి బిడ్డలను
హింస గావించుచు నిల దిరుగుచును
పూతన యనియెడు పొలదిండి పొలఁతి
పోతరమున నొకప్రొద్దున నందు

మందకుఁ జనుదెంచి మాయను బూని
యందాలు చిందు తొయ్యలివేష మూని
ఆ నందునిలయమ్ము నందునఁ దూఱి
మానుగఁ బర్యంక మధ్యమ్ము నందుఁ
బవళించియున్న నీ పజ్జకుఁజేర
జవమున రాఁగ నా చాన వీక్షించి
ఆ యింటనున్న గోపాంగనలెల్ల
నీ యింతి శ్రీ లక్ష్మి. యేతెంచె నిపుడు
మన భాగ్యవశమున మనయింటి కనుచు
మనములఁ బొంగి రమాయిక లగుట 310
కాని యా కపటిరక్కసిచేయు మాయ
శ్రీనాథ. నీముందు చెల్లునే. యద్ది
బాలెంతరూపు చొప్పడ మాయఁ బూని
పాలిండ్ల విసమూని వచ్చుటెడంద
నెఱిఁగి లో నగికొని యేమాత్రమేని
యెఱుఁగని యట్టుల నీవు కన్మొగిచి
గుఱక వెట్టుచునుండఁ గుమతి యా జంత
సరగున నీ సెజ్జ సరసనఁ జేరి
నినుఁ గరములనెత్తి నిజకుచయుగ్మ
మునకు హత్తగఁ జేసి ముద్దాడి "యోయి!
నీకు చన్నిచ్చి పెన్నిద్దుర గూర్ప
నా కెనయైన నట్టి నారి లే దెందు
నా చనుబాలు పానము సేయుమయ్య
నీ చెలువముఁ గననేర్చు నిజ్జగము"
అనుచు దంభోక్తులనాడు నా నాతిఁ
గని యశోదయు గోపకాంత లిట్లనిరి

"వనిత, బాలకు నంటవలదమ్మ నీవు
చనుగుడ్పుయత్నమ్ము చాలింపుమమ్మ
నీ చన్ను మా పాపనికి నచ్చదమ్మ
వే చనుమమ్మ నివ్వేఱపయ్యె నమ్మ 320

ఆ పల్కులను చెవులందుఁ జొన్పకయ
యా పాపి నిను నంకమందునఁ జేర్చి
చన్నియ మొదలిడ జలజాక్ష. నీవు
కన్నులు దెఱచి మేల్కనిన విధాన
నావులించుచు నీల్గి యాకొన్నయటుల
నావెలందుకఁ జూచి హస్తముల్ సాచి
దాని యురుస్తనద్వయమును బట్టి
నీనోటఁ గబళించి నెక్కొనువేడ్క
గ్రుక్కకు గ్రుక్కకు గుటగుట యనుచు
గ్రక్కునఁ బాలతోఁ బ్రాణాలు గూడ
నొకరెండు గ్రుక్కల నూటుచుండంగఁ
జకితయై యా కూళ చాలుచా లనుచు
విడువిడుమని యెంత వేఁడిన నీవు
విడువనందున నది విలవిల తన్ను
కొని యఱచుచు నేలఁ గూలె కొండంత
తన తొంటి రూపమ్ము దాల్చి మహాత్మ!
భవదీయ దివ్య ప్రభావాతిశయము
రవమాత్ర మెఱుఁగ నేరరు మూర్ఖజనులు
అట్టి గుణమ్ము నా కలవడనీక
చెట్టతలంపులఁ జెడిపోవనీక 330
కరము నీ భక్తునిగా నన్ను దిద్ది
పరమ పూరుష, దయఁ బాలింపుమయ్య.

## బాలకృష్ణుండు శకటంబుఁ గూలఁ దన్నుట

సారస దళనేత్ర, సజ్జన స్తోత్ర,
క్రూరదళనశీల, గోపాలబాల,
నీ బాలచేష్టలు నిరుపమానములు
సోబనంబులు జగత్‌స్తుతికిఁ బాత్రములు.
నీ వొదిగిలఁ బడ నేర్చుతి, నీకు
భావుకముం గోరి పండుగు సేయు
నందునిల్లాలు మనంబునం దలఁచి
బందుగుల్ తాను భవజ్జన్మతార
నొకనాఁడు నీకు మహోత్సవ మొప్ప
సకలమంగళములు సమకూరువేళ
జలకమాడించి సజ్జనుల బ్రాహ్మణులఁ
బిలిపించి వారిచే వేదమంత్రములు
చదివించి దీవెనల్ చాల నిప్పించి
కొదలేక దానముల్ గూర్చి యర్థులకు
నిను శయ్యపైఁ జేర్చి నిద్దురపుచ్చి
మునుకొన్న భక్తి గోపూజల మునిఁగి
మరచె పబ్బమ్ము సంబరమున నిన్ను
కరిరాజ సంరక్ష, కమలదళాక్ష! 340

అత్తఱి మేల్కాంచి యచ్యుతా, నీవు
క్షుత్తుపెల్లునఁ జనుఁ గోరి కోపించి
నవకిసలయమట్లు నవకమై యొప్పు
భవదీయ పదమున బండి నొక్కటిని
తన్నితి, వది వియత్తలమున కెగిరి
క్రన్నన భువిఁ బడె ఖండమ్ము లగుచు

అందున్న సరసపదార్థము లెల్ల
చిందఱ వందఱై చెడె వ్యర్థ మగుచు
శకటంబు ధరఁగూలి శకలమ్ము లౌట
సకల వస్తువులు నాశనమయి యుంట
తల్లి యశోదయుఁ దండ్రి నందుండు
గొల్ల పెద్దలు మఱి గోపకామినులు
ఎల్లరుఁ గనుఁగొని యిది కడుఁ గీడు
చెల్లఁబో యిట్టి దుఃస్థితి గల్గె నేఁడు
బాలుఁ డీతఁడు నిండు బండిని దీని
నేలఁ గూలఁగఁ దన్న నేరఁడు నిజము
కాని యీ శకట మెక్కరణిని దివికిఁ
దా నెగసెనొ, మఱి తథ్య మెట్టిదియొ
కని విని యెఱుఁగముగద మును నిట్టి
ద''ని సంశయాత్మకులై యుండ, నచట 350
నాఁడుచు నున్నట్టి యర్భకుల్ వారి
తోడ నిట్లనిరి యుత్సుకత యేర్పడఁగ —
"'పెద్దలు వినుఁడి! యీ పిల్లఁ డీ వేళ
తద్ద యాకొంట రోదనము సేయుచును
తన కాలు జాడింపఁ దగిలి యీ బండి
వినువీథి కెగసెను వేరేమి గాదు.''

ఆ పల్కులను విని యా పెద్దలెల్ల
''నీ పాపఁడీ బండి నెగయంగఁ దన్నె''
నని నమ్మ టెట్లని యంద ఱచ్చెరువు
నన యుండ నీరోదనము విని నీదు
జనని యశోద నీ సరస కేతెంచి
నిను నెత్తికొని యొడల్ నిమిరి ముద్దాడి

"ననుఁ గన్ననాతండ్రి, నా ముద్దులయ్య,
నిను మఱచితినయ్య, నేరమేనయ్య
నా మీదకోపమా నా బుజ్జినాన్న
యేమరనింక ని న్నిది పెద్దయాన
ఆకొంటివా యన్న! అలసితే యన్న!
శోకము వలదన్న! శుభమగు నన్న!
చనుద్రావు మిఁక సంతసము గల్గు నన్న!
కనుఁగవ నీరింకఁ గార్చకు మన్న!" 360
అని బుజ్జగించి యా యబ్జాక్షి నీకు
చనుగుడ్పి యోదార్చి, శయ్యను జేర్చె
అంత నందుండు బ్రాహ్మణుల రావించి
శాంతిహోమక్రియల్ జరిపించె నీకు.

నిన్ను సామాన్యపు నిసువుగా నెంచి
కన్నవారలమని కడుభ్రాంతితోడ
నా యశోదానందు లచ్యుతా, నీదు
శ్రేయముల్ గోరుచు సేవ లొనర్తు
రదియెంతపుణ్యమో, యట్టి భాగ్యమ్ము
కుదురునే నావంటికూళల కెందు
అంతటి భాగధేయము లేకయున్న
కొంతైన నీ సేవ కోరియొనర్చు
దాసునిగా నను దయఁజూడుమయ్య
శ్రీసముల్లాస, యో చిదచిద్విలాస!

## శ్రీకృష్ణుఁడు తృణావర్తుని సంహరించుట

నందనందన, కరుణామయరూప,
వందిత సురబృంద, వరద గోవింద,

ఒక్కనాఁడు యశోద యోపిక నిన్ను
మక్కువ తొడనిడి, మరిమరి ముద్దు
లాడుచునుండి నీ వతిభార మగుట
"నీ డింభకుం డింత యెక్కుడు భార 370
మగుటకు హేతువు నరయు నితండు
జగముల రక్షింప జనియించినట్టి
యొక మహాపురుషుఁడై యుండునం" చెంచి
యకలంకచరిత! ని న్నవనిపై నుంచె.

కంసు పంపున నొక్కకటికరక్కసుఁడు
హింసాస్వభావుఁ డయ్యేడఁ దృణావర్తుఁ
డనువాఁడు సుడిగాలియై వచ్చి చుట్టి
కొనిపోయె మింటికి కూనవౌ నిన్ను.
గాలిరేఁగిన దుమ్ము కన్నుల నిండి
బాలవృద్ధాది గోపజనమ్ము చాల
వగనొంది హాహారవమ్ముఁ గావించె
పగలైయైనను మంద ధ్వాంతమ్ము గ్రమ్మె
అత్తఱి నినుఁ గానకా యశోదమ్మ
చిత్తము గలఁగ "నా చిన్నికుమార,
ఎచ్చట నున్నావొ? యెట్టులున్నావొ?
ముచ్చటదీర నా ముందుకు రార!
గాలిపెట్టున నీకుఁ గలిగెనే యిడుమ
యే లీల భరియింతు నే నిట్టిగోడు"
అని పొగులుచునుండ నా సమయమున
వినువీథికిన్ నిను విట్టి వీఁగుచును 380
గొనిపోయినట్టి యా క్రూరదానవుఁడు
తనకు నిన్ మోయు సత్త్వములేక వగచి,

"ఇట్టి బాలకుని నే నెందును గాన
కట్ట! యేమందు నా గతి యెట్టులగునో!"
అని మనంబున నెంచునవసరమందు
వనజాక్ష, ఆ క్రూరువక్షాన నీవు
ఘన ముష్టి పాతమ్ము గావింప వాఁడు
నిను మోయఁ జాలక నేలపైఁ గూలి
తన నిజరూపమ్ముఁ దాలిచి చచ్చె
ఘన హర్ష మామందఁ గలయంగ హెచ్చె.

అంత నా రక్కసునక్కున నెక్కి
వింతగా శ్రమమేని వెఱపేని లేక
కడునమాయికునట్లు కలకల నగుచు
నుడివోని సంతస మొప్పంగ నాడు
కొనుచున్న నినుఁ గని గోపకామినులు
పెను నుబ్బునం దెచ్చి వేగమ నీదు
జనని యశోద హస్తములందు నుంచి
"మును మనమెట్టి నోములు నోచినామొ
ఏ పుణ్యభూముల నెట్టిదానమ్ము
లేపుగా నర్థుల కిడితిమో, వాని 390
ఫలితమ్ముగాఁగ నాపదఁ బొందనట్టి
కులదీపకుని వీని గోపాలబాలు
కనుఁగొంటి" మని నందుకాంత యశోద
వినఁగఁ బల్కిరి కడు వేడుకపడుచు
నంత యశోదయు నానంద మొందె
స్వాంతాన నందుండు శాంతమ్ము పొందె.

## శ్రీ బలరామకృష్ణుల నామకరణము

శ్రీకర యదుకుల క్షీరాబ్ధిచంద్ర,
ప్రాకట మాహాత్మ్య వరగుణసాంద్ర,

నిన్నుసత్పురుషులు నిర్మలభక్తి
నెన్నోవిధుల భజియించి తరింత్రు -
యదువంశగురుఁడు మహర్షి గర్గుండు
సదమలయశుఁడు విజ్ఞానసాగరుఁడు
అతఁడు వసుదేవుఁ డనుప వ్రేపల్లె
కేతెంచె సంతోష మెసగంగ నొక్క
దినమున, నందుఁడాతేజస్వి, విప్రుఁ
గని నమస్కారముల్ గావించి, పెక్కు
రీతుల పూజల ప్రేమతో సల్పి
యాతతభక్తిమై నతని కిట్లనియె.

"ఊరకెప్పుడు మహిమోన్నతుల్ రారు
వారధములఁ జేరవచ్చుట యెల్ల 400
కారణమౌను మంగళము లబ్బంగ
నీ రాక మాకుఁ బొందించు శుభమ్ము.
దైవజ్ఞులందు నెంతయు మేటివీవు
భావింతు భూతమ్ము, భావిఁ జక్కనగ
నా పల్కు లాలించి నన్ను మన్నించి
యీ పిన్నజంటకు నెలమి సంస్కార
మొనరింపుమా" యంచు నుత్సాహ మొప్ప
నిను, రౌహిణేయు మౌనికిఁ జూపి చెప్పె.

నందుని యభ్యర్థనమ్ము తానెందు
నొందని శుభముల నొనగూర్చుపుణ్య
కార్యమ్ముగాఁగ నగ్గర్గుండు దలఁచి
యార్యసంస్కృతి యెట్టు లటులు సంస్కార
మొనరింపయత్నించి మును రౌహిణేయుఁ
గని రాముఁడనియు సంకర్షణుఁడనియు

బలుఁడనియును శుభప్రదనామములను
వెలయ సార్థకముగ వేర్వేర నుంచె.

నారాయణా! జగన్నాటకసూత్ర
ధారివి నీవు. నీ తలఁపని కర్జ
మేదేని జరగునే యిజ్జగమందు
శ్రీదయితా! సర్వసృష్టినిర్మాత! 410

పదపడి దైవజ్ఞవరుఁడు గర్గుండు
విదళితశత్రు నిన్వీక్షించి యనియె —
"ఈ వటువునకును కృష్ణుండు. వాసు
దేవుం డనెడి నామధేయమ్ము లమరు
మరి గుణ రూప కర్మంబు లీతనికి
నరయ ననేకము లగుట నితండు
పెక్కు నామంబుల వెలయు. మీరింక
నిక్కట్లు వాయుదు రితని మూలమునఁ
గుజన సంఘంబులఁ గూలిచి యితఁడు
సుజనుల పాలించి శోభిల్లఁ గలఁడు
ఈ కుమారుండు లక్ష్మీశసముండు
ప్రాకట లోక సంభావిత యశుఁడు."
అని భావి నెఱిఁగించి యరిగె నా గర్గుఁ
డనుపమానందమ్ము నందె నందుండు —
నాగరాజశయన! నాళీకనయన!
యా గర్గుఁ డెంత పుణ్యము చేసినాఁడొ
నామరూపాదు లెన్నఁడు లేని నీకు
నామకరణము విన్ననువుగఁ జేసె.
అట్టి మహాత్ముల యడుగు దామరల
నిట్టలమగు భక్తి నిత్యమ్ము గొలుచు 420

మతి నా కొసంగి నన్ మన్నింపుమయ్య
పతితపావననామ! బ్రహ్మాండధామ!

## శ్రీకృష్ణబలరాముల బాలక్రీడాభివర్ణనము

శ్రీ వాసుదేవ! నిర్జిత పూర్వదేవ!
దేవాదిదేవ! సుస్థిర దివ్యభావ!
నీవును శ్రీ రౌహిణేయుండు బాల
భావమ్ముతోడ వ్రేపల్లెఁ బెరుఁగుచుఁ
జూపిన లీలలు చోద్యముల్, విన్నఁ
బాపముల్ దొలగించు భవ్యమంత్రములు

ఆజానుబాహుల యంద మొప్పార
నోజతోఁ దిరుగుచు నుంటి రెల్లెడల
నాల తోఁకలఁ బట్టి యవి పరువెత్త
వ్రేలుచు నుంటిరి వెఱపేమిలేక
దూడల పరువిడఁ దోలి వెంబడిని
వీడక పరువిడి వెలసితి రెలమి.
చన్ను ద్రావుచును మీ జనను లుప్పొంగఁ
జెన్నారు మోముల చెలువుఁ జూపితిరి
పలుకుచుంటిరి ముద్దు పలుకులు తేనె
లొలికెడు నట్లుగా నుత్సాహ మొప్ప
కరచరణంబులఁ గదలించి యాట
లరుదరుదని మెచ్చ నాడుచుండితిరి. 430
తలయెత్తి యాడెడు తతి నాగవరుల
పొలుపు మీ యందునఁ బొడగట్టుచుండు
మేని పూఁతలతోన మెలఁగెడు వేళ
నేనుంగు గున్నల యెసకమ్ము దోఁచు

చెంగనాల్వేయుచుఁ జెలఁగు పట్టులను
సింగంపుఁ గొదమల సిరి కానిపించు
సదమలానన కాంతి జాలముల్ చూడ
నుదయార్కచంద్రుల యొఱపు గన్పించు
తల్లుల చనుఁబాలు తనియంగఁ ద్రావి
యల్లన మైసోలి యలరెడు ఠీవి
పరమ యోగానంద భరితులైనట్టి
వరయోగుల విధంబు ప్రకటమౌచుండు
ఈ రీతి మీ లీల లింపును సొంపు
గూరుచుచుండు దృగ్గోచర మగుచు.

## బాలకృష్ణుని మహిమలు

మరియు శ్రీకృష్ణ! నీ మహిమలు లీల
లరయంగఁ గడు విస్మయంబులై తోఁచు
మూఁడు చూపులతోన ముజ్జగంబులను
చూడ నేర్చిన నీవు చూడ నేర్చితివి
నగవులతోన నజ్ఞానమ్ము వాపు
తగవరి వయ్యుఁ గాంతాజన సమితి 440
నగుమొగంబులఁ జూచి నవ్వ నేర్చితివి
నగధర! చాల జాణవుగాదె నీవు
మువ్వుర కవ్వలి మూలపూరుషుఁడ
వవ్వాడ మందలో నర్భకుండవయి
యవ్వలఁ గనుఁగొని యతి ప్రియమొప్ప
నవ్వయవ్వాయని యనఁగ నేర్చితివి.
అడుగులు వేయున్న. నడుగులజంటఁ
బుడమి మిన్నును సరిపోఁ గొల్చినట్టి

కడు ప్రౌఢు డవు నీవు కడఁక నీ బుచ్చి
యడుగుల నిలనిడ నభ్యసించితివి.

ఒడలిపై నంటిన యుర్వీరజమ్ము
మడుఁగు భస్మపు పూఁత మఱపించుచుండ
ముందలఁ దాల్చిన ముత్తెంపుఁ దొడవు
చందురు వంకకు సరివచ్చుచుండ
నొసలిపై దీర్చిన నును కావి తిలక
మసమాస్త్రు గాల్చు కన్నన నొప్పుచుండ
గళము నంటిన దండ ఘన నీలరత్న
విలసితాసిత నూత్న విస్ఫురచ్ఛాయ
గరళపానమ్ము లక్ష్మమ్మని తోఁచు
కఱయునఁ గ్రమమై కన్పడుచుండ 450
మణిగణ ఘట్టిత మంజుహారములు
ఫణిహారనివహ సంపదఁ దెల్పుచుండ
బాలవేషమున నా పల్లెలో నీవు
హేళిమై నాటల నాడెడు వేళ
శివుని పగిది నుంటి శ్రీకృష్ణ! "నేను
శివుఁడు నొక్కటి" యని చెప్పెడి రీతి
హరిహర రూప! నీ యందచందములఁ
బరికించి పరికించి పరవశత్వమున
తమ పనుల్ మాని మందను గల సతులు
కమలాక్ష! నీ సేవఁ గావింతు రెపుడు.

ఈడు బాలురఁ గూడి యెలమి నీవెప్పు
డాడు చుండెడి యాట లత్యద్భుతములు
ఆలపోఁతేను మీ రా లని బంకె
పోలవెచుచు వంగి మురిసి క్రీడింతు.

వే రాజు భటులు మీ రెల్ల రండంచు
గౌరవమున పనుల్ గావించుకొందు
దొంగ నే నౌదు గేస్తులు మీరలంచు
దొంగిలి నగల నెందో డాఁగియుందు
వే సూత్రధారి మీరే పాత్రలంచు
వాసి నాటకములఁ బ్రకటించుచుందు 460
వీ రీతి నాటల నెలమి పెక్కింటిఁ
బారమ్మ మీఱగాఁ బచరించుచుంటి
భవదీయ కైతవ బాల్యవర్తనలు
ప్రవిమలానంద వర్ధనములు కృష్ణ!

నీ మైత్రి గడియించి నీ తోడఁ గూడి
నీ మాటలను విని నీతోడ నాడి
నీ యాజ్ఞ పాటించి నీ మెప్పు వడయు
నా యర్భకుల పుణ్య మనుపమానమ్ము
ఆ మందలోన నే నా నాఁడు చిన్న
చీమ రూపుననైన జీవించియున్న
నీ పాదధూళి నా నెమ్మేన నెట్లొ
యే పాటియేఁ బడ నీ పాటి కేను
భవదీయ పాదసేవకుఁడనై యుండి
సవతుమీఱిన సంతసము నొంది యుందు
అట్టి భాగ్యంబు నా యట్టి నీచునకు
నెట్టుల లభియించు నిభరాజవరద,
కాని నీ పదములే గతి యని కొల్తుఁ
గాన న న్గరుణించి కాపాడుమయ్య
నారాయణా, కరుణాగుణసాంద్ర,
శ్రీరమ్య యదుకుల క్షీరాబ్ధిచంద్ర! 470

## గోపికలు బాలకృష్ణుని దుడుకు చేఁతలు యశోదకుం దెల్పుట

శ్రీ పుండరీకాక్ష, శ్రితజనపక్ష,
తాపసజనరక్ష, దనుజవిపక్ష,
నందనందన, జగన్నాథ, శ్రీకృష్ణ!
మందగోపికలు నీ మహిమ లెఱుఁగక
నీ ముద్దుచేష్ట లన్నియు దోషములుగ
తాము భావించి యందఱు గుమిగూడి
ధన్యచరిత యశోదాదేవి కడకు
మన్యుభావంబులు మఱువక వచ్చి
సర్వేశ! బాలకృష్ణా! యదువీర!
వేర్వేర నినుఁ గూర్చి వినుపించి రిట్లు —

"బాలుర కీయంగఁ బాలు లేవంచు
బాలెంత లందఱు వలదన్ననీదు
బాలుఁ డాలముచేసి పకపక నగుచు
నాలకు వదలెనమ్మా వత్సములను:
మా బానలందున్న మంచిపాలెల్ల
నీ బాలకుఁడు తన నెచ్చెలుల్ ద్రావఁ
బోసి, యా కడవలఁ బోఁగొట్టెనమ్మ
యీ సుద్ది వినమమ్మ యీ జగమందు:
ఆపోవఁ దాఁ గ్రోలునంత క్షీరమ్ము
చూపునఁ బడకున్న సుదతి, నీ బిడ్డ 480
కోపించి మాయింటి కుఱ్ఱ లందఱును
వాపోవఁ జిమ్ముచు వచ్చినాఁడమ్మ:
మా యింటఁ దాఁజొచ్చి మా యుట్టికొఱకు
చేయెత్తి యందక చెచ్చెఱ ఱోళ్లు

పీటలు ప్రోవుగాఁ బెట్టుచు నెక్కి
వాట మనుచు చేయి పైకెత్తిచూచి
యందలేదని యుట్టియం దున్నకుండ
క్రిందుగా తూఁటొనరించి మీగడల
పాలు చేరలఁబట్టి పట్టి పూర్ణముగ
గ్రోలినాఁడమ్మ నీ కొడుకు చూడమ్మ :
ఆ యింటిపెరుఁగుఁ దా నంతయుఁద్రావి
నీ యర్భకుఁడు పూసె నెలఁత! యందుండు
కోడలిమూతికి గొంచెం. మా యత్త
కోడలే దొంగని కొట్టెఁగదమ్మ :
వా రింటినేయి యవారిగఁ ద్రావి
ఆ రిత్తకడవల నన్నింటిఁ దెచ్చి
వీ రింటనుంచె నీ బిడ్డఁడు. దాన
వారికి వీరికి వాదయ్యెనమ్మ :
వేలుపు లెవ్వరు వినుఁడు. నాకంటె
వేలుపు లేఁడని వెలఁది మాయింటి 490
వేలుపుగోడల వీఁక నీకొడుకు
చాలుగా నెంగిలి సలిపినాఁడమ్మ :
నా బంతి మీ భవనమువెన్కఁ బడియె
నేఁ బడయుదునని యిలుదూరి వలువ
మా బిడ్డ స్నానసంభ్రమమునసుండ
నీ బిడ్డ గొనివెళ్లె నీతియేనమ్మ :
నిదురించు నా సుతు నిద్దంపుచుంచు
ముదిత! తఱపి వాలముంజేర్చి కట్టి
బెదరించి వీథుల వెంబడి తఱిమె
నదయుఁడై నీ సుతుఁ డది న్యాయ మమ్మ!

నా పట్టిపొట్ట వెన్నను బానె డంత
నీ పట్టి పట్టుగా నింపినాఁడమ్మ
ఊపిరిసలుపలే కున్నాఁడు వాని
కాపదగల్గిన నడ్డు నీవమ్మ ?
వినవె యశోద! యీ వ్రేపల్లెనున్న
వనితల మేమెల్లఁ బాలునుం బెరుఁగు
మా యిండ్ల దాఁచి యేమర కెల్ల ప్రొద్దు
నే యుపాయమ్మున నెటువచ్చునొక్కొ
చూతమంచుండ నీ సుతుఁడు చోద్యముగ
నేతటి నా యిండ్ల నెటునొచ్చినాఁడొ 500
మూసినతలుపులు మూసినట్లుండ
వేసినతాళముల్ వేసినట్లుండ
ఒకయింటిలోఁ బాడు, నొకయింట నాఁడు
నొకయింటిలో నవ్వు, నొకయింటఁ దిట్టు
పక్షుల మృగముల ధ్వనులు విన్పించు
కక్షతో హేళన గావించుచుండు
నీకరణింజేసి, యెటకు తాఁజనునొ
మాకంటఁబడఁ డిది మాయయే నమ్మ
పనివడి గృహములఁ బరికించి చూడ
పనటుఁలు రిత్తలై పడియుండు నమ్మ:
సంపదల్గల్గిన సర్వసౌఖ్యములఁ
బొంపిరివోఁ బొందఁ బోలునే గాని
కొడుకుల బడుగుల కొంపలమీఁదఁ
బడవిడుతురె యిది పాడియే నమ్మ:
మా పాఁడి సంపద మననీఁడు నీదు
పాపఁడు మాకెల్ల భయమయ్యెనమ్మ.

ఎక్కడికైన మే మేగెద మమ్మ
నిక్క మిమ్మాటలు నీరజవదన!
మరి నీదు పుత్రుఁడు మా యెడకొన్ని
దురితంపుఁ బనులకు దొరకొనె నమ్మ 510
అవి చెప్పరాదు నీ వాలింపరాదు
భువి నట్టివింతలు పొడమె గదమ్మ"
అని యనేకముగ నా యతివ లందఱును
నిను దూఱుచుండంగ నీ తల్లి వారి
వారించి యిట్లనె— "పడతుఁలు మీర,
లీ రీతి వాక్రువ్వ నెవరు నమ్ముదురు
కన్నులు దెరువని కడుచిన్నవాఁడు
నన్ను విడిచిపోఁడు నా తనయుండు
ఇరుగుపొరుగు నిండ్ల కేగెడు జాడ
లెఱుఁగడు మాబిడ్డఁ: డెందుకీలాగు
నేరముల్ మోపుట నెఱిగాదు మీకు
పోరిత మిఁకమాని పొండమ్మ మీరు-"
అని యా యశోద వారందఱుఁ దృప్తి
గనఁ జెప్పి, పంపి, ని న్నని కోపపడక
యూరకుండెను పురుషోత్తమా, నీవు
నేరముల్ గోపికల్ నీ పయిఁ జెప్ప
విని భీతిఁజెందిన విధము గన్పింప
జనని యంకము జేరి సాధువురీతి
నే పాపమేనియు నెఱుఁగని యటులు
శ్రీపతీ, నెమ్మది క్రీడించుచుంటి. 520

సర్వమెఱింగిన సాక్షిస్వరూప!
నిర్వికారుండవు, ని న్నెల్లవారు

పరిపరివిధముల భావించుచుందు
రెటులఁగినటుల భజియించుచు నుంద్రు
అందఱిభావమ్ము లరసి వారలకుఁ
బొందించుచుందువు పొదలు సౌఖ్యములు
నీ సమభావమ్ము. నీ దయాపరత
దాసులభాగ్యమ్ము తామరసాక్ష!
దురితాత్ముఁడను నాదు దోషముల్ దొలఁచి
పరమపూరుష! నన్నుఁ బాలింపుమయ్య.

## మృద్భక్షణ విశ్వరూప ప్రదర్శనాద్యభివర్ణనము

శ్రీహరి పీతకౌశేయ, లక్ష్మీశ,
మోహనాకార, దామోదర, చక్రి,
భవదీయమాయాప్రవర్తన గాంచి,
యవితథమని లోకు లందఱు భ్రాంతిఁ
గని నిన్ను సామాన్యగా నెంత్రుగాని
కనలేరు నీదు నిక్కపు తత్త్వమహిమ.

నందనందన, యొక్కనాడు రాముండు
గొందఱుబాలురు గుమిగూడివచ్చి
"మనుదినినాఁడమ్మ మనచిన్నికృష్ణుఁ''
డని యశోదకుఁ జెప్ప నా యమ్మ వగచి 530
నినుఁ గని నీ చేతినిం బట్టి నిలిపి
మనము కొంత నిమ్మాడ్కి తా ననియె.
"తనయ, మన్నుదినంగఁ దగునె: తినంగ
మన యింట లేవె కమ్మని పదార్థములు
మీ యన్నయును నీదు మిత్రు లెల్లరును
బాయక యన్నియు వచియించి రిపుడు

నా యాజ్ఞమీఱుచు నడచుచున్నావు
నీ యాటలన్నియు నేనిఁకఁ గందు-''
ననెడు నమాయిక నా నందుసతిని
గని యిట్టులంటివి కంజాతనేత్ర!

"మన్ను దినంగ నమ్మా, నేను మిగుల
చిన్నవాఁడనె వెఱ్ఱిచేష్టచేయుదునె?
ఆఁకొంటినే, వీరలన్నవి నమ్మఁ
బోకమ్మ, నను నీవు మోదంగ నిట్టి
వెరవును వెదకి చెప్పిరి వీరు: నీకు
కరము విశ్వాసము కలుగకయున్న
నస్మదీయాస్య గంధాఘ్రాణ మొనర
విస్మయమనక గావించి నా పల్కు
తప్పైనచో నన్ను దండింపు మమ్మ
యొప్పైన మన్నించి యోదార్పు మమ్మ" 540
అని నమ్మఁబలికి నీ యాస్యంబుఁ దెఱచి
మునిజననుత! నీదు ముఖము చూపితివి.

పర్వతవనసరిద్వార్ధిసంయుక్త
సర్వప్రపంచ మా సతి నీదువదన
మందునఁ గని విస్మయమ్మును భ్రమము
నంది యీరీతి తా నాత్మఁ దలంచె.
"కలయ? నిక్కమ? మఱి కాదేని విష్ణు
విలసిత మాయయా! వివరింప నేర.
ఏను యశోదనా? యిది పరస్థలమ?
మానసమెల్ల సంభ్రమ మగ్న మయ్యె.
ఈ యర్భకుం డెంత? యితని ముఖస్థ
మై యొప్పి తోఁచు బ్రహ్మాండ మదెంత?

ఇతఁడు బాలుండైన నీ విశ్వమెల్ల
నితని మోమున నెట్టు లిమిడి తా నుండు
బాలుని భంగిఁ గన్పట్టునే గాని
పోలుప శ్రీ విష్ణుమూర్తి యితండు
ఏమరి యిందాక నితని మా సుతుగ
నేము నిక్కముగ మా యెదల నమ్మితిమి
అని నిన్ను నీశ్వరుఁ డంచు నా యమ్మ
మనమున నెంచు నమ్మరునిముసాన 550
వైష్ణవమాయ నవ్వనిత ముంచితివి
కృష్ణ, విశ్వేశ, ప్రకృష్ట ప్రభావ,
అంతలోనన తన యాత్మలో నెఱుక
నంతయు మఱచి యా యమ్మ యశోద
తన కొడుకనియెడు తత్త్వమ్ముతోడ
మనమున భావించి మమతతో నుండె.

నిను చన్ను గుడ్పి మన్నిక పెంచునట్టి
జననిగా నుండెడి సద్భాగ్యమునకు
మును పెట్టి వ్రతము లమ్ముగుద యశోద
యొనరించెనో యామె యురుపుణ్యవనిత
దివిజులు మునులును దివురుచున్నట్టి
భవదీయ విశ్వరూపము నామె గాంచె.
అంతటి సద్భాగ్య మబ్బునే నాకు
దంతివరద, గిరిధర, లోకనాథ,
నీ పాదదర్శన నియతియే నొసఁగి
కాపాడుమా నన్నుఁ గమలదళాక్ష!

## దధిభాండములు పగులఁ గొట్టిన కృష్ణుని యశోద పట్టుకొనుట

శ్రీ వాసుదేవ, శార్ఙ్గి, వనమాలి,
గోవింద, గోపాల, గోపికానంద,
దేవకీపుత్ర! నీ దివ్యభావనలు
భావి భద్రములకుఁ బరమ మూలములు 560
ఎఱుఁగంగఁ బడవవి యెవ్వరికేని
నరయ క్రియాపూర్తి యగునంత దాఁక
తదనుకూల ప్రవర్తనలు మున్ముందె
విదితముల్ నీ యందు విశ్వప్రకాశ!

నందనందన, యొకనాఁడు వ్రేపల్లె
మందగమన నీదు మాత యశోద
తరికంబమునకు చెంతన పదిలముగ
పెరుగు పనఁటిఁ బెట్టి వేడ్కఁ బాడుచును
తరిత్రాడు చేఁబట్టి త్రచ్చుచునుండ
హరి, బాలకృష్ణ, నీ వచటి కేతెంచి
"అమ్మ రమ్మా కడు నాఁకలి యయ్యె
నిమ్ముగా నాకు చన్నిత్తువుగాని
తాళలేనమ్మ క్షుద్బాధ కాలస్య
మేలనే" యని గంతు లెగిరివేయుచును
గవ్వముం దిరుగని కరణిని బట్ట
నవ్వనరుహనేత్ర అంకాన నిన్ను
నవ్వుచుఁ జేరిచి, నాయనా యనుచు
మవ్వంపు నీ చుంచు మరి మరి దువ్వి
యానంద మొందుచు నాదృతి చన్ను
నాన నిచ్చుచునుండె, నంతలో పొంగు 570

పాలు దింపఁగ నెంచి, బాలు, నాపోవ
పాలుద్రావని నిన్ను, పడఁతి బంగారు
పీఁటపైఁ గూర్చుండఁబెట్టి వెళ్లంగ
గాటమౌ కోపాన కఠినమౌ ఱాత
పెరుగుపనంటిని భిన్న మొనర్చి
వెరవున నందున్న వెన్న భుజించి
కను మూసి తెఱచెడు కాలమ్ములోన
కనరావు నీవు పంకజదళనయన!

ఆవల మీయమ్మ యానవాల్ డించి
వేవేగఁ జనుదెంచి వికలమ్ము లగుచు
పడియున్న దధిభాండభాగముల్ సూచి
దుడుకు కొడుకు కుండఁ దునుక లొనర్చి
వెన్ననంతయు దిని వెళ్లెనా యనుచు
చిన్నగా నవ్వి ని న్వెదకుచుఁ బోయి
రోసి, యొకింటిలో ఱోటిని దిరుగ
వేసి పై కెక్కి నివ్వెఱతోడ నుట్టిఁ
గుండలోగల వెన్న కోతి పాల్సేయు
చుండు ని న్నుఱచుఱ చూచి కోపమున
సెలగోల నొక్కటి చేఁబట్టి నీకు
నులుకెత్తునటుల నయ్యువిద యిట్లనియె. 580
"బాలకా! తుంటరిపను లొనరించి
యీ లీల దిరుగుదే! యింక గానిమ్ము
ఎవరికి నేఁజిక్క నెవరిదండనము
నవుబాటు నా చెంత, నా కెందుభీతి
మును నెప్పుడేగాని పొరయ దటంచు
మనమునఁ దలఁచితే, మాను మా తలఁపు

లా యాట లిఁక సాఁగవయ్యు నా ముందు
పాయుము నీ దుష్టపద్ధతు లన్ని."
అని బెదరించుచు నా నందునాలు
మనమున నిన్ను, నీ మాట లాటలును
నీ నడతలను నన్నిటి గూర్చి, వాని
మానిపింపఁగ దగు మార్గమ్ము గూర్చి
యోచించి దండమే యుక్త మంచెంచి
చే చబుకును చూపి చివ్వున విసరి
జళిపించి, "బాలకా! చనకుము నిలుము
నిలువక చనితేని నిన్ను మన్నింప "
నని కఠినోక్తుల నాడి వేగిరమ
నిను సమీపింపఁగా, నిఖిల సంవేద్య!
బెగ్గడిల్లిన యట్లు వేగమ టోలు
దిగ్గన నుఱుకుచు దిగులొందినట్లు 590
నటియించి గోపకాంతలు నవ్వుచుండ
తటుకున నీదు మాతను మోసపుచ్చి
పరుగిడి తటనుండి బాలగోపాల!
కరము వేగిరముగ కాంచనచేల!
నినుఁ బట్ట నెంచి యా నెలఁత యశోద
వెనుకొని పరువిడి విడువక తటిమి
పట్టఁ జూడంగ స్తంభముల చాటునకు
నిట్టట్టు లేగితి "విఁక దొంగపనులు
మానుదు నీ తప్పు మన్నింపు" మంచు
నానలు పెక్కుగా నాడుచుఁ గంటి
కజ్జలము చెదటి కన్నీరుగాఱ
బుజ్జిచేతుల కనుల్ పులుముచునుంటి.

వమ్మ వచ్చెడి దారి నరయుఁ గ్రేవలకు
నిమ్ముగా జూపులనిడి చూచుచుంటి

## యశోద కృష్ణుని ఉలూఖలా బద్ధుని గావించుట

ఈ లీల లీలల నెన్నియో చూపు
ఖేలారతుని బాలకృష్ణుని నిన్నుఁ
గూడ బఱచి పట్టికొని యా యశోద
ఏఁడ దాఁగెద వింక నెచటి కేగెదవు
దొరకినాఁడవు వెన్నదొంగా, యటంచు
పరుష వాక్యంబులు పల్కి యామీఁద 600
నలిగి కొట్టఁగఁ జేతులాడక, కరుణ
కలిగి నిన్ బంధింపఁగా మదినెంచి,
"ఎవరయ్య మీరు శ్రీకృష్ణుల వార!
ఎవరికిఁ జిక్కక నేగెడివార!
ఎఱుఁగరుఁ గద వెన్న యెట్లుండునదియు
చౌరవ శూన్యము గద చోరత్వపుందు
గుణివా కావో నిన్నుఁగూర్చి చెప్పంగ
మనమునఁ దోఁచ దేమాత్ర మేనియును
పట్టువడని నిన్ను పట్టుతో నేను
పట్టఁగల్గితి నొరుల్ పట్టంగ లేరు
నీటమున్గగఁ, దేల, నేర్చితిః మంటి
నేటికో శిరమున నిడుకొనుచుందు
విఱుతువు కంబాల పెరలయాచింతు,
దొరలన్న నులుకవు, తోయముల్ నిలుప
కట్టలు గట్టుదు, కని విననట్టి
యిట్టి తుంటరిపను లెపుడుఁ జేయుదువు

మన్నుమిన్నెఱుఁగక మసలుచున్నావు
నిన్ను దండింతు మన్నింప నీనాఁడు''
అని యామె బెదరించి యచ్యుతా, నిన్ను
ఘనమగు ఱోటను గట్టఁగా నెంచి 610
యొకత్రాడు దెచ్చి నీ యుదరంబుఁ జుట్ట
నొకయంగుళము వెత్తి యున్నట్లు తోచె.
మరియొకపాశ మమ్మగువ కీలించి
సరిపోవునని మానసమ్మున నెంచి
మరలఁ జుట్టఁగఁ దొలిమాడ్కి చూడంగఁ
గొఱఁత గన్పింప, నా కోమలి పిదప
తనయింట నున్నట్టి త్రాళ్ల నన్నింటి
పెనుత్రాడుగా ముడివెట్టి చుట్టినను
చాలమి దోఁచ నా చాన యశోద
చాల నాశ్చర్యవిచారమ్ము లొందె
భువనములున్న నీ బొజ్జను గట్ట
నవునె రక్షక! వెట్టి యత్నమే గాని
నీ తల్లి నందునినెలఁత యశోద
యా తీరుగా తన యత్నమ్ము పతన
మగుటకు గడుఁ జింత నందుటే గాక.
మొగమునఁ జెమ్మటల్ ముసురుకొనంగ
వేనలి వీడ్వడి విరులెల్లఁ రాల
జానగు పయ్యెద జాఱఁగ, విసిగి
యేమి తోఁచక యట్టులే యూరకుండ
నామెను గరుణించి, యా తల్లిచేత 620
బంధింపఁ బడితివి పరమేశ, భక్త
బంధనమ్ములువాపు బంధవిదూర!

సతి నే ననుచు సిరి, శంభుండు నేను
హితుఁడ నంచును, బ్రహ్మ యే బుత్రుఁడ నని,
నినుఁ గని మోదింత్రు నెమ్మనమ్ములను
వనజనాభా! కృష్ణ! వారు యశోద
తరణి నీ కరుణను గాంచిరే, యా వె
వరపుణ్య మహిమంబు వర్ణింపఁ దరమె!
భవబంధమోచన, పద్మాక్ష, శ్రీశ,
భవదీయ దివ్య సేవాభాగ్య మొసఁగి
కరుణింపుమా నన్నుఁ గంజాతనేత్ర,
నిరుపమ చారిత్ర! నీరదగాత్ర!




## యమళార్జున భంజనము

శ్రీశిఖిపింఛలాంఛిత దివ్యరూప,
దాశార్హ, కృష్ణ, యాదవవంశదీప,
ఆలాగు నందునిల్లాలు యశోద
ఱోల నినుంగట్టి ప్రొద్దయ్యె ననుచు
నిను నొంటరిగ నుంచి, నీ మాట మఱచి
దినకృత్యముల వెంటఁ దిరుగుచునుండె
ముని నారదుని శాపమున మణిగ్రీవుఁ
డును నలకూబరుఁ డును జంటవిడక 630
ఇరుమద్ది చెట్లయి పృథ్వి నుండుటయు
నరయు నాశ్వత్థ గుహ్యకు లిరువురును
దామోదరా! భవద్దర్శన మహిమ
తాము శాపవిముక్తిఁ దము నిజరూప-
ములను బొందుదురని మును నారదుండు
పలికియుండిన నుడుల్ పాటించి నీవు

ఆ గుహ్యకుల శాప మపనయింపంగ
బాగుగ నెమ్మది భావించి రోటిఁ
గవమద్దిచెట్ల చెంగట చేరునట్లు
తివిచి కొంపోయి పృథ్వీజ ద్వయమ్ము
నడుమన దూటి తిన్నఁగ రోటి నడ్డ
మిడి లాగితివి తరు లిలఁబడి విఱుగ
నయ్యర్జున ద్వయమందుండి శాప
మయ్యెడఁ దీఱిన యా మణిగ్రీవ
నలకూబరులు ధననాథుని సుతులు
విలసిత నిజపూర్వ విగ్రహమ్ములను
దాలిచి వచ్చి ని న్దర్శించి, నీదు
శీల, నామ, గుణవిశేషమ్ము లెల్ల
భక్తితో నానందపరవశు లగుచు
శక్తికొలంది సంస్తవ మొనరించి 64
"నందనందన, భవన్నామ చింతనము
నెందు మా చిత్తమ్ము లేమరనట్లు
వరము నొసంగి బ్రోవవె వాసుదేవ,
శరణము, నీవె మా శరణమ్ము దేవ"
అనివేఁడ వారల యక్షేశుసుతులఁ
గనికర మొప్పంగఁ గాంచి యిట్లంటి –

ఓ నలకూబర, ఓ మణిగ్రీవ,
మీ నిలయములకు మీ రింకఁ జనుఁడు
తమ తమ ధర్మముల్ దప్పక సమత
విమల మనస్కులై వెలయువారలకు
శుభములు చేకూరు చొప్పడు పుణ్య
విభవ, మీ సత్యమ్ము విదిత మెల్లరకు

నారదముని వచనము విశేషమున
మీరు సన్మార్గాన మెలఁగుదు రింక.
నా మీఁది బుద్ధి యెన్నఁడు మీకు నిలుచు
క్షేమ మొదవునంచు సెల వొసంగితివి.
వారు భవద్దివ్య వాక్కు లాలించి
పారము మీఱిన భక్తి నీ చరణ
కమలములకు నమస్కారముల్ సేసి
యమలమనస్కులై యరిగి రామీఁద. 650

నందాదులైన మందను గల పెద్ద
లందఱు గుమిగూడి యమళార్జునములు
విఱిగిపడినసద్దు పిడుగు సద్దంచు
కరము శంకించి వేగమవచ్చి చూచి
"ఈ పాదపము లిట్టు లిలఁబడినప్పు
డీ పాపఁ డీ ఱోట నిటు కట్టువడియు
ఏ పాటులేక తా నెట్లుండఁ గలిగె ?
వాపోవఁ డులుకఁ డబ్రబ్బిమ్మిది చూడఁ
బిడుగు పడదు. గాలి వీవదు. వీఁడు
బుడుతఁడు ద్రోయంగఁ బోలఁడు తరులఁ
గాన నుత్పాతలక్షణమగు నిద్ది
యీనాఁడు గంటిమి యిట్టి లక్షణము"
అని వితర్కించెడు నార్యుల పలుక్కు
లను విని యచటిబాలకు లీవు తరులఁ
విఱిచిన తీరెల్ల వివరించి 'చెట్లు
విఱిగిన యప్పుడ వింతమానిసుల
ఇరుగురఁ గంటిమి యే' మంచుఁ జెప్పఁ
గరము వారికి నమ్మకము గల్గదయ్యె.

బాలగోపాల, యెప్పటియట్ల నీవు
నీ లీల లెవ్వరే నెదిలిసికో లేని 66
రీతి నాడుచునుంటి, వ్రేపల్లెవారు
చేతోముదమ్మునఁ జెలఁగి రవ్వేళ
పరమేశ, భక్తులే ప్రాణముల్ నీకు
నిరతమ్ము వారి మన్నించి ప్రోచెదవు
వారిమాటలకును వారియూహలకు
గోరంత కొఱయుఁ జేకూర్ప వెన్నటికి
ధనదుపుత్రులఁ దిట్టి తన్నివారణకు
ననుకూలమగు మార్గ మరయ శ్రీకృష్ణ
దరిసెన మని నారదముని మున్నెపుడొ
భరము నీపైనుంచి పలికె, నా భక్త
వరుమాటలకు గౌరవము గూర్పనెంచి
హరి యిట్టి నాటక మాడితి వీవు
ఈ రహస్యములెల్ల నెవ రెఱుంగుదురు?
శ్రీరమారమణ, చక్రీ, నాగశయన!

## నందాదులు బృందావనముఁ జేరుట

కోలచేతం బట్టి కుంభమ్ము నీట
నీ లాగు గన్పడు నీ నీడఁ జూచి
ననుఁ గొట్టఁగా వచ్చె నర్భకుం డొకఁ
డని తల్లితో నంటివట ముద్దుకృష్ణ!
ఇదిగో భిక్షుకులు నీ వేడ్చితివేని
వదలరు బిచ్చపుపాత్ర నిన్నుంచి 670
శిక్షింతురని తల్లి చెప్పగా నీవు
భిక్షుకులంగని భీతిల్లితి వట,

తనయ, పాల్ద్రావుము తద్ద చుంచెదుగు
ననఁగఁ దక్షీరమ్ము నాని, నా చుంచు
అమ్మరో! యెదుగలే దని పల్కితి వఁట
యిపమ్మాడ్కి నీ లీల లెమ్మెలు కృష్ణ,
బహువిధమ్ముల నిట్టివ్యాజంపులీల
లహిరాజశయన, నీ వటు చూపుచుండ
నీ లీల లన్నియు నిక్క ముత్పాత
జాలమ్ములంచు నిస్సంశయ మంచు
నందాది గోపబృందము తమయెడఁద
లందు భావించి యి య్యాపద లెల్ల
బాలుఁ డెట్టులొ దాఁటె పరమాత్మకరుణ
నేలాకో మనమిఁక నిందు వసింప,
బృందావనము చేరుటెంతయు శ్రేయ
మందు పసికి మన కన్నివిధాల
వసతులు గలవని వారు యోచించి
వెస ప్రయాణమ్ముల విధియించి యవల
తమకుటుంబముల బృందకుఁ జేర్చి మిగుల
ప్రముదితస్వాంతులై వసియించి రచట. 680
బలరాముఁడును నీవు బహువిధఖేల
లెలమి బృందావని నీడుబాలకులఁ
గూడి క్రీడించుచు గోవత్సములను
వేడుక మేపుచు వెలయుచునుండ
గోపగోపీజనుల్ కుతుకమ్ము మీఱ
నేపారుసంతృప్తి నెసఁగి రచ్చోట.

ఎచ్చోట నీవుందు వెచట కాలిడుదు
వచ్చోట శుభము లనంతము లగును.

ఆపదల్ రవికిరణాళికి హిమము
రూపఱునట్లు నిర్మూలమ్ము లగును
ఇట్టి నీ మాహాత్మ్య మెఱుఁగక మంద
పట్టు వీడిరి వ్రేలు పామరు లగుట
మందయు బృంద నీ మహితపాదార –
విందచిహ్నితములై వెలసిన కతన
పరమపుణ్యస్థల పదవుల నొందె
నిరుపమ కారుణ్యనిధి! దేవదేవ!

కలలోననైన శ్రీకర భవత్పాద
జలజదర్శన ఘన సంపద నొసఁగి
నను భక్తునిగఁ జేసి నాజన్మసఫల
మొనరింపుమా జగదుద్ధార నిరత! 690

## వత్సాసుర వధ

సకల బర్హిర్ముఖ సంస్తవనీయ,
ప్రకట శుభచరిత్ర, పంకజనేత్ర,
శ్రీకృష్ణ, నీదు సత్కృత్యముల్ లోక
శోకవిదూరముల్ శుభదాయకములు.
ఒకనాఁడు కాళిందియొడ్డున వత్స
నికరమును బలుండు నీవు గోపాల
బాలురు మేపఁగ, వత్సమై యొకఁడు
కూళరక్కసుఁడు నెక్కొన్నగర్వమునఁ
గీడు మీ కొనరింపఁ గికురు వహించి
దూడ గుంపులలోన దూఱి, మేయుచును
అదను చూచుచునుండె, నా కూళతలఁపు
యదువంశతిలక, నీవంతయు నెఱిఁగి

బలరామునకుఁ దెల్పి, బాలురఁ బిలిచి
చెలులార! గనుఁడి, యీ చెలువంపు లేఁగఁ
గనుల కానందమ్ము గల్గించుచున్న
దనుచు దగ్గరఁ జేరి యా క్రేపుకాళ్లు
వాలముం జేరిచి పట్టి కపిత్థ
సాలమ్మునకు గొట్టి సంహరించితివి
వెలఁగయు నాసురద్వేషియు నొకట
నిలఁబడఁగాఁ గాంచి, యెలమి బాలకులు 700
నిను నుతియించిరి, నిర్జరగణము
సొసరఁగఁ గురియించె పూలవర్షమ్ము.

## బకాసురవధ

నవనీతచోర, శ్రీనందకుమార,
దివిజార్తిహర, కృష్ణ, దీనమందార,
ఒకనాఁడు క్రేపుల నుత్సాహ మొప్ప
నికటాటవిని మేప నీవు, రాముండు
గోపబాలురు, తోలుకొనిపోయి, మేపి
యేపగు నెండ సహింపఁగ లేక
దూపగొన్నట్టి మీ దూడల నెల్ల
దాపునఁగల నీటి తావున నీరు
ద్రావించి, మరలించి, తరలిరా నొకెడఁ
ద్రోవ బకం బొండు దోఁచె బెన్మేన
నొప్పారి: యద్దాని యొడలింటి చావు
విప్పు బాలురు గని వెఱపు నచ్చెరువు
పడుచుండ, నా కొంగ పనులెల్లమాని
యెడఁదఁ గదలనీక, యూహలు వదలి

తనచూపు నీ యందఁ దగులమ్ము చేసి
మునిచెలువున నుండె పుండరీకాక్ష!

ఆ రీతినుండి తా నదనని ముక్కు
తీరుగా సవరించి తెప్పున ఱెక్క 710
లల్లార్చి పాదద్వయమ్ము పైకెత్తి
యల్లన నెగిరి, భయంకర వక్త్ర
మతి వివృతముచేసి యా బకాసురుఁడు
ధృతిమీఱ నిను మ్రింగె శ్రీ బాలకృష్ణ
ఆ రక్కసుఁడు మ్రింగినట్టి నిన్ననక
తీరనిభీతిఁ జెందిరి బలరాము
డాది బాలురు, కాని యమృతస్వరూప,
నీదు మాహాత్మ్యంబు నెఱిఁ గనరైరి.
అసురుఁడు కబళింప నచ్యుతా, నీవు
వెస వాని కంఠమ్ము వివరమ్ము నందు
నిలిచి లోనికి బోక నిప్పుచొప్పునను
బెలుచ దహింప నా వేంద్రమ్ము నోర్వఁ
జాలక మ్రింగెడు శక్తియు లేక
తాలిమిమాలి నిన్ధరణిపై వెడలఁ
గ్రక్కి ఘోషించుచు గ్రక్కునఁ బొడువ
నుక్కరియై రాగ నుదుటడగంగ
వాని చంచులు రెండు పట్టి చీల్చితివి
ప్రాణముల్ గోల్పోయి వాఁ డంత మొంద
నమితహర్షమ్మున నలరుల వాన
నమరులు గురియించి రా సమయాన 720
గోపకుమారు లెక్కుడు మోదమంది
"ఆపద తొలఁగె కృష్ణా" యని కేక

లిడుచు గంతులువేసి, రెలమి మీ యన్న
కడుఁ బ్రీతి నినుఁ దన కౌ గిటఁ జేర్చె.

## రామకృష్ణులు బంతి చల్దులారగింప గోపబాలురతో వనికిఁ జనుట

అఖిల జగద్వందితాంఘ్రి సరోజ,
శిఖిరమ్యపింఛలాంఛిత దివ్యతేజ,
బాలకృష్ణా! ఒక వాసరమందు
హేళిమై నీవు మీ యన్న రాముండు
బంతి చల్దులు గోపబాలురతోడఁ
గాంతారమునఁ దినఁ గాంక్షించి తేప
కడలేచి, మీ లేఁగ కదుపు లన్నింటి
విడిచి కొమ్ములనూద వ్రేలబాలకులు
మెలఁకువఁ గని లేచి మించిన వేడ్క
చలిదికావళ్ళ సంసతలమ్ములందు
ధ:యించి క్రేపుల తలుగుల విడిచి
తరలించుకొని భవత్సన్నిధిఁ జేర
నందఱు గలిసి మీ రమిత ముదమ్ము
నంది దూడలమంద లన్నింటి కాన
కుం దోలుకొనిపోయి కూరిమిపెల్లు
సం దేలియాడుచు నడయాడుచుండ 730

## అఘాసురవధ

అఘుఁడను రాక్షసుఁ డతి మదోన్మత్తుఁ
డఘకృత్యరతుఁడు బకాసురు ననుజుఁ

డాతఁడు తనయున్న హతుఁడైన యట్టి
రీతి నెఱిఁగి ప్రవృద్ధరోషమున
తన సోదరుని పగఁ దాఁ దీర్పనెంచి
నిను నీదు మిత్రుల నిర్మూలనమ్ము
గావింపఁ గడురేఁగి. కమలాక్ష! కంసు
భావంబెఱిఁగి వాని పనుపునఁ వచ్చి
మీరెల్ల చల్దులు మెసవంగఁ బోవు
దారి కడ్డంబుగఁ దా నొకపెద్ద
యజగర రూపమ్ము నంది. యాశ్చర్య
మజునకైనను గల్గునట్లు గన్పడుచు
మిమ్ముల నందఱ మ్రింగు యత్నమునఁ
బమ్మిన క్రుధ తన వదన గహ్వరము
మను మిను దాఁకెడి మాడికిఁ దెఱచి
కొని పడియుండె నెక్కొన్న గర్వమున —

ఆ మార్గమందున నరుగు మీ కెదుర
భీమ రూపమున నా పెనుఁబాము తోఁచె
నా పామునుం జూచి యాశ్చర్య మొంది
గోపాలబాలురు 'కో'యని యఱచి 740
అల్లదె కనుఁగొనుఁ డా యజగరము
నుల్లములకుఁ గడు నులుకుఁ గల్గించెఁ
గొండంత దేహము. గుహయంత నోరు
మండు కనులు. విషమయములౌ కోఱ
లతిఘోర మీ రూప. మరయంగ మనల
హత మొనరింప నీ యహి యిట్లు ద్రోవఁ
బడియుండు: నుండనీ. బకునంతవాని
గెడపినవాఁడు శ్రీకృష్ణుఁడే మనకు

ప్రాపుగా నుండఁగా, భయమేల? మనల
నీ పాము మ్రింగెనా, యిదియును బకుఁడు
పొందిన దుర్గతిఁ బొందెడి ననుచు,
నందఱు బాలకు లమితమౌ వేడ్క
నినుఁ జూచి నవ్వుచు నిర్భీతి వారు
వనజోదరా! పాముపదన గహ్వరము
నందు ప్రవేశించి రందఱు క్రేపు-
లం దోలుకొని శంక లవమేని లేక
తననోటఁబడిన వత్సములను, వాని
వెనుఁబడి వచ్చు నాభీరబాలురను
ఒక కబళముగ నా యురగమ్ము మ్రింగె
ప్రకటాద్భుతమున దేవతతి మునింగె. 750
జగదార్తిహరణ, నిర్జరలోకశరణ,
నిగమచరణ, నవనీరజనయన,
అంతట నీ వా భయంకరదృశ్య
మంతయుఁ జూచి య య్యహికంఠబిలము
నందునఁ జేరి దేహముఁ బెంచి సన్న
సందేనిలేనట్లు సంపూరణముగ
గోడవెట్టిన రీతి కుదిరికతోడ
నీడ వోవకయుంటి హేమాద్రిధీర!

ఆ రీతి నీ వుండ నజగరమునకు
నూరుపాడక యొడ లుబ్బి లోనున్న
ప్రాణముల్ తచ్ఛిరోభాగపార్శ్వముల
నాని చీరిచికొని యటనుండి తొలఁగె
భవదీయదివ్యకృపాసుధావృష్టి
లవమేని నాపదలను బొందనట్టి

గోవత్సములతోడ గోపాలబాల-
కావళితోడ న య్యాశీవిషమ్ము
వదనమార్గమునుండి వచ్చితి వీవు
చదలున మేఘమ్ముచాటును వీడి
తారలతోడఁ బ్రత్యక్షమై వెలుఁగు
తారేశు చందానఁ దపనీయచేల! 760

అంత న య్యహిమేనునందుననుండి
కాంతిపుంజమ్మొండు గ్రక్కున వెడలి
నలుదెసల్ వెలుగంగ నభమున కెగసి
యులుకఁ గ్రేపులు బాలు రొందుచునుండ
అచ్చెరువని యమృతాశను లన గ
వచ్చి నీలోఁజొచ్చె బాలగోపాల!

అప్పుడు నీతోడియర్భకుల్ చాల
మెప్పు సంతృప్తి సంప్రీతియు నొంది
"జయ యఘాసురహర, జయ మేరుధీర
జయ నందనందన, జయ బాలకృష్ణ!"
అని నిన్నుఁ బొగడుచు నాటలాడుచును
మునుకొన్న సంతసమున మున్గిరంత.
విరివాన గురిసిరి విబుధులు, జగము
పరమశాంతమ్మునఁ బరగె, నజుండు
ఆ మహోత్సవముల నన్నింటిఁ జూచి
భూమికి దిగివచ్చి, "భుజగరాజమ్ము
నీ బాలుఁ డే క్రియ మృతిఁజెందఁ జేసె
నే బాధలునులేక యెట్లు బాలురను,
మనగఁజేసె నిది యమానుషకృత్య"
మని మనంబునఁ గడు నబ్బుర మందె 770

దేవదేవ, జగత్పతీ, సర్వభూత
భావుకాదిసమస్తభాగ్య ప్రదాత.
శ్రీకృష్ణ, నీదు ప్రసిద్ధమౌ మహిమ
లేకొలందులో యెవ్వరేఁ గనలేరు
వత్సాసురుండును బకుఁ డఘాసురుఁడు
మత్సరబుద్ధి ని క్రమ్మందింప నెంచి
అగ్గిఁబడ్డ మిడుత లట్టులు తామె
క్రుగ్గిరిగద యహంభావ హేతువున
అట్టిగుణములు నా కలవడనీక
కట్టడచేసి నీ కైంకర్యదీక్ష
గలిగించి నన్నేలు కమలదళాక్ష!
జలజాసనాది నిర్జరలోక రక్ష!

## శ్రీకృష్ణుడు బంతిచల్దు లారగించుట

శ్రీరమణీనిత్యసేవితచరణ.
క్షీరాబ్ధిశయన. పంకేరుహనయన.
యదుపుత్ర. నీ మాహాత్మ్యమ్ముగరిమ
విదితమ్ముగాదంద్రుడు వేధకు నైన
నీ మహితోన్నతుల్ నీప్రభావములు
తా మెఱిఁగియు దేవతలుగూడ భ్రాంతి
నిన్నుఁ గేవలము మానిసిగాఁగ నెడఁద
నెన్ని నిజాధిక్య మిదియంచుఁ దెలియ 780
నీ ముందు ప్రకటించి నిక్క మ్మెఱింగి
యామేది నీవే మహత్తరశక్తి
గలదైవమని యెంచి. కలఁకను విడిచి
విలసితభక్తి సేవింతురు నిన్ను.

ఆ రీతి మ్రుక్కి సయ్యఘదానవునకుఁ
గూరిచి పదపడి గోపాలకృష్ణ.
చల్లని నీడల జానొందు తరులు
ఫుల్లారవింద కుముద సంచయములు
తియ్యని కమ్మని తేటతోయమ్ము
లొయ్యనొయ్యన వీచుచుండు పయ్యరలు
గలిగి మహానందకరమగు నొక్క
జలజాకరమ్ముపజ్జకు వత్సములను
గోపబాలురను దోడ్కొనిపోయి కొలను
చూపి. నెచ్చెలుల కుత్సుకత నిట్లంటి
"ఎండ గ్రమ్మగ్గితిరి మీ కెచ్చెగా క్షుత్తు
రండు బాలురు! వేగిరమ జాగులేక
ఇది చల్దులు భుజింప నిమ్మగు స్థాన
మదిగాక యీ క్రేపు లన్నియు నిచట
నీరమ్ము ద్రావుచు. నెమ్మి మేయుచును
దూరమ్ముసనక యిందున నందు నుండు 790
మనమ్ము చల్దులను నెమ్మది భుజియింప
నొనరికగా నుండు నో చెలులార!"

ఆ లలితోక్తుల కానందమొంది
వ్రేలబాలురు తమ క్రేపుల నెల్ల
నీరమ్ముద్రావించి నిండు పచ్చికల
మీఱు పల్లముల నెమ్మిని నిల్పి వచ్చి
కొలను దరిం జేరి కుతుకమ్ముతోడ
చలిది చిక్కము ముళ్లు సడలించి. విప్పి
తామర దుద్దువృత్తము చుట్టునుండు
కోమలములగు రేకులఁ బోలి నీదు

చుట్టుఁ గూర్చుండి ని న్జూచుచు వారు
చట్టు, లివుళ్లు, ఘాసమ్ములు, లతలు
పువ్వు, లాకులు, కంచములుగ నా చల్ది
బువ్వలు వేడ్కతో భుజియించి రపుడు,
ఊరుఁగాయలను నోరూరఁగఁ జూపి
యేరికి నిడక తానే తిను నొకఁడు,
ఒకని చే కబళమ్ము నొడిచి గ్రసించి
యెకసక్కె మొనరించు నెగురుచు నొకఁడు,
పంతమ్ములాడుచుఁ బదిమంది చల్ది
గొంతుకనిండఁ గూర్కొని తిను నొకఁడు, 800
అన్ని పదార్థమ్ము లందఱనుండి
యన్నువ కొని తిని యలరు నొకండు,
అదె కృష్ణుఁ గనుమని యన్య భక్ష్యములఁ
బొదివి కైకొని తిని పొంగు నొకండు,
గుసగుసలాడుచు గుంపులు గూడి
ముసిముసినవ్వుల మురియుచు నిట్టు
లలరుచు, నాడుచు నా బాలు రెల్ల
చలుదులు సాపడు సమయమ్మునందు

జగముల నాడించు చతురుఁడ వీవు
నిగమవందిత, నీదు నెచ్చెలులైన
పడుచువారలు మెచ్చ, బటువుగా నుండ
నడుము దిండున వంశనాళమ్ముఁ జొనిపి
నిడువేత్రదండమ్ము నిగ్గు శృంగమ్ము
పడిపోనియట్లు డాపలిచంక నదిమి,
మీఁగడ పెరుఁగుతో మిశితమైనట్టి
బాగుగ వాసనల్ ప్రసరించునట్టి

చలిది యన్నమును నీ సవ్యహస్తమునఁ
బొలుపార నునిచి యింపును గూర్చునట్టి
వివిధోపదంశముల్ వ్రేళుల నడుమ
సవరించి. యా మిత్రసమితి మధ్యమున 810
నుపవిష్టుఁడ వయి సర్వోక్తుల తోడఁ
గృపమీఱ నవ్వుచుఁ గృష్ణ! శైశవము
మెఱయంగఁ జల్దుల మెసవితివయ్యె
యరుదరుదిదియని యమరులు వొగడ –
నీ నాటకమ్మున నెలమితో జల్ది
బోనమ్ము నీ తోడ భుజియించినట్టి
గోపబాలురు చేసికొన్నట్టి పుణ్య
మీ పాటిదని చెప్ప నేరుతే రెందు
పురుషోత్తమా. యాగ భోక్తవు నీవు
పరమాదరమున గోపాలబాలకుల
బంతిని గూర్చుండి పర్యుషితమ్ము
స్వాంత ముప్పొంగఁగా సాపడితయ్యె

వేదోక్తమంత్ర పవిత్ర హవిస్సు
నాదరించెడు నీకు నాభీరి. నందు –
సతిచేతిపాకము చాల రుచించె
నతి నుతి పాత్ర మా యతివ జన్మమ్ము
భక్తిహార్దములె భవత్కాంక్షితములు
త్యక్తమ్ము లన్యమ్ము లవి యెట్టివేని
సముఁడవు. నీ సేవ సల్పెడి భాగ్య
మమరునే నా వంటి యధమాధమునకు 820
కాని నా లఘుసేవ కాదనఁబోక
న్యూనాతిరేకమ్ము లూహించుకొనక

నన్నుఁ గాపాడుమా, నవనీతచోర!
నిన్ను నమ్మితినిరా, నిగమసంచార!

## బ్రహ్మ గోవత్సగోపబాలుర నంతర్ధానము సేయుట

శ్రీయాదవాన్వయ స్థిరరత్నదీప,
మాయామనుజరూప, మహితప్రతాప,
నందకిశోర, ఆనందాన బాల
బృందమ్ముతోడ నా రీతిని నీవు
చలుదులు భుజియించు సమయాన వత్స
ములు మేఁతలకుఁ జొచ్చి, పొదలిన లేఁత
గఱికలు మేయుచుఁ గడు దూర మేఁగి
యురుతరాటవిఁ జొచ్చియుండెః బాలకులు
తమతమదూడల తండమ్ము లచట
తమకుఁ గన్పడవని తద్ద భయమ్ము
నొంద నా బాలుర యులుకు మానంగ
పొందిక నిట్లంటి పురుహూతవంద్య!

"బాలులారా! మన వత్సమ్ములెల్ల
మేలు లేఁగసవులు మేయుచు నడవిఁ
జాలదూరమునకుఁ జనియుండు, నచట
నేలాగు మెదలుచు నే క్రూరజంతు
తతిచేత నే యాపదలకు లోనగుచు
వెతఁ గూరియున్నవో, వేగ నే నేఁగి
కని కొనితెచ్చెదః కడమలేకుండఁ
దినుఁడు చల్దులు మీరు, దిగులు నొందకుఁడు."
అని వారి నోదార్చి, హస్తాబ్జమందు
పొనరియుండిన చల్ది బువ్వతో నీవు 830

కదలి యరణ్యమార్గమున దూడలను
వెదకుచు నటునిటు వేవేగఁ జనుచు,
నిచట మేసినవి, నీ రిచటఁ ద్రావినవి,
యిచట విడిసినవి, యిచోటు వాసినవి,
అది యిది యనుచును హరి! కృష్ణ! నీవు
పొదలందు గిరులందు భూజమ్ములందు
కూలంకషములందుఁ గొలఁకుల వత్స
జాలమ్ము వెదకుచు చరియించుచుండ
భువి నీదు సామర్థ్యమును గన్నయట్టి
భువననిర్మాత వేల్పులపెద్ద బ్రహ్మ
నీ నేర్పు, నీ శక్తి, నీ సహనమ్ము
తా నెఱుంగఁగ మదిఁదలఁచి లేఁగలను
బాలుర నొక్కచో పదిలమ్ముగాఁగ
పాళిమై తనదు మాయాశక్తి దాఁచె 840
దూడలుపోయిన త్రోవ యొక్కింత
గూడ నెఱుఁగ కీవు గోపాలకృష్ణ!
చలుదులు దిన్న కాసారమ్ముఁ జేర
చెలికాండ్రు లేరందు శ్రీ మనోనాథ!
విశ్వమయుఁడ వీవు విశ్వాత్మకుఁడవు
విశ్వవిదుఁడవీవు విశ్వప్రకాశ!
ఈ వెఱుంగనిది యొండెద్దేనిఁ గలదె
యీ విశ్వమందు సర్వేశ, శ్రీకృష్ణ,
ఇది బ్రహ్మమోసంపుకృత్యమ్ముగా గ
మదిలోన నీ వెంచి మందహాసమ్ము
గావించి, "యేలొకో, కాంచన గర్భుఁ
డీ విధమ్మున మోస మేర్పడఁజేసె.

నాతని వంచించి యా వత్సగణము
నాతోడి గోపాల నందనసమితిఁ
గొని తెచ్చుటిది యొక గొప్పయే నాకు
మునుకొన నక్కార్యమునకు నే నిపుడు
వనజగర్భుండె యా వంచనమాని
దన యజ్ఞతకుఁ గడుఁ దపియించుఁగాక"
అను నిర్ణయమ్మున నటనుండి మరలి
చనుచు బృందను గోపసతులకుఁ గోప 850
బాలవత్సగణమ్ము వనభూమియందు
నేలీల నెచ్చటి కేగెనో గాని
కానరారని చెప్పఁగా రాదు. కాన
నేన వత్సములుగ, నేన బాలురుగఁ
బూనెద నన్నిరూపులు భేద మించు
కైనను గనరాని యట్టుల. మరియు
వయసులు. కంఠ శబ్దంబులు. నీతి
నియమము. లలవాట్లు. నేర్పు. లూహలును
అవి యివి యననేల యన్నియు నటులె
సవరించుకొని మంద సంచరించెదను"
అని యన్నిరూపమ్ము లప్పుడ దాల్చి
నలినాయతాక్షు. మందను జేరుకొంటి
గోపబాలకులును గోవత్సనివహ
మే పగిదిని తమ యిక్కల మున్ను
మాతలతోఁగూడి మమత వర్తిల్లు
నా తెఱఁగున నుండె నానందమొప్ప
వ్రేతలకును ధేనువితతికిఁ జూడ
మాతఁతఁ మదిక సంబావితమయెఁ

పిల్లలకును వత్సవితతికిఁ గూడ
తల్లులపైఁ బ్రేమ తద్దయుఁ బెరిఁగె 860
అనుదిన కార్యమ్ము లప్పటప్పటికి
మునుపటివలెఁ గ్రమముగ సాగుచుండె.

## బలరాముని సందియమును శ్రీకృష్ణుఁడు తీర్చుట

బలరామునకు బాల, వత్సగణమ్ముఁ
దిలకింపఁ గృష్ణ! ని న్దిలకించి నట్లు
ప్రేమ మిక్కుట మౌట, విస్మయ మ్మంది
యామీఁద నతఁడు దివ్యజ్ఞానదృష్టి
నీవ యాబాలురు, నీవ యాక్రేపు
లీవ సర్వమ్మని యెఱిఁగియు లోన
సందేహపడుచుండ, సత్యమైనట్టి
చందంబునుం దెల్పి శంక మాన్పితివి.
భవదగ్రజుండగు బలునకుఁ గూడ
సవతులేని త్వదీయ సంపూర్ణమహిమ
మెఱుఁగరా దనఁగ మరెవ్వరి కేనిఁ
దరమౌనె యెఱుఁగఁ బద్మదళాయతాక్ష!

## బ్రహ్మ శ్రీకృష్ణుని మహిమనెఱిఁగి, తనయజ్ఞానమునకుఁ జింతించి, కృష్ణుని ప్రార్థించుట

ఆ విధంబునను గోపార్భకుల్ క్రేపు
లీవయైయుండ నొకేఁడు గతించె
తోయజసూతికిఁ ద్రుటికాల మగుట
నాయమరజ్యేష్ఠుఁ డవల నేతెంచి

బాల, వత్సముల రూపములతో నున్న
బాలకృష్ణుని నిన్నుఁ బరికించిచూచి 870
వెఱఁగున మునిఁగి వివేకమ్ము తఱిగి
యెఱుకమాలుట మది నిటు వితర్కించె.

“బృందావనములోని క్రేపులు బాలు
రందఱు నాదు మాయాగుహా సుప్తు
లై యింతకును లేవ రరుగ రెచ్చటికి
యీ యున్నవత్సము లీ బాలు రెవరు?
పరసృష్టియందమా బ్రహ్మ నాకన్న
నొరుఁ డితరుఁడు మది నూహింపలేఁడు;
పుట్టితిఁ బెఱిగితి బుద్ధినెఱిఁగితిఁ
బుట్టించితి జగమ్ముఁ బోయెఁ బ్రాయమ్ము
సవపాలు కాని యీ చందాన నిట్టి
నవసృష్టిఁ గాన నెన్నఁడు నిది వింత.”
అని తమ్మిచూలి నిజాత్మవిచార
మునుబొంది, యాశ్చర్యమున మున్గియుండ
ఆ యర్భకసమూహ మంతయుఁ గృష్ణ
నీ యాదిరూపమై నెగడు నారాయ
ణాకారములతోడ నచటఁ గన్పింప
వీఁక నుత్సాహమ్ము వెలయు విరించి
తనుఁ దాన మఱచి, యంతట మేలుకాంచి,
తన యెదుటన బృంద దర్శించి, యచటఁ 880
గరమున శీతాన్నకబళమ్ముఁ దాల్చి
త్వర మిత్రసమితిని, వత్సగణమ్ము
వెదకుచుఁ దిరిగెడు విష్ణుని, నిన్ను
నుగద మొదననగఁ గని మోహము మాని

నీదు శ్రీకరపాద నీరజములకు
వేదోక్తమంత్రముల్ వెలయ సాష్టాంగ
మెరఁగి నిలిచి చేతులెత్తి జోడించి,
పరమపురుష, నిన్నుఁ బ్రార్థించె నిట్లు.

## బ్రహ్మ శ్రీకృష్ణుని బ్రార్థించి తన్ను మన్నింప వేడుట

"విశ్వప్రకాశ! దుర్విషయవినాశ!
శాశ్వతరూప! యసదృశప్రతాప!
నీవె ప్రపంచంబు, నీవె సమస్త
జీవజాల, మ్మీవె సృష్టి కాధార.
మీవె గుణత్రయ, మీవె సర్వమ్ము
భావనాతీతమౌ బ్రహ్మమ్ము నీవె
నీదు మాహాత్మ్యమ్ము నెఱిఁ గనలేక
ఆదమఱచి కడు నజ్ఞానతిమిర
మున మునింగితి గర్వమున వెఱ్ఱినైతి
నినుఁ బరీక్షింపంగ నెమ్మది నెంచి
పొనరించితిని దోషపూర్ణమౌ కర్జ
మనయుఁడ నన్ను దయాదృష్టిఁ జూచి 890
మన్నింపుమా జగన్మాన్యచరిత్ర,
పన్నగశయన, పాపధ్వంసనిపుణ,
తారల నాసారధారలనైన
భూరజంబులనైన బుధులు లెక్కింపఁ
జాలుదు రేమొ, నీ శశ్వదుత్కృష్ట
లీలాగుణంబుల లెక్కింప లేరు
నీ కరుణాగుణాన్విత భాగ్యలబ్ధి
లేకున్న ని న్గనలే రెవ్వరేని

భవదీయమహిమాప్రభావముల్ గనెడు
ప్రవిమల సత్త్వసంపన్నులౌ నీదు
భక్తులలో నొకభక్తునిగాఁగ
ముక్తసాంగత్య సమ్మోదితుగాఁగ
నను఼ గరుణింపవే నలినదళాక్ష.
మునిజనసంరక్ష. బుధజనపక్ష!''

అని పెక్కువిధముల నచ్యుతా. నిన్ను
వినయవిధేయతల్ వెలయంగఁ బొగడి
భవదీయకరుణకుఁ బాత్రుఁడై యజుఁడు
ప్రవిమలభావసంపద్భాగ్య మంది
వలగొని నీ పాదవనజముల్ తనదు
తలలుదాఁకఁగ మ్రొక్కి ధన్యుండనైతి 900
నని మనంబునఁ బొంగి యాత్మనివాస
మునుఁజేరఁ జనియె దామోదరా! కృష్ణ!

ఆవల నీదు మాయను మాయఁ జేసి,
గోవత్సముల బాలకుల నదృశ్యమ్ము
గావించి నిజవత్సగణము, బాలురను
వేవేగ ప్రియమునఁ బేర్వేరఁ బిలిచి
అనుఁగులతో చల్దు లాప్యాయనముగ
మునుపటి రీతిని భుజియించి యచటి
వింతలు చూపుచు వేడుకపడుచు
స్వాంతముల్ పొంగఁగా బాలకుల్ నిన్ను
కొనియాడుచుండ నా గోపబాలకులఁ
గనికరించుచు వత్సగణములతోడ
బృందఁ జేరితి బాలకృష్ణ! నీ లీల
లెందు మాహాత్మ్య ప్రకృష్టముల్ దేవ!

మునులైన నేమి? విబుధులైన నేమి?
వనజోద్భవుండేని ఫలమె? గర్వమ్ము
విడకున్న నెందేని విఫలులే యగుట
కడు సత్యమే యగుఁ గాదె జగాన.
మిగుల నహమ్మతి మించి విరించి
నగుబాటునొందె. శ్రీనాయకా! నీదు 910
మహిమ యెఱుంగక మాయలో మునిఁగి
యహమనుగుణము మహాబాధకమ్ము.

నను నహంకార గుణవ్యతిరేక
ఘన నయశీలునిగాఁగ మన్నించి
భవదీయపాదసేవాభాగ్య మొసఁగి
యవిరతకరుణా కటాక్షమ్ముతోడఁ
గాపాడవే ముక్తి కాంతావినోద!
నీ పాదములె దిక్కు నిత్యానుమోద!
ఖలు నఘుఁ బోకార్చి, కడుప్రియమ్మొసఁగ
చలుదు లాప్తులతోడ సాపడి యజున
కతులమౌ నీదు మాహాత్మ్యంబు పెంపు
మతికెక్కఁ దెల్పిన మహనీయమైన
యీ నీ కథను పఠియించిన విన్న
మానక కోర్కులు మానవతతికి
పలియించునని శుకబ్రహ్మ పేర్కొనియె
జలజనాభా! కృష్ణ! సాధుమందార!

## గార్దభాకారుండైన ధేనుకాసురుని వధ

శ్రీ పుండరీకాక్ష, శ్రితజనపక్ష,
తాపసజనరక్ష, దైత్యవిపక్ష,

కపట చిద్వృత్తి లోకము మోసగించి
యపరాధమనక నిజాకృతిమార్చి 920
మారురూపములెత్తి మానక హింస
లోరువరానటు లొనరించునట్టి
క్రూరుల దండించి కుతుకమ్ము ప్రజకు
నేరుపునం గూర్చు నీ దయాపరత
భువనత్రయంబునఁ బొగడొందుచుండు
భవబంధమోచన, భార్గవీరమణ!
శ్రీదాముఁడనువాఁడు శ్రీ బాలకృష్ణ!
నీదు నెచ్చెలి మిత్రనిచయమ్ము తోడఁ
జనుదెంచి నీ యగ్రజన్ముని నిన్నుఁ
గని యిట్టులనె మైత్రి గడలుకొనంగ
"రామకృష్ణులు మీరు ప్రబల దోర్బలులు
ప్రేమస్వరూపు లాశ్రితకల్పతరులు
మా మనవిని విని మా యభీష్టంబు
ప్రేముడి తొనఁక గావింపఁగా వలయు.
వినుఁడు దూరంబున వెలసెడి నొక్క
ఘనతాళవనము: తత్కాననమందు
ధేనుకుఁడను నొక దేవారి గలఁడు
దాన, నెవ్వరు దాని దరియంగఁ బోరు
ఆ దుష్టరాక్షసుఁ డమిత శూరుండు
సాదుల బాధించు సహజ దుర్గుణుఁడు 930
వాఁడు గార్దభము రూపమ్మును బడసి
వాఁడిమి గల తన వారితోఁ గలసి
మనుజులఁజంపి తన్మాంస మోరెపుగఁ
దినుచుండు మిగుల భీతిదముగ నెపుడు

ఆ తాళఫల సుగంధానిల మిపుడు
మా తాల్మిభేదించి మమ్ముల నటకుఁ
బాయక లాగెడు బలిమి నెట్లేని
తీయని యా పండ్లఁ దినెడు భాగ్యమ్ము
నాదృతి మాకు లభ్యం బగునట్లు
మీ దయ నెఱపుఁడీ. మీకు జేజేలు
ఆ రక్కసుల మీరె హతమార్పఁ గలరు
తీరుపఁగలరు మా తీరని కోర్కె''

ఆ పల్కులను విని హాస మ్మొనర్చి
మై పొంగ నన్నయు మరియు మిత్రులును
వెంటరాఁ దత్తాలవిపినమ్ముఁ జేరి
తుంటరిదైత్యుని దున్మాడు మనుచు
ప్రేరేచితివి రాము. రిపుజనభీము
శౌరి. నందకుమార. జలధి గంభీర.
బలభద్రుఁ డంత పెంపగు తనబాహు
బలమేర్పడ గ తాళపాదపంబులను 940
బట్టి కదల్చి తత్ఫలములు రాలు
నట్టు లొనర్పఁగ నా ధేనుకుండు
గార్ధభాకారుఁడై కడువేగ నటకు
దుర్దాంత భీషణాస్తోక కోపమునఁ
జనుదెంచి. నిజఘోర చరణఘాతమున
వనగిరియుతభూమిభాగంబు గదల
రదములు దీటుచు. ప్రదరమైనట్టి
కొదచెవుల్ వెలయ. మిక్కుటపుగ దోఁక
విసరికొనుచు వచ్చి వెంగాళ్ళతోన
వెసఁ దన్నె రాముని వెడఁదయురమ్ము —

నంతటఁ బోక యా యధమరాక్షసుఁడు
పంతమ్ముతోడ నా బలభద్రుఁ గఱవ
గమకించి వాటమ్ము గానక రోష
మమితమౌచుండంగ నటునిటు దిరిగి
తన్నె నాతని గోపతనయులు బెదరి
ఖిన్నులై చూడంగ, కెరలి యొంద్రించి.
అంతట బలరాముఁ డాగ్రహ మ్మొంది
యంతకాకారుఁడై యధమగార్ధభము
నాలుగుకాళులం దా నొయ్య నొక్క
కేలున బిగఁబట్టి క్రేడించి త్రిప్పి 950
విగతజీవుని జేసి వెస నొక్కతాళ
నగముపై విసరె ననంత శౌర్యమున
ఆ తాఁకుచే నది యటునిటులూఁగి
వాతాహతిం ద్రుళ్లిపడెడు విధాన
వేరొంటిపైఁ బడి విఱిగె, యా చెట్టు
ధారుణిపై నిల్చు దార్ఢ్యమ్ములేక
వ్రాలె వేరొకటిపై వరుసగ నిటులె
తాళభూజమ్ములన్ని తత్కాననమున
నొకటిపై నొక్కటి యొఱఁగుచుఁ గూలెఁ
బ్రకటమయ్యెను రాముబాహు విక్రమము.

ఆ విపద్దశ ధేనుకాసురబంధు
నివహమ్ము గాంచి యున్నిద్రరోషమున
రాసభాకారులై రయమున వచ్చి
యీసున మీ పయి కెగసి మీచేత
మడిసి రెల్లరు నొక్కమాటుగా నంత
యడవియంతయు నిర్భయాటవి యయ్యె.

గోపాలబాలురు కొండంతప్రమద
మేపార మిము రామకృష్ణులఁ గాంచి
భవదీయ బాహు సత్త్వమునకు మెచ్చి
వివిధరీతుల మిమ్ము వినుతించి. తాళ 960
ఫలములఁ దమకోర్కె ఫలియించినటుల
కలమాఁగినట్టివి కడుపారఁ దినిరి
అదిమొదలా వని యాలమేఁతలకుఁ
గొదలేక మందలకుం డెంకి యయ్యె.

నందనందన. కృష్ణ. నవనీతచోర.
సుందరాకార. వసుంధరోద్ధార.
చెలికాలు వేఁడఁ జెచ్చెర వారి కోర్కె
ఫలవంతమగునట్లు భావించి వేగ
కూళుని ధేనుకుఁ గూల్పించి మధుర
తాళఫలంబులఁ దనివి తీరంగ
మెసవెడి భాగ్యంబు మిత్రమండలికి
నొసఁగితి గౌరవ మొప్పంగఁ గాని
వారు బాలకులంచుఁ బరఁగ నీసాటి
వారు గారంచు నొప్పరికమ్ముఁ జూప
వైతివి. భవదీయహార్దసమ్మతికి
జోతలర్పింతు యశోదాకుమార!
ధేనుకాసురు బలదేవుండు చంపఁ
బూనఁజేసితి వీవు పూన వెందులకు?
తెలిసె నీ సంస్తుత్యదివ్యగుణంబు
బలున కన్నకు జగత్ప్రఖ్యాతిఁ గూర్ప 970
ఆ రీతి జరిపించి తయ్య తత్కార్య
మీరేడుజగముల నెసఁగె నీ గుణము

నీ మిత్రసమతయు, నీ గురుభక్తి
సామాన్యములె బుధజనసమ్మతములు
అట్టి మేలిగుణమ్ము లావంతలేని
కట్టఁడిమూర్ఖుఁడ కడుహీనజనుఁడ
నను గుణిగాఁ గరుణను సవరించి
వనజనాభా, భవత్పాదపద్మములు
సేవించుభాగ్యమ్ముఁ జేకూర్పుమయ్య
గోవింద, గోపాల, గోపికాలోల!

## శ్రీకృష్ణుఁడు కాళియమర్దనము గావించిన కథ

శ్రీ గోపికాజన చిత్తవిహార!
రాగాదివిషయ దుర్వ్యాపారదూర!
విశ్వమ్ము నిర్భీతి వివిధ సౌఖ్యముల
శాశ్వతముగఁ బొందు సంకల్ప మొనర
దుష్టులఁ దునిమి నిస్తులమైన ముదము
శిష్టుల, కొసఁగుదు శ్రితజనపక్ష!
నీదు సంకల్పముల్ నిత్యముల్ పుణ్య
ధామంబు లనుదినధ్యాన యోగ్యములు.

కాళిందిమడుగున కాళియుఁ డనెడు
కూళనాగంబుండు క్రూరు డతండు 980
ఆ సరీసృపగరళానల శిఖల
నే సమయమ్మునసేని యమ్మడుగు
వేఁగుఁ; బైఁబైఁ బరువిడు పక్షిజాతి
క్రాఁగి యందునఁబడి క్రమ్గుచునుండు
ఆ నీటిజల్లుపయ్యెరసోఁకఁ జాలు
ప్రాణముల్ వీడు నే ప్రాణియు నైన

నుదకంబుపొంగుచు నుడుక నా మడువు
వెదఁజల్లు కాళియువిషము నెల్లెడల
ఆ విషజలమయహ్రదము నిర్విషము
గావించి సుజలసంకలిత మ్మొనర్చి
జంతుజాలమున కాశ్రయముగఁ జేయ
స్వాంతమం దెంచితి సర్వసంరక్ష !

అట్టి సంస్తుత్యకార్యమునకుఁ బూని
పట్టువిడక నీవు బాలురతోడ
ఆల నా హ్రదసమీపావనిఁ జేరఁ
దోలించి నీదు మిత్రులు చూచుచుండ,
సరగున మడువు పజ్జకుఁ జని దాని
దరినిగల కదంబతరువుపై నెక్కి
విడకుండ నీ నెఱుల్ బిగిముడివెట్టి
కడు భద్రముగ వల్వ కటి బిగియించి 990
యా తరుశాఖాగ్రమందుండి శబ్ద
మాతతముగ దిశలంటి మ్రోయంగ
నుఱికితి మడువున నుద్వేలమైన
తరఁగల తాఁపుల దరులు కంపిల్ల
ఆ రీతి సంక్షోభ మగుచు నమ్మడుగు
ఘోరమై తనకు నెక్కుడు నుపద్రవముఁ
గలిగింప కాళీయకాకోదరమ్ము
కలఁగుచిత్తమ్మునఁ గడుఁ గోపమంది
మడుఁగునంతయుఁ బరామర్శించి నిన్నుఁ
బొడఁగని, నిర్భయమ్ముగ నీవు నీట
నీఁదుచు సంతోషవృత్తిమై నుంట
వేదన, ఖేదమ్ము, భీతి, రోషమ్ము

తనకొక్కమారు వింతగఁ గల్గఁ దనదు
మనమున నపుడు నిమ్మాడ్కిఁ దాఁ దలఁచె.

కాళియ ఫణి శ్రీకృష్ణుని కఱచి బాధింపఁజూచుట

"ఎవ్వఁడీబాలకుఁ డిసుమంతలేఁడు
క్రొవ్వి యిమ్మడుగెల్లఁ గోలాహలమ్ము
గావించుచున్నాఁడు. కానఁడు భీతి.
భావిఁ గనఁడు మిట్టిపడుచున్నాఁడు:
ఇది నాకు నెలవని యెఱుఁగఁడు. వీని
మద మణఁచుటెగాక. మత్రూక్రగరళ 1000
పావకజ్వాలల భస్మ మొనర్తు
నీ వేళ నా శక్తినెఱుఁగు లోకమ్ము"
అని విజృంభించి కృష్ణా! శేషశయన!
అనయుఁడు కాళియుఁ డతిదుష్టబుద్ధి
గరళాగ్నితాపమ్ము గ్రమ్మంగ తనదు
కఱకుదంష్ట్రల భవత్కాయమ్ముఁ గఱచె.
కఱచుటేగాక యా కాకోదరమ్ము
తఱిఁజూచి తనదీర్ఘతనువుచే నీదు
మృదుకాయముంబట్టి మిట్టాడి చుట్టి
పొదలుకోపమ్మున బుసకొట్టుచుండె
పాముచే నటు చుట్టఁబడి చూచుప్రజకు
సామాన్యమానవు చాడ్పున చేష్ట
లుడిగినయటు దోఁచుచుంటివి. కాని
యెడరులు నీకున్నవే జగద్రక్ష!

మడుగున నున్న శ్రీకృష్ణునిగని యశోదానందాదు
లెల్లరు చింతించుట

నీ లోతుగానక. నినుఁగని గోప
బాలురు నీవు చేడ్పడుచుంటి వనుచు

ప్రహదముచుట్టునుమూఁగి యతిదుఃఖపూర్ణ
హృదయులై యుండిరి యెక్కుడు భీతి
విసదారిచే నీవు వెత నొందితివని
పసులు దూడలు వృషభములు నిర్గాంచి 1010
యాతతభీతిమై నంబారవమ్ము
లాతతిఁ గావించె నచ్చోటు విడక
మరియు నుల్కలురాలె మహియెల్ల వడఁకె
కరము భయంకరగతి గాలి వీచె.
నిర్నిమిత్తమ మంద నెగులు సూచించు
దుర్నిమిత్తము లిట్లు తోఁచుట చూచి
నందగోపుండు మానసమున వగచి
మందగొల్లలఁ జేర్చి "మనబాలురెల్ల
పసివెంటఁ జనిరి. యే పగిది నున్నారొ
వెసఁ జని చూతము వెడలుఁడీ యనుచు
వారలఁ దోడ్కొని వనికేఁగి జమునఁ
జేరి తద్వాహినీస్థిత హ్రదమందు
పాముకాటొంది. తద్వపువుచే నీదు
గోముకాయము చుట్టుకోబడియుండ
నినుఁగని శ్రీకృష్ణ! నీతలిదండ్రు
లనుగతమైవచ్చినట్టి యాగోప
గోపికావ్రజము మిక్కుటమగు శోక
తాపమ్ములం బొందె ధైర్యముల్ వీడె.
నీదు మాహాత్మ్యముల్ నీ సాహసములు
నీదు సాహాయ్యముల్ నీ చూపినట్టి
ముద్దుముచ్చటలును మురిపెంపుఁ బనులు 1020
నిద్దంపు నీమేన నెఱసెడికళలు
సకలమ్ముఁ దలఁచి దుస్సహమైనయట్టి

ప్రకటశోకమ్మొంది ప్రజతోడ నీదు
తలిదండ్రు లమితవ్యథల్ వొందుచుండ

## శ్రీకృష్ణుండు కాళియుని గర్వభంగంచుట

జలజాక్ష. నీ వొకసామాన్యమనుజు
కరణి నొక్కముహూర్తకాల మట్లుండి
యరుసమ్ము భీతజనాళికిం గూర్పఁ
దలఁచి నీ మేను తద్దయు నీవు పెంప
వలయితమై నిను బంధించియున్న
కాళీయసర్పమ్ముకాయమ్ము సడలి
తూలెను మరియు తద్భుజగమ్ము నాసి
కారంధ్రములనిండ గరళమ్ము గ్రమ్మె
కాఱె ధారలుగ రక్తము నోటినుండి
ఆ రీతిఁ దనబల మఱి గర్వ ముడిగి
కోఱలతో నిన్నుఁ గొఱుకుట మాని
క్రూరకాళీయుఁడు కొంతదూరానఁ
జేరి రోషమున దుశ్చింతలు విడక
ఖగరాజగమన. వెక్కసమగుబుద్ధి
పొగతోడికొఱవిని బోలి నిల్చుండె 1030
అంతట రిపుగర్వహరణ. శ్రీకృష్ణ.
దంతితుండాభమై తనరు త్వదీయ
కరమున నాగారికరణి కాళియుని
శిరము నదిమిపట్టి చెచ్చెర రెండు
తాలువులం జీల్చి ధరఁ బడవైచి
తూలించితివి వాని దుండగ మ్మెల్ల.
మరియు మాణిక్యసంభావిత మగుచు
కరము శోభిలు నా కాళీయభోగి

భోగమ్ముపై జగత్పూజార్హములును
భాగీరథీనదీ ప్రభవమూలమ్ము
లగు భవదీయ పాదారవిందముల
నగధర, నిలిపి విన్నను వేర్పడంగ,
యమునాతరంగ మహాధ్వనులెల్ల
కమనీయఘన మృదంగధ్వనుల్ గాఁగ,
మధుర లసన్మంజు మధుపఘోషములు
ప్రథితగాయక గానవాహినుల్ గాఁగ,
జలవిహంగవ్రజ సరసస్వనములు
సలలిత క్రమతాళశబ్దముల్ గాఁగ
వినువీథి గుమిగూడి వీక్షించు సురలు
ఘన సభనున్న ప్రేక్షకజనుల్ గాఁగ 1040
తాండవించితి జగద్రక్ష, బ్రహ్మాండ
భాండము మోదింప, వరమునివ్రజము
స్తుతియింప, సురతతి సుమములు గురియ
కుతుకంబుతో భక్తకోటి మ్రొక్కంగ,
నీ తలిదండ్రులు నీ చెలికాండ్రు
ప్రేఁతలు గోపకుల్ ప్రీతి నిన్గాంచి
ఆనందసాగరమం దోలలాడ
ధేనువుల్ ముదమునం దేలుచు నెగుర
నీ రీతి జగతికి నెసఁగె మోదమ్ము
కారుణ్యజలధి, నీ ఘనతాండవమున,

బాలగోపాల, భవత్కృతకార్య
జాలముల్ మెప్పులు సజ్జనతతికి
దుర్జనతతి కవి దుఃఖమూలములు
నిర్జరారివిపక్ష! నిగమసంరక్ష!

## కాళియుఁడు శ్రీకృష్ణునిమహిమ నెఱింగి పశ్చాత్తాపమొంది తన్ను మన్నింపఁబ్రార్థించుట

కాళియ భోగి భోగములపై నిలిచి
యాలాగు తాండవ మతిదుస్సహముగ
సలుపంగ తావక చరణఘాతలకుఁ
గలఁగుచు నెత్తురుగ్రక్కుచు, విషము
నుమియుచు నయ్యహి యుల్లమ్మునందు
కమలదళాక్ష, యిక్కరణిఁ తాఁ దలఁచె 1050
"దేవతలైన మదీయమౌ గరళ
పావకజ్వాలల స్పర్శమాత్రమున
మరణింత్రు, చిత్ర మీ మాణవకుండు
గరళాగ్నిఁ గాలఁడుగద, కడు మిగిలి
నా పడగలను భగ్నముగ నొనర్చి
యేపారు నిజశక్తి యేర్పడునట్లు
నను గాసివెట్టె నెన్నంగ సామాన్య
మనుజబాలుండె నమ్మఁగఁజాలఁ, గాదు
కాదు వీఁ డఖిలలోకముల నెల్లప్పు
డాదరమ్మునఁబ్రోచు నాదిదేవుండు
శ్రీహరి" యని నిజచిత్తమం దెంచి
"పాహి మాం, పాహి, శ్రీపతి, దీనరక్ష,
నాదు దోషముల నెన్నక దయఁ జూచి
నీదు దాసునిగ మన్నింపుమా దేవ!
నీవె నా ది" క్కని నిన్ను నా భోగి
భావించి భావించి ప్రార్థించుచుండ,

## నాగకాంతలు తమ భర్తను గాపాడుమని శ్రీకృష్ణునివేడుట

పరమాత్మ భవదీయ పాదఘాతములఁ
గరము తద్భోగి భోగములెల చెదఱి

యెమ్ములి సలిగి, సహింపఁగ రాని
యుమ్మలికమ్మున, నుదుటెల్ల నణఁగి 1060
మృతిఁ జెందినట్లు భూమిని బడియున్న
పతిఁగాంచి గుండెలు వగులంగ నాగ
కాంత లెంతేఁ జింత కడలుకొనంగ
స్వాంతముల్ కలఁగ నెవ్వగ నివ్వటిల్ల
క ర్తవ్య మెద్దియో గానక లోక
క ర్తను హరి నినుఁ గాంచి కారుణ్య
మూ ర్తివి నీ వని బుద్ధి నూహించి
యా ర్త శరణ్యుఁడ వంచు స్వాంతముల
నెన్ని నిగమవంద్య, నీరజనేత్ర,
పన్నగశాయి, నిన్ ప్రార్థించిరిట్లు

"క్రూరుల దండించుకొఱకు మహాత్మ
ధారుణి నీ వవతార మందితివి
కావున నీ క్రూరకర్ము దండించి
తీ విది యు త్తమ కృత్యమ్ము కృష్ణ!
పగఱ బిడ్డలె యైనఁ బగఁబూన వీవు
జగదవనమె నీదు సంకల్ప మగుట
తెగటార్తు ఖలుల నంతియెగాని, నీకు
పగయెక్కడిది సమభావ, సర్వేశ,
ఎట్టి సత్కార్యమ్ము లీ ఫణిరాజు
కట్టడ మున్ను దాఁ గావించి నాఁడొ 1070
ఎట్టి వారలచెంత కెప్పుడుఁ జనని
యట్టి దేవుండ వీ యహిభాగ్య మేమొ
భవదీయ శ్రీకరపాదద్వయమ్ము
భవదూర! యీతని ఫణముల పైన

నునిచి తాండవము మహోత్సవ మొప్ప
నొనరించితివి జగదుద్ధార చరిత.
నిగమలోక విహార. నీ పాదధూళి
తగిలినఁజాలు. నా ధన్యాత్ములింద్ర
పదమునైనను. బ్రహ్మ పదమునే యైన
తుదకు డెందమ్ములందున నెంచఁ బోరు
నీ మహామహిమలు నిరుపమానములు
సామాన్యములె సర్వసాక్షిస్వరూప.
మా మనవిని విని మముఁ బ్రోవు మయ్య
సామగాన వినోద. సామజవరద.
ఇతఁడు మా పెనిమిటి హీనుండు క్రూర
మతి గలవాఁడు సన్మార్గుండు గాఁడు
కాని సౌభాగ్యభాగ్యము మముఁ బాయ
హీనవైధవ్య నికృష్ట జీవితము
భరియింపఁజాలము. పతిభిక్ష మాకుఁ
గరుణించి యొసఁగుమా కల్యాణమూర్తి. 1080
మా పతిఁ బ్రాణసంపన్నుగాఁ జూచి
శ్రీపతీ. మముఁ బెండ్లి సేయుమా కరుణ
వినవయ్య నీ సేయు పెండ్లియే పెండ్లి
పిననాటి పెండిలి పెండ్లియే గాదు
నీ యాన నెట్టి ప్రాణికి గాని కీడు
చేయ డాగ్రహవృత్తి చెలరేఁగఁ డింక
నీ యాజ్ఞఁ బాటించు నేఁ డాదిగాఁగ
నీయవే ప్రాణమ్ము లీయహిపతికి."

అని పతిప్రాణమ్ము లర్థించు నాగ
వనితలఁ గరుణించి వనజాక్ష. నీదు

చరణఘట్టనములఁ జాలించి యచోటు
జరగి నిల్చుంటివి: సరగ కాళియుఁడు
తన ప్రాణములఁ బొంది తబ్బిబ్బిమాని
చినిఁగిన చెదరిన శీర్షమ్ము లెల్ల
కుదురుగ సవరించుకొని నిన్నుఁ గాంచి
మదినిల్పి భక్తి నిమ్మాడ్కిఁ బ్రార్థించె —

## కాళియుఁడు తన్నాజ్ఞాపింపుమని శ్రీకృష్ణుని ప్రార్థించుట

"కరుణాపయోధి! వక్రములు మా గతులు
గరళఘోరములు ముఖంబులు సూడ
మదరోష గుణములు మాకు నైజములు
వదలునే యవి మమ్ము వనజదళాక్ష. 1090
మా పాఁపజాతి యిమ్మహి పాపజాతి
సాపరాధులము శిక్షార్హులమేము
దయఁజూపితివి నన్ను దండించి. సరక
భయము దప్పెను. పుణ్యఫలము చేకూరెఁ
దాపసముఖ్యు లాత్మలఁ గోరు నీదు
శ్రీ పాదరజము నా శిరమునఁ జేరి
నను ధన్యుగాఁ జేసె నాచేత పూర్వ
మున నెట్టి సద్వ్రతములు సేయఁ బడెనో
స్వామి. గోపాలకృష్ణా! యదువీర!
యేమి యాజ్ఞయొ సెలవిమ్ము నా కింక"

## శ్రీకృష్ణుఁడు కాళియు నాజ్ఞాపించిన విధము

అని విన్నవింప నయ్యహివిభు పల్కు
లనుమతించి దయారసామృతవృష్టి

నాతనిముంచి నీ యాజ్ఞాపనమ్ము
నీ తీరు వినిపించి తిభరాజవరద.
" ఓయి కాళియ, వినవోయి నా ముదల
నీ యాటలిఁక సాగనేరవు విడువు
మీ మడువున జల మిది మొదల్ శుచికి
ధామమై భూతసంతతికెల్ల వేళ
పానయోగ్యమ్ముగాఁ బరఁగెడిఁ గాన
నీ నాటినుండి నీ విందుండరాదు 1100
నీవు నీ బందుగుల్ నీ సతీసుతులు
వే వెడలుఁడు మహాబ్ధినిఁ జేరుకొనుఁడు
నా చరణాబ్జ చిహ్నములు నీ తలను
ప్రాచుర్యముగఁ గనఁబడుచుండుఁ గాన,
గరుడుఁడు నిను బట్టఁ గడఁగ డా భీతి
యరయ నీకిఁక నెందునైనను లేదు
నిన్నీవిధమ్ముగా నేను శాసించి
యెన్నఁగా ప్రజకు మేలెసగంగఁ గూర్చి
నట్టి యీ కథను శ్రద్ధాళురై చదివి
యెట్టి వేళలఁగాని, యెచ్చోట గాని
నరులు భవద్విషానల దుఃఖములను
బొరయకుందురుగాక భువనమ్ములందు
ఇదిమొద లెవ్వరే నీ హ్రదమందు
మదిలోన నన్ను సంభావించి మునిఁగి
దేవతాతతికి నెంతే భక్తిమీఱఁ
బావనరీతి తర్పణ మొప్పఁజేయు
దురితములను బాసి తోరంపుపుణ్య
[illegible]"

అనియానతీయ న య్యహిరాజు నీవు
వినిచినయాజ్ఞ పవిత్రభావమునఁ 1110
దలఁదాల్చి. నీకు వందనము లొనర్చి
వలఁగొని. తాఁ దనవారలతోడఁ
జని సముద్రముఁ జేరి సద్భక్తి నిన్నుఁ
దన మదినుంచి శాంతము బొందియుండె

ఆ రీతి కాళియుఁ డరిగిన పిదపఁ
బేరిమితోడ గోపికలు గోపకులు
నీ తలిదండ్రులు నీ యనుంగన్న
యాతురపడుచు ని న్నాలింగనమ్ము
గావించుకొని తప్పెఁగా గండ మనుచు
నీ విధమగు బాధ లెన్నఁడు నీకుఁ
గలుగకుండెడునట్లు కరములు మోడ్చి
తలఁచి ప్రార్థించిరి తమదైవములను
అంతట యమునాహ్రదాంబువుల్ సకల
జంతుపానార్హ ప్రశస్తము లయ్యె.
తదుపాంతభూమి యంతయుఁ బశువులకు
కొదలేనిమేఁతలకుం డెంకి యయ్యె
నాలుదూడలు వృషభాదు లుప్పొంగి
వాలముబెత్తి సంబరముగా దుమికె
మోఁడులై యుండిన భూజమ్ములెల్లఁ
బోఁడిమిఁ జివురించి పొదలఁ దొడంగె 1120

దేవదేవ. మహాత్మ. దీనదయాళు.
భావింపఁగలనె భవత్ప్రభావమ్ము
జగమునకుం గీడుసల్పెడి వారి
తగువిధానమ్మున దండించి సాధు

వర్తనులను బ్రేమ పాలించుచుందు
కీర్తనీయము గదా కృష్ణ! నీ మహిమ
శరణన్నవారివాంఛలు దప్పకుండ
కొఱలేక దీర్తువు గోపాలకృష్ణ!
సకలభూతమ్ములు సంతృప్తిపడుట
యకలంకచరిత! నీ కానందమయ్య
అతిదుష్టుఁ గాళియు నబ్ధిఁ జేర్చితివి
పతిభిక్ష నొసఁగితి పొఁపచేఁడెలకు
యమునాహ్రదమ్ముతోయమ్మును మిగుల
విమలజలమ్ముగా వెలయ జేసితివి
ఎంతటి మాహాత్మ్య మెట్టి సంకల్ప
మెంతటి సాహస మెట్టి కారుణ్య
మంతటి దేవుఁడ వచ్యుతా! కృష్ణ!
యింతటి యల్పుని హీనుని నన్నుఁ
గాపాడు టెంతటి ఘనకార్య మయ్య ?
శ్రీపతీ, నాదు దుశ్శీలమ్ము వాపి, 1130
నీదు దాసునిగ మన్నించి నీ దివ్య
పాదసేవ యొసంగి పాలింపు మయ్య.

## బలరాముఁడు దవాగ్నిని మ్రింగి గోగోపగోపికా సంఘమును గాపాడుట

శ్రీవాసుదేవ, శార్ఙ్గి, రమానాథ,
దేవదేవా, జగత్పిత, జగన్నాథ,
పంచభూతములును భవదాజ్ఞ దాట
వించు కేనియు జగద్ధితశుభచరిత!

కాళీయఫణి యహంకార మ్మడంచి
వైశమ దాని నకూపారమ్ముఁ జేరఁ
దరిమిన నానిశీథమునఁ గాళింది
దరి ఘోషజనులునుఁ దత్పశుగణము
కడు క్షుత్పిపాసలఁ గాసిల్లి సోలి
పుడమినిబడి నిద్రవోవుచునుండ
న వ్వనమందు దవానల మొండు
నివ్వటిలుచు వచ్చి నిద్రించుచున్న
వారి సమీపింప వారు తద్వహ్ని
ఘోరతాపమ్మునకుం గడువెఱచి
సరసిజనయన, కేశవ, శౌరి, నీదు
శరణమ్ముఁ గోరి యీ చాడ్పున ననిరి

"అదెవచ్చె దవవహ్ని యతిభీకరముగ
నిదె మమ్ముఁ గప్పె దిక్కెవరింక మాకు 1140
రామకృష్ణులు! మీరె రక్షింపఁ గలరు
మేము మిమ్ములను నమ్మినవార మయ్య
మీ పాదములను నమ్మినవారి కెందు
నాపదల్ తొలఁగు కల్యాణముల్ గలుగు"

ఆ రీతిఁ బ్రార్థించు నాఘోషజనులఁ
గారుణ్యదృష్టితో. గాంచి యనంతుఁ
డతిబలశాలి మీ యన్న రాముండు
వితతమౌ నా యగ్ని వీక్షించి పట్టి
గ్రసియించెః వ్రేపల్లె ప్రజల కేర్పడిన
దొసఁగు తొలంగెః సంతోష మ్మెసంగె.
ఆదిదేవా! భవదంశసంభవుల
కేదే నసాధ్య మెందేనియుఁ గలదె!

అగ్నిజలంబగు నాపదలెల్ల
భగ్నమై శుభములు వరలుచునుండు
గాన పాపిని నన్నుఁ గరుణించి నీదు
ధ్యానమ్ము మఱువని తత్వమ్ము నిచ్చి
పాలింపుమా భక్తవారమందార.
శ్రీలలనామణీ చిత్తవిహార!

## బలభద్రుఁడు ప్రలంబాసురుని వధించుట

ప్రణవస్వరూప. దుర్వారప్రతాప. 1150
గుణరహితా! యదుకుల దివ్యదీప!
ప్రాణిచయ హృదంతరస్థితమైన
న్యూనాతిరిక్త బహూద్దేశములను
బాగుగ గమనించి భద్రముల్ ప్రజకు
నే గతి సమకూరు. నెయ్యది మార్గ
మా రీతి జరిపింతు వఖిల గార్యముల
నీరజదళనేత్ర. నిర్జరస్తోత్ర!

నందనందన! యొక్కనాఁడు రాముండు.
మందబాలురు. నీవమంద హర్షమున
పసుల నదీగిరి ప్రాంతమ్ములందు
పసిమికసవుగల పట్టులఁదోలి
మేపుచుండఁగ ననిమిషవైరి యొకఁడు
పాపి ప్రలంబాఖ్యుఁ బరఁగెడివాఁడు
కపటగోపార్భకాకారమ్ముఁ దాల్చి
నిపుణుఁడై మీతోడి నెచ్చెలివోలె
మిముఁ గూడికొనియుండె. మిమ్ము హింసింప
సమయమ్ముకొఱకు. మాత్సర్యమ్ముఁ బెంచి.

సర్వవేత్తవు కృష్ణ! సర్వేశ! నీవు
గర్వాంధకారు నా ఖలుని ప్రలంబుఁ
గని, వాని క్రూరసంకల్ప మ్మెఱింగి
కినుక గన్పడనీక కేవలబాల 1160
కుని వోలె నుండి యా కూళతో మైత్రిఁ
గనఁబఱచుచు వానిఁ గాలుని పురికిఁ
బనుపఁగ నెంచి, గోపాలురతోడ
వినుఁడని, వాఁడును విన నిట్టు లంటి

"చెలికాండ్రు! మోదమ్ము చెలగంగ మనము
కలసి యాడుదమయ్య కందుకక్రీడ
లెన్నఁగ మా యన్న, యేను వేర్వేర
పెన్నద్దులౌదుము, వినుఁడు మీరెల్ల
రటుఁ గొంద, ఱిటుఁగొంద రయి మముఁ గూడుఁ
డటుమీఁద నాడుద మాహ్లాద మెసఁగ
అనికొన్ని క్రీడానియమములు దెల్పి
మునుపె యా ఖలు ప్రలంబుని చంద మెల్ల
బలునకు నెఱిఁగించి, బాలురతోడఁ
గలసి క్రీడింపగాఁ గడఁగితి వయ్య,
ఆ యాటలందుఁ గృష్ణా! నిన్ను బలుని
మోయంగ దొడఁగిరి మొదట శ్రీదాముఁ
డనెడువాఁడును ప్రలంబాసురాధముఁడు
మునుకొని క్రమముగ మోదమ్ము చెలఁగ.
నా తరుణమున నా యమరారి తనదు
చేతమ్మునందిట్లు చింతించె "మున్ను 1170
వనజలోచను: దృణావర్తుండు దివికిఁ
గొని పోవఁజాలక క్షోణిపైఁ గూలెఁ

గాన. నాతని మోయ గారాదు నాకు
వీని( గొంపోదు నీ వేళనే" యంచు
బలు తనవెన్నున వహియించి. గిఱి
తల(గి పరువిడె. నా దైత్యాధముండు.

ఆ రీతి( బరువిడి యద్రిసమాన
భారు(. దాలాంకుని భరియింపలేక
మానవాకారమ్ము మాని యా కూళ
దానవాకారమ్ము( దాలిచె నంత
మోసపోవక వాని మూ(పుననుండి
యా సమయమ్మున నా హలాయుధు(డు
ఆ రాక్షసుని భయదాకృతి( జూచి
సారమౌ తనముష్టి సారించి వాని
శిరము వ్రయ్యలుగ విజృంభించి పొడువ
దురుసు రక్కసు(డు నెత్తురులు గ్రక్కుచును
పవిధార( దెగిపడు పర్వతమట్లు
వివశు(డై బువి.బడి వీడె( బ్రాణములు.
రక్కసు మృతికిని. రాముశక్తికిని
నక్కజ మానంద మధికమ్ముగా(గ 1180
గోపబాలురు రాము( గొనియాడి రీత(
డాపదుద్ధారకు( డం చంజలించి
భవదీయ కారుణ్య భాగ్యవంతులకు
దవుల వాపదలు నందకుమార, కృష్ణ!

## శ్రీకృష్ణు(డు దవాగ్నిని మ్రింగి గోగోపసంఘమును గాపాడుట

అతిక్రూరు(డగు ప్రలంబాసురు( డట్లు
హతు(డైన నా మీ(ద నాలగుంపులను

మేఁతలకై వనమేదినిఁ దోలి
చేతము లుప్పొంగఁ జెలరేఁగి గోప
బాలు రాడుచునుండఁ బసులు దవాగ్ని
కీలల వేడిమికిం దాప మొంది
అంబా యనుచుఁ గడు నడలి యాక్రంద
నం బొనరింపఁ గ్రన్నన గోపబాలు
రాలించి యాటల నపుడు సాలించి
యాలజాడలఁ బట్టి యరిగి యయ్యడవి
నెరగలిచే నావు లెరియని యట్లు
మరలించి వచ్చి రాత్మలు శాంతినొంద

అంత నున్నటులుండి యవ్వనభూమి
వింతదోఁపఁగ దైవవిధిఁ బుట్టినట్టి
యెరగలి బిట్టుగా నెసఁగుచు వీచు
కరువలివలన నాకసమంటునటులు 1190
దరికొని యచోటునంతయుఁ జుట్టుకొనఁగ
వెఱఁగును వెఱపుఁ దబ్బిబ్బును బొంది
గోపబాలకులు ముకుంద! శ్రీకృష్ణ!
నీపజ్జ కరుదెంచి, ని న్గని మ్రొక్కి
"దీనశరణ్య! మా దిక్కు నీ వయ్య
మానుపగదవయ్య మా కడగండ్లు
నీ దయారసవృష్టి నినుపారకున్న
నీ దవానలము మరెట్లు చల్లారు ?
నీదు బంధులకు నెందేనియాపదలు
పాదుకొనునె లోకభద్రప్రదాత!"
అని విన్నవింప నయ్యార్తుల కుయ్యి
విని కరుణించి గోవింద! యిట్లంటి

"బందుగులార, శుభంబగు మీకు
వందుర వలదు నా పల్కులు వినుడు
కనులు మూసికొనుండు క్షణమాత్ర నగ్నిఁ
బొనుపడఁ జేసి మీ పొగులును దీర్తు"
నన వార లవ్విధి నాచరింపంగ
వనవహ్నినంతయుఁ బట్టి గ్రోలితివి
ఈ రీతి దావాగ్ని నెలమిని ద్రావి
వారల సంతసపఱచితి కృష్ణ! 1200
గోపాలబాలురు గుమిగూడి నిన్ను
నాపదుద్ధారకు నచ్యుతు శౌరి
వేయువిధమ్ముల వినుతించి నీదు
శ్రేయస్కరంబయి చెన్నారు యోగ
మాయాగుణమ్ము సంభావించుకొనుచుఁ
బాయని యానందపరవశులైరి.

నీ చెల్మియొసరిచి నీతోడనుండి
నీ చెప్పినయనుజ్ఞ నెరవేర్చి నీకు
సన్నిహితులగు సత్సంపదకొఱకు
మున్నెట్టి వ్రతము లిమ్ముగఁ జేసినారొ!
గోపబాలకులు ముకుంద! గోవింద!
గోపబాలురె వారు? గురుయోగివరులు.
ఆ మహాసంపద నందుటకొఱకు
నేమి వ్రతమ్ముల నెటు సల్పవలెనొ
యెఱుఁగనివాఁడ నా కిఁక భవద్దివ్య
చరణములేదిక్కు సర్వలోకేశ,
కరుణింపు నన్ను భక్తజనసంరక్ష,
పరమదయాకర, పాహి, మాం పాహి,

## గోపికా వస్త్రాపహరణ కథ

శ్రీ గోపకామినీ చిత్తాబ్జభృంగ,
నాగశయన, వృజినవ్రజ భంగ, 1210
నిను స్వాంతమందున నిల్పి యే దైవ
మును గొల్చుచున్న నా పూజలు నీకుఁ
జెందుట, వారి కీప్సితములు నీవు
పొందించుచుండుట భువి ప్రసిద్ధమ్ము
సకలదైవములు నీ సాక్షిరూపమ్ము
లకలంకచరిత, భక్తావననిరత! —

ఒకమార్గశిరమున నుత్సాహ మొప్ప
నకలంకమతులు బృందావని నున్న
గోపకుమారికల్ గూడి కాళింది
దాపున దేవి కాత్యాయనిరూప
మిసుమునఁ గావించి యొసఁగినవేడ్క
కుసుమగంధాక్షతల్ గూర్చి పూజించి
"తల్లి, కాత్యాయనీ, దయయుంచి మాకు
నెల్లరకును కృష్ణుఁడే భర్తగాఁగ
వరమొసంగుమ; యట్టిభాగ్యమ్ము మాకు
కొఱఁతలే కందఱకును శుభ మొదవఁ
గలిగిననాఁడు నిక్కముగ మే మెల్ల
జలజాక్షి! నేతి వసంతములాడి
జాతర నినుఁగూర్చి జరపెద మమ్మ
మాతరో! మమ్ముల మన్నింపుమమ్మ" 1220
అనుచు నవ్వ్రతము నా యాభీరకన్య
లొనర భక్తినొనర్చి రోపికమీఱ —

## శ్రీకృష్ణుఁడు కాళిందిని స్నానమాడుచున్న గోపకన్యల వలువలు దొంగిలుట

అందొకనాఁ డుదయమ్మున వార
లందఱు గుమిగూడి యాదవశ్రేష్ఠ
నిన్నుఁ గీర్తించుచు నెమ్మదుల్ వొంగఁ
గ్రన్ననఁ గాళిందిగట్టునఁజేరి
మఱువున వారి యంబరములు విడిచి
గుఱుతుగా దాఁచి, సంకోచమ్ము వాసి
చిత్తలులై స్నానవిధిఁ దీర్పనెంచి
తత్తరంగిణిని నత్తనుమధ్యలెల్ల
దిగి భక్తి నిన్నుఁ బ్రార్థించుచు స్నాన
మొగిఁ జేయుచుండి రత్యుత్సాహ మొప్ప

ఆ రీతి గోపకన్యకలు కాళింది
నీరమ్ములను స్నాననియతిమై నుంట
నీవు గుర్తించి నీ హితులతోఁ గూడి
వేవేగ నచటికి విచ్చేసి సఖుల
నొకచోటఁ గదలకయుండఁ గన్సన్నఁ
బ్రకటించి, మౌనముద్రను వహియించి,
పదము లొయ్యన భూమిపయి నిడుకొనుచు
పొదలమాటునఁ జని పొంచి, దేహమ్ముఁ 1230
గుదియించి సమయమ్ముకొఱకునై వేచి
యద నేర్పడంగ కన్యకల వస్త్రముల
దొంగిలి వానిఁ జొందుగఁ గొనిపోయి
చెంగటి మంకెనచెట్టు నెక్కితివి
హాస్యార్థ మిటులు బాల్యపుఁ జేష్ట దెలియ
వాసుదేవ! ముకుంద! బాలగోపాల!

## గోపకన్యలు తమవలువ లిమ్మని కృష్ణుఁ బ్రార్థించుట

అంత ననంతు, నిజాంబరచోరుఁ
బ్రాంతభూరుహవిటపస్థితు, హాస
భాసితవదను, రూపజితసుమాస్త్రు
వాసవాద్యమరసంభావితచరణు
నినుఁ గని నాన మునింగి, నీర్వెడల
వెనుకాడి నీకు ని వ్విధి వార లనిరి

"మామనోనాయక, మా పుట్టములను
మామా, కొనెదవేల? మఱి ముట్టనేల!
మా మానములఁ గొను మమతను విడువు
మా, మము మన్నింపుమా, మసలకుము
మా చిత్తములఁగొంటి, మా లజ్జఁగొంటి
మా చేలములఁ గొంటి మా పర్వుఁ గొంటి
దంటవై యిఁక నేమి తలఁచితో నీవు
కొంటెగాఁడవు గద గోపాలకృష్ణ! 1240
గుణ మొక్కఁడేనియుఁ గుదురదు నీకు
గణుతింపఁ బెక్కులుగలవాఁడ వీవు
సహజత్వదీయ వేషము గాన మెపుడు
బహువేషధారివై పరఁగుచుండుదువు
మాయావి వీవు నీ మాయ లెఱుంగ
నా యబ్జభవునకే నలవిగాదయ్య
మా యంబరము లిమ్ము, మర్యాదఁ గొనుము,
యీయవా? యబలల మేమెల్ల రేఁగి
రాజున కెఱిఁగించి రట్టు చేసెదము
రాజీవనేత్ర! నీరద నిభగాత్ర!"

## శ్రీకృష్ణుండు గోపికల నాక్షేపించిన విధము

అని పలికిన కన్నియల పలుకులను
విని మందహాసమ్ము వెలయించి, ప్రేమ
మొలక లెత్తంగ నమ్ముగుదల తోడఁ
బలికితి వీ రీతిఁ బంకజనాభ!
"స్త్రీలెందు నీ రీతిఁ జేయుదు రొక్కొ?
ప్రేలుచున్నారు పెక్కులు మీరు
మీ తప్పుఁగూర్చి యేమియు బాధపడరు
చేతమ్ములందు రాజితముఖులార!
జలమధ్యమును వీడి చనుదెండు, కొనుఁడు
వలువలు మీయవి వనజాక్షులార!" 1250

ఆ మర్మముల నాటు వ్యాహారములకు
భామలు గోపికల్ బదులాడలేక
యొండొరుల మొగమ్ములొగిఁ జూచుకొనుచు
మెండగు సిగ్గున మీలితనేత్ర
లగుచును. మఱి యగ్గలంబగు చలికి
మిగుల వడంకుచు, మెడబంటి నీటి
యందుండి యొడ లురియాడుచునుండ
నిందీవర శ్యామ! యీ రీతి ననిరి.

"మా చేలముల నక్రమమ్మునఁ గొంటి
నీచుఁడవే యిద్ది నీకు నర్హమ్మె?
ఈవు సర్వజ్ఞుఁడ వింగితజ్ఞాని
వీ వెఱుంగని ధర్మ మెందేనిఁ గలదె!
గరితలు స్నానమ్ము గావించుచుండ
పురుషులు వత్తురే పుండరీకాక్ష!

వచ్చిరిపో కృపావర్జితు లగుచు
నెచ్చోటనేఁ జేసిరే యిట్టి చేఁత
పంతమా ? కృష్ణ, మా పయి నీకు, నీదు
చెంత సేవావృత్తి చేయుదు మయ్య
నీ యాజ్ఞమీఱము నిన్నుఁ గొల్చెదము
మా యంబరమ్ముల మా కిడుమయ్య" 1260
అని వేఁడఁగా దరహసిత మొనర్చి
వినుఁడని వారికి వినిచితి విట్లు —

## శ్రీకృష్ణుఁడు గోపికల ననుగ్రహించుట

"పడఁతులారా ! క్రొత్తవాఁడనే నేను
బిడియమ్ము సిబ్బితి, భీతి మీకేల ?
అడిగెద నొకమాట యనృతమ్ములేక
నుడువుఁడు నా తోడ న్యూనత యనక
ఈ నోము సల్పంగ హేతు వెయ్యదియొ !
మానినులార, మీ మగనిగ నెవని
కోరియున్నారొ, మీకుం గూర్చునట్టి
పూరుషుం డెవఁడొ, మీ పూర్ణానురాగ
మెవనిపైఁ గలదొ, మీ హృదయమ్ములెల్ల
నెవఁడు హరించెనో యెఱిగింపుఁ డిప్పు"
డన గోపకన్యక లందఱు నిన్నుఁ
గని మన్మథుఁడు తమ్ముఁ గలవరపెట్ట
నొకరిమొగమ్ము వేఱొకరు గన్గొనుచు
నొకరేని నీకుఁ బ్రత్యుత్తర మీక
నాన మునింగి మౌనమ్మున నుండ
శ్రీనాథ ! వారికిఁ బ్రేమ నిటంటి

"నా యింటి సేవలు, నా యాజ్ఞలెల్ల
పాయక యేవేళఁ బాటింతు రేని 1270
మీ యంబరము లిత్తు, మీ రింక రండు
తోయముల్ విడిచి యో తొయ్యలులార!"

అన విని గోపకన్యకలు వారెల్లఁ
బెను చలిబాధకు వెఱచి జలమ్ము
నడుమ నిల్వఁగలేక నగుబాటువలన
వెడలి రాఁజాలక, వెడలఁ గృష్ణుండు
నిజమానముంగొంట నిక్క మ్మటంచు
గజిబిజినొంది మార్గము వేరులేక
చిత్తమ్ము లం గట్టిచేసి యా గొల్ల
బిత్తరుల్ నీరమ్ము వెల్వడివచ్చి
హస్తయుగ్మముల మర్మాంగముల్ దాఁచి
త్రస్తాత్మ లగుచు నందఱు నిల్వఁబడిరి

వారిజనాభ! కృపామూర్తి వీవు
వారలఁగని స్మితవదనుఁడ వగుచు
"శృంగారవతులార, సిగ్గేల? యింత
వెంగలు లైతిరే వింతయ్యె నాకు
పెరిఁగితి మొకటిగ పినినాఁటనుండి
యెఱుఁగనె మిమ్ము న న్నెఱుఁగరే మీరు?
ఏ నెఱుంగని మర్మమెద్ది? యీ సిగ్గు
మానుండు, మరియొకమాట వినుండు 1280
తడుపుగట్టక నీటఁ దగునె మునుంగ
విడువఁదగునె ధర్మవిధి నెప్పుడేని,
నరయంగ నిద్ది కాత్యాయనీదేవిఁ
బరిహసించుటెగాని, వ్రతవిధి గాదు

వ్రతఫలమ్మును మీరు వలచితిరేని
సతులు మీరెల్ల హస్తములు పైకెత్తి
మ్రొక్కి మీ వలువలు పుచ్చుకొనుండు
దక్కింతు వ్రతఫలితమ్మును మీకు.''
అనవుడు గోపకన్యలు తమకెట్లు
ననువగు మార్గ మన్యము తోఁపకుంట
వ్రతభంగశంక తత్పరిహారమునకు
నతి నీకు సల్పుటెంతయు మే లటంచు
తమహస్తములు ఫాలతటముల నుంచి
విమల భక్తిని మ్రొక్కి వినుతించి రెలమి

అంత నమాయికలగు వారిభక్తి
కెంతయు ముదమంది హెచ్చిన కరుణఁ
బంచిన వేడ్క న వ్వనితలు వొంద
నంబరముల నిచ్చి యాదరించితివి
వారు మహానంద భరితాత్మ లగుచుఁ
జీరలు ధరియించి చిత్తమ్ములందు 1290
నిను నిల్పి పొంగుచు నీదు రూపమ్ము
కనుఱెప్ప లార్పక కనుఁగొనుచుండ
వారికోర్కి యెఱింగి పరమాదరమ్ము
మీఱ నిట్లంటి కుంభీనసశయన!
"కడమవడిన యంబికాదేవివ్రతము
విడక సేయుండు నిర్విఘ్నమ్ముగాఁగ
నా పయి రాత్రులయందు మీకెల్ల
నా పొందు గల్గెడి నమ్ముఁడు పొండు"
అని వరమీయ నా యబ్జాక్షు లెల్ల
"మన నోము ఫలియించె మన భాగ్యవశత

మన కృష్ణుఁ డిటమీఁద మనతోడనుండు"
నని యుబ్బి మందకు నరిగి రందఱును—

గోపకన్యకలెల్లఁ గూడి వ్రతమ్ము
నీ పయి మమతతో నెరవేర్చుచుండ
వారియభీష్టమ్ము భావించి, నోము
గోరంత యేనియుఁ గొఱలేనియట్లు
జరుగు విధానమ్ముఁ జక్క బోధించి
వర మొసంగితి వారివాంఛలు దీర
నీ దయాపరతయు నీ ధర్మనిరతి
వేదసంస్తుత్యముల్ విశ్వమయాత్మ! 1300
నిన్ను నమ్మినవారి నెనరునఁ జూతు
వెన్నంటియుందు వెవ్వేళ నేమరక

పన్నగశయన! ఆపన్నశరణ్య!
యెన్నఁడే నినుఁగూర్చి, యే పూజయేనిఁ
జేసి యెఱుంగ నా చేసినవెల్ల
దోసముల్ పాపసందోహవిదూర!
ఏమరి యెప్పుడే నీశ్వరు నిన్ను
నా మనమ్మునను ధ్యాన మ్మొనరించి
యున్నఁ దదల్పభక్త్యుపహారలవము
మిన్నక త్రోయ కెమ్మెయినే గ్రహించి
సను నేలుకోవయ్య నందకుమార!
నిను నమ్మినానయ్య! నిగమసంచార!

## మునిపత్నుల యన్నమును శ్రీకృష్ణుఁ డారగించిన కథ

శ్రీకరాకార, ఆశ్రితజనోద్ధార,
పాకారినుతపాద, భక్తానుమోద,

నిను భక్తి మదినెంచు నీ ప్రియదాస
జనుల చెంతకు నీవె చనుదెంచి, వారి
యభిమతమ్ములఁ దీర్తువయ్య సర్వేశ?
శుభదచారిత్ర, భాసుర దివ్యగాత్ర!
భవదీయ సద్భక్త పక్షపాతమ్ము
భువనసంస్తుత్యమ్ము పుణ్యమూలమ్ము 1310

నీవు నీ మిత్రులు నీ యగ్రజుండు
గోవుల మేపుటకొఱకు కాళింది
కూలాటవికిఁ దోలుకొనిపోయి, మేపి
నీళులఁ ద్రావించి నీడల నిల్పి
యూఱట నొందుచునుండ నీతోడి
వారు బాలకులు నీ పజ్జ కేతెంచి
"ఆఁకలి మిక్కుట మగుచున్నదయ్య
శ్రీకృష్ణ! యన్నంబు చేకూర్పు మయ్య"
అనవుడు యోచించి యు వ్వనమందు
నిను మనంబుల నెంచి నిష్ఠమైనున్న
పాఱుటింతులకు భవద్దర్శనమ్ము
కోరికమీఱ చేకూర్పంగ నెంచి
నిను వేఁడుచున్నట్టి నీ చెలికాండ్రఁ
గనుఁగొని యిట్లంటి కాంచనచేల!

"విను డయ్య మీర, లివ్విపినమ్మునందు
ఘనులు బ్రాహ్మణులు యాగంబొండు శ్రద్ధ
సలుపుచున్నార లచ్చటికి మీ రేగి
చెలిమి పాటించి వచింపుఁడు నాదు
పేరును, మా యన్న పేరు, నియ్యేటి
తీరాన మాయున్కి తెఱఁగును దెలియఁ 1320

బిదప మీ రడిగినఁ బ్రియమున వారు
కొదలేని యన్నంబుఁ గూర్చఁ గలారు”

అప్పలుకులు విని యాభీరబాలు
రప్పుడ యరిగి బ్రాహ్మణులకు మ్రొక్కి
“బలుఁడును గృష్ణుఁడు పసి మేపికొనుచు
నలసి, యన్నంబు మి మ్మడిగితెం డనుచు
పనిపిరి మముః ధర్మపరులు మీ వంటి
ఘనులు శ్రాంతులఁ బిల్చి కడు దయఁ జూపి
భోజనపానీయములు గూర్చుచుంట
యీ జగతికి వింతయే విప్రులార:”
అని గోపకులు వల్క నాలించి విప్ర
జనము మందప్రజ్ఞ సర్వేశ్వరుఁడవు,
క్రతుకర్త, క్రతుభోక్త, క్రతురక్షకుఁడవు,
సతజనలోక బాంధవుఁడవు నీవ
యని యెఱుఁగమి నిన్ను నాభీరబాలుఁ
డని యెంచి దుర్బుద్ధి “నన్నంబు లేదు,
లేదు పొం”డనిరి కిల్బిషచిత్తు లగుచు
వేదవినుత! వారు విప్రులే చూడ?

అంత గోపకులు నిరాశతో వచ్చి
యంతయు నెఱిఁగింప, యాదవచంద్ర! 1330
మరల బాలకుల నీ మారు మీరేగి
యరయ నా విప్రుల సడుగక వారి
యిల్లాండ్ర నర్థింపుఁ డిందు మే ముంట
తెల్లమ్ము సేయుఁడు తీరు మీ కోర్కి”

అని పంపితీవు వా రటులేగి విప్ర
వనితల దర్శించి వందనాల్ సేసి

మిము దెల్పి బోన మామీఁద నర్థించి
మము బంపుఁ డనఁగ నమ్మానినీమణులు
అపరిమితానంద మంది మేల్మేలు
కృపఁజూపె మనపయిఁ గృష్ణుఁ డావేల్పు
దరిసించి కొందము ధన్యుల మవుద
మరమరలేల ప్రయాణమ్ము గట్టుఁ
డని యొక్కరొకరి నాహ్వానించుకొనుచు
తనయులు మగలు భ్రాతలు వలదన్న
వినక వేర్వేరుగా వివిధాన్నములను
పనఁటులఁ గొనుచు సంబరమొప్పఁ గదలి
చని యమునా తటస్థలి నొక్కచోట
నును చివురాకుల నూతన ప్రభలఁ
దనరు నశోకపాదపము మూలమున
ననుఁగు మిత్రులలోన నలరు విల్కాని 1340
యనువున లోకమోహనమూర్తి తోడఁ
గనువిందు గావించు కమలాక్షు నిన్నుఁ
గనుల కఱవుదీరఁ గాంచి యా స్త్రీలు
మనముల భక్తి, ప్రేమము పైకొనంగ
పరిరంభచుంబన భాగ్యమ్ము లంది
పరమ సంతోషసంభరితలై యుండ
దేవదేవ, జగత్పతీ, యదుపుత్ర!
ఆ విప్రవధువు లన్యాభిలాషమ్ము
లిసుమంతయును లేక, యీశ్వరు నిన్నుఁ
గుసుమకోమలుని గన్గొను వేడ్కతోడ
వచ్చుటెఱిఁగి నగి వారలఁ గాంచి
ముచ్చటించితి వీవు ముదమున నిట్లు,

"భామినీమణులార! భద్రముల్ మీకు
నేమి కొఱంతలే కెసఁగుఁగదమ్మ
ననుఁ జూడ జనుదెంచినారు మీ రిటకుఁ
దనిసితి మీ కోర్కిఁ దప్పకతీర్తు
వినిపింపుఁడమ్మ యి వ్విధమున నన్నుఁ
గని యెందఱో తమకాంక్షితమ్ములను
గనుచుందు రిది వింతగాదు: మీ పతులు
గుణవతులగు మిమ్ముఁ గూడి యాగములు 1350
నిర్విఘ్నముగఁ జేయనేర్తురు మీకు
సర్వశుభమ్ములు సమకూరునమ్మ
చనుఁడింక మీ యజ్ఞశాలలు చేర"
ననుఁడు నమ్మానిను లని రిట్లు నీకు
"శ్రీరమారమణ! హరీ! వాసుదేవ!
సారసనాభ! కృష్ణా! సత్యభావ!
ఇంత వాక్పారుష్య మేలొకో చూపు
టింతులయెడ నిది యేమి న్యాయ్యమ్ము
కలబందుగులు, పతుల్ కన్నవారలును
వలదు, పోరాదని వారించుచున్న
వినక నీ పాద సవేశమ్ముఁ జేరఁ
జనుదెంచితిమి: యింక చనిన మావారు
మమ్ముఁ జేకొందురే, మాధవా! నిన్ను
నమ్మి కొల్చెదము మన్ననఁ బ్రోవుమయ్య!"
అని వేఁడు పాఁటిల్లాంండ్ర నందఱను
గని యిట్టు లంటివి కరుణ పెంపొంద.

"పాఁతలార! నా పజ్జను మీరు
చేరితిరని మిముఁ జినఁవుచుంగఁ

దల ప రెవ్వరు భవద్బాంధవుల్. సురలు
దలఁతురు మిమ్ము నుత్తమ వధువులుగ. 1360
నా దేహము స్పృశింప నరులకు సౌఖ్య
మేదియులేదు మత్కృప మోక్ష మబ్బ
నన్నుఁ గీర్తించుచు. ననుఁగూర్చి వినుచు
నన్ను దర్శించుచు నశ్వరములగు
నీ కర్మకాయమ్ము లిందున వదలి
ప్రాకటమోక్షమ్ము వడసి యామీఁద
ననుఁ జేరుకొందురు నమ్ముఁడు మీర"
లని వారు దెచ్చిన యన్నాదికముల
నారగించితివి కృష్ణా! నీదు మిత్ర
వారమ్ముతోడ నపారమోదమునఁ
బరమేశ్వరునకు నర్పణమంచు భిక్ష
పెరవారి కొసఁగ లభించుఁ బుణ్యమ్ము
పరమేశ్వరా. నీవె స్వయముగాఁ బాఱు
గరిత లొసంగఁగాఁ గైకొంటి భిక్ష
ఆ పుణ్యవతుల భాగ్యముఁ గొనియాడ
నోపుదురే విబుధోత్తములైన.

ఇమ్మెయి భిక్ష నీకిడి పుణ్యభాగ్య
మ మ్మెయిఁ దమభార్య లందుట విప్ర
జనమెల్ల నెఱిఁగి పశ్చాత్తాపమంది
వనితల కున్నంత ప్రజ్ఞయుఁ గూడఁ 1370
దమకు లేదని. నిన్ను దర్శింపఁజనమి
యమితపాప మ్మని. యజ్ఞానవశత
మోసపోయితి మని. మురహరుభక్తి
కాసంతయును లేని కష్టుల ప్రజ్ఞ.

తపము, శీలమ్ము, వ్రతమ్ము సర్వమ్ము
విపథమే యనుచు నిర్వేదమ్ము నొంది
"భవబంధమోచన, బాలగోపాల,
ప్రవిమల గుణధామ, పావననామ!
మా యపరాధముల్ మన్నించి నిన్నుఁ
బాయక సేవించు భక్తులుగాఁ గఁ
గరుణింపవే జగత్కల్యాణదాత,
కరిరాజవరద, జగత్త్రయనేత!"
అని నిన్నుఁ గూర్చి నిజాత్మల మ్రొక్కు
లను సమర్పించిరి లక్ష్మీహృదీశ!

హరి! వాసుదేవ! నారాయణా! శౌరి!
పరమపూరుష! జగత్పతి! గిరిధారి!
నిను నమ్మి నీ చెంతనేయున్న గొల్ల
యను గు మిత్రములకు నడవియందైన
నన్నమ్ము సమకూర్చి యాదరించితివి
ఎన్న నీ కృప కెందు నీడు లేదయ్య! 1380
నిన్ను మనమ్ముల నిరతమ్ముఁ దలఁచు
పున్నెంపు స్త్రీలున్న పొలకువ యెఱిగి
వారి దరికిఁ దీసి పరమపదమ్ముఁ
జేరుమార్గమ్మును జెప్పి ప్రోచితివి.
భూసురుల్ నిను భక్తిఁ బూజింపలేక
మోసపోయితి మని పొగిలిరి గాదె!
నినుఁగొల్చువారు పున్నెములను గంద్రు
నినుఁ గొలువనివారు నిరయమ్ముఁ గంద్రు.

పాఱుటిల్లాంద్రఁ, గోపాలుర భాగ్య
మే రీతిఁ బడయని హీనుండఁ గాన,

నీదు నామధ్యాననిరతియు, నీదు
పాదదాస జనసంపర్కమ్ము నాకు
సమకూర్చి నన్ను దోషవిముక్తుఁ జేసి
యమలాపవర్గభాగ్యముఁ గూర్పుమయ్య
ననుఁ బ్రోవుమయ్య ఘనశ్యామగాత్ర!
నిను నమ్మినానయ్య నీరజనేత్ర!

## శ్రీకృష్ణుఁడు గోవర్ధనగిరినెత్తిన కథ

అఖిలవేధోండ భాండావననిరత,
నిఖిలాదితేయ వందిత నిత్యచరిత,
గరుడకేతన, ముక్తికాంతా వినోద,
హరి, కేశవాచ్యుత, యబ్ధిజామోద, 1390
భవదీయ నియమ ప్రభావమే సకల
భువనవర్తనలకు మూల మ్మటంచు
నెఱిఁగియుఁ గొందఱు హీనవర్తనులు
కర మహంకార వికార భావమున
నీకు నెదురునిల్చి నిక్క మెఱింగి
తేఁకువ చెడి కడు దీనులై వగచి
తమ నేరములనెల్ల దయఁ దలఁగించి
క్షమియింపుఁ మని నీదు శరణుఁ జొచ్చెదరు
అట్టివారలసైత మాదరించెదవు
నిట్టలమగుప్రేమ, నీవు మహాత్మ!

## శ్రీకృష్ణుఁ డింద్రపూజ మాన్పించి గిరిపూజ చేయించుట

నందాది గోపబృంద మ్మింద్రుగూర్చి
మంద యాగమ్ము నమందమోదమ్ము

వెలయఁ జేయఁగనెంచి విశ్వమ్మునెల్లఁ
దిలకించు శ్రీకృష్ణ దేవకీపుత్రుఁ
బరమాత్మ నినుఁ గని ప్రణయభాషణము
లిరవొందఁగాఁ దమహృదయ భావముల
నెఱిఁగింపఁ "దత్క్రతు వే లాభమునకు
జరిపింతు? రయ్యది జరపు విధాన
మెట్టిది? యెఱిఁగింపుఁ డే వినవలతు
చుట్టాలకోర్కి దీర్చుట ధర్మపథము" 1400
అని నీవు కోర మీ యయ్య నందుండు
వినిపించె సర్వ మీ విధమున నీకు
వినుము కుమారక, వినుతు సర్వమ్ము
మన సంప్రదాయమ్ము, మన యలవాటు
జలదబృందమునకు సర్వాధికారి
బలభేది యాతని పనుపున మేఘ
సముదాయ మెసఁగి వర్షముఁ గురియించుఁ
గ్రమముతప్పక ఋతుకాలమ్ములందు
నా తోయసంపద నఖిలసస్యములు
భూతలమ్మందు నేపుగఁ బండుచుండు
నా పంట తమ పురుషార్థసాధనకుఁ
బ్రాపయి మోదమ్ము ప్రజకుఁ జేకూర్చుఁ
గావున నృపులు మేఘపతి యింద్రునకు
భావము రంజిల్లుపద్ధతి నింద్ర
యాగము భక్తితో నవని నెల్లెడల
సాగించుచుంద్రు కృష్ణా! మరి వినుము
శక్రుండు మదిమెచ్చసవన మొనర్ప
శక్రుండుమెచ్చ భూస్థలి వాన గురియు.

వానగురియ గడ్డిపడు: గడ్డిమేసి
ధేనువుల్ బ్రదుకును: ధేనువుల్ బ్రదుక 1410
పాఁడి మందల వృద్ధిఁబరఁగుచు నుండు
పాఁడిచే నరులు, దేవతలను దనిపి
మనుచుందు రిది క్రొత్తమార్గమ్ముగాదు
మన పూర్వులొనరించు మార్గమ్ముకృష్ణ"
ఆ పల్కులెల్ల నీ వాలించి, నంద
గోపుతో నిట్లంటి గోపాలబాల:

"కర్మము జంతు సర్గస్థితినాశ
ధర్మపద్ధతికిఁ బ్రధానకారణము
కర్మమే దైవము, కర్మమే ప్రజకు
శర్మముల్ కష్టముల్ సమకూర్చుచుండు.
తమచేయుకర్మకు దగినఫలమ్ము
సమకూరుచుండు నే జంతువునకును
గావున మనచేయుకర్మలఁ బట్టి
భావిభావుకములు పరఁగ నేర్పడును
మన మింద్రయాగమ్ము మానుద మింక
మనకుఁ బ్రాపుగనుండి, మనకుఁ గన్పడెడి
శైలరాజమునకు సద్బ్రాహ్మణులకు
నాలగుంపులకు నాప్యాయన మొప్ప
మఖము గావించుట మంచిమార్గమ్ము
సుఖశుభసంపదల్ చొప్పడుదాన 1420
కావున నింద్రయాగమున కేమేమి
తేవలయునొ వానిఁ దెప్పింపుఁ డవల
వానిచే గిరిపూజ బ్రాహ్మణపూజ
ధేనుపూజ యొనర్చి తృప్తిఁ జెందుదము

మన ప్రయత్నములకు మఘువుఁ డలంతి
కినుకయుఁ బొందఁడు: కినిసెఁబో మీకుఁ
గలుగదు నష్టమ్ము కాసంతయేని
కలఁగకుఁ డెడఁదలఁ గానిండు మఖము''
అని నీవు దెల్ప నీ యమృతబోధనము
విని యాదవులు గోపవిభుఁడు నందుండు
మేలు మేలనుచు సమీచీనవస్తు
జాలమ్ము పూజకు సమకూర్చి. యంత
భవదాజ్ఞ పాటించి భక్తిమీఱంగ
నవనిదేవతలకు నాలగుంపులకుఁ
బూజలు సేయంగఁ బూనుకొనంగ
గిరిరూపమున నిజాకృతితోన నీవ
యిరురూపులందాల్చి. యేన కృష్ణుండ
నిదె గిరి కనుఁగొనుఁ డిపుడంచుఁ జూపి
ముదమున నిఁక గిరిపూజలు సేయుఁ 1430
డని గోపకులకెల్ల నాజ్ఞ యొనర్చి
పనివడి నీవు గోపకులతోఁ గలిసి
గిరిపూజచేసి. తద్గిరి మ్రోలనున్న
సరస పదార్థ ప్రశస్తాన్నమెల్ల
నారగించితివి కృష్ణా! ఘోషజనము
మేరకుమీరు సంప్రీతి నొందంగ

ఈలాగు గోపాలు రెల్లరు నిన్ను
బాలకృష్ణుని గూడి పర్వతపూజ
లొనరించి. యవనీసురోత్తమాశీస్సు
లను స్వీకరించి యుల్లాసమ్ము మీఱ
గిరిదేవతా ప్రదక్షిణము సేయంగ

తరలి రెల్లరును దత్సమయమ్మునందు
గుఱ్ఱాల వడి లెక్కగొనని ప్రాయంపు
నఱ్ఱులు లాగు స్యందనముల నెక్కి
నందాది వృద్ధులందఱు వెంటరాఁగఁ
జిందులు ద్రొక్కుచుఁ జెలరేఁగి యేల
పాటలు పాడుచుఁ బరువంపుగొల్ల
కూటువ నడువంగఁ గోడె లావులును
మూపురమ్ములుఁ బాలపొదుగులుఁ గదల
నేపుగ మీఁదికి నెగురుచు రాఁగ 1440
వత్సముల్ మింటికి వాలమ్ము లెత్తి
యుత్సాహముగ గంతు లొనరవేయుచును
రాఁగ, శృంగములాది రమ్యవాద్యములు
మ్రోఁగ, మహోత్సాహమున వారలెల్ల
గిరిధర! గిరి ప్రదక్షిణము గావించి
పరమసంతోషమ్ముఁబడసి నిన్గూడి
పెందలకడ కడు విభవమ్ముతోడ
బృందఁ జేరిరి పశుబృందమ్ముతోడ

### ఇంద్రుఁడు గొల్లలపైఁ గోపించి వానలు గురియించి వారిని బాధింపఁ జూచుట

అంతట నమరేంద్రుఁ డంతయు నెఱిఁగి
యంతములేని కోపాటోపబుద్ధి
బ్రలయ ప్రవర్త సంవర్తక మేఘ
ములఁ బిల్చి యీ రీతిఁ ముదల నొసంగె.
"భూలోకమునఁ బాఁడి పొదలుట నేయి
పాలు పెరుఁగుః ద్రావి బలుమద మెక్కి

గొల్లలు నను లెక్కగొనకయే గిరికి
పెల్లుబ్బి పూజ లర్పించిరి నేఁడు
గోపాలుఁడగు కృష్ణుఁ గొప్పగా నెంచి
యీ పాకదమను నన్నిటుల నుపేక్ష
చేసిరి కాఁబోలు. చెప్పెద బుద్ధి
నా సాహసోన్నతి. నా శక్తిచూపి 1450
అభ్రరాజములు. మీ రందఱుఁగూడి
విభ్రమ త్రాసముల్ పెనఁగొనునట్లు
మెఱయుచు. నుఱుముచు. మిడివడగండ్లు
గుఱియించి. గోవుల గొల్లల నెల్ల
మిత్తిపాల్సేయుఁడు మీ వెంట నేను
వత్తు నైరావణవారణ మెక్కి
నా వెంట నమరు లందఱుఁ జనుదేర.
గోవిందు మందల. గొందలవెట్ట '' —
నని ముదలనునిడి యభ్రసమూహ
మునకు స్వేచ్ఛ నొసంగెఁ బురుహూతుఁ డంత

మేఘముల్ ప్రబల సమీరమ్ముచేత
నోఘమ్ము లగుచు మహోద్వృత్తి తోడఁ
బఱతెంచి. చీఁకట్లు వ్యాపింప నింగి
తెఱపిలేనటు గప్పి. తెగి గొల్లలున్న
పల్లెయుఁ దత్సమీపక్షోణినెల్ల
నల్లకల్లోలమౌనటు విజృంభించి
మొల్లమై చలిగాలి ముసరి వీవంగఁ
గొల్లగా వర్షమ్ముఁ గురియించి. శిలలు
పిడుగులు రాల్చుచు బెడిదంపు మించు
లడరంగ జేయుచు నవనిని మిట్టు 1460

పల్లముల్ గుర్తింప వలనుగానట్టు
లెల్లెడలను నీళు లెడలేక నింప
నా దుర్భరాసార మతివేల మగుట
యాదవావాసమ్ము లాలకొట్టములు
గూలెః నా తరుణాన గోపగోపికలు
బాలురు వృషభముల్ పసులు క్రేపులును
తడిసి పెన్నీదర తాకుడుచేత
గడగడవడఁకుచుఁ గదలి వేరొక్క
స్థలముఁ జేరఁగ నేగు తాలిమిలేక
కలఁగెనుః మరి పశుగణమెల్ల నులికి
అంబారవమ్ముల నఱువంగ సాగె.
నింబేది దిగులొంది యెల్లనాభీరు
లుల్లమ్ము లుడుకంగ నోరువలేక
యల్లలనాడుచు నాక్రందనమ్ము
లొనరింపఁ దొడఁగి రీయోజ నామంద
విని, కని యెఱుఁగని బెడదపాలయ్యె

ఆఘోరమగు విపదంబుధి మునిఁగి
నా ఘోష జనులెల్ల రల్లాడుచుంట
గోపవృద్ధులు గనుఁగొని "యిట్టి యిడుమ
వాపంగ నొరులకు వలనెట్లు గాదు 1470
బాలకృష్ణుఁడె మన బాధలు దీర్ప
జాలినవాఁ డింక జాగేల సేయ"
నని నీదు చెంతకు నరుదెంచి నీకు
వినతులు వినయమ్ము వెలయంగఁ జేసి
"ఓ కృపాగుణమూర్తిః ఓ బాలకృష్ణః
యీ కరణిని వ్రజ మెన్నఁడేఁగాని

వానల నింత చేఁడ్వాటొంది నటులు
గానము, వినము, నీ కరుణాకటాక్ష!
మున మను మాకు నీ ముప్పు నీ యెదుట
పొనరు టాశ్చర్యమ్ము పుండరీకాక్ష!
ప్రాపు నీవేగద పరికింప మాకు
కాపాడుమా మంద గజరాజరక్ష!''
అని వేఁడుచున్నట్టి యాభీరవృద్ధ
జనుల కుయ్యాలించి, సర్వ మ్మెఱింగి
"అనిమిషేంద్రున కెంత యామెక్కె చూడఁ
దనుఁ దలంపకయె సంతసమున యాగ
మునుజేసి పర్వతమును మ్రొక్కె'' రనుచు
మునువెనుకలు కొంచెమును నెంచ కిటులఁ
గోపమ్ముఁ బెంచి యీ గోకులమెల్ల
నోపఁగ రానట్టి యుమ్మలికమ్ముఁ 1480
గుడువంగ శిలలను గురియించి మిగుల
నడరుచు నున్నవాఁ డనుపమోద్వృత్తిఁ
గనుగానఁ డీతని గర్వ మడంతు
నని మది నెంచితి వచ్యుతా! నిన్ను
శరణుఁజొచ్చిన వృద్ధసంఘమ్ముఁ జూచి
దరము తొలంగఁగ దయ వెలయంగ

## శ్రీకృష్ణుఁడు గోవర్ధనగిరినెత్తి గోకులమును గాపాడుట

"ఆభీరులార! మీ రడలంగ వలదు
శ్రీ భార్గవీపతి శ్రితజనావనుఁడు
మోదము మీకెల్లఁ బొనరింపఁ గలఁడు
నాదు పల్కులు మీరు నమ్ము" డటంచు

వారి నోదార్చి విస్ఫారతేజమున
వారిజనాభ. దేవా. కృష్ణ! నీవు
వనజకుట్మము మదవారణ మెత్తు
ననువున గోవర్ధనావనీధరము
నక్కజమ్ముగ నొక్కహస్తాన నెత్తి
మక్కువ సామాన్య మాణవకుండు
పూలగుత్తిని ఛత్రముగ మదినెంచి
కేల ధరించుపోల్కని వలకేలఁ
దాలిచి, యాతపత్రముగాఁగఁ బట్టి
యీ లీల నంటి వీ వెల్లబంధులకు 1490

"తలిదండ్రులార! వ్రేతలు! గోపులార!
అలుకు చెందకుఁడు మీయాలతో మీరు
కదలిరం డిచటి కీ గర్తమ్ముచేరి
పదిలమ్ముగా నిందు వసియింప వచ్చు
బాలుఁ డీతఁడు గిరిభారమ్ము మోయఁ
జాలునే యని మీరు శంకింపవలదు
వసుమతియెల్లఁ బైఁబడిన నాచేయి
యిసుమంతయును చలియింపదు సుండు.
జాగుచేయక రండు సకలకష్టమ్ము
లీఁగి శుభమ్ము లెన్నేనిఁ గనుండు"
అన్న నీ హితవాక్కు లాలించి వారు
క్రన్ననఁ దమ పశుగణముతోఁ గదలి
యరుదెంచి యా కొండయడుగునఁ జేరి
గరుడకేతన! భవత్కరుణాపిలోక
నామృతవర్షాన నాఁకలిదప్పు
లేమాత్ర మెఱుఁగక, యిడుమలు వాసి

నిను దరిసించుచు, నీ కథల్ చెప్పి
కొనుచునుండిరి, యెట్టి కొఱంతయులేక

ఆ రీతి మందవా రాపదల్ వాసి
నారాయణా! జగన్నాథ! శ్రీకృష్ణ! 1500
భవదీయ కారుణ్యభాగ్యాన నుండ
నవనీధరారాతి యత్యమర్షమున
నేడహోరాత్రము లెడము లేనట్టు
వీడక కురియించెఁ బెనుగాలివానఁ
గాని, శ్రీకృష్ణ, యా గట్టుపల్లమున
నీ నిరుపమదయానియతి గోపకులు
సుకముంటఁ గాంచి విసుగున నింద్రుండు
ప్రకటమౌ నీదుప్రభావమ్ము నెఱిఁగి
కరము వెఱఁగున మేఘముల నన్నింటి
మరలించుకొని యల్కమాని తాఁ జనియె—

వెలిసెను జడివాన పెనుగాలి యడఁగె
జల మెల్లెడల నింకె శాంతి యేర్పడియె
నంత గొల్లలు భవదనుమతిఁ బొంగు
స్వాంతాలతోఁ, గొండపల్లమ్ము వదలి
వెలికిరా తొల్లింటి విధమున గిరిని
నిలిపితి ముందున్ననెలవునఁ గృష్ణ!
నీ సాహసమునకు నీ గురుకృపకు
నీ సముచితకార్యనిరతి కవ్వేళ
మిగుల నచ్చెరువొంది మెచ్చి యా వ్రేలు
తగినట్లు తమప్రమోదము బయల్వడఁగ 1510
నతులును, గౌఁగిలింతలు, దీవెనలును
కుతుకమ్ముతోఁ జేసి కొనసాగు ప్రేమ

నినుఁ గూడి తమతమనెలవులఁ జేరఁ
జని రందఱును గడు సంతుష్టిఁజెంది.

### ఇంద్రుఁడు తన్ను మన్నింపుమని శ్రీకృష్ణుని వేఁడుట

అంతట దేవేంద్రుఁ డఖిలలోకేంద్ర!
స్వాంతమందున భవత్ప్రాభవోన్నతులు
మాహాత్మ్యములు జగన్మాన్యవర్తనలు
సాహసకృత్యముల్ చక్కఁగా నెఱిఁగి
తన యపరాధ వర్తనకుఁ దా మిగుల
ననుతాపమొంది నీ యనుపమాదరము
పొందకుండిన శుభమ్ములు తన కెప్డుఁ
జెందవం చెద నెంచి చెచ్చెర వచ్చి
నందకుమార! ఆనందస్వరూప!
ఇందిరాసుందరీ హృదయనివాస!
భవదీయ పావనపాదాబ్జములకు
భువి సాగిలంబడి మ్రొక్కి నిల్చుండి
"పరమపూరుష! త్రిభువనవంద్యచరిత!
కరుణాకరా! శత్రుగర్వాపహార!
అరయమి నీయెడ నపరాధ మిటులు
జరిపితి. నావంటి జాల్మున కెందుఁ
బొరయునే శుభములు పుండరీకాక్ష!
కరుణింపు నను జగత్కల్యాణదీక్ష!" 1520

అని వేఁడె నప్పు డయ్యమరేంద్రు నీవు
కని కరుణించి యి క్కరణిని బనుపు
గావించితివి "ఇంద్ర! కరుణించినాఁడ
నీ విఁక నా భక్తనిచయమ్ము మరియు

సను నిరతమునమ్మి నాచెంత నున్న
యనఘుల వేధింప యత్నింపరాదు
వార లెల్లరు నాకుఁ బ్రాణముల్‌గాన
వారికష్టములు నా పరమగుచుండు.
నీ యధికారమ్ము నియమమ్ము దాఁటి
యే యెడ నడువకు మిది నీకు నాజ్ఞ''
అని సెలవిచ్చితి. వమరేంద్రుఁ డంత.
మనమున నుప్పొంగి మరలెను దివికి.

సకలలోకేశ! అసాధువినాశ!
అకలంకచారిత్ర! అబ్జాతనేత్ర!
పీతకౌశేయ! గోవింద! యా వజ్రి
నీతియు నియమమ్ము నేర కజ్ఞాన
మున మున్గి చెలఁగి నీపూన్కికి మారు
షొనరింపఁ బూని తాఁ బొందె బన్నమ్ము 1530
నీ పన్పు గావించి, నిను నమ్మియున్న
గోపబృందమునకు గుందు నీ కరుణ
రవికిరణ ప్రసార స్పర్శచేత
నివ మట్లు దొలఁగె మునీశ్వరవంద్య!
నీ యాగ్రహమ్ము చెందించుఁ గష్టములు
నీ యనుగ్రహము పొందించు శ్రేయములు

నను – నిన్ను దలఁపక జ్ఞానశూన్యముగ
ఘన గర్వమున విశృంఖలవృత్తిఁ బాప
కర్మమ్ము లొనరించు ఖలుని మన్నించి
ధర్మమార్గమున సత్కర్మలు సేయు
నీ దాసవరదాసునిగ నవరించి
యాదరమ్మునఁ బ్రోవుమా. వాసుదేవ!

గట్టిగా నీ పాదకమలద్వయమ్ముఁ
బట్టితి విడువ మాం పాహి! మాం పాహి!!

గోవర్ధనాద్రిని గొడుగుఁగాఁ బట్టి
గోవులమందను గోపకులమ్ము
శ్రీకృష్ణమూర్తి రక్షించినయట్టి
యీ కథ చదివిన నెవ్వరే వినిన
కష్టముల్ దొలఁగు సుఖంబులు గలుగు
నిష్టార్థసంపద లెడలేక పెరుఁగు — 1540

## శ్రీకృష్ణమూర్తి నందుని వరుణనగరమునుండి కొనితెచ్చుట

శ్రీపుండరీకాక్ష, శ్రితజనరక్ష,
తాపసజనపక్ష, తామరసాక్ష!
అఘటనాఘటన సాహసము నీ చర్య
యఘదూర! నీదు మాహాత్మ్య మబ్బురము
శరణన్న నెట్టి దుష్కర్మునినైన
కరుణించి ప్రోతువు కారుణ్యరూప,
గరుడకేతన! భవత్కల్యాణ గుణము
లరసి నిన్బొగడంగ నగునె యెల్లరకు?

ఒక్కయేకాదశి నుపవాసముండి
నిక్కంపుభక్తి శ్రీ నిలయు నచ్యుతుని
నందుఁ డర్చించి, దానవవేళ యెఱుఁగ
నందునఁ దా నుదయము గాకమున్నె
భ్రమ ద్వాదశీస్నాన పరత నేతెంచి
యమునానదీ జలమందున దిగియె.
అందున్న యొకదైత్యుఁ డతని గొంపోయి
పొందుగా వరుణుని పురమునం దుంచె —

అంత నందునిగాన కందఱు గోపు
లెంతయుఁ గలఁగి రోహిణిపుత్రు. మరియు
నిన్నుఁ జేర్కొని శోకనినదమ్ము సేయఁ
గ్రన్నన నీవు చక్కనగ యోచించి 1550
వంచన నందుని వరుణభటుండు
గొంచు చేగి యప్పాశి కుఱఁగటఁ జేర్చు
టెడఁద నెఱింగితి. వేగి తచ్చటకుఁ
గడువేగ కృష్ణ! భక్తజన మందార!
నినుఁగాంచి వరుణుండు నీళ్ళరాయుండు
తన తను వుప్పొంగఁ దద్దయు భక్తి
నతు లొనరిచి పూజనములు గావించి
పతిత పావన! యిట్లు పలికె నీతోడ.

"'ఏ దేవు నున్కి తా మెఱుఁగక మునులు.
సాదు లతృప్తి విచారమ్ము గందు
రా దేవుఁడవు జగదాధారమూర్తి
వాదర మొప్ప నా యావాసమునకుఁ
జనుదెంచితివి. నాదు జన్మ కృతార్థ
తనుబొందెఁ గడు పవిత్రమ్మయ్యె గృహము.
ఏ మాయకేఁగాని యే మహనీయుఁ
డేమాత్రమును జిక్క కెడముగా నుండు
నా కృపాళునకు నీ కఖిలేశ్వరునకు
శ్రీకృష్ణునకు నమస్కృతు లొనరింతు.
వీఁడు నా భటుఁడు వివేకమ్ము మాలి
యీడకుఁ గొనితెచ్చె నిదె నీదు తండ్రి 1560
నిది కడు నపరాధకృత్యమ్ము దీని
మదిఁ దలంపక మమ్ము మన్నింపు మయ్య

కొనిపొమ్ము నీ జనకుని౹ బుణ్యచరిత్ర
నను౹ దొంటివలె కరుణను బ్రోవుమయ్య ''
అని వేఁడుచున్నట్టి యాదసాంపతిని
కనికరించి యచటు గదలి నీ జనకు
నందునితోడ బృందారకుల్ మెచ్చ
బృంద౹ జేరితి బంధుబృందమ్ము వొగడ.

నందుండు వరుణుని నగరమ్ము౹ జేరి
యందుండి తా బృంద కరుదెంచునట్టి
వృత్తాంత మంతయు వివరింప వ్రేలు
చిత్తముల్ పొంగ నచ్చెరువొంది నీవ
సకలలోకముల కీశ్వరుఁడ వటంచు
నకలంకచరిత! నిన్నంద ఱెఱిఁగిరి
వనజలోచన! నీవు వారల తలఁపు
గనుఁగొని యపుడ తత్కాంక్షలు దీర్ప
వారి బ్రహ్మహ్రదమ్ము వారిని ముంచి
తీరాన౹ జేర్చి నీ దివ్యలోకమ్ము.
నలువలోకము౹ జూప నందాదు లెల్ల
తుల యిడరాని సంతోషమ్ము నొంది 1570
హరి! వాసుదేవ! కృష్ణా! పరమాత్మ!
పురుషోత్తమా! యంచు౹ బొగడిరి నిన్ను —

వరుణుసేవకు డు కేవల మవివేకి
జరపె దోషము కాని. జలధులఱేఁడు
తన సేవకుని తప్పిదమును మన్నించి
కనికరింపు మటంచు౹ గడుభక్తి వేడ.
దాసునితప్పులు దండమ్ముతోడ౹
బాసెన న్నటుల న ప్పాశిని కరుణ

మన్నించితివి దయామయ, దీనబంధు,
ని న్నెన్ని పొగడంగ నేర రెవ్వరును –

మంచిచెడ్డ లెఱుంగు మతిలేని వాఁడ
కించిద్జ్ఞుఁడను దోషకృత్యముల్ సేయ
నలవడినాఁడ నా యపరాధకార్య
ముల గుఱించి విచారమును బొందునట్టి
గౌనమైనలేనట్టి క్రూరుఁడ నన్ను
వనజాక్ష! యే రీతి పాపదూరునిగ
సవరించి మన్నించి సద్బుద్ధి గఱపి
యవగుణంబుల దుల్పి యార్యమార్గమున
నడపింతువో స్వామి! నా కింక నీదు
నడుగుఁ దమ్ములె శరణ్యమ్ము సర్వేశ! 1580
నీ పాలబడినాఁడ, నిను నమ్మినాఁడ
నా పాలిదైవమై ననుఁ బ్రోవుమయ్య

## శరత్పూర్ణిమా నిశ యమునాతీర ప్రాంతమున గోపికలు శ్రీకృష్ణునితోఁ గూడి విహరించుట

శ్రీమానినీమణీ చిత్తాబ్జమిత్ర,
శ్యామపయోదలసచ్ఛుభగాత్ర,
నవనీతదధిచోర, నందకుమార,
నవపింఛభూషణ, నతజనశరణ,
గోపికామానస కువలయచంద్ర,
తాపసనుత, శుభాత్మక, గుణసాంద్ర,
శ్రీకృష్ణ! గోపికాస్త్రీలతో నీవు
రాకానిశను ప్రేమ రంజిల్ల యమున

తీరాన విహరించుతీరు లానంద
కారణమ్ములు త్రిజగమ్ములకెల్ల.

శ్రీకృష్ణ! యొక శరదృతువేళ పూర్ణ
రాకాహిమాంశు విరాజితజ్యోత్స్న
యవని నంతయు నిండి యఖిలమ్ము చూడ
నవదాతకాంతిశోభాన్విత మయ్యె
ఆ నిండు వెన్నెలయందు నెల్లెడల
ప్రాణిలోకము పరస్పర మనురాగ
భరితమై యానంద పారవశ్యమునఁ
గరము కుతూహలోత్కర్షత నుండె 1590

ఆ పండువెన్నెల యమునతీరాన
గోపికాహృచ్చోర! గోపాల! నీవు
మురళి మ్రోగించితి మూఁడులోకములు
కరము సమ్మోహసాగరమున మునుఁగ
భవదీయ మంజుల వంశీరవమ్ము
శ్రవణముల్ సోఁక ఘోషస్త్రీజనమ్ము
అపరిమితానంద మంది నీ గీతిఁ
గృప నీవు పిల్చు సంకేతశబ్దమ్ము
గా మది నెన్ని, యుత్కంఠ నీతోడి
సామీప్య సౌభాగ్య సౌఖ్యముల్ వొంద
నిది యదనని తమ గృహకృత్యములను
వదలి యెందఱు తమ్ము వలదనుచున్న
మరుతూపులకుఁ దమ మనములు గలఁగ
దొరలేని తమకమ్ము తొందరింపంగ
తమ యిరవులు వీడి తరలి వేవేగ
యమునా తటస్థలి నచ్యుతా! నీదు

సన్నిధింజేరి రచ్చపుఁ జెల్మిబల్మి
యెన్నంగఁ దరమె యా యింతులకల్మి.
ఈ రీతి నీ చెంత కెంతయుఁ బ్రీతిఁ
జేరిన గోపికాస్త్రీజనసమితిఁ 1600
జూచి మాటలనేర్పు సొంపార నిట్లు
వచియించితివి కృష్ణ, వసుదేవతనయ!

"వ్రేతలారా! రాత్రివేళ మీరెల్ల
బీతు శంకయులేక బృందను వీడి
యేల వచ్చితిరిట? కేదేని ఇడుమ
యాలమందలను మీ యావాసములను
బొడమదుగద. సుఖమ్మున నుండ కిపుడు
కడు భయంకరమగు కానకు మీరు
వచ్చుట, నిసి నిట వసియించుచుంట
మెచ్చఁగూర్చునె? యిది మిగుల హేయమ్ము
పతులకుఁ దక్కిన బంధుసంతతికి
వితత పరీభావ వేదనఁ గూర్చి
జారేచ్ఛఁ గులసతుల్ చనుదెంత్రె యిట్లు?
మీరఁజాలుదు రొకో మీ ధర్మపథము.
పతి యెట్టిఁడైనను బాయంగరాదు
సతులకుఁ బతియె నిజమ్ము దైవమ్ము
నన్ను ధ్యానించిన నను గూర్చి వినిన
నన్ను మీ మనములం దలఁచినఁ జాలు
చరితార్థములగు మీ జన్మముల్ గాన
నరుగుఁడు మీ నిలయమ్ముల కింక" — 1610

నీ పల్కులను విని నిగమసంచార!
గోపికలెల్ల నెక్కుడు వెఱఁగంది

నిట్టూర్చుచును గంటినీరు గార్చుచును
బెట్టిదమగు మరు విరితూపుగముల
తాఁకుడుల సహించు తాలిమిలేక
తేఁకువమాలి నిస్త్రేజానఁ దూలి
చెక్కులఁ జేతులుచేర్చి మౌనమున
నొక్కింతసే పూరకుండి దుఃఖమునఁ
బలుకులఁ గడుఁ దడబాటు గన్పడఁగ
నిల నడుగుల త్రాయు చెడలు చేడ్పడఁగ
నఖిలజగన్మోహనాకారుఁ గృష్ణు
శిఖిపింఛలాంఛితు శ్రీకాంతు నిన్నుఁ
గని వినిపించి రా కామిను లెల్ల
వినుమని తమ మనోభీష్టమ్ము లెల్ల

"అక్కటా! కృష్ణ, నీ యడుగుఁదామరల
మక్కువగొల్చు సమ్మతిని మే మెల్లఁ
జనుదేర నిట్లంటి, సరసుఁడ వీవు
కన నిది మా చెడ్డకాలమ్ము సుమ్ము,
నమ్మినప్రజ విడనాడు టే నీతి?
యెమ్మెయి రక్షించుటేగద ఖ్యాతి. 1620
ముక్తిఁగోరెడివారిఁ బ్రోచెడురీతి
రక్తి మ మ్మేలుమా రాజితకీర్తి
పతుల బందుగులను బాటించుచుంట
సతుల కెల్లరకును సద్ధర్మమంచు
బోధించుచున్నావు పురుషవరేణ్య,
సాధుశరణ్య, నీ చరణమ్ములాన
పతిభక్తి, పితృభక్తి, బంధ్వనురక్తి
యితరభోగాసక్తి యిది యది యనక

సర్వసంబంధముల్ సర్వవాంఛలును
సర్వమ్ము నీ దివ్యచరణార్పణమ్ము
గావించి పడయంగఁ గామించినట్టి
మా వివేక మధర్మమా తెల్పుమయ్య
నీ పాదకమలసాన్నిధ్యమ్ము వదల
మా పాదములకు సమ్మతము గాదయ్య
మాకేలు నీకేలు మఱిమఱి నంట
మేకొను: నన్యమ్ము మేకొనవయ్య!
మా చెవులకు నీదు మధురభాషణము
తేచవు: లితరము లింపు గావయ్య!
మా కనుల్ నీదు శుంభద్రూపవీక్ష
ణాకాంక్షసేయు: నన్యముఁ జూడవయ్య 1630
మా రసనలు నీదు మాటలే గాని,
వేరుమాటలు వల్క వెనుకాడునయ్య
ఇటులు మా జ్ఞాన కర్మేంద్రియసమితి
సటలేక నీ సేవ సాగించుచుండ
నీలాగు మమ్ము మా హృదయాల నెల్ల
నేల లోగొంటివి యిప్పుడు మమ్ము
నేల పొమ్మంటి మేమేమిసేయంగఁ
జాలుదు? మీ నుడుల్ చాలింపుమయ్య
పతులు బందుగులును వలదనుచున్న
నతిభక్తి నినుఁ గొల్వ నరుగుదెంచితిమి.
మరల నింటికిఁబోవ మర్యాదగలదె?
నిరసింపరే బంధు నిచయమ్ము మమ్ము
నీ పొత్తు మాకు నన్నిఁట మేలుగాన.
నే పొత్తు మాకింక నించదు కృష్ణ!

నీ దాస్యమే మాకు నిశ్శ్రేయసమ్ము
కాదందువా, యదిగాదు న్యాయమ్ము
నీ గానమును విన్న నీ రూపుగన్న
గోగణమును సర్పకులము మృగాలు
తరువులు శిలలును తన్మయత్వమున
గరఁగునుఁ బులకించుఁ గరఁగరే స్త్రీలు ? 1640
మాయందు దోష మేమాత్రమ్ము లేదు
వేయేల నిన్నింక విడనాడఁ గాదు "

అని యిట్లు గోపిక లందఱు నిన్ను
మనములఁ బ్రేమించి మమతలు పెంచి
శరణాగతుల మని సంస్తుతియింపఁ
గరుణతో వారలఁగని వారుచూపు
మధురభక్తికి నిజమానసమందు
పృథుల సంతోషమ్ము తృప్తియు నొంది
తాలిమితోడ నాత్మారాముఁడ వయి
యా లలనల యభీష్టార్థమ్ము లెఱిఁగి
తీరిచినాఁడవు దీనమందార!
వారల యానంద మవధినిఁ జేర —

సర్వజ్ఞుఁడవు సర్వసముచితార్థముల
నిర్వహింతువు ప్రాణినిచయమ్ముకొఱకు
నీకు రాగ విరాగ నియమమ్ము లేదు
ప్రాకృతుఁడవె నీవు పరతత్త్వరూప!
ఆ తీరుగా యాదవాంగనాతతికి
చేతము లుప్పొంగఁ జేసి యాఁమీద
వారిసమ్మోహసంభ్రాంతులు గొంత
వారించి, శాంతి చొప్పడఁజేయుటకును 1650

మన్ననతోడను మరియాదతోడఁ
గ్రన్నన వారిని గరుణించుటకును
మనమున నెంచి, యేమఱచి, వారలకుఁ
గనుమఱుఁగైతి శ్రీకరశుభాకార!

## అగోచరుండగు శ్రీకృష్ణునికై గోపికలు పలువిధములఁ బరితపించుట

అంత వల్లవకాంత లందఱు సకల
జంతు బాహ్యాంతర స్థలముల నిండి
చర్మచక్షువులకుఁ జాటుగానుండి
నిర్మలసుజ్ఞాన నేత్రగోచరుఁడ
వగుచు విశ్వమయుండవై యున్న నిన్ను
నిగమ వందితుఁ గననేరక మిగులఁ
బరితాపమందుచుఁ బాడుచు యమున
దరిగల యడవిమధ్యమ్మున వెదుక
సాగిరి యనురాగ సంబంధబుద్ధి
నీగతి మోహిత హృదయలై భ్రాంతి—

ఆ జలజాక్షు లాయటవియందున్న
భూజ లతా గుల్మముల హరిణములఁ
బేరు పేరునఁ బిల్చి విశ్రుతమైన
నీ రూపగుణశీల నిచయముల్ దెల్పి
అట్టి పూరుషమూర్తి యట్టి గుణాఢ్యుఁ
డట్టి మోహనరూపుఁడైన కృష్ణుండు 1660
మముఁ గూడియుండి యేమఱచి తానెందొ
మము భ్రమియింప నెమ్మది దాఁగియున్న

వాఁడమ్మ ! మీకుఁ గన్పడఁడమ్మ ! యతని
జాడఁ దెల్పిన మాకు సంతస మమ్మ
మరునిఁ బాణములకు మము గుఱిచేసి
మరులు మఱచి కనుమఱుఁ గయ్యెనమ్మ
మీకుఁ గన్పడెనేని మెలఁతల వెతల
నీ కరణిఁ గలంచు టేమి న్యాయమ్ము'
అని మందలించి మా యండ కాప్రియునిఁ
బనిపి పుణ్యమ్ములఁ బడయుఁ డోయమ్మ !
అని యంతఁబోక యా యతివ లందఱును
నిను మనమ్ముల నిల్పి నిఖిలమ్ము మఱచి
యోఁపగు నానంద మేర్పడఁ జెలఁగి
నీ పలులీల లన్నింటిని దాము
ప్రకటించి తన్మయత్వమ్ము నొందియును
సకలమ్ము నిండిన సాక్షిస్వరూపు
నినుఁ గనలేక చింతిలుచు నయ్యటవిఁ
గనఁబడుచున్న మార్గములందు నీదు
పాదచిహ్నమ్ముల బరికించి, చూచి
పైదలులార ! గోపాలుఁ డియ్యెడల 1670
చేడెలతోఁ గూడి చెలువ మొప్పారఁ
గ్రీడించె నిదిగొ వీక్షింపరేయమ్మ !
అని యొండొరులకు నీ యనుపమలీల
లనుగూర్చి తెల్పు చుల్లాస మొందుచును
ఆపువుబోండ్లు బృందారణ్యమందు
శ్రీపతీ ! నిన్ను వీక్షింపఁగలేక
మనముల నిన్నుంచి మమతతో మరలి
చని యమునాతీర సైకతస్థలిని

జేరి, వియోగదుఃస్థితి నోర్వలేక
యీ రీతి నిను నుతియించి రందఱును

మా మనోహర! సుకుమార! శ్రీకృష్ణ!
మా మంద, నీవు జన్మమునొంద నెల్ల
సిరుల మందిరమయి చెలువమ్ము నొందె
సరిలేని భాగ్యసంచయము మా కందె.
ననలమ్మువలన విషాదులవలన
దనుజులవలన నెత్తఱి నేని కీడు
గలుగ నీయక మముఁ గాపాడి! మరుని
యలుఁగులపాలు సేయఁగ నీకు దగవె?
నిరుపమ కల్యాణ నిలయమౌ నీదు
కరచరణాబ్జయుగ్మ స్పర్శచేత 1680
మా పాపములువాపి మముఁ గరుణించి
నీ పొంతఁ జేర్చి మన్నింపుమా కృష్ణ!
వ్రేపల్లె విడి యటవిని గోగణమ్ము
మేపెడువేళ నీ మృదు పదద్వయము
తృణశిలా స్పర్శఁ గందెడునేమొ యంచు
ననయమ్ము ననుతాప మందుదుమయ్య
అడవిని వదలి సాయంసమయానఁ
దొడుకుల క్రేపులతోఁ గూడి నీవు
వ్రేపల్లెఁ జేరెడువేళ నీ మోము
గోపాదధూళి సంకులమయి నూత్న
కాంతులతోడ మా కన్నుల కింపు
స్వాంతమ్మునకు హాయి సమకూర్చునయ్య.
అట్టి జగన్మోహనాకారు నిన్ను
నెట్టుల మఱచి మే మిల నుండఁగలము?

నినుఁ జూడఁజాలని నిముసముల్ మాకు
వనజాక్ష! యుగములై వగఁ గూర్చునయ్య!
అని పెక్కువిధముల నతి మోహవార్ధి
మునిఁగి మారోన్మాదమున నిన్నుఁగూర్చి
వల్లవాంగన లట్లు పాడుచాడుచును
వల్లభ, మాకుఁ గన్పడవె యటంచు 1690
పెద్ద వాపోవుచుఁ బిలువ వారలను
తద్దయుఁ గరుణించి దాక్షిణ్యబుద్ధి
నంతలోఁ బ్రత్యక్షమైతి వాగోప
కాంతలయెదుట శ్రీకాంతావినోద!

## కృష్ణుఁడు గోపికలకుఁ బ్రత్యక్షమై వారి ననుగ్రహించుట

అంత నిన్గాంచి గోపాంగనాసమితి
స్వాంతముల్ వొంగఁ గృష్ణా! కృష్ణ యనుచు
నినుఁ గదియఁగఁజేరి నీ చుట్టు ముట్టి
మనసుకొదలుదీర, మమత లింపార,
వందనములుసేయు వారును, నీదు
సుందరపాదముల్ సోకఁగఁ దలలు
వ్రాలిచి మ్రొక్కెడువారుఁ గౌఁగిళులఁ
దేలువారును, గడుఁదియ్యని ముద్దు
మాటలతోడ సమ్మానించువారుఁ,
బోటుమాటలువల్కి పొడిచెడువారుఁ
జూటుకుఁ జూపులతోడఁ జూచెడివారు
మురిపెముల్చింద నిమ్ముగ నవ్వువారు
నై పెక్కువిధముల నాఘోషకాంత
లాపోవక యమాయికాత్మలతోడ

నాలాగు పరమమోదాబ్ధి మునింగి
తేలుచునుండిరి దేవకీతనయ! 1700
ఆ రీతిగా వార లానందమొంద
సారసనాభ! దర్శన మీ వొసంగ
ప్రముదిత స్వాంతలై వారలు నిన్ను
సముచితంబుగఁ గొల్వ సంతసమంది
కూరిమి వారల గొంపోయి యమున
తీరాన పులిన ప్రదేశమ్మునందుఁ
జేర్చి యా లలనల చిత్తముల్ పొంగఁ
బేర్చిన ముచ్చటల్ వెలయుభాషణలు
సలిపి యా పయిని రాసక్రీడ, మరియు
జలకేళి మొదలగు చర్య లాగోప
కామినీ తతితోడఁ గావించి, వారి
ప్రేమానుబంధముల్ పెనఁగొనునట్లు
తనియింపఁజేసి మందకు జనుఁడంచు
పనిచి తందఱ నీవు బాలగోపాల!

హరి, వాసుదేవ, లోకావనదీక్ష,
కరివరదా, కృష్ణ! కమలదళాక్ష!
నీ వేణునాదమ్ము నిఖిల ప్రపంచ
జీవచేతమ్ములఁ జివురింపఁజేయు
భవదీయ సౌందర్య భవసరూపమ్ము
భువనత్రయమ్మును మోహింపఁజేయు 1710
నీ తాండవక్రియా నియమసంపత్తి
భూతలమునకు సమ్మోదమ్ముఁగూర్చు
నీదు సాంగత్య సాన్నిధ్యభాగ్యమ్ము
ఖేదదూరము పరిష్కృత సుఖదమ్ము

నీ నామమును విని, నీ చెంతఁజేరి
నీ నగు మోమును నీ సౌరుఁ గాంచి
నీ జతనేయుండి, నీ జతనాడి
నీ జత విహరించి, నీ ప్రేమమంది
యమునానదీ పులినావనీ స్థలుల
విమలమౌ కౌముదీ వేళల యందు
ఆ గోపికాతతి యందిన యట్టి
భోగ సంపూర్ణానుభూతి యెందేని
నే పుణ్యునకుఁగాని యెప్పుడేఁగాని
ప్రాపించెనో లేదో పరమాత్మ! యెఱుఁగ
వారిదే జన్మము వారిదే వ్రతము
వారిదే లోకసంభావ్య చరితము

అట్టి భాగ్యము నాకు నాకాశకుసుమ
మట్టులౌఁగాన, నా యభిమత మొండు
కలలోననైన నీ గానమ్ము వినిచి
పొలుపారు నీ దివ్యమూర్తిని జూపి 1720
నీ చెంతఁజేరిచి, నిన్ను సేవించు
ప్రాచుర్యభాగ్యమ్ము పడయంగఁజేసి
నన్నుఁబాలింపుమా నలినాయతాక్ష!
నిన్ను నమ్మితినిరా నిర్జరపక్ష!
శారదపూర్ణిమా సమయ కౌముదిని
సూరాత్మజాతట క్షోణిఁ గృష్ణుండు
వ్రేతలతోఁగూడి విహరించినట్టి
యీ తోరపుంగథ నెవ్వరే భక్తి
చదివిన వ్రాసిన, శ్రద్ధతో వినిన
పొదలు భాగ్యమ్ములు పొందుదు రెలమి

## సర్పరూపుఁడగు సుదర్శనుండను గంధర్వుని శాప విమోచనము

శ్రీరమారమణ, హరీ, వాసుదేవ,
సారసనాభ, కృష్ణా! సత్యభావ,
బృందావన విహార, విమతసంహార,
నందకుమార! దీనజనమందార!
భవదీయ బాహుసంపద్విక్రమమ్ము,
లవిరతలోక మోహన భవ్యలీల
లరిదూర! నీదు సాహసయుత క్రియలు
వరభక్తరక్షణ భావముల్ జగతి
స్తవనీయములు వానిఁ దరమిడి తెలుప
నవునె యజ్ఞునకు నా కబ్జాత నేత్ర! 1730

నందుఁ డొకానొకనాఁడు గోపకుల
బృందమ్ముతోఁ గడువేడ్క చెన్నార
పోతరించిన యెడ్లఁ బూన్చినయట్టి
యాతతశకటాల నధివసియించి
చని, లంబికాటవీ స్థలమునఁ జేరి
ఘనముగా జాతర గావింపఁ బూని
బందుగుల్ మిత్రులు పరివారవర్గ
మందరు గుమిగూడ నట సరస్వతిని
ధ్యాననిష్ఠను మున్గి తద్దయు శ్రద్ధ
జానుగ జాతర జరిపించి, యప్డు
భక్తి యుమామహేశ్వరులఁ బూజించి
యుక్తమౌ దానమ్ము లొగి పెక్కుచేసి
జలపానమాత్ర నిష్ఠమెయి తానుండ
వెలసె నా పండుగు విభవసంపత్తి.

అమ్మహోత్సవ సమయాన నందుండు
నెమ్మిమై నొండెడ నిదురింప నతని
కాకోదరంబొండు కఱచి మ్రింగుటకు
వీఁకమై బూనఁగా భీతి నతండు
"హా కృష్ణ! కృష్ణ! యి య్యహిని బోకార్చి
నా కడగండ్ల మాన్పర తండ్రి" యనుచుఁ 1740
గుయ్యిడుచుండఁగా గోపకుల్ గూడ
చయ్యన నిద్దురల్ చాలించి, లేచి
గుదెలను గొఱవులఁ గొని మోదుచున్న
బెదరదు తనపట్టువీడ దా పాము
అంత శ్రీకృష్ణ! నీ వా మహోరగము
చెంతకు నరిగి, యోచించి నీ దివ్య
పాదమ్ముతోఁ దన్ని బలముగాఁ ద్రొక్క
నా దందశూక మయ్యవసరముునను
చోద్యమ్ముగాఁ బాఁప చొప్పును వీఁడి
విద్యాధరాకృతి వెలసి, నీ యెదుట
నిలిచి నమస్కృతుల్ నెఱిఁ జేయ నతనిఁ
దిలకించి పలికి తీ తీరునఁ గృష్ణ!

ఎవ్వఁడ వీవు నీ వింత రూపసివి
యివ్విధి విషధరాకృతి నుంటివేల?
నీ చరితమ్ము విన్పింపుము నాకు
దాఁచక నవవుడు తా నిట్టు లనియె.

"వినుము దేవా, నేను విద్యాధరుండ
నను సుదర్శనుఁడను నామమ్ముతోడఁ
బిలుతు రందఱు: రూపవిత్తముల్ చాలఁ
గలవాఁడ నంచును గర్వింతు నేను 1750

సకలసృష్టిని జూడ సంకల్ప మొదవి
యొకనాఁడు వెడలితి వ్యోమయానమున
వెడలుచు నొకచోట వికృతరూపములఁ
బొడగట్టినట్టి సన్మునులఁ బుణ్యులను
ఆంగిరసులఁగని యపహసించితిని
పొంగున సద్ధర్మమును మఱచితిని
ఆ మునుల్ రూపగర్వాంధుని నన్నుఁ
బాము రూపమ్మునఁ బడియుండు మనుచు
శపియించి, నాదు విజ్ఞప్తి మన్నించి
కృప నను( గని తన్నివృత్తికి మార్గ
మీ లాగు దెల్పిరి, "మేదిని భర్త
జాలమ్ము రక్షింప సర్వేశ్వరుండు
యదుకులమ్మునఁ బుట్టు, నాస్వామి నీవు
మెదలెడు గహనభూమినిఁ జేరవచ్చు
తచ్చరణాబ్జ ఘాతమ్మున నీకుఁ
జెచ్చెర తొలఁగును సీద్రంపురూపు
తొలిరూపు నీవు దాల్తువు పొమ్మటంచుఁ
బలికి రా ఘనులు కృపాఖను లగుచు"
నిది నాదు వృత్తాంత మిందిరానాథ,
సదమలచారిత్ర, సజ్జనస్తోత్ర! 1760
నిన్నుఁ జింతించిన, నిన్నుఁ బేర్కొన్నఁ
గ్రన్నన పాపముల్ కడచనునంట
నా మేన నీ చరణమ్ము మోపితివి
స్వామి నా జన్మమ్ము చరితార్థ మయ్యె
నను దయఁజూడుమా నాగేంద్రశయన!
అని నిన్ను వీడ్కొని యరిగె నతండు.

నీరదనిభగాత్ర, నీరేజనేత్ర,
క్రూరదానవహర, గోపకిశోర!
గురుజనహేళన కుత్సితమైత్రి
యరయ నాలో లేనియటులు మన్నించి
మంచిమార్గముఁ జూపి మనుపుమా నన్నుఁ
గాంచనాంబరధర, కల్యాణమూర్తి!

## శ్రీకృష్ణుండు కుబేరభటుండగు శంఖచూడుండను గుహ్యకుని సంహరించుట

శ్రీసతీహృత్సరసీజ పతంగ,
వాసుదేవ, హరీ, సుపర్ణతురంగ,
నవనీతచోర, కృష్ణా! యొకనాఁడు
ప్రవిమల చంద్రికల్ పర్విన వేళ
యమునాతటస్థలి హలియును నీవు
భ్రమరరుతమ్ముల శ్రవణపేయముగ
వినుచును, మీరును విమలగానమ్ము
తనరఁ గావించుచుఁ దన్నిశీథమున 1770
గోపికాతతితోడఁగూడి యానంద
మేపారఁ బొందుచు నిమ్మనుండ.

ధనదు భటుం డట్టితటి శంఖచూడుఁ
డనువాఁడు తనదు మాయావిద్యచూపి
వల్లవకాంతల వడిచక్కిఁ జేరి
బల్లిదుఁడై కొని పాఱుచునుండ
నా రమణులు సాధ్వసాక్రాంత లగుచు
హా! రామకృష్ణులారా, మమ్ముఁ గాన

రండు రండని బిగ్గరగ మొఱవెట్టఁ
బుండరీకాక్ష! తెంపున నీవు బలుఁడు
సాలవృక్షముల హస్తములందుఁ బూని
"ఓ లలనలు! మీర లోడకుఁ" డనుచుఁ
బఱతెంచి తను ముట్టఁ బాఱె గుహ్యకుఁడు
వెఱపున వేగమ ప్రేతల విడిచి
విత్తేశు భటునిచే విడివడినట్టి
మత్తమబాళగమనలకుఁ గాపు
గా రాము నియమించి, కడువడి నేగి
క్రూరాత్ము గుహ్యకుఁ గూల్చి తచ్ఛిరము
నందున్న మణిఁ దెచ్చి యన్న కిచ్చితివి
నందకుమార, కృష్ణా, యదువీర! 1780

నిను నమ్మి ప్రార్థించు నిర్మలాత్ములకు
నొనరవు కష్టములు: లొనరిన యేని
జలజాప్తకిరణసంస్పర్శచే నివము
తొలఁగినయట్టులఁ దొలఁగుట నిజము.
నా మనమ్మున నిన్ను నమ్మియున్నాఁడ
స్వామి, నా పాపముల్ పాఱంగఁ దోలి
రక్షింపుమా జగద్రక్ష, ముకుంద,
పక్షీంద్రవాహ, గోపాల, గోవింద,

## వృషభాసుర సంహారము

శ్రీకర, గోపికా చిత్తవిహార,
పాకారినుత, గోపబాల, శ్రీకృష్ణ,
అసురమర్దన! వృషభాసురాధముఁడు
కసిపెంచి మందను గారింపనెంచి

కొండకొమ్మను భ్రమగొల్పెడినట్టి
గండుమూపురముఁ జక్కఁగ నిగుడ్చుచును
గర్భిణుల్ విన్నచో గర్భముల్ చెదరు
నిర్భరమగు అంకె నిక్కి వేయుచును
ఖురహతి రేఁగిన ఘోరంపు ధూళి
ఖరకరు బింబమ్ముఁ గప్పివేయుచును
కొమ్ములతోఁ బెద్దకొండలనైనఁ
జిమ్మి పెల్లగిలంగఁ జేసి పర్విడుచు 1790
వాలమ్ముఁ బైకెత్తి బయలఁ ద్రిప్పుచును
కాళులచే నేలఁ గదలఁ ద్రవ్వుచును
గడు నహంకారమ్ము గన్పడ వచ్చి
బెడిదమ్ముగా మందవిడిదిపైఁ బడిన

ఆ వృషభాసురు నతిమాత్రసాధ్వ
సావహరూపవిహారాదికములు
గని మందఁగల ధేనుగణము వత్సములుఁ
బెనువృషభంబులు బెదటిపాఱుచును
కుంభీంద్రవరద, దిక్కులు దోఁచకుండ
నంభారవములతో నల్లాడుచుండె.

పసిభయమ్మును వాప వలను సామర్థ్య
మిసుమంతయును లేక హెచ్చినభీతి
గోపకులందఱుఁగూడి "శ్రీకృష్ణ!
కాపాడుమా మమ్ముఁ గారుణ్యమూర్తి!"
అని వేఁడ వారల కండగా నిలిచి
పెనుగర్వమున విట్టవీఁగు నా యసురుఁ
గని తృణప్రాయముగా వాని నెంచి
దనుజవంశాటవీదహన! యిట్లంటి

"ఓయి, వృషాసుర, యొప్పునే యిద్ది
నీ యుద్ధతిని యాలనిచయమ్ముపైని 1800
బాలురపైని గోపాలురపైని
నీ లీలఁ జూపుట యిది యేమి గొప్ప?
నిలువుము నిన్నొక్కనిముసమ్ములోనఁ
బొలియింతు నందకు ముదము చేకూర్తు"
అని పల్కి యా క్రూరు హతమార్ప నీవు
ఘన నిజబాహువుల్ కరతలద్వయిని
చఱచుచు నిలుచుండ సరభసోద్వృత్తి
చుఱుచుఱ నినుఁ జూచుచును వృషాసురుఁడు
నీపైని బడఁరాఁగ నీవు తద్దనుజు
నేపడంగఁగ వాని శృంగముల్ వట్టి
గిరగిరమని ద్రిప్పి క్షితిఁ బడగొట్టి
సరగ నా వృషభరాక్షసుఁ డంతమొందె.
నా వృషభాసురు నంతమ్ముఁ గాంచి
దేవతానిచయమ్ము దివినుండి పుష్ప
వర్షమ్ముఁ గురియించె వసుధ నెల్లెడల
హర్షమ్ము శాంతియు హాయియు నిండె.

సర్వజగద్రక్ష! శత్రు విపక్ష!
నిర్వికార! యుపేంద్ర! నిగమసంచార!
నిను శత్రువని యెంచు నీచవర్తనుల
కొనగూడదు నెపుడు మహోపద్రవములు 1810
నిను నమ్మి భజియించు నిర్మలాత్ములకు
నొనగూడుచుండు మహోన్నతశ్రీలు
నాదు దోషముల వినాశ మ్మొనర్చి
నీదు దాసునిగ మన్నించి నీ చెంతఁ

జేరుచు కొనుమయ్య. శ్రితపారిజాత!
సారసనేత్ర! కృష్ణా! జగన్నేత!

## శ్రీకృష్ణుఁడు కేశివ్యోమాసురుల సంహరించిన కథ

శ్రీపుండరీకాక్ష. శ్రితజనపక్ష.
పాపవిపక్ష. సుపర్వసంరక్ష.
వసుదేవతనయ. గోపాల. గోవింద.
అసితాంబువాహసమంచితదేహ!
శ్రీకృష్ణ! నీవె సృష్టిస్థితిలయము
లాఁకలే కడరి యయ్యావేళలందుఁ
గావించు త్రిగుణాత్మకస్వరూపుఁడవు
దేవుండ వని మదిఁదెలిసియు ఖలులు
పరుల దుర్బోధనల్ పాటించి నిన్ను
నరమాత్రుఁ డనుచు డెందమ్ములఁ దలఁచి
పగఁబెంచి నీచేతఁబడి మరణింత్రు
ఖగరాజగమన. సాగరరాజశయన!

ఖలునికంసునిబోధ కడుప్రమాణముగఁ
దలఁచి ని న్జెనక నాత్మలఁబొంగి యధము 1820
లైన కేశి వ్యోము లనెడిరాక్షసులు
పూనిరి తలఁపరు ముందువెన్కలను

### కేశిదైత్యసంహారము

ఒకనాడు కేశిదైత్యుఁడు మావురూపుఁ
బ్రకటంబుగాఁదాల్చి పదఖురాహతుల
ధరధూళి రేఁపుచు, దర్పించిహేష
కరము భీకరముగఁ గావించి. సటలు

విసరుచుఁ దన వాయి వివృత మొనర్చి
వెస దంతరోచుల వెలువరించుచును
వచ్చె మందకు గోపవర్గమ్ము మిగుల
నచ్చెరువు భయమ్ము నంది క్షోభింప.

ఆలాగునన్ వచ్చి యశ్వాసురుండు
వ్రేలు త న్గనుఁగొని బెగడొందువిధముఁ
గని, వీరిఁ బందలఁ గారింప, నిందు
దనుజారి గలఁడు గదా వానిఁ గూల్తు
ననుచు నంతములేని యామున నిన్నుఁ
గనుఁగొన నాల్గుప్రక్కలఁ జూచుచుండ
వ్రేల దిగులు మాన్పి, వేగ న య్యసుర
మ్రోల నిలిచి నీవు మూర్ఖుఁడౌ వాని
తోడ నిట్లంటివి "దుష్టనిశాట,
ఏడ కేగెద వింక నిటు నన్నుఁజూడు 1830
నిముసమాత్రమె చాలు నిలువుము నిన్ను
జముబాఁతఁ ద్రోసెద, చలము మానిపెద"

అనవు డప్పలుకుల కాగ్రహ మెత్తి
దనుజుఁ డక్కెళి తద్దయు నోరు దెఱచి
నినుఁ గఱవఁగ నెంచి, నేరుపులేమి
తన కాళులంజాచి తన్నెఁ దత్క్షణము
కాని, యా తన్ను కగ్గముగాక నీవు
వాని పాదమ్ముల వడిఁబట్టి, విసరి
దూరమ్ముగాఁ బడఁ ద్రోసితిః వతఁడు
ధారుణిఁబడి త్వరితమ్ముగ లేచి
హుంకరించుచు వచ్చి యుగ్రుఁడై నిన్ను
జంకక కబళింపఁ జయ్యన తనదు

నోరు విప్పఁగ వాని నోట నీ కరము
సారించి, చొనిపి, తత్క్షణమ య య్యసుర
దంతముల్ డుల్చి, యుదరములోపలికి
వింతగా దూఱిచి, పెద్దగాఁ జేసి
పవనమాడని యట్లు బాధింప, వాని
జవసత్త్వములు దూలె, చయ్యన కుక్షి
యుబ్బి విచ్ఛిన్నమై యుసురులు చనుట
దబ్బున నాతఁడు ధరఁగూలి చచ్చె. 1840
ఘోటకాకారుఁడౌ క్రూరుఁ డా కేశి
పాటును మరణసంప్రాప్తియుఁ గాంచి
సురసమూహమ్ము ప్రసూనవర్షమ్ము
గురియించి నినుఁ జాలఁ గొనియాడె నెలమి

## వ్యోమాసుర సంహారము

మరియొకనాఁడు శ్రీ మహిళావినోద,
సురనదీజనన విశ్రుత దివ్యపాద,
నందకుమార, కృష్ణా! నీవు బలుఁడు
మందనుగల గోపమాణవకులును
యమునా స్రవంతి తీరాటవియందు
ప్రముదిత సుస్నేహ భరితాత్ములగుచు
నాలమేపుచు 'నిలాయన' మను క్రీడ
హేళిమైనాడ మీ రందఱుఁ జేరి
కొందఱు దొంగలు, గొందఱు దొరలు
కొందఱు గొఱియలై కూడి కన్మూసి
గంతలాడంగ రక్కసుఁడు వ్యోముండు
వింతగా బాలకవేషమ్ము నూని

దొంగల జట్టునందునఁ బ్రవేశించి
వెంగలులై మేషవేషాలనున్న
గోపబాలుర నలుగుర నైదుగురను
చూపునకు మిగిల్చి చోద్యమ్ముగాఁగ 1850
తక్కినవారిఁ జెంతను గలయట్టి
యొక్కకొండ బిలాన నొక్కరొక్కరిగఁ
జేర్చి, తద్ద్వారమ్ము శిలచేతఁ గప్పి
పేర్చిన కుత్సిత వృత్తిఁ దా నుండె.

జగతి మాయల ముంచు జాణవు నీవు
తగుదు రెవ్వరు నిన్నుఁ దగ మోసగింప?
ఆ నీచు తస్కరోద్యమము నీ వెఱిఁగి
వానిని గని నవ్వి పాపనిశాట!
నీ చోరకృత్యమ్ము నిఖిలమ్ము దెలిసె
నీచుడా! బాలక నివహమ్ము నెల్లఁ
గికురించి దాఁచితి గిరిగహ్వరమున
నిఁక మిగిలిన వీరి నేల మానితివి?
కొనిపోవగా రార! క్రూరాత్మ! యనుచు
పెనురోషమున వాని బిట్టు పట్టితివి
నీ పట్టు సడలించు నేరుపులేక
యే పట్టు. గానక యుగిలించువానిఁ
దునిమి, కొండబిలమ్ము దోరమందున్న
పెనుఱాతిఁ బగులంగ వేసి యా గవిని
నివసించు బాలక నిచయమ్ముగొంచు
దివినుండి సుమవృష్టి దేవతల్ గురియ 1860
మందఁ జేరితివి యమందమోదమున
నిందిరాసుందరీ హృదయాధినాథ!

ఒరులమాటలు విని యొరులకుఁ గీడుఁ
బొరయించుచుండెడి బుద్ధిహీనులకు
వెతలగు నఁట. నిన్నె విశ్వాత్మ నొరుల
వితథవాక్కులు విని వెఱ్ఱులై యెదిరి
యెవ రంగదల్ వడ? రెట్లు సుఖింత్రు?
భువనత్రయిని నెట్టి పురుషులేగాని
పరుల దుర్బోధనల్ పాటించు బుద్ధి
హరిహరి నా మదిఁ హత్తంగనీక
నిన్ను భజించెడు నీదు దాసునిగ
న న్ననారతము మన్ననఁ బ్రోవుమయ్య
నవనీతచోర! శ్రీ నందకుమార!
ప్రవిమలాకార! గోవర్ధనోద్ధార!

## కంసుని పనుపున మందకు వచ్చి అక్రూరుఁడు రామకృష్ణుల మథురకుఁ బిలుచుకొని పోయిన కథ

శ్రీ దేవదేవ! నిర్జిత దుస్స్వభావ!
వేదోద్ధరణ, యదువీర, శ్రీకృష్ణ!
గోపాలబాల, యో గోపికాలోల,
పాపనిర్మూల, శుభంకరలీల,
నీ భక్తు లెందున నివసించియున్న
నే భువనాధీశు నేల్బడి నున్న 1870
నే వానిముదలఁ జరించుచు నున్న
నే విధమగు కృత్య మెటుసేయుచున్న
నిను మదిలోనుంచి నిఖిలమ్మునందు
ననఘమౌ నీదు శుభాకృతిఁ గాంచి
తమచేయు లౌకిక ధర్మకర్తలకు
సమబుద్ధితో నిన్నె సాక్షిగా నుంచి

విషయకాంక్షాదూర వృత్తిఁ జరింత్రు
విషధరేంద్ర శయన, విహగేంద్రగమన,
నిను వైరిగా నెంచి, నిన్నెదిరించి
నిను నల్పమానవునిగ మది నెంచి
కొందఱు చెడుదురు. కొందఱు నీదు
నందమౌ రూపమ్ము నర్చించి, శుభము
అనుపమానమ్ముగ ననుభవించెదరు
ఘనవారిదశ్యామ, కారుణ్యధామ!

## కంసుఁడు అక్రూరుని మంపకుఁ బంపఁ జేసిన విన్నపము తోడి యాజ్ఞ

యదువీర! కంసధరాధినాథుండు
మద మలినుఁడు క్రూరమతి ధనుర్యాగ
సందర్శనమ్ము వ్యాజమ్ముగ మిమ్ము
సుందర రామకృష్ణులఁ దనపురికిఁ
బిలిపించి చంపింపఁ బెద్దయత్నమ్ము
తలఁపునందుంచి, తత్త్వజ్ఞు నక్రూరుఁ 1880
దన చెంతకుం బిల్చి, తన యూహ చెప్పి
"చని రామకృష్ణుల చయ్యనఁ దోడి
తె"మ్మని యాజ్ఞఁ బ్రార్థించుచుఁ దెల్పి
పొమ్మని పనిచె నప్పుణ్యు న ప్పాపి.

## అక్రూరుని బృందావన ప్రయాణము

"రాజాజ్ఞ కాదనరాదు, కాదనక
యే జాల్మఁడైనఁ దా నిట్టియకృత్య

మొనరించునే. దైవమునకు ద్రోహమ్ము
పెనుపాపమూల మి వ్విధమైన సేఁత
నెటు నేను చేయుదు: నెటు సేయకుందు?
నెటులఁజూచిన నాకు నిద్ది పరీక్ష
యిన నేమాయె మదాత్మ యెట్టిదియొ
యానంద నందనుఁ డా దేవుఁ డెఱుఁగుఁ
గాన. నా సర్వాత్ము కడకేగి కంసు
పూనికఁ దెల్పి య పుణ్యమూర్తులను
అనఘుల దరిసించి. యతిభక్తి నిటకుఁ
గొనితెత్తు'' ననుచు నక్రూరుండు గదలి
మందకుఁ జనుచు న మ్మార్గమధ్యమ్ము
నం దివ్విధంబున నాత్మఁ దా నెంచె

## అక్రూరుఁడు మందకుఁ జనుచుఁ దనకుఁ దాఁ దర్కించు కొన్న విధము

ఏ నెట్టితపము నెట్లే జన్మమందుఁ
బూని చేసితినొ. యే పుణ్యచరిత్ర 1890
ప్రాపించెనో: యెట్టి భవ్యదానమ్ము
లే పవిత్రాత్ముల కే నిచ్చినానొ
యోగీంద్రులే తమయోగదృష్టులను
బాగుగ దర్శింప వలనుగానట్టి
పరమాత్ము హరి పరాత్పరుఁ బరంధాము
దరిసించు భాగ్యమ్ము దక్కె నా కిపుడు
ఏ పరాత్పరు సేవ యిహబంధములను
బాపి శాశ్వతసౌఖ్య పదవిఁ జేకూర్చు
నా పరాత్పరుని నాహ్వానించు చెయ్యి
నా పయి నిడి పంచి నా కతిశుభము

గలిగించినాఁడు నిష్కారణమైత్రిఁ
దలపోయ గంసు నంతటి హితుఁడెవఁడు
'ఇతఁడు కంసుఁడు పంప నేతెంచె. నన్ను
వెతల ముంపఁగ నెంత విద్వేషి' యంచు
ననుఁ దయఁ గనఁడేమొ నా యంతరాత్మ
తన కెఱుకగుఁ గాన దయఁ జూచునొక్కొ?
ఏ మాడ్కిఁ బల్కునో యేమొ శ్రీకృష్ణుఁ
డేమందు నా భాగ్య మెట్టులో దెలియ
మేలుమే లీవన్య మృగములు త్రోవ
నీ లీల వలపట నేగెడుఁ గాన. 1900
శ్రీకమలాక్షు వీక్షించు భాగ్యమ్ము
చేకూరు నా కోర్కి సిద్ధించు నిజము
నే నా మహాత్ము సన్నిధిఁ జేరి యతని
జానగు పదతోయజములు నా మౌళి
దాఁక మ్రొక్కంగ నాతఁడు కృపఁ దనదు
శ్రీకరకరము నా శిరముపై నుంచి
యభయ మ్మొసంగి నా కానంద మెసఁగ
శుభవీక్షణముల నన్జూడక యున్నె"

అని నినుఁ గూరిచి యక్రూరుఁ డాత్మఁ
దనకుఁ దా మరిమరి తర్కించుకొనుచుఁ
జనిచని మాపటి సందెజామునకు
మనమున నుబ్బుబ్బ మందకు జేరి
యలఘుమానసుల మహాత్ముల మిమ్ము
బలరామకృష్ణుల భగవదంశజులఁ
గని భవత్పాద పంకజముల కెఱఁగి
తనుదానఁ బొంగి మీ దయ చాలఁ బడసి

నందాది గోపబృందమ్ము మేళ్లెఱిఁగి
పొందిక మీతోడ భజియించి, రాత్రి
వసుదేవతనయ, దేవకి పుత్ర, కృష్ణ!
అసుర విమర్దన, అమరార్తి హరణ! 1910
తానొక పర్యంకతలమున సుఖము
తోనుండ నీవు సంతోషమ్ముతోడ
నాతని కెదురుగ నాసీనుఁడ వయి
యీ తీరునం బల్కి తెక్కుడు ప్రీతి

## శ్రీకృష్ణుఁడు అక్రూరునితోఁ గుశలప్రశ్నలు గావించుట

"కుశలమే నీకు నక్రూర? మీ ప్రజకు
భృశముగా సంపదల్ పెరుగుచున్నవియె?
బందుగుల్ మిత్రులు పరివారజనము
పొందుచున్నారె ప్రమోదభాగ్యమ్ము
మామ ముక్తభయుండె! మా తలిదండ్రు
లేమాడ్కి చెఱ వసియించుచున్నారొ
యీ విట కేతెంచు టెఱిఁగి యా పూజ్యు
లేవేని వార్తల నెక్కుడు వగల
నీతోడఁ జెప్పిరే నిస్పృహ వార
లేతెఱఁగున డస్సి యెట్టు లున్నారొ,
యే నిమిత్తమున నీ విచటి కేతెంచి
తా నిమిత్తముఁ దెల్పుమయ్య ధన్యాత్మ!"

## శ్రీకృష్ణునకు అక్రూరుఁడు తావచ్చిన కారణముఁ దెల్పుట

అనుఁడు నీ పల్కుల నాలించి యతఁడు
వినిచె యథార్థమౌ వృత్తాంత మిట్లు

"సర్వజగద్రక్ష, శత్రువిపక్ష,
నిర్వికల్పజ్ఞాన, నిఖిలేశ, కృష్ణ! 1920
వినుము కంసావనీ విభునకు నమర
ముని నారదుఁడు భవత్పుణ్యచరిత్ర
జననముఁ దద్రహస్యమ్ముఁ గారణముఁ
దనకగు మరణవిధమ్మును నీవు
బలదేవుఁ డిచ్చట వసియించుటయును
దెలిపెను; సర్వమ్ముదెలిసి కంసుండు
తా నిను జంపింపఁ దలఁచి యోచించి
పూనె ధనుర్యాగమును దాను జరపు
నటులఁ జాటించి తద్యాగమ్ముఁ జూడ
నటకు మిముందేర నానతి నాకుఁ
గావించెఁ; నింత యకార్యమ్ముఁ జేయ
నే వచ్చితిని రాజనియమ మ్మొనర్ప"
నా మాటలను విన నచ్యుతా, నీకు
రామదేవునకుఁ జిర్నగ వంకురించె

అంతట నీవు నందాదిగోపకులఁ
జెంతకు రావించి, "క్షితినాయకుండు
యాగమ్ముఁ జూడ నాహ్వానించె మనల
నేగుట మనకు నెంతేని ధర్మమ్ము
ఆదరబుద్ధి నాహ్వానించెఁ గాన
పోద మందఱము నా భూపతిఁ జూడ 1930
రిత్తచేతులతోడఁ బృథ్వీశవరుల
నెత్తఱి నెవ్వరే నేగరు చూడఁ
గాన, పాల్పెరుఁగులఁ గమ్మనేతులను
కానుకలను గొని కదలుఁడు తగిన

యానమ్ము లెక్కి మీ రందఱు నెల్లి
నేను నన్నయుఁ గూడ నేగుదెంచెదము"
అని నీవు నియమించి తందఱు వినఁగ
వనజలోచన, రమావల్లభ, కృష్ణ!

## శ్రీకృష్ణుని మథురానగరప్రయాణము నెఱిఁగి వ్రేతలు విచారము నొందుట

ఎల్లి మథురకు నీ వేగెడువార్త
గొల్లతలిరుఁబోండ్లకుం గుందుగూర్ప
నీ నవ్వుమాటలు నీ విలాసములు
నీ నయగారముల్ నీదు మన్ననలు
నీ కరస్పర్శలు నీ కటాక్షమ్ము
లేకాంతములు తమ కింక లేవనుచు
నీ వియోగజలధి నీదు టెట్లనుచు
హా విధీ యనుచుఁ దా మనుకొని రిట్లు.

మంచిగేస్తని మన మనముల బ్రహ్మ
నెంచితిమి గదమ్మ యెంతటి ద్రోహ
మొనరించె నమ్మ, వేరొండుచోటునకు
వనజాక్షుఁ గృష్ణుఁ బంప విధించెనమ్మ 1940
ఈ పిన్నబిడ్డాట లెఱిఁగింతమమ్మ
యా పవిత్రచరిత్ర కాసరస్వతికి
పిలుచుటె తడవుగా వెడలుద మంచుఁ
బలికెనేగాని, యీ పడఁతులు నన్ను
నమ్మినారలు వీరి ననవిలుకాని
యమ్ములపాల్సేసి యరుగుట నాకు
న్యాయమ్ముగాదని యనెనె గోపాలుఁ
డియ్యకొన్నారె యీ వృద్ధులుగూడ!

పేరె యక్రూరుఁ డీ పెద్ద గుణమ్ము
నారయ క్రూరుఁడే యగును నిజమ్ము
క్రూరుఁడు గాదేని గోపాలకృష్ణుఁ
గోరి గొంపోయెడు కుటిలత మాని
తనదారిఁ బోవుట తగవు: కాకున్న
ననయుండు క్రూరుఁడే యగుఁగద నితఁడు
మధురాపురమ్ము హర్మ్యమ్ముల నుండి
విధుముఖు లింతులు వేడ్క బంగారు
లాజలుచల్ల నా లలనలఁ గాంచి
మోజున వారిసమ్ముఖమున నుండఁ
దలఁచునేకృష్ణుఁ డేతఱి నైనమనలఁ
గలనైనఁ దలఁపఁ డక్కట! సత్యమిద్ది 1950
పౌరకాంతల మృదుభాష లీక్షణము
లారయ స్పర్శసౌఖ్యాది భోగములు
మరగి మనల హరి మఱచెడు నమ్మ
నరపాలకులు నూతనప్రియులమ్మ.
హరిని గొంపోకుమా యంచు నక్రూరుఁ
దఱిసి ప్రార్థింతమా: దయు మముఁజూచి
యితనిఁ బోనీయకుఁ డీ యంచు దైవ
తతి వేఁడుకొందమా! తరలకు మనుచు
హరి పదాబ్జమ్ముల కడ్డమ్ముగాఁగ
ధరఁబడుదమ, యంచు, దైవమా యంచు
వెరవుదోఁపక కడు విభ్రాంత లగుచు
గరిత లందఱు చాలఁ గలఁగి శ్రీకృష్ణ,
గోవింద, గోపాల, గోకులరక్ష!
నీవె మా పాలిటినిధివి, మమ్ములను

గాపాడు మంచు ? ని న్గలవరించుచును
నీ పాదముల నెడ నిల్పి యున్నంత

### శ్రీకృష్ణుఁడు మథురకుఁ జనుట

మరునాఁ డుదయవేళ మథురకుఁ జనఁగ
గురుజనమ్ములు నందగోపాదు లెలమి
కానుకల్ గొంచు శకటముల నెక్కి
మానుగ వెంటరా, మహితాత్మ రాము 1960
విక్రమోద్దాము నీ వెంటఁ గైకొనుచు
నక్రూరచోదితంబగు రథ మ్మెక్కి
మథురకుఁ జనుచు నమ్మార్గ మధ్యమున
మధురజలాప్తి సమ్మాన్యమై వెలయు
కాళిందిఁ గని తేరుఁ గ్రన్నన డిగ్గి
హాళితత్తోయంబు లాప్యాయనముగఁ
గ్రావి, రామునితోడ రథమునఁజేరి
తీవు సర్వజ్ఞ, సర్వేశ, శ్రీకృష్ణ!

### అక్రూరుఁడు యమునలో రామకృష్ణుల దర్శించి నుతించుట

అంతట నక్రూరుఁ డరదమ్ము డిగ్గి
దాంతుఁడు మీకు వందనము లొనర్చి
చని, యమునానదీజలముల స్నాన
మొనరించుచుండి తదుదకమ్మునందు
బలకృష్ణులను మిమ్ము భద్రమూర్తులను
దిలకించి, శంకించి, తేరున నుండి
"ఇచటికి వీ రెప్పు డేతెంచి" రనుచు
నచటనుండి రథమ్మునందున్న మిమ్ముఁ

గని యబ్బురమ్మంది" కంటిని వీరి
మును రథమ్మున, జలమ్మునఁ గంటినిపుడు
మరల దేరునఁగంటి, మతివిభ్రమమ్ముఁ
బొరసెనేమొ, సత్యముం గనఁజాల" 1970
నని యా యదూత్తముఁ డక్రూరుఁ డంతఁ
గనుగొందు నిజమంచుఁ గాళింది మరల
మునిఁగి తజ్జల మధ్యమున నాదిశేషు
ఘనుని నీలాంబరుఁ గాంచి యా పాఁప
సెజ్జఁ బన్నుండెడి జిష్ణుని విష్ణు
బొజ్జలోఁ బదునాల్గు భువనమ్ము లుంచి
కాపాడుచున్నట్టి ఘను జగద్వంద్యు
శ్రీపతి నినుఁగాంచి, చేతులు మోడ్చి
యాదవకులజుఁ డా యక్రూరుఁ డిటులు
మోదమ్ము భక్తియుఁ బొసఁగ ని ట్లొగడె.

శ్రీరమామానినీ చిత్తవిహార,
మారజనక, హరి, మంగళాకార,
దామోదర, యుపేంద్ర, తపనీయచేల,
సామజవరద, నిర్జర లోకపాల!
నిన్నుఁ గనుంగొని, నీ మహిమమ్ము
లెన్నఁగా మరి నుతియింప సామర్థ్య
మున్నదే నాకు లోకోత్తర చరిత!
యెన్న నజ్ఞానుండ హీనమానవుఁడఁ
బ్రళయకాలమున సర్వప్రపంచమ్ము
జలనిధిమగ్నమై జడమయి యుండ 1980
ఆ నీట బాలుమర్యాదను దేలి
మానుగాఁ బన్నుండి మరల జగమ్ము

సృజియింపఁగా నీదు చిత్తమం దెంచి
యజునిఁ బుట్టించితి వయ్య ముకుంద,
శ్రీభార్గవీప్రియ, శ్రితగేయ, లోక
వైభవదాయక, వనజాత నేత్ర!
సర్వలోకమ్ములు సర్వభూతములు
సర్వమ్ము భవదీయ జఠరమం దుంచి
అదన సృష్టించెద వాదరించెదవు
తుది యొనర్తువు నీకుఁ దోఁచిన యపుడు
సృష్టిస్థితి లయమ్ము లెల్లను దేవ
స్పష్టమ్ముగాదె నీ వశములై యుంట
దైవమ్ములం దాదిదైవ మీ వంచు
భావింప హరిహర బ్రహ్మ లీ వంచుఁ
బరిపరివిధముల భక్తులు నిన్ను
దురితదూరుని నుతింతురు వేరువేరఁ
గాని, యొగ్గేమి? లోకమ్మున నేఱు
లేనాట, నే త్రోవ, నెటులు పాఱినను
జలనిధిఁ జేరుట సత్యమ్ముగాదె
జలజాప్త చంద్రలోచన! దయాభరణ! 1990
జగతిఁ గన్పడు వస్తుజాలముల్, ప్రాణు
లగధర! నీదు ప్రత్యక్షరూపములు
అన్నిటికిని నీవె యాధార మగుచుఁ
జెన్నారుచుందువు చిదచిత్స్వరూప!
మీనంబవై ప్రాతమినుకు లబ్జజున
కానంద మెసఁగంగ నర్పించి తీవు
తామేటిరూపమ్ముఁ దాల్చి దేవతల
క్షేమమ్ము మదినెంచి గిరి మోసి తీవు

భూదారమవై యధోభూస్థలినుండి
భూదేవి నాదరమున నెత్తితీవు
నరసింహ రూప మెన్నఁగఁ దాల్చి భక్త
వరునిమాటకు స్థిరత్వము గూర్చితీవు
వామనాకృతిఁ దాల్చి బలిని పాతాళ
భూమికిఁ బంపి పెంపును బొంది తీవు
పరశురామాకృతిఁ బరఁగి భూపతులఁ
బొరిగొని భువిఁ గశ్యపున కిచ్చి తీవు
దశరథాత్మజుఁడవై దశకంఠుఁ దునిమి
యశము భృశమ్ముగా నార్జించి తీవు
వాసుదేవుఁడ వయి వసుధకుఁ గల్గు
త్రాసమ్ము మాన్పి మోదముఁ గూర్చి తీవు 2000
అరయ బుద్ధుండవై యసుర యిల్లాండ్ర
తిరమగు మనములఁ ద్రిప్పితి వీవు
కలికివై దోషసంగతమగు భువిని
విలసద్గుణంబుల వెలయించి తీవు
నీదు మాహాత్మ్యముల్ నిరుపమానములు
శ్రీదముల్ జగతికిఁ జిదచిద్విలాస!
నే మూఢజనుఁడ వానిం బ్రస్తుతింప
నే మాత్ర మేఁ దగ నిభరాజవరద!
నీ పాదకమలముల్ నెసరునఁ జూపి
కాపాడుమా నన్ను ఖగరాజగమన"
అని వేఁడుచున్నట్టి యక్రూరునెడల
ననుకంప గలిగి యా యమునతోయమున
నీ తొలి రూపమ్ము నెమ్మని జూపి
యా తఱిఁ గన నదృశ్యము నొంది తీవు

అంతట నక్రూరుఁ డటనుండి వెడలి
వింతపడుచు వచ్చి వేగ రథమ్ము
నారోహణ మొనర్ప నచ్యుతా! నీవు
గారవమున వాని గని యిట్టు లంటి
"కాళింది చెంతనే గలదు నీ వేగి
చాలకాల మ్మయ్యె. జాగు సేయుటకు 2010
నా నదీజలముల నవని వ్యోమమున
లేనిచోద్యములు పొల్చునె యెవ్వియేనిఁ
గనియున్నచోఁ జెప్పఁగదవె యక్రూర!"
యనవు డాతం డిట్టు లనియె సద్భక్తి.

"ఏమని చెప్పుదు నిందిరానాథ!
నీ మహిమంబులు నిగమవేద్యములు
నీలోనఁ జూపట్టనివి యద్భుతమ్ము
లేలోకముననేని నెట్టులనుండు
నేలను నింగిని నీటను జూడ
నీలోనిచోద్యముల్ నెగడె మహాత్మ!"
ఈ రీతి నక్రూరుఁ డెఱిగించి రథముఁ
దోరంపువేడుకతో నడిపించి
మథురకు సాయంసమయముకు ముందె
పథిపరిశ్రమముతోఁ బనియట్లు చేర్చె.

## మథురాపురాంగనలు శ్రీకృష్ణాగమనమును జూచి సంతసించుట

బలభద్రుతోడ గోపాలురతోడఁ
గలసి ప్రగాఢోత్సుకత వెలయంగ
దేవకీసుత. కృష్ణ. దీనమందార!
యీవు తత్పురిఁ జొచ్చి యేతెంచునపుడు

భవదాగమనవార్త పౌరకామినులు
శ్రవణంబులం బడ సంబరపడుచు 2020
వారు సౌధములపై వరుసలు దీరి
నీ రాకకై వేచి నిలుచుండి, నీదు
దరిసెన మగుట సంతసము తా మొంది
యొరులొండొరులతోడ "సువిదలు, గనుడు
నందనందనుఁడు సుందరమూర్తి గోప
సుందరీసందోహ సువ్రతఫలము
కరుణామయుండు జగద్వంద్యుఁ డమల
చరితుఁడు గనుఁ డదె చనుదెంచెనమ్మ"
అనుచు నీపైని పుష్పాక్షతల్ సల్లి
తనివి సనక యిట్లు తలపోసికొనిరి.

"ఇతఁడఁటే పూతన హింసరాక్షసిని
హతముగావించిన యరిభయంకరుఁడు
ఇతఁడఁటే తననోట నీ సృష్టినెల్ల
సతికిఁ జూపినయట్టి సర్వేశ్వరుండు
ఇతఁడఁటే మంద నింటింట దొంగిలుచు
మితిమీర వెన్నలు మెక్కినవాఁడు
ఇతఁడఁటే వ్రేపల్లె నింతులసిగ్గు
చతురుఁడై దోఁచిన సరసవర్తనుఁడు
ఇతఁడులేని స్థలమ్ము లెల్ల వనమ్ము
లితనిఁ బొందని మేను లెల్ల నిష్ఫలము 2030
లితనిఁ బల్కని పల్కులెల్ల వ్యర్థమ్ము
లితనిఁ జూడని చూడ్కులెల్లను వృథలు
ఇంతిరో, గోపిక లీ సుకుమారు
చెంత వసించుచుఁ జెలఁగి పాడుచును

కలకల నవ్వుచుఁ గౌఁగిలించుచును
బలుకరించుచుఁ గరస్పర్శచేయుచును
మరియుఁ బెక్కువిధాల మన్ననల్ వొంద
పురుడింప రానట్టి పుణ్యవ్రతములు
తొలిపుట్టునందు నెందున జేసిరొక్కొ
తలపోయఁ బులకించుఁ దనువులు మనకు"
అని సంతసించి యా యబ్జాక్షులెల్ల
నినుఁ జూచుచుండిరి నిగమసంచార!

## శ్రీకృష్ణుఁడు రజకుని చంపుట

అంతట నీవు నీ యగ్రజుఁగూడి
అంతరంగము పొంగ నప్పట్టణమున
నడయాడుచును రాచనగరుకుఁ జనెడు
మెడవాలుఁ గాంచి నెమ్మిని నిట్టులంటి
"రజకోత్తమా! కంసరాజునల్లురము
వ్రజము నివాసము, వచ్చితి మిటకు
నితఁడు రామాఖ్యుండు కృష్ణుండ నేను
జతగ మామను జూడ జనవలె మేము 2040
మా మంద లేవయ్య మంచివస్త్రములు
నీ ముడి నున్నవి నెమ్మి మా కిమ్ము"
అనుడు నీ మాటల నాలించివాఁడు
కనలు వెంచుచు నిన్నుఁ గాంచి యిట్లనియె.

"ఏమిరా! బాలక! యేమంటి విపుడు
మా మనుజేంద్రునంబరములు మీకుఁ
దగ వగునే యీాయ, ధరియింప మీరు
దగుదురె! క్షీరమ్ము దధియు ఘృతమ్ముఁ

గ్రోలుట మత్తెక్కి కొల దు లెఱుంగఁ
జాలకి ట్టాడంగఁ జనెఁగాక గొల్ల
వారికి నోరెట్లు వచ్చు నిట్లాడ
నీ రాజు మాటన్న నే రాజు నడలు
మేర మీఱితి రేని మృత్యువు నిజము
మా రాజుచే మీకు. మరలిపొం డింక''
అనవు డు నీ వాగ్రహమ్మున నీదు
ఘనకరాగ్రమున నా కష్టునిశిరము
తెగి పడఁగొట్టి మిత్తికి బలిచేసి
నగి. వానికడనున్న నాడెంపువలువ
లొక కొన్నిటిని నన్నయును నీవు దాల్చి
సకులకుం గట్టంగ జాలిన వొసఁగి 2050
చనుచుంటి వటనుండి సర్వాధినేత
నిను నడ్డువారేరి? నీ కెదు రేది?

## సాలెవాని వృత్తాంతము

అంతట నొకక్రంత నతిగుణి యొక్క
తంతువాయుఁడు నిన్ను దర్శించి మీకు
సన్నని నున్న వస్త్రముల నొసంగ
కన్నాకు లొ వాని గైకొని మీరు
ఆ సాలెవానికి నైశ్వర్యములును
వాసియుఁ గల్గంగ వరము లొసంగి

## సుదాముఁడను మాలాకారుని వృత్తాంతము

తరువాతఁ గదలి సుదాముఁడన్ మాల
కరియింటి కీవు సంకర్షణుఁ డాది

బాలు రందఱుఁ జేర బరమమోదమునఁ
దేలి యతఁడు బలదేవుని నిన్నుఁ
గని కడు బొంగి యర్ఘ్యముల పాద్యములఁ
దనిపి మీ మెచ్చు మిత్రసమూహ మెల్ల
నలరంగఁ గుసుమగంధాదు లొసంగి
లలితశృంగార సల్లక్షణాన్వితుల
సోదరులను మిమ్ముఁ జూచి సద్భక్తి
నాదర మభిమాన మాహ్లాద మెసఁగ
"జగతిని గాపాడఁ జనియించినట్టి
నిగమవంద్యులు మీరు, నిఖిలమ్మునకును 2060
ప్రభువులు కరుణ నా భవనమ్ముఁ జేర
విభవముల్ సంపదల్ వెలసె, మద్గృహము
పావనమయ్యె. నే పనివడి మీరు
నావద్ద కేతెంచినారు. నే నేమి
సేయంగ వలయునో చెప్పరే యంచు
మీ యనుజ్ఞను గోరి మీకు సుగంధ
యుత దామములు దెచ్చి యొనర నర్పించి
నతినుతల్ సేసి వినమ్రుఁడై యుండె

ఆ మాలకరి భక్తి కానంద మొంది
శ్రీమానినీప్రియ, శ్రితపారిజాత!
వానితోడ "సుదామ, వరగుణ! నీదు
మానస మెఱిఁగితి మాన్యుఁడ వీవు
కోరిన వరమిత్తుఁ గొను" మంటి, వమిత
కారుణ్య మేపారఁగా. నంత నతఁడు
నీ పాద నీరజ నిత్యసేవనము
నీ పాదదాసుల నెయ్యంపుఁ గలిమి

యేఁపుగాఁ బ్రాణులయెడ దయ నాకు
తాపసమందార! దయసేయు మయ్య"
అని వేఁడ నతని కివన్నియు నొసఁగి
యనుఁగులు బలుఁడు నిన్ననుసరింపంగ 2070
నా సుదాముని వీడి యరుగుచునుంటి
వాసుదేవ, ముకుంద, వరద, గోవింద!

## త్రివక్ర వృత్తాంతము

వనజలోచన, యదూద్భవ, రాజవీథిఁ
జని చని నీవు ప్రశస్తలేపముల
హరివాణమునఁగొని యరిగెడు నొక్క
గరితను కుబ్జను గని యిట్లు లంటి.
"ఎవ్వరిదాన? వీ యించులేపముల?
నెవ్వరు గోరిరి యెట కేగుచుంటి?
వేయది నీ నామ? మెఱిఁగింపు, మాకు
నీయవచ్చునె? వీని నిచ్చిన నీకు
చక్కనిరూపమ్ము సమకూరఁగలదు
నిక్కమ్ము నా మాట నెమ్మది నమ్ము"
మనవు డ య్యబల యిట్లను "సరసాల
పనునొంతె నీకు నందముగల దంచు
చక్కని వా రొకో! జగతి నెల్లరును
పెక్కల వినుము నా పేరు త్రివక్ర
ఏఁ గంసుదాసిని ఈ లేపవిద్య
బాగుగ నెఱుగుదుఁ బ్రభువును మెచ్చి
మీరు పూసికొనుఁడు మీ మేనులకును
కోరిక తీఱ నీ గురులేపనములు!" 2080

అని యామె యీయ నీ వబ్జాక్ష! వానిఁ
గొని యొడల నలందుకొని సంతసించి
యామె త్రివక్రత్వ ముపనయింపంగ
నీ మదినెంచి యా నెలఁత పాదముల
పయిని భవత్పదద్వయ మూని త్రొక్కి
కయి యంగుళముల నక్కాంతగౌదలకు
నడుగుననిడి యెత్త నామె వక్రతలు
పొడగట్టవయ్యె నుత్ఫుల్లాబ్జనయన!
తన త్రివక్రత్వమ్ము తన గుజ్జుతనము
తనదు విరూపమ్ము తలఁగి సౌందర్య
వతి యయి యామె నిర్భరసమ్మదమున
నతులు నీకొనరించి "నా గృహమ్మునకు
దయసేయు "మంచుఁ బ్రార్థనసేయ "నాదు
నియమమ్ము లన్నియు నెరవేర్చి పిదపఁ
జనుదెంతు భవదీయ సదనమ్ముఁ జేర"
నని యామె నోదార్చి యచ్చోటు వదలి
విపణిమార్గమ్మున వెడలి యాత్రోవ
నుపహారములు పౌరు లొసఁగఁ గైకొంచు
చని నీవు నృపు ధనుశ్శాలఁ జేరితివి
మునిజన సంస్తోత్ర! పుణ్యచారిత్ర! 2090

### శ్రీకృష్ణుఁడు ధనుర్భంగము గావించుట

ఆ కార్ముకాగారమం దొకచోట
పాకశాసను వింటిభాతి నొప్పారు
ధనువు నొక్కండు దుస్తరమైన దాని
గని, నీ వచటనున్న కావలివారు

వలదనుచున్న. నీ వారు మెచ్చంగ
సలవోకగా సవ్యహస్తమ్ముతోన
నెత్తి నారి బిగించి యీడిచి దాని
మత్తగజం బించు మాడ్కని విఱిచి
ప్రక్కలొనర్చ: తా భయదరవమ్ము
దిక్కుల భువియందు దివియందు నిండె
మరియు భోజనరేంద్రు మానసమందు
గురుతరత్రాసమ్ము గూరిచె నపుడు
కావలివారలు కడు నాగ్రహించి
నీ విక్రమ మణంప నినుఁబట్టు కొనఁగ
నీ పయిఁ బడరాఁగ నీవును రాముఁ
డా పందలను బట్టి హతము చేసితిరి
ఈ రీతిఁ దత్పురి నెదు రెందులేక
వీర విహారమ్ము వెలయఁ గావించి
నీ వారితోడ నా నిసి నీదు విడిది
వావిరి సంతోషపరతఁ జేరితివి 2100

కౌస్తుభరత్న సంకలితోరువక్ష.
నిస్తులవై భవాన్విత. జగద్రక్ష.
ఎంతమూర్ఖుఁడొ కంసుఁ డెటులేని నీకు
నంతమ్ముగూర్ప ప్రయత్నమ్ము లెన్నొ
తగినట్లుచేయఁగాఁ దనవారి కాజ్ఞ
లొగి చేసెకాని. వా రొనరించినట్టి
జతనముల్ వారల స్వాంతాలఁబట్టి
యతిమోదవంతము లయ్యె వారలకు
రాజాజ్ఞ మీఱంగ రాదని నిన్ను
భోజేంద్రుకడకుఁ గొంపోవ వచ్చినను

తన మనంబున నిన్నె దైవం బటంచుఁ
దనదు దోషమ్ము నుంతయు లేదటంచుఁ
దనమది నీకు వేద్యమ్మె యటంచుఁ
గనికరమున నీవు గాతు వటంచు
తలఁచి యక్రూరుండు ధర్మమ్ము విడక
సలిపె దౌత్యమ్ము కంసనరేంద్రు నాజ్ఞఁ
గాన, నా భక్తు నిష్కల్మషదివ్య
మానసం బెఱిఁగి, యమర్త్యులు మౌను
లెట్టి భవద్రూప మేర్పడఁ జూడ
గట్టి ప్రయత్నమ్ముఁ గావింతు రట్టి 2110
నీ దివ్యరూపమ్ము నెనరునఁ జూపి
యాదరించితివి నీ వతని శ్రీకృష్ణ!

నిన్నుఁ గేవలము మానిసి గాఁగ నెంచి
మన్ను మిన్నెఱుఁగక మనమున వర్థరి
రజకుఁడు నీ కరప్రహరమ్ముచేత
భుజగశయన! ప్రాణములు గోలుపోయె
సాలె యొకండు వస్త్రమ్ములు నీకుఁ
జాలినవియు ప్రశస్తమ్ములు నైన
యవి యిచ్చి నీ దయ నఖిలసంపదలు
ప్రవిపులసౌఖ్యముల్ వడయంగ లేదె?
అలరుదండల సుదామాఖ్యుండు భక్తి
వెలయంగ నీకు నర్పించి, నీ కరుణ
గడియించి నీ పాదకమలసేవనము
విడువక దాసుఁడై విలసిల్ల లేదె?
మంచిలేపనముల మర్యాదతోడ
సంచితభక్తి నీకమరిచి కుబ్జ

తన త్రివక్రత్వమ్ము తలఁగ సౌందర్య
ఖని యయి వెలసెనుగా భవత్కరుణ!
కార్ముకాగారమ్ముఁ గాచెడివారు
దుర్మదాంధులు నిన్ను దూషించి యెదిరి 2120
హతులైరి నీచేత నంతియే గాని
వితలయ్యెఁగద వారి వెఱ్ఱిభావనలు.

స్వామి, సర్వేశ, గోవర్ధనోద్ధార,
కామితవరద, జగద్ధితచరిత!
రజక ధనుర్గృహరక్షకు లట్ల
కుజనునిగాఁ జెడఁగొట్టక నన్ను
నక్రూర తంతువాయక సుదాము త్రి
వక్రలవలె భవత్పాదాబ్జములను
నిరతమ్ము సేవించి నీ నామభజన
మఱవక సేయుచు మనునట్టి గుణము
గల నీదు దాసునిగాఁ గరుణించి
నలినాక్ష, ప్రోవవే, నతజనరక్ష!
దాసరక్షణమె నీ ధర్మ మటంద్రు
దాసులదోషముల్ తలఁప వటంద్రు
ఆ ధర్మ మా తలం పచ్యుతా, నీకు
సాధారణములు విశ్వంభర, శౌరి!
కాన నా కోరిక కాదనకయ్య
దీనజనావన! దిక్కు నీవయ్య.

## కంసవధ వృత్తాంతము

శ్రీయదుకులదీప, ప్రేమస్వరూప,
మాయామనుజవేష, మంజులభాష! 2130

భవదీయమహిమలు ప్రత్యక్ష మగుట
మివుల గౌరవము సంప్రీతియు భక్తి
నీ పయి నుదయించు నిర్మలాత్ములకు.
నా పవిత్ర భవన్మహామహిమములె
క్రూరవర్తనులగు కుజనుల కెపుడుఁ
గూరుచుచుండును కోపతాపములు.
కావునఁ దమపట్టు గట్టిగా నమ్మి
నీ వన్నగిట్టక, నినుఁ గనలేక
తమ మరణమ్ములఁ దామె కోరుదురు.
విమతులు విశ్వేశ, విశ్వప్రకాశ!

## రామకృష్ణులు కంసుని కొలువుకూటము (రంగస్థలము) న ప్రవేశించుట

విడిది నా రాతిరి విశ్రాంతి నిద్ర
గడపి ప్రొద్దున మేలుకాంచి సోదరులు
అన్నయు నీవు స్నానాదికములను
గ్రన్ననఁ దీఱిచి ప్రభుదర్శనమున
కనువగునట్టి వేషాద్యలంకృతులఁ
బొనరఁ దాలిచి, శ్రవఃపుటముల మల్ల
దుందుభినాద మస్తోకమై పడఁగ
మందహాస మొనర్చి మరు నిముసమున
రంగస్థలమ్ముఁ జేరంగ వెళ్ళితిరి
పొంగారు నుత్సాహమున జంట విడక. 2140

## కువలయాపీడమను గజసంహారము

ఆ రంగభూమి మహాద్వారమందు
మీరు ప్రవేశింప మీపైనిఁ బడఁగ

కువలయాపీడాఖ్యకుంజరేంద్రమ్ము
జవమున మావటి చలమునఁ దోల
నా దంతిదంతద్వయమ్మును లాగి
యా దంతములతోన న మ్మదకరిని
మావటివానిని బ్రమందించి తీవు
గోవర్ధనోద్ధార, గోపాలకృష్ణ!
మదగజరాజమ్ము మావటివాఁడు
యదుపుత్ర! నీచేత హతమౌటఁ గాంచి
భవదీయశౌర్య సంపద్బలోన్నతికి
సవతుమీఱినయట్టి సాహసమునకు
వెఱపొంది వెఱఁగొంది, వేఁడుకఁ జెంది
పురజనుల్ వేవిధమ్ముల నిన్నుఁ గూర్చి
పొగడఁ జొచ్చిరి, కంసభూపాలు మదిని
పగ వగగా మారి భయ ముప్పతిల్లె.

## శ్రీకృష్ణ బలరాములు చాణూర ముష్టికుల సంహరించుట

తదుపరి మీ రన్నదమ్ము లిద్దఱును
ముదమున నటనుండి ముందున కేగి
రంగస్థలమ్ము కుఱంగటఁ జేరి
సింగంపుఁగొదమలచెల్వున నిల్వఁ 2150
గంసు ప్రేరణమునఁ గడుఁ గ్రొవ్వి మిమ్ము
ధ్వంసమ్ము గావింపఁదలఁచి చాణూర
ముష్టికు లనువారు పోటు మగల్లు
కష్టాత్ము లిరువురు కదియుచు మల్ల
యుద్ధమ్మునకుఁ బిల్వ నుబ్బుచు మీరు
సిద్ధమైతిరి వారిఁ జేరి పోరంగ

అసురవంశవినాశ, యచ్యుతా! నీవు
వెస రేఁగి చాణూరు వీఁకమైఁ బట్టి
పురజనుల్ వెఱఁగంది పొగడుచునుండఁ
బొరిగొంటి వజ్రమమ్మున వాని దేవ!
బలుఁడును ముష్టికు బాహుబలాఢ్యుఁ
గలన నెదిరి వాని గర్వ మడంచి
ప్రాణములం బాపెఁ బౌరుల కెల్ల
నానందమును గడు నాశ్చర్య మయ్యె
ఈ లీలమల్లుర నిర్వుర మీరు
కాలునింటికిఁ బంపి కాలియందియలు
ఘలుఘల్లురని మ్రోఁగ, కడిమిమై రాఁగ
విలసితకీర్తుల వీరశేఖరుల
మిము రామకృష్ణుల మేలు మే లంచు
ప్రముదితోహృదయమై ప్రజ ప్రశంసించె. 2160
పెల్లగు భవదీయ విక్రమోద్వృత్తి
మల్లయుగళఘోర మరణమ్ము ప్రజల
పొగడితలును కంసభూపతి మదికి
పగయు, విచారమ్ము బరివేదనమ్ముఁ
గలిగింప నాతఁ డా కలకల మణఁచి
పలికె నిట్లని మంత్రివర్గమ్ముఁ గాంచి.

## కంసవధ

"అల్లరిపిల్ల లీయధములు వీరి
వెళ్లగొట్టుఁడు వీడు విడిపోవునట్లు
తరుముఁడు గొల్లలఁ దత్కులముఖ్యు
దురితాత్ము నందుని ద్రోయుఁడు కార

వసుదేవుఁ జంపుఁడు, పరపక్షపాతిఁ
గసి మసంగుండు గొంకక యుగ్రసేను
నాలసింపక వీరి నందఱఁ బట్టి
కాలుపురికి నంపి గనుఁడు విఖ్యాతి"

అనవు డాపలుక్కుల నచ్యుతా, కృష్ణ,
విని, యసురాన్వయ విధ్వంస, నీవు
కోపమ్ముఁ బెంచి, యీ కుటిలవర్తనుని
నీ పాపిఁ గంసుని నిప్పుడ త్రుంతు
నని గద్దెమీ దికి నతివేగ దుమికి
యనయు నాతని సిగవంచి చేఁబట్టి 2170
క్రిందికి నీడ్చి నికృష్టుఁడా! కూళ!
మ్రందుమా' యని రంగమధ్యమ్మునందుఁ
బడద్రోసితివి వాఁడు పడి తత్క్షణంబ
వడి లేవఁజాలక, పారాడలేక
కదలక మెదలక కనుమూసికొనియెఁ
గదిరె నాశ్చర్యమ్ము కను ప్రజకెల్ల
గొల్లపిల్లం డెంత ఘోరమౌ కార్య
మెల్లరముం జూడ నిటుచేసె నకట!
పొదువుఁడు వీనిని బొరిగొనుఁ డనుచు
వదరుచు కంసు నవరజులు మంత్రు
లొక్కటిగాఁ గూడి యుగ్రులై మిమ్ముఁ
జిక్కడఁ బైఁబడఁ జనుదేర వారి
బలరాముఁ డుగ్రుఁడై పరిమార్చె, నంత
నలరులఁ గురియించె నమరబృందమ్ము
చేతమ్ము పొంగంగ సిగముడి వీడ
చేతతాళమ్ములు చెలఁగి వేయుచును

నారదముని గగనమ్మున నాడె
సారసభవ భవ సన్నుతుల్ మించె

## శ్రీకృష్ణుఁడు దేవకీ వసుదేవుల చెఱనుండి విడిపించుట

అంతట శ్రీకృష్ణ. అగ్రజుతోడ
స్వాంత ముబ్బగ చెఱసాలకు నీవు 2180
చనుదెంచి. యచట నీ జననిని. జనకు
గని వారలకు నమస్కారముల్ చేసి
చెఱ విడిపించి సుస్థిరచిత్తభక్తి
చిఱునగ వొలయ వచించితి విట్లు
"తలిదండ్రులార! జోతలు మీకు. జగతిఁ
దెలియుదు కాలమ్ము తీరెవ్వరికిని.
మముఁ గనియెడు నంతమాత్రమే గాని.
క్రమముగ బాల్య పౌగండాది దశల
ముచ్చటతో మముఁ బోషించు భాగ్య
మిచ్చగించియు లభియించెనే మీకు
జననీజనకుల పజ్జవసించి ప్రేమ
పెనుపొందునట్టు లేవేళ నేరీతిఁ
బెనుతురో వార. లాపెంపున సుఖము
గనెడు సామాన్య భాగ్యములేదు మాకు
పురుషార్థములు పొంద మూలమౌ మేని
కరయ నాద్యులు మీరుగద. మీ ఋణమ్ము
నెన్ని వత్సరములకేనిఁ దీర్పంగఁ
జన్నె మా కిఁక పుణ్యచారిత్రులార!
తనదు సర్వస్వమ్ము. తనమేను. ధనము
జననీజనకులకు సదాఁనియోగ 2190

మొనరింపఁదగు శక్తి యుండియు నెవఁడు
వినియోగ పఱుపఁడా వెంగలి తుదకు
తనమేని పలలమ్ముఁ దాన భక్షించి
మను ప్రాణియగు నను మాట నిజమ్ము
తల్లిదండ్రులను వృద్ధజనమ్ము గురుల
పిల్లల, సతుల, సద్భృందాది హితుల
నెవఁడు సమర్థుఁడై యేలక యుండు
నతఁడు జీవన్మృతుఁ డగును జగాన
మాపయిఁ దనకున్న మత్సరబుద్ధి
మీపయిఁ జూపుచు మిమ్ముఁ జెఱనుంచె
కూళ కంసుఁడు వానిఁ గూల్పక యింత
కాల మూరకయుంట కడు దోష మయ్యె
మా తప్పిదమ్ముల మన్నించి, మమ్ము
మీ తనుజులఁ బ్రోవ మీకు జేజేలు"

అని త్రిజగన్నేత, అసితాబ్దగాత్ర,
దినకర శశినేత్ర, దివిజసంస్తోత్ర,
బాలకృష్ణా! నీవు పలుక, నీ పలుకు
లాలించి మోదాబ్ధియందు నోలాడి
దేవకియును వసుదేవుండు మిమ్ముఁ
బావనమూర్తులఁ బ్రణతార్తి హరులఁ 2200
దమ యంకములఁ జేర్చి, తగఁ గౌఁగిలించి
సమధికానంద బాష్పముల మీ ముద్దు
మోములఁ దడుపుచు, ముద్దులు గొనుచుఁ
బ్రేమాదరమ్ములు పెంచిరి, మరియు
పదపడి యా పుణ్యవర్తను లచోటు
వదలి రాచనగళ్ల వసియింపఁ జనిరి,

## శ్రీకృష్ణుఁడు ఉగ్రసేనునకు పట్టాభిషేకము చేయుట

తదనంతరంబ శ్రీధర! యుగ్రసేనుఁ
గదిసి "యయాతి భూకాంతు శాపమున
యాదవాన్వయులు సింహాసనమెక్క
రాదు కావున, నీవె రాజవు గమ్ము
నరనాథ! అదితి నందనులైన నీకు
నరివెట్టఁ గల రింక నన్యులేపాటి"
యని చెప్పి తాతను నవనీశు జేసి
ఘనయశో విభవంబు గడియించి తీవు
కంసనృశంసు నక్రమశాసనముల
హింసల భరియింప నెటు వీలుగాక
పరవాసమున నున్న బంధువర్గమ్ముఁ
బెరిమమ్ము మీఱఁగాఁ బిలిపించి వారి
కభయదానము నిచ్చి యాదరించితివి,
యిభరాజవరద, సర్వేశ, శ్రీకృష్ణ! 2210

### శ్రీకృష్ణుఁడు నందాదుల బృందకుఁ బంపుట

అంతట నొక్కనాఁ డబ్జాక్ష! నీదు
నంతికమ్మందు హలాయుధుఁ డుండు
సమ్ముఖాన నందు నీ సరసకుఁ జేరి
సముచితాలాపముల్ సల్పుచు "మేము
జనని నెఱుంగము జనకు నెఱుఁగము
జనని యశోదగా జనకుగా నిన్నుఁ
దలఁచియుంటిమి భవద్దయ నెట్టిదొ యంత
గలిగి యెఱుఁగ మింతకాలమ్ము మేము

ఏ తలిదండ్రులు లే నేకాలమందు
నీతియు నియమము నెఱి దప్పకుండ
పిల్లల నీరీతిఁ బెంచిరే యెందుఁ
దెల్లమయ్యెను భవద్దివ్యగుణమ్ము
మీ సహృదయతచే మే మింత వార
మై, సర్వసుఖముల నందితిమయ్య
ఇక్కడి బంధులకెల్ల సౌఖ్యములు
చక్కఁగ గుదిరించి చయ్యన నటకు
నరుదెంతు మీ వార్త నస్మదీయులకు
నెఱిఁగింపుమా, తండ్రి: యేమెందునున్న
మంద దయాబుద్ధి మాకుగా మీరు
పొందికచేయు నపూర్వపోషణము 2220
లరమరలేని సమాదరమ్ములును
మఱవ మెన్నండును మాన్యచరిత్ర!"
అని పల్కి వస్త్రభూషాదు లొసంగి
యనుపమాదరము సౌహార్దమ్ము వెలయ
పనిపిరి వతని వ్రేపల్లెకు నతఁడు
చనెఁ దనవారితో సంతస మ్మెసఁగ

వాసుదేవ! త్వదీయబాహు విక్రమము
భాసురదివ్య ప్రభావోన్నతమ్ము
భువనప్రసిద్ధమై పొదలుచునుండ
నవివేకి కంసుఁ డహంకార బుద్ధి
నీతోడఁ బగఁబెంచి నీల్గెనే గాని,
యాతఁడు సాధించినది యేమి గలదు?
మరియు నా కంసుని మాటలు నమ్మి
కరిపాలకుండును, ఖలులు మల్లురును

అవివేకు లగుచు నహమ్మతి చెలఁగి
భవదీయ కోపాగ్ని భస్మమైపోరె!
దుష్టబోధలు విని దుర్ణయవృత్తి
శిష్టుల కపకృతిఁ జేసెడు బుద్ధి
నా యెడనున్నచో నాశ మొనర్చి
యే యవగుణము నా కెడముగఁజేసి

పెద్దల సద్బోధ విని నీదు సేవ
తద్ద నొనర్చు నుత్తమమగు పథము
ననుఁ బాయనట్టి గుణమ్ముగా నాదు
మనసున నెలకొల్పి మన్నింపు మయ్య 2230
సరసిజ దళనేత్ర, జలదాభగాత్ర,
పురుషోత్తమా, జగత్పూజ్యచారిత్ర,
గోవర్ధనోద్ధార, గోకులపాల,
గోవింద, శ్రీకృష్ణ, గోపికాలోల,

## శ్రీకృష్ణబలరాముల ఉపనయన విద్యాభ్యాసములు

శ్రీపుండరీకాక్ష, శ్రితజనపక్ష,
తాపసజనరక్ష, దైత్యవిపక్ష,
శ్రీకృష్ణ! మానవాకృతిఁ బుట్టి నీవు
లోకధర్మమునకు లోప మించుకయు
రానట్లు మనుజధర్మమ్ము పాటించి
మానవజాతికి మార్గదర్శకుడ
వైతివి నీదు ధర్మాచరణమ్ము
ఖ్యాతమ్ము జగతికిఁ గడు శుభదమ్ము.

## ఉపనయనము

వసుదేవునాజ్ఞ విప్రవరుఁడు గర్గుఁ
డసదృశబ్రహ్మవిద్యావేత్త మిమ్ము
రామకృష్ణులను ధర్మస్వరూపులను
నేమమ్ముతో నుపనీతులు గాఁగ 2240
నొనరిచె మీరు బ్రహ్మోపదేశమ్ముఁ
గనుట ద్విజత్వభాగ్యముఁబొంది యవల

## రామకృష్ణులు సాందీపనియొద్ద విద్యాభ్యాసము గావించుట

నరుఁ డెట్టిఁడేని విజ్ఞానార్జనమ్ము
గురుసేవఁ బడసి, తద్గురు నాజ్ఞనొంది
తన పురుషార్థసత్కర్మక్రియాదు
లొనరింప యత్నించు టురవగు త్రోవ —
అని లోకులకు హిత మరయ బోధించు
ననువున నీవు నీయన్న సర్వజ్ఞు
లై జగద్గురువులునై యుండి లోక
పూజితు నొక గురుమూర్తిని బడయఁ
దలఁచి కాశికిఁ జని తత్సమీపమునఁ
గల యవంతీవాసి ఘను సర్వశాస్త్ర
విదుని సాందీపని విఖ్యాతనాము
మది మెచ్చుకొని గురుమాన్యగా నెన్ని
యతిభక్తి మీర లాయాచార్యసేవ
కౌతుకక సేయుచుఁ గొలుచుచునుండ —
మీ గురుభక్తికి మిక్కిలి మెచ్చి
బాగుగ మీకు నాప్యాయమ్ముగాఁగ
సకలశాస్త్రమ్ములు సర్వవేదములు
సకలతంత్రమ్ములు సరసంపుఫణితి 2250

గణపి, యా గురుఁడు జగద్గురులకును
గురుఁ డయ్యె నతఁ డెంత గురుపుణ్యయుతుఁడొ!
అరువదినాల్గువిద్యల గురునొద్ద
నరువదినాలు గహస్సులలోన
నొక్కదినమ్మున కొకటి చొప్పునను
జక్క నేరిచితిరి శ్రవణమాత్రమున
ఇమ్మాడ్కి విద్యలఁ గృతకృత్యులైన
మిమ్ముఁ గనుంగొని, మీ మహాత్మత్వ
మునకు మహాశ్చర్యమును బొందియిట్టు
లనియె సాందీపని యచ్యుతా! మీకు,

## గురునియభ్యర్థనము

"వీరశేఖరులార! వినుఁడయ్య మీరు
ధీరులు నా కోర్కె తీర్పగలారు.
వనరాశియందు ప్రభాసతీర్థమున
మును నాదు కొమరుండు మునిఁగి రాఁడయ్యెఁ
గరుణ నాబాలుఁ దేగదరయ్య. మీరు
గురుఋణముం దీర్చుకొనుఁడయ్య, శిష్య
ధర్మమ్ము జగతికిఁ దగ నేర్పుఁడయ్య.
శర్మమ్ము నా మది సవరింపుఁడయ్య"

## రామకృష్ణులు మరణించిన గురుపుత్రునిఁ దెచ్చిన వృత్తాంతము

అన విని గురుని కార్యార్థమై మీరు
చని, వననిధిఁజేరి "సాగర! వేగ 2260

మా గురుసుతు నిమ్ము, మాఱాడితేని
నీ గర్వ మణఁచుట నిక్కమ్ము సుమ్ము”
అన నతఁ డిట్టుల ననియె మీతోడ
“వినుఁడు యాదవవంశ వీరులు, మీరు
నేర మింతుకయేని నేఁ జేయలేదు
పాఱునికొడుకు ప్రభాసతీర్థమున
మునుఁగుచునుండ సముద్రమునుండి
పెనుతరఁగొండు తద్విప్రకుమారుఁ
గొనిపోయె లోనికి క్రూరుఁడు పంచ
జను డు తద్బాలకు చప్పున మ్రింగె”

## పాంచజన్యవృత్తాంతము

అనవు డమ్మాటల నాలించి పంచ
జనుఁడున్న సాగరస్థలము నెఱింగి
యన్న వెంబడిరాగ సచటికి నీవు
క్రన్నన జేరి యా ఖలు పంచజనునిఁ
జదిపి, యా రక్కసు జఠరమ్మునందు
వెదకి బాలుఁడులేని విధము నెఱింగి
వాని శరీరాన వరలు శంఖమ్ము
మానిత మ్మనుచు సమ్మతి గ్రహియించి

## యమునినుండి రామకృష్ణులు గురుపుత్రుని దెచ్చుట

క్రన్నన నటనుండి రాముఁడు నీదు
వెన్నంటిరాఁగ వేవేగ సంయమునిఁ 2270
జేరి తత్పురిఁ బ్రవేశించి శంఖమ్ముఁ
బూరించితివి జగత్పూజ్య, శ్రీకృష్ణ!

నిఖిలనిర్ణేతవు, నీ కెదురేది?
అఖిలలోకేశ్వర, అసహాయశూర!

భవదీయశంఖనిస్వనము చిత్రముగఁ
జెవిఁబడ, శమనుఁ డచ్చెరువును, గినుక
మనమునఁ బెనఁగొన "మత్ప్రతాపంబుఁ
గనక యెవ్వండొ శంఖధ్వని నిట్లు
గావించె వాని నేఁ గడతేర్తు'' ననుచు
నీవున్న యెడఁజేరి, నిన్ను మీయన్నఁ
గాంచి, మీరలు లోక కల్యాణ సిద్ధి
నెంచి ధారుణి నరాకృతుల జనించి
నట్టి దైవములుగా నాత్మ నెఱింగి
యిట్టలమగు భక్తి నెఱఁగి నీతోడ
"స్వామి! మహాత్మ! నీ వాంఛిత మెద్ది?
యేమియానతి తెల్పవే యని వేఁడ
"యమరాజ, మా గురునాత్మజు నొకనిఁ
గ్రమమని దండింపఁగా నెంచి నీవు
తెప్పించినాఁడ వా ధీమంతు బాలు
నిప్పింపుమా మాకు నీద్య చరిత్ర!" 2280
అని వనజాక్ష నీ వంటి వాపల్కు
లను వింటయొకటె యాలస్యమ్ముగా గ
నప్పుడె య బ్బాలు నటకు రప్పించి
యొప్పించె నీకు మహోదారబుద్ధి
దండధరుండు వేదండసంరక్ష!
పుండరీకాక్ష! సన్ముని జనపక్ష!

అంతట నీవు మీ యన్నయు బాలు
నంతకునుండి మహాసంతసమునఁ

గాని యవంతికివచ్చి గురునకు నిచ్చి
"మునిజననుత, గురుముఖ్య, యింకేమి
సేయంగ వలయు వచింపవే యనిన"
నా యుపాధ్యాయుఁ డిట్లనియె మోదమున
"గురువులు కోరిన కోర్కెలు మున్ను
కొఱతలేక తీర్చిరొకో యెవ్వరేని?
గురునకు దక్షిణ కోరిన యటుల
నరుదన నొసఁగితి రది యపూర్వమ్ము
నాకు మిక్కిలిగ నానందమ్ము గల్గె
మీ కెందు విజయ సమృద్ధియౌఁ గాత!
అనుచు దీవించిన యా గురువర్యు
ననఘు సాందీపని యనుమతిఁబడసి 2290
యాతని వీడ్కొని యన్నతో మధుర
కేతెంచితివి జగద్ధిత కార్యనిరత!

శ్రీ యదుకులవీర, సింధుగంభీర!
మాయావిదూర, రమాచిత్తచోర!
జ్ఞాన స్వరూప! నీ సత్ప్రవర్తనము
మానవజగతికి మార్గదర్శకము
బ్రహ్మమే నీ వయ్యుఁ బామరునట్లు
బ్రహ్మోపదేశమ్ముఁ బడయుట వింత
గురుఁడవును బరమ గురుడవు నీవె
గుఱుతింపఁగా జగద్గురుఁడవు నీవె
కాని, శ్రీకృష్ణ! యొక్కని విప్రు గురుని
గా నెన్ని విద్యల గడియించి తీవు
గురుసుతు మృతబాలకుని దెచ్చి యిచ్చి
గురుఋణమ్మును దీర్చికొంటివి మరియు

ననితర సాధ్యమైనట్టి తత్కార్య
మొనరించి జగతి శిష్యుల ధర్మమిట్టి
దని నిరూపించితి వబ్జాక్ష, కృష్ణ,
అనుపమానము భవదాచరణమ్ము
కరుణాసముద్ర, శ్రీకర, ధర్మనిరత,

పరమపూరుష, జగత్పావనచరిత! 2300
గురుజనభక్తియు గురుపాదసేవ
నిరతమ్ము గావించు నిర్మలబుద్ధి
గురునాజ్ఞ దాఁటని గొప్పగుణమ్ము
గురుకాంక్ష దీర్చెడు గురుతరశక్తి
నాకుఁ బ్రసాదించి నను( బ్రోవుమయ్య
నీ కరుణకుఁ బాత్రునిగఁ జూడుమయ్య
నందనందన, యదునందన, కృష్ణ,
బృందావిహార, గోవింద, ముకుంద!

## శ్రీకృష్ణుఁడు మందఁగల గోపాంగనలకు ఉద్ధవుని మూలమున సందేశముఁ బంపిన కథ

శ్రీయాదవాన్వయ సింధుశశాంక,
మాయామనుజరూప, మహిత ప్రతాప,
కారుణ్యగుణధామ, కల్యాణనామ,
నీరజాసనముఖ నిర్జరస్తోత్ర!
నిను నమ్మియున్న ప్రాణిసమూహమునకు
సుసితి గావింతు నీ యుల్లాన నెపుడు
వారల మఱవవు వారి సంక్షేమ
మారయుచుందు వీ వతులమౌ కరుణ

భవదాశ్రిత స్నేహ వాత్సల్యమహిమ
భవ పద్మభవులకుం బ్రార్థనీయమ్ము

శ్రీకృష్ణుఁడు ఉద్ధవుని మందకుఁ బంపుట

నందనందన, జగన్మాన్య సచ్చరిత!
సాందీపని పవిత్ర సాన్నిధ్యమందు 2310
నరువదినాలుగు నరువది కళల
నరు దరుదని జగ మ్మనునట్లు నీవు
అభ్యాస మొనరించి యామీఁద మథుర
నుబ్బ మీఱఁగఁ జేరియుంటివి కృష్ణ!
ఒకనాఁడు కృష్ణ నీ యుల్లమ్మునందు
సకలంకమతుల గోపాంగనాజనులఁ
దలపోసికొనుచు "నెంత ప్రమాద మయ్యె
లలనలు గోపికల్ లలితమానసలు
నా విరహమ్మున కెంతగ బాధపడుచు
నే వత్తునని తెన్ను లెదురుచూచుచును
నా రాక గానక నన్నుఁ గోపించి
దూరుచున్నారేమొ తులలేని చింత"
అని కడు వగచి, నీ యాత్మీయు, వృద్ధ
జననుతగుణగణ్యు, సాధు, నుద్ధవునిఁ
బిలిపించుకొని చాల ప్రియముతో నతఁడు
తెలియంగ నిటులంటి, దివిజేంద్రవంద్య!

"ఉద్ధవా! వృష్ణివంశోద్భవా! మిత్ర!
ఇద్ధచరిత్ర! రమ్మిట కొక్కమాట
వినుము, వ్రేపల్లెలో వ్రేత లెల్లరును
నన్నుఁ జూడఁ గోరుచు నా వియోగమునఁ 2320

గడుఁ బొగులుచు, సర్వకార్యముల్ మఱచి
యెడఁదల సంతస మేపాటిలేక
వగ మునుంగుట వ్యాజవర్తనుఁ డనుచుఁ
దెగి నన్ను వారెల్లఁ దెగడుచుండుదురు
నమ్మినవారి నెన్నఁడుగాని విడుట
యెమ్మెయి ధర్మప్రవృత్తియే గాదు.
అదియునుగాక నా కాశ్రితావనము
ముదముఁగూర్చెడి కార్యమును. నిసర్గమ్ము
నగుటచే బృంద కీ వరుగు మచ్చోట
వగగొన్న నా గొల్లభామలఁ గాంచి
వ్రేతభామినులార! వినుఁడు మీరెల్ల
మీ తోడికలయిక. మీ చెల్మికల్మి
మఱువ నించుకయేని. మానుఁడు శంక
నరుదెంతు మీ చెంత కందఱఁ జూడ
మిమ్ము విడువఁజాల మీ నెమ్మనముల
నమ్ముఁడు నా మాట నలినాక్షులార!"
అని యిట్లు మీకు శ్రీహరి సమాచార
మనిపినాఁ'' డని చెప్పి యాప్యాయనముగ
నోదార్చి రమ్మని యుత్సాహపఱచి
యాదరమ్మునఁ బంపె తాతని నీవు. 2330
నీ పంపు తనకుఁ బెన్నిధిగాఁగ నెంచి
యేపగు సంతస మేర్పడ నపుడ
యా యుద్ధవుఁడు మంద కానాఁడె యరిగి
పాయని ప్రేమ గోపకు నందుఁ జూచె
నుద్ధవుఁజూచి మహోత్సాహ మంది
బద్ధానురాగాన భార్యయుఁ దాను

నందుఁ డాతనికి విన్నాణ మొప్పార
హొందిక సత్కారములు పెక్కుచేసె.

## నంద, ఉద్ధవుల సంభాషణము

మరియు నానందుఁ డమ్మహితాత్మ. నీదు
పరమాప్తు నుద్ధవు పజ్జఁ గూర్చుండి
"అన్న. ఉద్ధవ. మదీయాప్తమిత్రుండు
విన్నాణి వసుదేవ విభుఁడట సుఖియె?
నీకు శ్రేయమెగద. నిర్జరార్చితుఁడు
శ్రీకృష్ణుఁ డెపుడేనిఁ జెప్పునే యిచటి
ముచ్చటలను. గొల్లపూఁబోండ్ల. మమ్మ.
నెచ్చెలులను. పశునిచయమ్ముగూర్చి
తలఁచునె? మరిమాకు దర్శన మిచ్చు
తలఁపున నిచటికిఁ దా నెప్డు వచ్చు?"
నని ప్రేమతొలుకాడ నడుగు నందునకు
ననియె నా యుద్ధవుఁ డతులమౌ ప్రీతి 2340

"నందమహాశయ! నా మాట వినుము
సందియమును మాను జలజనాభుండు
శ్రీకృష్ణుఁ డిచటికిఁ జెచ్చెర వచ్చు
మీకు సంతసమును మిగులంగఁ గూర్చు
తలిదండ్రులని యశోదాదేవి నిన్నుఁ
దలఁపున నెప్పుడుఁ దలఁచుచు నుండు
బలరామకృష్ణులు భావింప నరులె
తెలియుమా యీ ధరిత్రీభార ముడుప
హరియె వారలరూప మమరంగఁ దాల్చి
చరియించుచున్నాఁడు జగములు మెచ్చ

జననకర్మలుగాని, జననములోగాని
హరికిం గలవె? కాని యమ్మహాత్ముండు
దుష్టజనమ్ముల దునుమాడు కొఱకు
శిష్ట ప్రజారక్ష సేయుట కొఱకు.
జనియించుం గర్మముల్ జరుపుచునుండు
గుణిగా.గం దిరుగు లోకులంగూడి మెలంగు"
నని పెక్కువిధముల నచ్యుతా! కృష్ణ!
అనఘుం డుద్ధవుండు నందాదుల కెల్లం
దనివితీరంగం, దత్తనువులు పొంగ
నినుంగూర్చి తెలిపి. యా నిసి నిద్రగడిపి 2350
మరునాండు ప్రాతస్సమయమున లేచి
సరవి ననుష్ఠాన సత్క్రియల్ దీర్చి
ఒకండె యేకతమున నొకచోట నుండ
చకితేక్షణలు మంద జవ్వను లతని
గని సిగ్గు నవ్వు మొగములకుం జెల్వుం
బెనుప నీ మిత్రుండు విన నిట్టు లనిరి

## ఉద్ధవుండు విన వ్రేతలు శ్రీకృష్ణుని గూర్చి యుపాలంభోక్తులు పలుకుట

"ఎవ్వండీతండు? మన కృష్ణుని భంగి
నవ్వంపురూపసంపద నున్నవాండు"
అని చక్క వీక్షించి యచ్చెరువొంది
యనిరి యా భామిను లతండు వినంగ
"ఎఱింగితిమయ్య మే మెల్లను నిన్ను
సరసిజేక్షణు కృష్ణు సఖుండవు నిజము.
తన క్షేమవార్తలు తల్లిదండ్రులకు
వినుపింప నినుం బనిపినవాం డతండు

తల్లిదండ్రులనైనఁ దలఁపన సుఱపఁ
డల్ల కృష్ణుం డిది యాసందకరమె!
లేనిచో నిట్టిపల్లియలోనఁ గలరె
తాను గుర్తింపంగఁ దగినట్టివారు?
జడదారులైనను సద్బంధుమైత్రి
విడువనొల్లరు కాని, విడువకుండుదురె 2360
సనిమిత్తహార్దముఁ జంచరీకములు
పనితీర సుమములఁ బాయు టబ్బురమె?''
అని యుపాలంభోక్తులాడుచునుండ
వినుచుండి యొకవ్రేఁత విశ్వేశ, నీదు
ధ్యానమ్మునను మున్గి తనుఁదాన మఱచి
సూనమరందాన సొక్కి యా చెంత
మధురగానమ్ము నెమ్మది చేయు నొండు
మధుపమ్ముఁ గాంచి యా మానిని తన్ను
నీవు ప్రార్థింపఁ బన్పిన దూతగాఁగ
భావమ్మునందుఁ గల్పనము గావించి
ఆ యుద్ధవునకు నన్యాపదేశముగఁ
బాయక తనలోనిభావ మేర్పడఁగ
న య్యళితోడ నీ యనుఁగు వినంగ
నయ్యబ్జదళనేత్ర యనియె నీ రీతి

## భ్రమరగీతలు

"మా పదాబ్జముల బంభర! ముట్టఁబోకు
రూపింప దుష్టమిత్రుఁడ వౌదు వీవు
ముట్టితిపో వ్రింంచి పోయెడిదేమి?
వట్టి శ్రమయెగాని ఫలమేమి లేదు

పౌర నారీకుచోపరి కుంకుమాంక
గౌరవమున నొప్పు కమలాక్షు దామ 2370
సుమ మధురసపాన శోణితం బగుచుఁ
గమనీయమై నీ ముఖం బొప్పియుంట
నా నాథుఁడే నిను నాదృతిఁ జూచుఁ
గాన, మధురకీవు కదలుటే మేలు

ఒక విరిఁగలతేనె నుబ్బుచుఁ గ్రోలి
వికటబుద్ధిని వేరు విరిఁ జేరునట్టి
నినుఁబోలి మా చెంత నెమ్మదిఁజేరి
యనువుగ మా యధరామృత మ్మాని
మము మోహమున ముంచి మా జవ్వనమ్ము
ప్రమదమ్మునను బొంది, పరవధూకాంక్ష
మఱచి యున్నాఁడిప్డు మము మాధవుండు
సిరి పాప మేమఱి చిక్కె నాతనికి

మధుప! శ్రీకృష్ణుఁడు మంచివాఁ డనుచు
పృథుగౌరవమ్మున వినుతింతు వకట!
తచ్చరిత్రములు నూతనములే, మేము
ముచ్చటఁ బొందము మోహానఁ బడము
పౌరకాంతల ముందు పాడుము, నీవు
కోరు నిష్టార్థముల్ గూర్తురు వారు
శౌరి తేజోమయ సౌందర్య గరిమ
యే రామ చూచి తా నెసఁగెడు ప్రేమ 2380
వారిధిలోమున్గి వరియింపకుండు?
శ్రీరమాదేవి వరింపదే మున్ను
మే మెంతవార మ మ్మేఘ వర్ణుండు
స్వామి శ్రీకృష్ణుని సంతసపఱుప

నీవు దౌత్యక్రియ నేర్పరి వగుట
భావించితిమి: చాలు, పట్టకు విడుము
మా పదాబ్జంబుల: మా బంధుజనుల
మా పతులను మఱి మా పుత్రకులను
మఱచి యాతని నమ్మ, మమ్మేలతండు
మఱచెనో, యిద్ది ధర్మమె ధార్మికులకు?

వాలిఁ గిరాతుని వడువునఁ గూల్చె
లోల శూర్పణఖ కేలో రూపుమార్చె
దనుజేంద్రు బలిరాజు దంభోక్తిఁ గట్టి
కొనఁడె ముజ్జగము లా కుటిలవర్తనుఁడు
విన్ననఁ బాఱెడి విహగమ్ములైనఁ
దన్నొకపరి విన్నఁ దత్క్షణమ్మనవె
వానికి సంసార బంధముల్ వాపి
మానుగఁ గాపాడు మాధవుఁ డిపుడు
తనుఁ జూచు లాలసఁ దపియించు మమ్ముఁ
గనుఁగొనరానట్టి కారణ మేమొ! 2390
మృగయు టక్కరికూఁత లెడఁదల నమ్మి
మృగము లా స్థలములకేగి యమ్మృగయు
శరపాతముల నొచ్చుచాడ్పున మేము
హరికపటోక్తుల నాత్మల నమ్మి
యిపు డంగజుని తూపు లెడఁదల నొంపఁ
దపియించు చున్నాము త్రపతోడివంత
మనసిజవశలమై మా వారినెల్ల
మనములఁ దలఁపక మా దిక్కతండె?
యని నమ్మియున్నట్టి యబలల మమ్ము
ఘన వియోగాబ్ధి సంకటపడఁ ద్రోసి

నేరనియట్లుంట నీతియే? ధర్మ
దూరవర్తనమని తోఁచదే తనకు
రోలంబ! నీదు మిత్రుపదాబ్జములను
ప్రాలి చెప్పుమ. ధర్మపద్ధతితీరు.

మా కుటీరమ్ములు మాడుగు లౌనె?
శ్రీకృష్ణు మదికెట్లు తృప్తిని గూర్చు!
మా పల్లె పట్టణమా? కాదుకాదు
శ్రీపతి కే రీతి ప్రీతిఁజేకూర్చు
మా యరణ్యము కుసుమవనస్థలమ్మొ?
యా యచ్యుతున కెట్లు హర్షమ్ము గూర్చు?
మా పసు లశ్వముల్ మదపుటేనుఁగులె?
యే పొటి హరిమది కింపు గల్గించు?
మేము శృంగారాల మించు వారలమె?
కాము. మ మ్మేల శ్రీకాంతుండు దలఁచు?
నరనాయకులు నూతనప్రియు లనెడి
ధరఁగల లోకోక్తి తప్పునే భృంగ!"
అని నినుఁ గనువేడ్క ననురాగ మొలుక
వినిచిన గోపికా వితతి పల్కులను
విని యుద్ధవుఁడు వారి వినుఁడని యిట్టు
లనునయాలాపమ్ము లాడె నెమ్మదిగ.

## ఉద్ధవుఁడు గోపికలకు శ్రీకృష్ణుని సందేశమును వినిపించుట

గోపికలార! యెక్కడు పవిత్రములు
మీ పూజ్యచేతముల్ మీ నడవడులు
జపములఁ దపముల స్వాధ్యాయములను
నిపుణులైనట్టి మునిప్రవరులును

ఏ దైవమును దమ హృత్పీమలందుఁ
బాదుకొల్పఁగలేరొ పరమపూరుషుని
నా దైవమును మీర లాత్మలయందుఁ
బాదుకొల్పి భజించు వరతపస్వినులు
నను మిముఁగనిరాఁగ నళినాయతాక్షుఁ
డని పెడివేళ నత్యంతముదమ్ము 2410
మీపయిఁ జూపి పంపిన వాచికమ్ము
తేపాటివో మీర లిప్పుడు వినుఁడు
విన్నచో మీకున్న వెతలన్ని తలఁగు
నన్నలు! మీకెల్ల హర్షమ్ము గలుగు''
అని నీదు సందేశ మా యబలలకు
వినిచె నుద్ధవుఁడు సంప్రీతి నీ రీతి
''గోపికలార! నన్గూర్చి వియోగ
తాపంబు మీరు పొందఁగనేల వినుఁడు
నేను మీ దగ్గరనే యున్నవాఁడఁ
గాని, మీ రెఱుఁగరు, కష్తి నొందెదరు
ఎల్లకార్యములకు నేను హేతువని
యెల్ల రెఱుంగుదు రిది ప్రసిద్ధమ్ము
ఏ నెంచ కున్నచో నే కార్యమేని
నేనాఁడు జరగఁబో దెఱుఁగుఁడు మీరు
అట్టు లుండియుఁ దామరాకున నీటి
బొట్టురీతిగ నుందుఁ బొత్తును విడను
నన్నెప్డు మీకు చెంతనయున్నయటుల
నెన్ని మీ రొనరించు నెల్లకార్యముల
గుఱితించి ననుఁ జూచి కొఱలేని తృప్తిఁ
బొరయుఁడు మీ వగల్ పోద్రోచికొనుఁడు 2420

మనము దవ్వులనున్న మన మానసములు
కనుఁ డెంతచేరువగా నున్నయవియొ
వచ్చెద మందకు, వచ్చి మీతోడ
ముచ్చటల్ జరపి యిమ్ములు గూర్చువాఁడ"
ఇవ్వి కృష్ణునిపల్కు లెఱిగించినాఁడ
నవ్విభుమాటల నట్టులే నేను"
అని యాతఁ డనఁగ న య్యమృతసందేశ
మును విని యా గొల్ల ముదిత లందఱును
అనుపమానందము నంది యుద్ధవున
కనిరి మరల నిట్టు లతి సంభ్రమమున

## గోపికలు తమ మనోనిశ్చయమును ఉద్ధవునకుఁ దెల్పుట

ఓయి! ఉద్ధవ కృష్ణునుచితసందేశ
మీ యదనున మాకు నింపును గూర్చె
నారటమును మాన్చె హరిఁగూర్చి వినఁగ
కోరిక లూరించెఁ గుతుకమ్ముఁ బెంచె
నెఱిఁగింపుమా, క్షేమమేగద హరికి?
నెఱుఁగుదే యతఁ డిట కెప్పు డేతెంచు?
నేతెంచి మాకోర్కు లీడేర్చునొక్కొ!
యాతఁ డిటకువచ్చు యత్నమ్ముచూచి
సైతురే యచటి స్త్రీజన మడ్డుపడక
ధాతకు మాయెడ దయ శూన్య మయ్యె! 2430

యమునాతటమ్మున యామినులందు
మముఁ జేరువకుఁ బిల్చి మమతలు పెంచి
వెన్నెలవేళల వేఁడుకమీఱఁ
జెన్నార మాతోడఁ జేరి విహార

ముల నొనరించె, నా ముచ్చటల్ తాను
తెలిపెనే నీకుఁ దృప్తిగ మాధవుండు
యమునానదీతీరమం దొండు వ్రతము
ప్రమదలు మే మందఱము చేయుచుండి
తడుపులు లే కొక్కతఱిని౯ దత్తటిని౯
గడు నిష్ఠ స్నానముల్ గావించుచుండ
మా వలువలు దాఁచి మాకు సువ్రతము
గావించుతీరు చక్కగఁ దెల్పెఁ గృష్ణుఁ
డా కథ యుద్ధవా! అతఁ డెప్పుడేని
నీకుఁ జెప్పెనె? చెప్పు, నిజముగ మాకు
కాళిందిదరిని రాకాజ్యోత్స్నలందు
హాళి రాసమ్ము మా యందఱి తోడ
నంగీకృతుండయి యాడినవిధము
పొంగుచు నీతోడ ముచ్చటింపఁడటె!

హరిఁ బాసి యొక్కింత యాలస్యమైన
ధరణిపై నిలువ వీ తనువులు మాకుఁ 2440
దనువులు నిలువని దశకన్న మున్నె
విను ధృతుల్ సెడి మమ్ము విడుచు ప్రాణములు
ప్రాణముల్ వోయిన పదపడి వచ్చి
తా నేమి సేయు? నిందలకు లోనౌను
కాన వేగమ యేగి కమలాక్షుఁ గాంచి
మా నెగుల్ దెల్పి ధర్మపథమ్ము నేర్పి
తగులమ్మితోనుండు తరుణుల విడువఁ
దగదని యతనికిఁ దగఁ జెప్పుమయ్య

అతఁడిందు రాఁ గాంచి హర్షించుభాగ్య
మతని సుధోక్తుల నాలించు భాగ్య

మతని యాశ్లేష సౌఖ్యమునొందు భాగ్య
మతని మర్మముఁ దూఱనాడెడి భాగ్య
మెట్టు లయ్యది లభియించును మాకు?
కట్టిఁడి విధి యెంత కఠినాత్ముఁ డయ్యె"
అని చిట్ట చివర కా యబలలు నిన్ను
మనముల నిల్పి నమస్కారములను
గావించుచును గృష్ణ, కరుణాస్వరూప!
మా విభుఁడవు నీవు మము మఱవకుము
రమ్ము, గోకులము సంరక్షించి మాకు
నిమ్ము నిన్గూడు నహీనమంగళము 2450
అని శాంతి వహియించి, యవల నుద్ధవుని
మునుకొన్న సద్భక్తిఁ బూజించి రెలమి

అంతట నుద్ధవుఁ డటనుండి కదలి
సంతోషపూర్ణ సుస్వాంతుఁడై మధుర
కేతెంచి భక్తి నీ కెఱిఁగి వ్రేపల్లె
వ్రేత పూఁబోడుల, వ్రేల క్షేమములు
వారి భావములు సర్వము నెఱిఁగించె
శౌరి! నీ మది సంతసము వహియించె

సకల చరాచర జంతుసంరక్ష,
అకలంకచరిత, పీతాంబరధారి!
ఆ యశోదానందు లతిపుణ్య చరితు
లే యుత్తమవ్రతా లెటుచేసి రొక్కొ
నీ పితరులను నెన్నిక శాశ్వతముగ
నీ పుడమిని బొందుటేగాదు నీదు
మదిలోన నిల్చిరి మాధవా, నీవు
కుదురుకొంటివి వారి గురుమానసముల

ఉద్ధవుఁ డెంత మహోత్కృష్టగుణియొ
యిద్ధరలోన తా నెట్టి సుకృతియొ
నీ పంపు వార్త లన్నింటి వ్రేతలకు
తాప మాఱంగ శ్రద్ధగ వినిపించె 2460
నీవుగాఁ దానె యా నెలఁతలతోడ
సావధానముగ మహాప్రీతి సలిపె
ఆ మహాభాగ్యమ్ము హర్ష మేరేని
భూమండలమ్మునఁ బొందిరో లేదొ
ఆతఁడు నినుఁబోలు నందగాఁ డనుచు
వ్రేతలు దలఁచిరి విభ్రాంత లగుచు
నదియ నీతోడి స్నేహమ్ము భాగ్యమ్ము
గద, నందనందన! కంజాతనయన!
ఆ కామినులు వ్రేత లతిశుద్ధమతులు
నీ కటాక్షమ్ముఁ బొందిన భాగ్యవతులు
నీ వెందు నున్నను నీ యంతరంగ
మా వనజాక్షులయందె లగ్నమ్ము
నీ తోడియెడబాటు నిముసమ్ముగూడ
వ్రేత లోరువ రఁట వింతగా దద్ది
వారి వియోగ మోర్వక గాదె నీవు
వారికి నీ వచ్చువార్త లంపితివి
వారు నీపైఁజూపు వరభక్తి యురవొ
వారిపై నీ చూపు వాత్సల్య మురవొ
నీవు వ్రేత లెఱుంగ నేర్తురేగాని
నా వంటిమూఢ మానవుల కేర్పడునె? 2470
దాసదైవమ్ముల ధర్మ మీలాగు
వాసిమై గుప్తమై భవ్యమై యుండు

గోవర్ధనోద్ధార, గోపాలబాల,
గోవింద, మాధవ, కుంజరపాల!
నందగోపకుని చందమ్మున పుణ్య
మెందు నేఁ జేసిన యెఱుకయే లేదు
ఉద్ధవుఁబోలెడు నుత్తమభావ
శుద్ధి నా నడవడి శూన్యమ్ము సుమ్ము
రక్తి శ్వేతలుచూపు ప్రవిమల మధుర
భక్తిమార్గమునైనఁ బట్టని శఠుఁడ
బంధుల మిత్రులఁ బాయని ప్రణయ
బంధురు లగునట్టి వధువులఁ బోలె
నిన్నుపాసనచేసి నీ దయఁ గనెడు
తెన్నిట్టిదని సుంత తెలియనివాఁడ
ననుఁ గడఁద్రోయక నా ప్రార్థనమ్ము
విని, పాపరహితుఁ బవిత్రుఁగాఁ జేసి
నీ భక్తతతిలోన నెలవు గల్పించి
నా భక్తి సంప్రార్థనమ్ము మన్నించి
కాపాడుమా నన్ను కౌస్తుభాభరణ,
నీ పాదములె దిక్కు నీరజనయన! 2480
శ్రీమనస్సంచార, సింధుగంభీర,
కామితఫలదాయకా, మేరుధీర,
పుండరీకాక్ష, త్రిభువనసంరక్ష,
అండజవాహ, సర్వామరపక్ష!
మాటచెప్పినరీతి మఱవక, భక్త
కోటి యభీష్టముల్ గూర్తువు బంధు
జనుల యోగక్షేమ సౌఖ్యముల్ దెలియఁ
బనుపుదు హితులను, బాయని మమత

గురుజనంబుల మేలుఁగోరి తజ్జనుల
యరయమిఁ దెలిపింతు వత్యాదరమున
దేవకీసుత, భవద్దివ్య భావములు
పావనములు జగద్భద్రంకరములు

శ్రీకృష్ణుఁడు కుబ్జ గృహంబునకుఁ జనుట

నిను మున్ను తా నున్న నిలయమ్ముఁ జేర
"ననుకంపఁ బూని ర"మ్మని కుబ్జ పిల్వ
"కానిమ్ము వత్తు నా కార్యముల్ కొన్ని
పూని కావించి, నీ ముచ్చట దీర్తు"
నని వరమిచ్చితి, వా పల్కు నిల్ప
మనము పొంగఁగ నామె మందిరమునకుఁ
జని యా నెలంత వాంఛలు దీర్చి తీవు
మునిజనవందిత, ముక్తిప్రదాత! 2490

శ్రీకృష్ణుఁ డక్రూరుని హస్తిపురికిఁ బంపుట

ఆవల నొక్కనాఁ డక్రూరుకడకు
నీవ యేతెంచి యా నిర్మలాత్మకుఁడు
గావించునట్టి సత్కారమ్ములంది
భావ ముప్పొంగ నా భక్తుఁడు సేయు
స్తుతులను వినుచు నిస్తులరక్తి నతని
కతి శుద్ధమతికి నిట్లంటివి కృష్ణ!

"ఓయి, యక్రూర, మహోత్కృష్టచరిత!
నీ యమల గుణముల్ నిత్యపూజ్యములు
హితముఁగూరుచు బంధువేగాక, నాకు
పితవు వావిని నీవు ప్రియము గూరుతువు

మదభీష్టములు నీవ మన్నించి తీర్పఁ
జదురుగలాఁడవు సత్యసంధుఁడవు
వినుమయ్య. పాండుభూవిభుఁడు స్వర్గమ్ము
జనినపిమ్మటఁ గుంతి సాధ్వి మాయత్త.
పాండవులును హస్తిపట్టణమందు
నుండు టీవు నెఱింగియుందువు: కాని.
ధృతరాష్ట్రభూపుఁ డెంతే పుత్రమోహ
మతిఁ బాండవుల నీతిమాలి తాఁ గన్న
సుతులతోఁ సమముగఁ జూడ కెల్లప్పు
డతిపక్షపాతయు క్తాత్ముఁ డైనాఁడు 2500
కురుపాండవులు నాకుఁ గూర్చుచుట్టమ్ము
లరయంగ వారల కన్యోన్యమైత్రిఁ
గలిగించుటయు నాకు కరము ధర్మమ్ము
తెలిపితి నా కోర్కి దీర్పు మిద్దానిఁ
గావున హస్తినగరమున కిప్పు
డీ వేగి కుంతికి నెఱఁగి యోదార్చి
పాండవేయుల స్థితిఁ బరికించి, కొల్వు
మండపమ్మున బుద్ధిమంతులు వినఁగ
ధృతరాష్ట్రునకు ధర్మ మెట్టిదో తెలిపి
కృతకృత్యుఁ డవయి రమ్మిట కార్యవర్య"

అని యానతిచ్చితి వక్రూరుఁ డంతఁ
దనుఁ దాను ధన్యుఁగా దలఁచి నీయాజ్ఞఁ
దలఁదాల్చి హస్తిపత్తనమున కేగి
జలజాక్ష! నీ యాన చందాన నచట
పనులు దీరిచికొని పదపడివచ్చి
నినుఁగని నీకు ననిఁయుఁ దెలెఁ. గుంతి

వంతయు ధృతరాష్ట్ర భావమర్మమ్ము
వింత వింత యనుచు వినుమంచు నీదు
చిత్త మ్మెఱుంగఁగా శ్రితజనోద్ధార.
మత్తారి భీకర. మౌనిమందార! 2510

వర మొసంగినమాట వమ్ము గాకుండఁ
గరుణించి కుబ్జనికాయ్యముఁజేరి
ఆమెవాంఛలు దీర్చి యలరించి తీవు
నీ మాటనిలుకడ నిలుపుకొన్నావు
నీ కరుణకుఁ దాను నిలయమై యుంట
నా కుబ్జజన్మ మహాసార్థకమ్ము —
నీవె పాండవులుఁ గుంతియు హస్తిపురిని
నే విధినున్నారొ. యెఱిఁగితి వాప్త
ననిపి. వారలభాగ్య మసదె! నీ బంధు
జనప్రియత్వమ్మది స్వల్పమే? దేవ!
మతి పొరపడి ధర్మమార్గమ్ము విడిన
ధృతరాష్ట్రునకు ధర్మహితబోధసేయఁ
బనిపితి దూత. నా వసుమతీశ్వరుఁడు
మును తా నొనర్చిన పుణ్యమ్ము ఘనము
భవదీయ గురుజన భక్తి లోకులకు
సవతుమీఱిన నిదర్శనము సర్వేశ!

పరమపూరుష. కుబ్జవలె సుగంధమ్ము
గురుభక్తి వెలయ నీకుం గూర్పఁజాల
కుంతి. పాండుకుమారకులఁబోలె నీదు
స్వాంతమ్ము మెచ్చిన బంధుండఁగాను 2520
ధృతరాష్ట్రువలె వయోవృద్ధుండఁ గాను
సతతము పాపముల్ సల్పినవాఁడ

నను దయ వీక్షించి నా పాపములను
పొనుపడఁజేసి సద్బుద్ధిని గఱపి
యనవరతమ్ము భక్తావళిఁ గూడి
నినుఁ గొలిచెడి భక్తునిగ దిద్ది నీదు
పాదసన్నిధిఁ జేర్చి పాలింపు మయ్య
శ్రీదయితా, శ్రీహరీ, వాసుదేవ,

శ్రీపద్మనాభ, హరీ, వాసుదేవ,
పాపవిదూర, శుభంకరాకార,
వనమాలి! కొంద ఱీ వసుమతిఁ దమకె
యనుపమ సత్త్వశౌర్యాదు లున్నట్లు
భావించి గర్వించి పరమేశ, నిన్ను
కేవలమనుజునిక్రింద లెక్కించి
నిను వైరిగా నెంచి ని న్నెదిరించి
ఘనపరితాపమ్ముఁ గడకుఁ బొందెదరు
ఎదిరినశత్రుల నీవు చంపకయె
చదివింతు వారులచే సాక్షిగా నుండి
భక్తు లెందున్న నా పట్టున కేగి
భుక్తిముక్తులు వారు పొందఁ గూరుతువు
ఇవి నీదు మాహాత్మ్య మెఱుఁగంగఁ జేయు
నవితథ సాక్ష్యమ్ములగు భక్తవరద! 2530

జరాసంధుఁడు మథురపై దండెత్తివచ్చి కృష్ణునితోఁ బోరుట

అనయుఁడౌ కంసు నిల్లాండ్ర స్తిప్రాప్తి,
యనువారు దుర్భరమైన వైధవ్య
పీడఁ గుందుచుఁ దమపిత జరాసంధుఁ
జూడఁ, జెప్పంగ, నెంచుచుఁ బోయి యతని

చెంత నిలిచి తమస్థితి నెఱిగించి
యింతకు హేతు వా కృష్ణుఁడే యనుచుఁ
దమభర్త మరణవార్తను వివరముగ
సమధిక దుఃఖిత స్వాంతలై దెలుప
విని జరాసంధుండు విక్రమోద్ధతుఁడు
తన కొమారితల బాధలఁ జూచి మిగుల
మనమున శోకాగ్ని మండుచునుండ
కనులెఱ్ఱవడి యగ్నికణములు రాల్ప
కోపించి కంసుని గూల్చెనే కృష్ణుఁ
డాపాలసునితోడ యాదవాన్వయము
నాదు కోపాగ్ని కింధనముగఁ జేసి
మేదిని నా శక్తి మెఱయింతు ననుచుఁ
గడు నహమ్మతిని సంగ్రామోత్సుకత్వ
మడర నిర్వదియుమూఁడగు సంఖ్య నొప్పు
నక్షౌహిణీసేన నాయత్తపఱచి
యా క్షణమునఁ దన కనుగతములుగ 2540
రాఁగొని చని మథురానగరమ్ము
వేగమ ముట్టడివేసె నతండు

ఆ గతి మథుర సైన్యావృత మగుట
మాగధుగర్వ సంభ్రమము పెల్లగుట
నరిలోకమర్దన, యచ్యుతా! నీవు
పరికించి, చూచి, "యీ పరమ దుష్టాత్ము
నెడను దండోపాయ మెంతయుఁ దగును
విడువరా దిట్టి గర్వితుల నెన్నటికిఁ
బుడమి నా యవతారమునకుఁ గారణము
దుడుకు వర్తనులను ద్రుంగింపఁ గాదె"

అని మనమ్మున నెంచు నా సమయమున
ఘనమార్గమున నుండి కాంతి శోభితము
నలఘు తురంగ సూతాధియుతమ్ముఁ
దులమించు నాయుధస్తోమ సంయుతము
నగు రథద్వయము నీ కాహ్లాద మెసఁగ
నగధర! నీదు ముందట దిగి నిలువ

ఆ యరదము జంట నట్టె వీక్షించి
మీ యన్న రాము నమిత్రవిరాముఁ
గని యంటి "నీ శతాంగములపై నెక్కి
యని జరాసంధుని నతని సైన్యమ్ము 2550
బరిమార్చి భూదేవి భారమ్ము మాన్పి
మరయంగ నీదు దివ్యావతారమ్ము
కృతకృత్య మగును వేగిరమ లెమ్మింక
హత మొనరింతు వా యరినికరమ్ము"
అనుడు న మ్మాటల కలరి యతండు
మునుకొనె సంగరమునకుఁ దత్క్షణమ

అంత నన్నయును నీ వతిసంభ్రమమున
స్వాంతముల్ వొంగఁగాఁ జతురంగబలము
సమకూర్చుకొని కవచములు ధరించి
సమరాయుధములతో స్యందనమ్ములను
వేరువేరుగ నెక్కి వేగంబ కదలి
చేరుకొంటిరి రణసీమ కాక్షణమ.

యదువంశవీర! మహాత్మ! శ్రీకృష్ణ!
కదనమొనర్చునుత్కంఠతో మధుర
భవదీయ ఘన విజృంభణము. నాత్మీయ
వివిధబలమ్ముల విభ్రాంతిఁ గాంచి

సరసమూఁగిన జరాసంధుని, నతని
పరివారమును నొక్కపరిఁ జూచినీవు
ప్రతిపక్షభీకర! పాంచజన్యమ్ము
నతి గాఢముగ నొత్తి తా ఘోరశబ్ద
మరి సైన్యకర్ణమ్ములందునఁ దూఱి
కరము వారలకు దిగ్భ్రమము గావించె 2560

మన మసూయాకోపమాత్సర్యములను
బెనుపంగ, నీతోడఁ బెనకువ తీరుఁ
బలుకుచుఁ బరిహాసభాషల నిన్నుఁ
జులుకనసేయుచుఁ జూడంగ నీవు
బాలుఁడ వనిసేయు పాటవ మెట్లుఁ
జాలనివాఁడ వీ సంరంభ మేల?
నీతోడఁ గదనమ్ము నేఁ జేసితేని
నాతోడివారలు నవ్వకుందురె!
కాన, మీయన్నను గలనికిఁ బంపు
మీ నాఁడు మిము మిత్తి కెరగ నొనర్తు"
ననుచు దురుక్తు లహమ్మతిఁ బల్క
ననయు జరాసంధు నంటివి కృష్ణ!

"ఏల యీ వ్యర్థోక్తు లెందేని శూరు
లీ లీలఁ దమ్ముఁ దా మిటు వేదురెత్తి
పొగడుకొందురె: నిజమ్ముగ తమయందు
మగతన మున్నచో మాగధ, యుద్ధ
వేళఁ జూపుదురు, నీ వెట్టివర్తనము
చాలింపు మిఁక నిది సంగరభూమి 2570
మగతనముండెడి మగవాఁడ వేనిఁ
దెగి నీదు శూరతఁ దెలుపు మివ్వేళ"

అనుడు నమ్మాటల నాలించి రేఁగి
తనబలమ్మునకుఁ బ్రోత్సాహమ్ముఁ గూర్చి
మీ సైనికులను గ్రమ్మెను జరాసంధుఁ
డా సమరమ్ము మహాభీకరమ్ము
ఇరుపక్షములును జయేచ్ఛమై నొరుల
నొరు లెదుర్కొని కడు నుద్ధతితోడఁ
బెనఁగఁ బెనంగ నా విద్విషద్బలము
ఘనమైన నీ సైన్యగణమున కోడె
సంకర్షణుఁడు జరాసంధు బంధించి
సంకటపఱచి లజ్జాహీనుఁ జేసి
యసువులు వోయెడునట్లు మోదంగ
వెసరేఁగఁ గాఁగల విధము నీ కెఱుక
యగుట నా బలరాము యత్నమ్ము మాన్పి
నగుచు మగధదేశనాయకుఁ గాంచి

## జరాసంధుఁడు పరాజితుఁ డగుట

ఓయి. జరాసంధ యుల్లమ్ములోన
నీ యపజయము నీయెడ గణింపకుము
వగవక పొమ్ము. నీ పట్టుసాధింప
మగటిమి గలిగిన మంచిబలమ్ము 2580
తో రమ్ము: నీ మనోదుఃఖమ్ము తొలఁగ
వీరారిబృందమ్ము విదళించి పొమ్ము
కాదేని వెఱవక కదనరంగమున
నీదు శౌర్యమ్మును నిర్జరుల్ ప్రజలు
పరికించి. కని. మెచ్చఁ బ్రకటించి తుదకు
మరణింపు మిది నీకు మంచిమార్గమ్ము"

అని నీవు కరుణింప నాతఁడు మరలి
చనె మిగిలిన తన సైన్యమ్ముతోడ
మీ విజయముఁ గాంచి మిన్నున నుండి
దేవతల్ హర్షించి దివ్యసుమమ్ము
లవనిపై గురియించి, రాడి రచ్చరలు
ప్రవిమలానందమ్ముఁ బడసిరి ప్రజలు.

అటులు పరాజితుఁడయి జరాసంధుఁ
డటనుండి తనపురి కరిగి యామీఁద
పరమపూరుష, పరాత్పర, పరంధామ,
కరుణానికేతన, కల్యాణనామ!
మరియు నీ పయిఁ బగ మానక దుష్ట
ధరణీపతులను గొందఱఁ జేరిచికొని 2590
పదునేఁడుమారులు పదునేఁడుసంఖ్య
గుదురు నక్షౌహిణీ గురుబలమ్ములను
గూరిచికొని యదుకులము నంతయును
దోరింపఁ దలఁచి యుత్సుకతతో మథుర
పయి విడిసియు నొక్కపరి యేని తాను
జయమునొందక పరాజయ ముంది పోయెఁ,
గాని, యష్టాదశకలహ మొనర్చు
పూనిక మరలఁ దెంపున వచ్చుచుండె

**కాలయవనుఁడు మథురను ముట్టడించుట**

గరుడకేతన, శత్రుగర్వాపహరణ,
గిరిధర, సద్భక్త కిల్బిషహరణ!
అంతలోనన త్రిదశార్చితచరిత,
దంతివరద, భవత్సంకల్ప మనుచుఁ

దల<చెద: నిర్జరతపసి నారదుఁడు
ఖలు కాలయవను దగ్గఱ కేగుదెంచి
"యవన! నీ బాహుబలాతిరేకమున
భువిఁ బెక్కు నృపతులఁ బోర గెల్చితివి
కాని యాదవుల సంగ్రామభీకరుల
మానితి గెల్వక: మరి వారిమాట
మఱచితివో భయంపడితివో! ధైర్య
మఱగొఱయయ్యెనో! యవివేకి వైతొ! 2600
అ య్యాదవులలోన నమితబలాఢ్యుఁ
డెయ్యెడ నపజయ మెఱుఁగనివాఁడు
కలఁ డొక్కరుఁడు సాటిగానని వీరుఁ
డల జరాసంధముఖావనీపతుల
ననిఁ దరిమిన శూరుఁ డాతనిఁగూర్చి
వినవె యెన్నం డెంత వెఱ్ఱివి నీవు"
అని చెప్ప విని కాలయవనుఁ "డెట్లెట్లు?
మునివర! నీ వన్న పురుషుఁ డెట్లుండు?
నెచ్చట విహరించు? నెవరికి హితుఁడు
హెచ్చు బలాఢ్యుండె! యేపాటి నేర్పు
కదనానఁ జూపు? నా ఘనభుజశక్తి
కెదిరి నిల్వఁగలండె? యెఱిగింపు మయ్య"
అనఁ గలహాశనయతి నారదుండు
వినుమని యాతఁడు విన నిట్టు లనియె.

"వినుమోయి యవన! నీ వినఁ గోరినట్టి
ఘనుఁగూర్చి వినుతు నక్కజమగు, నతఁడు
అసిత నవాబ్ద దేహచ్ఛాయవాఁడు
నసిమించు తోయజేక్షణములవాఁడు

నిండుచందురుఁబోలు నెమ్మోమువాఁడు
గండుమీఱిన భుజస్కంధాలవాఁడు 2610
శ్రీవత్సవక్షమ్ముచే నొప్పువాఁడు
వావిరి కౌస్తుభపదకమ్ము వాఁడు
స్వర్ణాంబరమ్ముచే వరలెడువాఁడు
కర్ణకుండలకనత్ గల్లమువాఁడు
ఆతఁ డింతంతని యనరాని వాఁడు
జ్యోతియై యెందును జూపట్టువాఁడు
ఎట్టివేళల నెందు నెసఁగెడివాఁడు
పట్ట నెవ్వరికి లోఁబడకుండువాఁడు "
అనుచు నీ రీతిఁ జయ్యన నారదుండు
నినుఁ గూర్చి వినుపించి నీ మహిమలను
వివరింప నన్నియు విని యవనుండు
లవమాత్ర మేనియు లక్ష్యమ్ము గొనక
" యాదవుఁ డెంతసాహసియైనఁ గాని,
నాదు నిశాత బాణ పరంపరలకు
గుఱిచేసి వానిని గూలుతు. భువిని
మెఱయింతు నా కీర్తి మేలుమే లనఁగ
కనుఁగొనుచుందువుగద. మౌనిచంద్ర.
పనివినియెద "నని పలికి యతండు "
వాఁడిమిగలయట్టి వారి మ్లేచ్ఛులను
మూఁడుకోటులు తన మొనగాఁగఁ జేర్చి 2620
చతురంగబల శౌర్యసంపదతోడ
నతిరయంబున వచ్చి యబ్జదళాక్ష!
మథురపై విడిసె నమ్మదదూషితుండు
క్రుధ నీ పయిం బెంచి క్రూరాత్మకుండు

ఆ విడిసినదండు నంతయుఁ జూచి
శ్రీవల్లభా! జగత్క్షేమ సంకల్ప!
కాలదేశములు జగద్వర్తనములు
నీ లీలలేగదా, నిగమవిహార!
కాన భవిష్యత్తు గమనించి, చూచి
పూనితి వొక మార్గమునఁ బ్రవర్తింప.

## ద్వారకానగర నిర్మాణము

భవదగ్రజుండగు బలునితో " అన్న!
యవనుఁడు మనపురి నంతయుఁ గ్రమ్మె:
కంటివే! మరియు మాగధుఁడు క్రూరుండు
బంటుతనమ్మున బలగమ్ముతోడ
నేఁడొ, యెల్లియొ వచ్చి, నిక్కుచు మథుర
పోఁడిమి చెడఁ జుట్టుముాఁగ నున్నాఁడు
యవనమాగధులు మహావీరవరులు
భువిఁ బేరుగన్నట్టి భుజబలోద్ధతులు
పురి రెండుకడల నా పోటుమగళ్లు
దురముసేయుఁగఁ గడు దుస్తర మగును 2630
మనకు వారి జయింప: మనవారి వార
లనయులై చెఱనుంత్రు, హత మొనరింత్రు
కావున శత్రువుల్ గవియుఁ, బోరాడ
నే విధమగు వల నించుకయేని
లేనట్టి విషమస్థలిని దుర్గమొండు
పూని నిర్మించి, ప్రాపుగ మనవారి
నందఱ నందుంచు టది మేలు నిచ్చ
నిం దీఁక నుంచుట యిది కీడుదెచ్చుఁ

గద'' యని మదికి నెక్కంగ నాతనికి
విదితమ్ము చేసి. యో విశ్వప్రకాశ.
సర్వలోకశరణ్య. సర్వేశ. శ్రీశ.
శర్వధాత్రాది నిర్జర సేవ్యపాద.
జలజలోచన! నీవు సాగరు నడిగి
జలధి మధ్యమున విశాలమౌ ఒక్క
పురమును సుందరముగ వెలయింప
సురశిల్పి నియమించి. చొప్పడునట్లు
ద్వారకయను నాఖ్య తత్పురమ్మునకుఁ
బేరిమిఁ బెట్టి య వ్వీటికి నీదు
యోగప్రభావమహోన్నతశక్తి
నాగారివాహ! కృష్ణా! శౌరి! మధురఁ 2640
గల ప్రజాసమితి నాక్షణమునఁ జేర్చి
హలికి సర్వముఁ దెల్పి యతని సమ్మతిని
వడసి య మ్మధుర వెల్వడి యీవు మిగుల
వడి నిరాయుధుఁడవై వచ్చుచునుండ—

## కాలయవనుని మోసగించి శ్రీకృష్ణుఁడు ఒకానొక కొండగుహకుఁ గొంపోవుట

నినుఁ గని యవనుఁ డెంతే నమ్రబుద్ధి
తనవారితోఁగూడి తర్కించె నిట్లు.
"చతురంగబలముల జాడ చూపట్టి
దతనినిజూడ నిరాయుధుఁ డయ్యె.
నయ్యు న పురివీడి యతిధైర్యమొప్ప
నియ్యెడకే నాకు నెదురు వచ్చెడిని.
యెన్ని దినములయ్యె నే ముట్టడించి
యిన్నాళ్ల కొక్కఁడే యేతేరఁడిటకు

నను గెల్వ వచ్చుచున్నాఁ డంట కితఁడు
తన హస్తముల నాయుధములు దాల్పుండు
నాతోడఁ బ్రియభాషణములాడి నాదు
చేతమ్ము మెప్పించి చెలిమిచేయుటకొ
మరి యేలొకో యిట్లు మన కెదు రగుట?
సరిసరి రానిండు చక్కఁబెట్టుదము''
అనుచు నుద్రిక్తుఁడై యా యవనుండు
నినుఁ జూపుచుండె సన్నిహితులకెల్ల. 2650

అంతటిలోన నీ వతనికి నెదురఁ
గొంత దగ్గర గాఁగఁ గుంభీంద్ర గమన
మొప్పార వచ్చుచునుండ ని గ్గాంచి
చప్పున నారదసంయమీంద్రుండు
తనకు ని[illegible] గుర్తింపఁ దగిన గుర్తులను
మును దెల్పెనుగద యా పోలిక లెల్ల
నీలోన నుండుట నిను గుఱుతించి
చాల సంతోషించి చయ్యన నిన్నుఁ
బట్టఁదలంచి నీపైఁ బడవచ్చు
నట్టి యా యవనున కందరానట్లు
త్వరితగతిని నీవు పటుశక్తి మెఱయఁ
బరువెత్తితివి శత్రువారసంహార!

అఖిలలోకములకు నభయ మిచ్చెదవు
నిఖిలమ్ము గుర్తించి నీవె రక్షింతు
వసహాయశూరుఁడ వాద్యుఁడ వీవు
వసుదేవతనయ, గోపాల, గోవింద!
ఆ నీచవర్తను యవను, సామాన్య
మానవుఁ గని, భయంపడినట్టు లట్లు

పరుగులెత్తితి వది పరికించిచూడ
సరసీరుహాక్ష! యీ జగతిని నీవు 2660
నడిపింప నాడించునాటకమందుఁ
గడుముఖ్యముగఁ జూపఁగా దగునొక్క
యవసరమగు ఘట్ట మగుఁగాని, నీకు,
భువనత్రయీవంద్య, పొడమునే భయము ?
భవదీయసంకల్ప ఫలితముల్ పిదప
భువి దివి ఖ్యాతముల్ పురుషవరేణ్య!

పరువెత్తు నీ వెంటఁబడి యవనుండు
పరువిడుచును బట్ట వలనుగాకుంటఁ
దనశక్తి నీ శక్తిఁ దాఁ బోల్చికొనక
నినుఁ బిల్చి యిట్లను నీరజనాభ,
"యదువంశవర. పోకుమయ్య యీలాగు
కదనమ్ము నాతోడఁ గావింప నీవ
తగుదయ్య: కంసాది ధారుణీపతుల
దెగి జయించితి వని తెలిసి నీతోడ
దురమొనరించు సంతోషచిత్తమున
నరుదెంచినానయ్య! అక్కటా! యిట్టు
లరికి వెన్నిచ్చి యే యవనీశుఁడైన
నరుగునె నీ కపఖ్యాతి సుమ్మిద్ది
తప్పించుకొనలేవు తప్పక పట్టి
యిప్పుడే బంధింతు నెచటి కేగినను" 2670
అని పెక్కుగర్వోక్తు లాతఁడు నీదు
వెనుబడివచ్చుచు విఱ్ఱవీఁగుచును
నిను నొక పిఱికిగా నెమ్మది నెంచి
విన నసహ్యమ్ములు వినుచుచు రాఁగ

పరుసమ్ములాడు నా పాపిపల్కులను
సరకుసేయక ముఖ సరసిజమునకుఁ
జిఱునవ్వు కొంగ్రొత్త చెలువమ్ముఁ గూర్చ
గుఱి వానిఁ బొలియించుకోర్కె పై నుంచి
సరసోక్తి నీవు నీ శత్రునితోడ
"బిరబిర రమ్ము నావెంట నిట్లేల
వేగిరపడెదవు. వినుము నీ కోర్కి
సాగింతు నా పూన్కి సవరింతు" ననుచుఁ
జిక్కిన యటులుండి చిక్కక యొక్క
చక్కికి దాఁటుచుఁ జాచినచేతి
కందిన యటులుండి యందక కొంత
ముందు కేగుచుఁ, దన ముంగలనుండి
యంతలోనన మాయమయి వెన్నుప్రక్క
వింతగా నున్నటుల్ విభ్రాంతిఁ గూర్చి.
యంతికమ్మున నున్నయటులు గన్పించి
సుంత సేపటికి కన్గూపుదూరమునఁ 2680
గనఁబడు చీ రీతిఁ గడు విచిత్రముగఁ
గనని విననియట్టి గతుల నా యవను
నాడించుచును జాల నాశగల్పించి
వీడక యటులు నీ వెంట దూరముగఁ
గొనిపోయి యొక శైలగుహఁ జొచ్చితీవు
వెనుకాడ కతఁడు నీ వెనువెంటఁ జొచ్చె

## కాలయవనుఁడు ముచుకుందునిచేఁ జచ్చుట

ఆలాగు నీవెంట నక్కొండబిలముఁ
జాల ధైర్యమున నీ శత్రువు చొచ్చి

ధ్వాంతమయంబైన తద్గహ్వరమ్ము
నంతరాళమ్మున నతిపృథుశయ్య
గుఱకలువెట్టుచుఁ గూరుకుచున్న
నరు నొక్కరుని గాంచి నందకుమార!
నినుఁగాఁగ భావించి " నీచమానవుఁడ!
అని సేయలేక యి య్యడవి మార్గమునఁ
బరుగిడివచ్చి యి ప్పర్వతబిలము
చొరఁబడి నేఁ జూచుచుండ నీ సెజ్జ
యందు నిద్రించెడునట్లు నటింతె?
పంద. నే నిఁక నిన్ను వదల. మన్నింప
నెక్కడ నెవ్వారికేఁగాని నీవు
చిక్క వటంచును జెప్పె నారదుఁడు 2690
చిక్కితి విఁక నెందుఁ జేర నేగెదవు?
నిక్కము శాశ్వతనిద్ర పొ మ్మింక."
అనుచు యవను డట్టహాస మ్మొనర్చి
ఘనకులిశాయుధ కఠినమైనట్టి
తన పాదమున వాని తనువును దన్నె
ధ్వని బిలమ్మున ప్రతిధ్వను లీనునట్లు—
ఆ తాపునకు లేచి య పూరుషుండు
చేతులు విదిచి విజృంభించి నీల్గి
కనులు మెల్లన విచ్చి. కనలి నల్దిశలు
కనుఁగొని తనకు ముంగలనున్న యవను
నిజనయనాగ్నిచే నీఱు గావించి
గజిబిజిమాని యొక్కం డటనుండె

## ముచుకుందునివృత్తాంతము

అంతటఁ గృష్ణ. నీ వా శూరు నెదుట
ధ్వాంతపూర్ణమ్మగు తద్గహ్వరమును

భవదీయ తనుకాంతి భాసిల్లఁ జేసి
భువనమోహన భవన్మూర్తి విస్ఫూర్తిఁ
బ్రత్యక్షమైతి. వ్రబ్రమునొంది యతఁడు
నిత్యశోభితమగు నీ రూపుఁ జూచి
నిరుపమానంద వార్నిధి మున్గితేలి
పరమాత్మ! యీ రీతిఁ బలికె నీతోడ 2700
"అయ్య వందనము. మహాత్మ! నీ వెవఁడ?
వియ్యెడ కేతెంచి తేమికారణమొ?
మానవుండవుగా వమర్త్యుండ వౌదు
వే నెఱుంగఁగఁ దెల్పవే వేలుపేని
కాకున్నచో నన్నుఁ గావంగ నెంచి
యీకడ కీ రీతి నేతెంచినట్టి
హరివొ. హరుండవొ. యబ్జాసనుఁడవొ
పరమాదరమునఁ దెల్పవె నిక్క మెదియొ?
ఇది కంటకాటవి. యెట్లోర్చె నీదు
మృదుచరణమ్ము లిమ్మెయి నడువంగ
నీ సేవ నాకు పెన్నిధిగాఁ దలంతు
నా సంపద నొసంగు మయ్య మహాత్మ!
నీ జన్మవంశముల్ నీ నివాసమ్ము
లే జాడలో వాని నే నెఱుఁగంగఁ
దగుదున యేని యేతద్విధ మెల్లఁ
దగ నెఱిగింపు సంతసము నా కగును

## ముచుకుందుఁడు తనవృత్తాంతము శ్రీకృష్ణునకుం దెల్పుట

జననమ్ము నాకు నిక్ష్వాకు వంశమున
ఘనుఁడగు మాంధాత గన్నపుత్రుండ

ముచుకుందుఁడను వాఁడ. మును వేల్పుగమికి
ప్రచురరాక్షసబాధః బాయంగఁ జేసి 2710
వారిచే సుఖనిద్ర వరముగాఁ బడసి
యీ రహస్యస్థలి నే నేకతంబ
నిదురించుచుండ దుర్నీతిపరుండు
మదము మీరినయట్టి మానవుఁ డొక్కఁ
డేతెంచి. దుష్కర్మ మెసరేఁగి చేసి
యాతఁడే నీఱయ్యె నాత్మదోషమున
నంతట నీ దర్శనాప్తిని నాదు
స్వాంతమ్ము సంతోష సంపూర్ణ మయ్యె
ననుఁ గృపాదృష్టి మన్ననసేయు" మనుచు
నిను వేఁడు నతనితో నీ విటు లంటి.

## శ్రీకృష్ణుఁడు తన్ను ముచుకుందున కెఱిఁగించుట

భూనాథ ముచుకుంద! పుడమిరేణువుల
నే నేరుపరియైన నెన్నునో యేమొ
కాని. నా గుణజన్మకర్మనామముల
నే నేరుపరి గాని యెన్నంగ లేఁడు
వానిని గూరిచి వర్ణించి చెప్ప
నే నైనఁ జాలను నిక్కమ్ము నమ్ము
ధరణికి భారమౌ ధర్మదూరులను
బరిమార్చి శిష్టులఁ బరిరక్షసేయ
మును బ్రహ్మ ప్రార్థింప మునుకొని యేన
యనఘుఁడౌ వసుదేవు నాత్మసంభవుగ 2720
వాసుదేవాఖ్య సంభవ మయి కంసు
గాసిపఱచి చంపి ఖలుల నెల్లరను

జదువుచున్నాఁడ. నీ శాతమౌ దృష్టి
సదమదమైన యసత్పురుషుండు
కాలయవనుఁడను ఖలుఁడు రాజేంద్ర!
కూలె నీచేత లోకులు మోదమంద
వినుమయ్య యొకమాట విమతవిధ్వంస!
మును భక్తి నను నీవు పూజించినట్టి
కారణమ్మునఁ నిన్నుఁ గరుణింపఁ దలఁచి
యీ రహస్యస్థలి కేతెంచినాఁడ
భవదభీష్టమ్ములౌ వరములు గోరు
మవనీశ. యొసఁగెద నానంద మెసఁగ
నను నమ్ము భక్తు లెన్నం డెందుఁగాని
వనట నొందరు నా కృపావిశేషమున"
అను నీదు పల్కుల నాలించి యతఁడు
నినుఁ గృష్ణు వైకుంఠనిలయుఁడం చెఱిఁగి
కరము భక్తిని నమస్కారముల్ చేసి
పరమపూరుష! నిన్నుఁ బ్రార్థించె నిట్లు.

## ముచుకుందుఁడు శ్రీకృష్ణుని ప్రార్థించుట

శ్రీకాంత! నీ మాయ స్త్రీలుఁ బురుషులు
లోకాన ధనభోగలుబ్ధులై, కామ 2730
ముఖ శత్రుషట్కమ్ముఁ బోఁద్రోయలేక
యఖిలమ్ము తమ వశ మగునట్లు చూతు.
రంతియే గాని, నారాయణ! నిన్ను
స్వాంతమ్మునం దుంచి ప్రార్థింపఁబోరు
మానవజన్మయే మహి నుత్తమంబు
కాని, మానవుఁడు నిష్కాముఁడు గాక.

సంసారసుఖము శాశ్వత మని నమ్మి
ధ్వంసమ్ముచేయు నుత్తమధర్మపథము
రాజ్యసంపద బుద్ధిభ్రమయుట నేను
పూజ్యకాలమ్ము వమ్ముగఁ జేసికొంటి
ధరణిపుఁ డనెడి నుద్ధతి నిన్నినాళ్లు
తిరిగితి నినుఁ గను తెలివిమానితిని
సార్వభౌముఁడు తుచ్ఛసుఖముల మరగి
సర్వేశ! నినుఁగొల్చు సరణిని మఱచు
సాధుజనుఁడు సర్వసౌఖ్యముల్ మఱచి
నీదుపాదాబ్జసాన్నిధ్యమ్ము మరగు
నీ దయయేయున్న నిఖిల బంధములు
పాదుకొనవు మోక్షపదవి సిద్ధించు
నీ సేవచేసెడి నిర్మలచిత్తుఁ
డాస చూపునె యైహికానందములకు''                2740
అని పెక్కుతెఱఁగుల నాత్మ విచార
మొనరించి, నీదు మహోన్నత శక్తి
గుఱుతించి నీ దివ్యగుణము నుతించి
మరియు నిట్లనియె రమాహృదయేశ!

ఈశ్వర! కృష్ణ! యీ యిహసౌఖ్యములను
శాశ్వతమని మది చాల నమ్మితిని
గాని చెడితి వానిఁ గాంక్షింప నింక
మానసమ్మును శాంతిమయము గావింతు.
నదియు నసంభవ మరుల నార్గురను
ఛెదరగొట్టఁగ లేని చెనఁటిని నాకు
శాంతి యెక్కడిది? విశ్వంభర. దేవ.
భ్రాంతియేగాని. సర్వమ్మును మఱచి

నిను నాశ్రయించెద నీరజనయన!
నను దయఁ గనుము పన్నగరాజ శయన!
అని భక్తి నినువేఁడు నమ్ముచుకుందుఁ
గని, యంటివి మహాత్మ, కరుణాసముద్ర.

## శ్రీకృష్ణుడు ముచుకుందునకు ముక్తిమార్గముఁ దెల్పుట

భూనాథ! నీకు సద్బుద్ధి చేకూరె
మానితి వాశల మంచిది, వినుము
జనవర! తొలి నీవు క్షత్రధర్మమ్ము
ననుసరించితి, మృగయావినోదమున 2750
మెకములఁ బెక్కింటి మిత్తిపాల్సేసి
సకలపాపమ్ముల సంతరించితివి
తపము గావింపుము తద్దోషసమితి
నపనయింపంగల వా యనంతరము
భూతదయాబుద్ధి పొసఁగిన విప్ర
జాతి జనించి మచ్చరణ సంసేవ
ననుఁ జేరుకొందు వెంతయు శాంతితోడ
నని కరుణించితి వా విభుఁ డంత
నీకు నతుల్ సేసి నిన్ను వీడుకొని
యా కొండగహ్వరమందుండి వెడలి
కడు చిన్నరూపాలఁ గన్పడునట్టి
పుడమిఁ జరాచరమ్ములగు ప్రాణులను
గని యబ్బురమ్మంది కలియుగప్రాప్తి
యొనఁగూడు నని యాత్మ నూహించి యతఁడు
మది శంకమాని హిమగిరినిఁ జేరి
బదరికాశ్రమమందుఁ బరమాత్ము హరిని

నినుఁ గూరిచి తపమ్ము నిశ్చలనిష్ఠ
నొనరించుచుండె లోకోత్తరచరిత!
ముచుకుందుఁడు తపమ్ము పొనరింపఁ దలఁచి
యచలబిలమునుండి యరిగిన పిదప 2760
మరలి నీ వేతెంచి, మధురను గ్రమ్మి
దుర మొనరింప నుద్ధురగతి నున్న
మ్లేచ్ఛుల కెల్లను మిత్తినిగూర్చి
స్వేచ్ఛమై మధురను వీడి తత్పురిని
గల ధనాదుల ద్వారకాపురిఁ జేర్ప
బలగమ్మునకుఁ దెల్పి పయనము లంత
సాగించుచుంటివి సర్వేశ, కృష్ణ!
మాగధుఁ డతిదుష్టమతి జరాసంధుఁ
డపు డిరువదియుమూఁ డక్షౌహిణులను
విపరీతమతిఁ దెచ్చి విడిసె నా దండుఁ
గని యని సేయంగఁ గాదని మిగులు
ధనమును విడిచి యుద్ధమునందు నోడి
పరువెత్తు కోచల పగిదిని నీవు
పరువెత్తితివి బలభద్రుని గొంచు

## జరాసంధుఁడు రామకృష్ణులఁ బట్ట నుంకించి విఫలుఁ డగుట

అటు మీరు సోదరు లటవి మార్గమునఁ
బటుశీఘ్రగమనానఁ బర్విడుచుండ
మీ మహామహిమలు, మీ సాహసమ్ము
లేమాత్ర మెఱుఁగక యెసఁగి మాగధుఁడు
తన బలగమ్ముతోఁ దరలి మిమ్ములను
వెనుకొని తఱుముచు "వెంగలులార! 2770

మీ రెందుఁ జొచ్చిన మిమ్ముల విడువఁ
బాఱిపోవుట రాచపాడిగా "దనుచు
పరిహసించుచు వెంటఁబడి వీడిపోక
తఱుముచు వచ్చె. న త్తఱి మీరు మిగుల
నలపున నుంట నా యలపు తీఱంగ
కొలఁది విశ్రాంతిని గోరి ప్రవర్ష
ణమ్మను గిరిని సందడి లేనిచోట
నెమ్మి నుంటిరి దాఁగి నీరజనాభ!
తనపట్టువిడువ కా ధరణీధరమున
నిను, రాము వెదుకంగ నిజసైన్యమునకు
నానతి యొసఁగి. యయ్యద్రి మాగధుఁడు
తానును వెదకి యే తావునఁ గాని
మిమ్ములఁ గనక పమ్మిన కోపబుద్ధి
నె మ్మెయి మిముఁ జంపనెంచి యా కొండ
నెల్లెడ ఘోర వహ్నిని దరికొల్పెఁ
బెల్లుగా మంటలు విన్వీథి కెగసె

ఆ రీతి గిరిమండ నటనుండి వెలికి
వైరు లెఱుంగని వడువున దుమికి
ద్వారకాపురము సత్వరఁ గుశలముగఁ
జేరుకొంటిరి మీరు శ్రితపారిజాత! 2780
అంత జరాసంధు డ గ్గిరి మీర
లంత మొందినయట్ల యాత్మ భావించి
యొసఁగు మోదమున మాహిష్మతీపురికి
వెసఁ జనె నిజబలవితతితోఁ గూడి
చక్రపాణి, చతుర్భుజ, దయానిశాంత,
శక్రాదిసురసంఘ సన్నుతచరిత!

భవదీయ సంకల్పపరమార్థ మెదియొ
భువి నెవ్వ రెఱుఁగ రుత్ఫుల్లాబ్జనేత్ర!
కంసుచావును విని కడు కోప మంది
హింసింతుఁ జూడుఁడు కృష్ణుని ననుచు
మగధభూపతి క్రూరమతి నిన్నుఁ దనకుఁ
బగతునిగా నెంచి బహుళయత్నముల
నిను నొంపఁగాఁ జూచనేగాని, కంసుఁ
డనయవర్తనుఁడు క్రూరాత్ముఁడు గాన
నతఁడు దండనమున కర్హుఁడే యనుచు
మదిఁ దలంచెనె? పెక్కు మార్లోటువడియు
మరి మోసపోయె నీ మాయా ప్రభావ
మెఱుఁగ శమాయిక హీనుని యటుల
కాలయవనుఁడు నిష్కారణవైర
మాలాగు నీపయి నధిక రోషమునఁ 2790
బెంచి నిన్ను సమరభీరువుగాఁగ
నెంచెనే గాని నీ యీశ్వరత్వమ్ము
నెంచెనే, తుదకొక పృథ్వీశుచేత
పంచత్వముం బొందె పరమమూర్ఖుండు
మాగధయవను లేమాత్ర నీ ముందు.
భోగీంద్రశయన, యీ మోసంపు నటన
మీలాగు గావించి యీవు లోకులకు
నీ లీలలం జూపి నీతి నేర్పితివి
ముచుకుందుఁ డెంతటి పుణ్యుఁడో యెందొ
యచలగహ్వరమున హాయిఁ బరుండి
నిదురించుచుండఁగా నీ వందుఁ జొచ్చి
యదనున నాతని కానంద మెసఁగ

భవదీయ దర్శన భాగ్యమ్ముఁగూర్చి
ప్రవిమలమోక్ష సంపదఁ బొందునట్టి
దారిఁ జూపితివి నీ దాసవాత్సల్య
మారయ వర్ణింప నలవి గాదయ్య

యవన మాగధుల కెట్లట్టులు నాకు
నవగుణంబులు పెక్కులయ్య సర్వేశ,
నా దుర్గుణమ్ముల నాశమ్మొనర్చి
నీదు సేవలు సేయు నియమమ్ము నేర్పి 2800
ముచుకుందునకు వలె మోక్షమ్మునొందు
ప్రచురసంభావ్యమౌ పద్ధతి నాకుఁ
దెలిపి రక్షింపుమా దీనశరణ్య!
కలుష మానసుఁ డని కడఁ ద్రోయకయ్య
నీ పాదదాసుఁడ నీరజనేత్ర!
కాపాడు నను నీలకంధరగాత్ర!

## రుక్మిణీ కల్యాణకథ

శ్రీనిలయా! హరి! శ్రీవత్సవక్ష,
జ్ఞానరూపామర సంఘసంరక్ష
కంజాతలోచన, కౌస్తుభాభరణ,
భంజితరిపుగణ, పాపసంహరణ,
వేదవినుత, కృష్ణ! విధినిర్ణయమ్ము
నే దివౌకసులు మరెవ్వరుఁగాని
తప్పింపఁగలరె? యా తథ్యమ్ముఁ గనక
గొప్పవార మటంచు గొందఱు జనులు
దైవనిర్ణయమును దప్పింపఁ బూని
యే విధమున దాని నెడచేయలేక

ఫలశూన్యతను గంద్రు. పరమాత్మ! నిన్నుఁ
దలఁచెడు వా రెంత దవ్వులనున్న
నదనునెఱింగి తదాకాంక్ష నెఱిఁగి
కొదలేక గూర్తువు గోవింద! నీవు 2810

## రుక్మిణీ కల్యాణ కథా ప్రారంభము

అరయ విదర్భదేశావని మున్ను
వరలు కుండిన పురవరము, తత్పురికి
ననఘుఁడు భీష్మకుండను రాజు భర్త
జననుతుఁ డాతఁడు సాధువర్తనుఁడు
అతని కేవురుపుత్రు లందున జ్యేష్ఠ
సుతుఁడు రుక్మి వెనుక సొరిది నల్వురును
రుక్మరథుండును రుక్మబాహుండు
రుక్మకేశుండును రుక్మనేత్రుండు
ననువారు. వారల కందఱకొక్క
యనుఁగు చెల్లెలుగల దామె సుశీల
పేరు రుక్మిణి, యామె పెరిగెడుకొలఁది
నారాజు మందిర మతి శోభ నెనసె

## రుక్మిణీదేవి బాల్యము

ఆ రుక్మిణీబాల యనుఁగుసకియలఁ
జేరి బొమ్మలపెండ్లి సేయు వేడుకగ
సకియులకెల్లఁ గుజ్జన గూళ్ళువెట్టి
ప్రకటించు వారితో బంధుమర్యాద
పూలతీఁగెలఁ బెంచుఁ బూఁదోటలందుఁ
హాళి నుయ్యెలలూఁగు హర్మ్యమ్ములందుఁ

జదువులు శుకపిక సమితికిఁ జెప్పు
ముదమార బంతు లద్భుతముగ నాడు 2820
మురిపెముల్ నెమ్మిగములఁ జేర్చి నేర్పు
గఱపు మక్కువ మందగతు లంచగమికి

నారదసన్నుత నగరిపువంద్య!
ఆ రీతి రుక్మిణి యాటలు పాట
లల్లారుముద్దుగా ననుఁగులతోడఁ
దల్లిదండ్రులకును, దక్కబంధులకు
ముదము గల్గంగఁ జూపుచు విద్య లెల్ల
కొదలేక నేర్చె నెక్కుడు కోర్కె నంత
నా రాజతనయకు యౌవన మప్పు
డారంభమయి యామె క ప్రతిమాన
సౌందర్య మేర్పడె సరసిజనాభ!
నందకుమార! కృష్ణా! నీకుఁ గూడఁ
నెలప్రాయ మేర్పడి యెదిగె నీలోన
తలఁపులు తమకముల్ తల్లక్షణములు

తన జనకుని నిశాంతమున కేతెంచు
ఘనులగు నతిథివర్గంబుల వలన
నా రుక్మిణి భవన్మహామహిమలును
సారరూపాదులు చక్కఁగ నెఱిఁగి
వనజనయన! నిన్నె వరునిఁగఁ దనదు
మనమున నెంచె, సమ్మదమును బెంచె 2830
నీవును మది రుక్మిణీరూపశీల
భావగుణాదులు బాగని యెంచి
ఆమెను నీదు నిల్లాలుగాఁ బడయ
నీ మానసంబున నిశ్చయించితివి

## రుక్మిణీ వివాహ ప్రయత్నము

అంతటఁ గొన్నాళ్ల కాత్మబంధువులు
సంతసపడుచు విచారముల్ చేసి
సుదతి రుక్మిణిని కృష్ణున కిత్త మనుచు
పదుగురువల్కఁ, నా పల్కుల రుక్మి
వారించి నీ పయి వైరమ్ముఁ బెంచి
పేరిమి శిశుపాల విభునిపై నుంచి
తన చెలియలిని నాతని కీయ నెంచి
మునుకొని తగుయత్నములు సేయుచుండె

## రుక్మిణి శ్రీకృష్ణునొద్దకు బ్రాహ్మణునిఁ బంపుట

అంత రుక్మిణీ తనయన్న యోచనకు
స్వాంతమ్మునందు విచారమ్ము నొంది
తన కాప్తుఁడైన సద్బ్రాహ్మణు నొకని
ననఘుని పిలిపించి, "అయ్య, మా యన్న
నన్నుఁ గూళకు జైద్యునకు నీయదలఁచి
యున్నాఁడు విప్రకులోత్తమ! నీవు
క్రన్ననఁజని కృష్ణుఁగాంచి యీ తీరు
విన్నవింపఁగదయ్య విమలగుణాఢ్య! 2840
జనకుఁడు పుత్రు నసద్విచారమ్ము
విని నివారించెడు వెరవరిగాఁడు
కనుక నీ వేగి మత్కామితార్థమ్ము
వినిపించి శ్రీకృష్ణుఁ బిలిచి రావయ్య"
అని కొన్ని మర్మవాక్యమ్ములు దెల్పి
పనిచె నప్పాఱు న ప్పడఁతి. తత్క్షణమ

## బ్రాహ్మణుఁడు ద్వారకలో శ్రీకృష్ణుని దర్శించుట

కదలి బాపఁడు ద్వారకాపురిఁ జేరి
ముదిత మనస్కుఁడై ముచుకుందవరద!
నీ రమ్యసౌధమ్ము నికటమ్ముఁజేరి
ద్వారపాలురఁగని వారి మూలమునఁ
దనరాక నీకుఁ దా _ త్తనె తెల్పఁ బంపి
మన ముబ్బునొంద హర్మ్యముఁ జొచ్చి నిన్నుఁ
గని "పెండ్లికొడుకౌదు గాక శ్రీకృష్ణ!
అనుచు దీవించె మహాత్మ! సర్వేశ!
విని నీవు చిఱునవ్వు వెలయించి నీదు
కనకాసనము డిగ్గి, కడు నాదరమున
న య్యాసనమునందె య విప్రవరుని
నెయ్యంపుఁబలుకుల నెమ్మిఁ గూర్చుండఁ
జేసి, సద్భక్తిఁ బూజించి, భోజనము
వాసిగాఁ బెట్టించి భవదీయ దివ్య 2850
హస్తాన నాతని యడుగు లొత్తుచును
నేస్తమ్ము వెలయించి నెమ్మి నిట్లంటి

## శ్రీకృష్ణుఁ డగ్నిద్యోతనుని సత్కరించి సంభాషించుట

ధరణీసురోత్తమ! ధన్యుఁడ వీవు
పరితృప్తి నీ మది భాసించుచుండు
కొద్దియైనను దృప్తిఁగొను నుత్తముండు
పెద్దలకా సుద్ది ప్రియమగుచుండు
సంతసపడకున్న శక్రుండుఁ జెడును
సంతసించిన పేదజనుఁడు సుఖించు
దయయు ధర్మము, తృప్తి, దాంతియు, శాంతి
నియమనిష్ఠల భక్తి నెఱపుచు నుండు

మనుజులు నాదు ప్రేమకు నర్హు! లట్టి
ఘనులకు నే నెప్డు గావింతు నతులు
ఏ దేశమందున, నెచట నీ యున్కి ?
ఆ దేశమును నేలు నధిపుఁ డెవండు ?
ఏ విభుచేఁ బ్రజలెల్ల సుఖింతు
రా విభుం డనిన నా కత్యంత ముదము
ఇది జడనిధి దుర్గ, మిచటి కీ వెట్లు
పదిలముగాఁ జేరవచ్చితి ? నీదు
తలఁపునఁ గల మేలు తప్పక దీర్తుఁ
దెలుపుమా నాకు సుధీనుత చరిత !" 2860
అని నీవు ప్రశ్నింప నా బ్రాహ్మణుండు
వినయ వివేకముల్ వెలయ నిట్లనియె

## రుక్మిణి సందేశము

దేవవినుత, వాసుదేవ, విదర్భ
భూవిభుఁ డత్యుత్తముఁడు భీష్మకుండు
అతనికిఁ గల దొక యాత్మజ రూప
వతి గుణవతి శీలవతి రుక్మిణియను
కన్నియ, నీ కామె కైంకర్యములను
దిన్ననఁజేయ మదింగోరి, పెండ్లి
సంబంధమగు నొక్క సంతోషవార్త
యింబు మీఱఁగ నీకు నెఱిఁగింప నన్నుఁ
బనిచె నా మాటలఁ బలికెద నామె
వినిచిన యట్టుల వినుము నెమ్మదిగ
నీ గుణములు విన్న నిఖిలశరీర
రోగతాపంబులు రూపఱి పోవు

నీ రూపమును గన్న నేత్రద్వయమున
కారయ సంపద లమరుచునుండు
నీ పాద పరిచర్య నిరతమ్ముచేయ
నేపారు నున్నతి యీ క్షితియందు,
నీ నామ భజనమ్ము నిత్యమొనర్ప
నానావిధముల బంధనములు దొలఁగు 2870
నట్టి నీ యందు మదాత్మ యెల్లపుడు
గట్టి విశ్వాసమ్ము గల్గి యున్నయది
నీ యాన సిగ్గిడి నిజము చెప్పితిని
నా యందు నీదు మన్ననఁ జూపుమయ్య
శ్రీరమాహృత్సరసీరుహ భృంగ!
కారుణ్యపూర్ణ, నిష్కలుషాంతరంగ!
నిను నేను కోరుట నేరమా స్వామి?
యనుపమ సమ్మోహనాకారు నిన్ను
నే కన్య కోర దింతెందుకు లక్ష్మి
వీఁకమై నిన్గోరి ప్రేమింపలేదె
మృగరాజు సొమ్మును మృగధూర్తకమ్ము
తగ వెఱుఁగక పొందఁ దలఁచిన యటులు
నీ పదాబ్జముల ధ్యానించెడు నన్నుఁ
జేపట్టనున్నాఁడు శిశుపాలుఁ డతఁడు
పరమనీచుఁడు నీదు ప్రాభవోన్నతుల
మరియాద నెఱుఁగునే మనుజమృగేంద్ర!
దానధర్మములు వ్రతమ్ములు దేవ
మానవ గురుజన మాన్యార్చనములు
మునుపటి నా జన్మముల నేను భక్తి
వనజనాభుని హరి వాంఛించి చేసి 2880

యున్నచోఁ గృష్ణ! మహోన్నతచరిత!
యెన్న నా హృదయేశుఁ డీవౌదు గాక!
పోరాటమున చేది భూపాలుఁ డాది
వైరు లోటమినొంది వగతురుగాక!
నీకు నంకిలిలేదు నీరజనాభ!
ప్రాకటమగు భవద్బలముతో వచ్చి
చేదీశుఁ డాదియౌ క్షితిపుల గెల్చి
నాదు చెంతకుఁ గరుణను జనుదెంచి
జగతి మెచ్చంగ రాక్షస వివాహమున
నగధర! నీ బలోన్నతి నొలిచేసి
ననుఁ గొనిపొమ్ము నందకుమార! కృష్ణ!
చనుదెంతు నీతోడ, సర్వులు చూడ
అంతిపురమునుండి యగునె నిర్దేర
చింతింపఁ దెచ్చుచో సేవకావళినిఁ
గలబందుగులఁజంపి దాని తెచ్చుటకు
వలనౌనె, యని యెంచవలదు విశ్వాత్మ!
మోద మెలర్పఁ జెప్పెదు నొకయుక్తి
నాదరమ్మున వినుమయ్య తదుక్తి.
కులదైవమును భక్తిఁ గొలిచి వచ్చుటకు
కొలము పెద్దలు పెండ్లికూతు వివాహ 2890
మునకు మున్ముందు పంపుదు: రట్టి ధర్మ
మునుబట్టి నేనును పురము వెల్పలను
గల పార్వతికి మ్రొక్కఁగాఁ జనుదెంతు
జలజాక్ష! నీవు నా సమయమ్మునందు
వచ్చి నన్గొని పొమ్ము వత్తు సర్వేశ!
పొచ్చె మేమియుఁ గల్గఁబోదు ప్రాణేశ!

ఘనులు తమతమమ్ముఁ గడఁద్రోయనెంచి
త్రినయనుని విధానఁ దివిరి యే వేల్పు
చరణాబ్జవారి మజ్జన మొనరింపఁ
గరము కోరుదు రట్టి కమలాక్షు నీదు
సరసనుండెడు నదృష్టము గల్గకున్న
నిరత వ్రతమ్ముల నెఱపుచు నూరు
జననమ్ములను నిన్నె స్మరియించుకొనుచు
మనుటయే చాలింతు మన్మనోనాథ!
నీ మృదూక్తుల విననేరని చెవుల
గోమెల్ల వ్యర్థమ్ము గోపికాలోల!
నీవు పొందని మేని నెఱపగు సొగసు
భావింప వమ్ము శుభంకరరూప!
నినుఁ జూడఁ జాలని నేత్రసౌందర్య
మెన వనజ్యోత్స్నకు నిందిరానాథ! 2900
నీ మోవిసుధఁ గ్రోల నేరని నాల్క
కేమిలాభము చవులెన్ను జ్ఞానమున?
నీ సుమదామమ్ము నెమ్మి మూర్కొనని
నాస జ్ఞానమ్ము హీనమ్ము రమేశ!
భవదీయ పాదసేవకు నోఁచనట్టి
భవము దుర్భరము గోవర్ధనోద్ధార!
అని రుక్మిణీదేవి యంపిన వార్త
సనఘుఁ డాబ్రాహ్మణుఁ డంతయు నీకు
వినిపించి మరియు నా వెలఁదుకరూప
గుణ యౌవనాదులఁ గూడ వర్ణించి
"అయ్య! యయ్యెలనాగ యర్హమ్ము నీకు
నయ్యంగనకును నీ వర్హుండ వగుదు

చెప్పితి మీ పెండ్లి స్థిరము నా మాట
తప్పదు: తడవింక తగదు సేయంగ
చుట్టాలతో రమ్ము సుదతిని దెమ్ము
నెట్టన శుభము లన్నియు నీ వశమ్ము
అనిన బ్రాహ్మణు పల్కు లాలించి నీవు
మనమున నుప్పొంగి, మాధవ! నీదు
కరమున నాతనికరమును బట్టి
చిఱునగ వొలయంగఁ జెప్పితి విట్లు 2910

## శ్రీకృష్ణుఁడు బ్రాహ్మణునితోఁ దనయభిప్రాయముఁ దెల్పుట

ధారుణీసురవర, ధర్మవిచార!
యా రుక్మిణీ కన్యయందు నా తలఁపు
నిలిచియున్నది నాకు నిసి నిద్రరాదు
తెలిసికొంటిని నామె తీరుఁ జిత్తమ్ము
నా పెండ్లి కార్యమ్మునకు ననిష్టమ్ముఁ
జూపుచు రుక్మి యొంచుచున్న కీడు
నే మున్నె యెఱుఁగుదు నిదె యేగుదెంచి
యా మూర్ఖశత్రు సంహారమ్ము చేసి
బాలికఁ దెత్తు మా బంధుజనమ్ము
మేలన, లోకమ్ము మెచ్చుకొనంగ''
అని నీ యభిప్రాయ మా భూసురునకు
వినిచితి, రుక్మిణి పెండ్లినక్షత్ర
మెఱిఁగితి: సారథి కిడితి వనుజ్ఞ
నరదమ్ముఁ దేర మహాత్మ! శ్రీకృష్ణ!
భవదీయ సంకల్పబలమున కెదురు
భువిఁ గలదే జగత్పూజ్య చరిత్ర!

## శ్రీకృష్ణుని కుండిన నగర ప్రయాణము

అంత దారుకుఁడు శైబ్యాది వాహముల
సంతసకట్టి నీ సరసనఁదేరు
నిలుప నందకుమార! నీవు బ్రాహ్మణుని
గలసి తద్రథమెక్కి కదలి విదర్భఁ 2920
జేరిఁ కుండినపురి క్షితినాథుఁ డెలమి
ధారుణీపతులకుఁ దగ నిల్పి యున్న
విడుదలలో నొక్కవిడిది గృహాన
విడిసియుంటివి యదువీర! శ్రీకృష్ణ!

## కుండిన నగరమున రుక్మిణీ వివాహసంరంభములు

కొడుకుమాటను కాదు కూడ దటంచు
నొడయుఁడు భీష్మకుఁ డుడిగింపలేమి
సంతకు మున్న నిజాంతరంగమునఁ
జింతించి రుక్మిణి శిశుపాలు కొసఁగి
పెండిలిసేయుటే విధియని యెంచి
నిండుసంతసమున నిఖిల వివాహ
శోభనోద్యోగముల్ సొరిదిఁ జేయించె
ప్రాభవ మొప్పార బంధువుల్ మెచ్చ
పురియలంకరణము పొలుపుగ జరిగె
పురవాసులకు నెల్ల మోదమ్ము పెరిగె
వివిధవాద్యమ్ములు వింతగా మ్రోఁగె
జవమున పెండ్లి కర్జమ్ములు సాగె

చతురంగబల విలసచ్ఛక్తితోడ
నతిహితబంధు జనావళితోడఁ

ప్రకటిత గర్వసంరంభమ్ముతోడ
వికటచిత్తముతోడ విచ్చేసె భీష్మ 2930
తనయుఁ దెత్తునటంచు దా శిశుపాలుఁ
డనయుఁ డవ్వీటికి నతి సంతసమున
బలరామకృష్ణులు వచ్చిన వారిఁ
గలహమందోడించి కన్యఁ జైద్యునకు
దక్కింతమని కడు దర్పమ్ము మెఱయ
గ్రక్కునఁ దమ బలగమ్ములతోడఁ
జనుదెంచి రా జరాసంధుండు మఱియు
ననయులౌ దంతవక్త్రాదు లెల్లరును
హరి యొక్కఁ డేగెఁ జైద్య హితమ్ముఁగోరి
నరయంగ మాగధాద్యవనిపుల్ పెక్కు
రరిగియున్నారు కన్యకఁ దెచ్చుచోట
దురము సిద్ధమ్ముగుఁ దోడుగావలయుఁ
గంసారి కని బలగమ్ముఁ దోకొంచు
హంసేందునయన! తా నరుదెంచె బలుఁడు
ఆలోన వైదర్భి యంతిపురాన
తాలిమిమాలి యో తామరసాక్ష!
నీ వామెకోర్కె మన్నింతువో, లేదా
యే విపరీత మెట్లేర్పడు నొక్కొ!
యని యేకతమ సంశయమ్మును బొంది
తనలోనఁ దా నిట్లు తర్కించుకొనియె 2940

## రుక్మిణి శ్రీకృష్ణునిరాకకై యెదురు చూచుచుఁ జింతించుట

"రేపు పెండిలి, కాని, శ్రీపతిరాఁడు
తాపము నాదు స్వాంతమ్మున నిండె

పాఱుండు చనియెనో! వాసుదేవుండు
తీరిక నాదు సందేశమ్ము వినెనో!
నా పూన్కి జయమౌనో, నగవుపా లగునో!
యే పగిదియొ విధికృతము నే నెఱుఁగ
నరయ నగ్నిద్యోతనాఖ్యుఁ డావిప్రు
డరిగెనో, తడసెనో, యలసెనో లేక
విని కృష్ణుఁ డిది లోక విపరీత మనుచుఁ
జనుదేరఁ డేమొ! యీశ్వరియు నీశ్వరుఁడు
కరుణింతురో లేదో! కడకు నా కోర్కి
పరికింపఁ దా నెట్టి పరిణతిఁ గనునో"
అని మఱి రుక్మిణి యాదవచంద్రుఁ
గనఁ జనియుండఁ డా క్ష్మాదేవుఁ డనియు
నందాత్మజుని రాక నమ్మరా దనియు
పొందిక నాతని బోధించితెచ్చు
హితుఁడు లేఁడనియు, నూహింపఁ జైద్యునకు
మతిమాలి రుక్మి సమ్మతి నిచ్చుననియు
గౌరికి దనపయిఁ గరుణలే దనియు
పరిపరి విధములఁ బరితాపమొందు 2950
తన తలఁపుం జిక్కుఁ దల్లికి నైన
వినుపించి దుఃఖమ్ము వెలిచేయఁబోదు
నిదురవోవదు, కృష్ణ! నీ వచ్చుత్రోవ
కెదురుగ నిల్పిన యా క్షణపంక్తి
నటునిటు మరలింప దశ్రుబిందువులు
జొటజొటమని స్రవించుచు నున్న వానిఁ
దుడువదు, త్రావదు తోయు, మన్నమ్ముఁ
గుడువదు, కై సేసికొనఁ బూనుకొనదు

చిలుకకుఁ బద్దెముల్ సెప్పుదు! వీణెఁ
బలికింప. దుద్యానవని నుండఁబోదు
నిను నిక్కువమ్ముగ నెఱ నమ్మినట్టి
యనఘుల మానస మన్యమ్ము పైనఁ
బొరలునే త్రిభువన పూజితచరణ.
గరుడగమన. కృష్ణ! కంజాతనయన!

## అగ్నిద్యోతనుఁడు రుక్మిణికి శ్రీకృష్ణునిరాక యెఱింగించుట

ఆ రీతి రుక్మిణి యంబుదశ్యామ!
కోరిక నీయందుఁ గుదిరిచి. నీవు
రావనుశంక సర్వమ్మును రోసి
భావజానలమునఁ బరితాప మొందు
నామెకు శుభవార్త లందించునట్లు
వామాంసనేత్ర కంపన మయ్యె నపుడు 2960
అంత నీదు నియోగ మంది బ్రాహ్మణుఁడు
చింతాభరాకులచిత్త రుక్మిణినిఁ
జేరంగఁ జనుదెంచి. చిఱునవ్వు నవ్వి
యా రమణికిఁ దాప మణఁగ నిట్లనియె —

“మెచ్చె నీ గుణములు మేలుమే లనుచు
నిచ్చె నాకు ధనమ్ము లెక్కుడు ప్రీతి
వచ్చె శ్రీకృష్ణుఁ డీ పట్టణమునకు
నచ్చెరువని ప్రజలందఱుఁజూడ
సచ్చరితుండు రాక్షస వివాహమున
నిచ్చ ని న్గొనిపోవు నెవ రడ్డమైన
పొచ్చెమ్ము లేదు నీ పూర్వభాగ్యమ్ము
గ్రచ్చఱ ఫలియించుఁ గన్యక నేఁడు”

అని తెల్పి రుక్మిణి యానంద మొంది
ఘనుని నా విప్రుని గాంచి యిట్లనియె –
"నా విన్నపముఁ దెల్పి నందకుమారు
నీ వేళ కిచ్చటి కెట్లొ తోడ్తెచ్చి
నిలువఁబెట్టితి నన్ను నీ కృప మంటిఁ
గలరె నీ కెనవచ్చు ఘనపుణ్యమతులు
దీనికి దగిన మాద్రిగ నుపకృతిని
నేను చేయఁగఁ నేర్తునే భక్తిమీఱ 2970
నంజలి గావింతు నవనీసురేశ!
భంజిత దుష్కృత పావనచరిత!"
అని నమస్కృతులతో నాతనిఁ దన్పి
మనమున వగమాని మానినియుండె

## కుండినపుర ప్రజాభిప్రాయము

అంతట భువనమోహనరూప, గోప
కాంతామనోజ, దిగ్వ్యాపితతేజ!
నీ రాక విని వచ్చి, నీ రూపుఁ గాంచి
పౌరులు సంతోషభరితాత్ము లగుచుఁ
దగు రుక్మిణికిఁ జక్రి తనరఁ జక్రికిని
దగు రుక్మిణియు, మంచి దాంపత్య మిద్ది
యీ యిద్దఱికిఁ దగు లెనయించి నట్టి
తోయజసూతి యెంతో నేర్పరి గద
పగర జయించి యీ పడఁతికిఁ జక్రి
మగఁడగుఁ గావుత! మా సుకృతమున
అని పెక్కుభంగుల నతికుతుకమున
ననుకొనుచుండిరి యా సమయమున

## రుక్మిణి పార్వతీదేవి గుడికిఁజని తద్దేవిని ప్రార్థించుట

పటుతరాయుధములు పట్టి హెచ్చరిక
భటసమూహ మ్మిరువంకల నడువ
గౌరి కర్పించు కానుకలుగొని ముందు
వారాంగనాజన వర్గమ్ము నడువ 2980
సుమగంధ భూషణాంశుకములు గొంచు
ప్రమదలు పాడుచుఁ బజ్జ నేతేర
వివిధ మంగళవాద్య విశ్రుతధ్వనులు
భువియందు దివియందుఁ బూరటిల్లంగ
సకులు తల్లులు బంధు సమితి మానినులు
ప్రకటితానంద సంభరితలై రాఁగ
మరియు పెక్కురు వందిమాగధులాది
పరివారవర్గమ్ము బలసి సేవింప
సన్నిహితులు బంధుజాలముల్ తన్ను
వెన్నంటి కడు ప్రేమ వెలయంగ నడువ
నంతిపురమువీడె నగజకు మ్రొక్క
కాంత యా రుక్మిణి కాల్నడతోడ
ఆ రీతి రుక్మిణి యార్యాలయమ్ముఁ
జేరి లోనికిఁ బ్రవేశించి పార్వతికిఁ

బూజలు సేయించి పొదలిన భక్తి
రాజిల్ల నద్దేవిఁ బ్రార్థించె నిట్లు
"నమ్మితినమ్మ సనాతనులైన
మిమ్ము దంపతుల నంబికను శంకరుని
సతతమ్ము మీ సేవ సల్పితి నమ్మ
యతిదయావతివి గదమ్మ నీ వెన్న 2990

వాసుదేవుని నాకుఁ బతిఁ జేయు మమ్మ
నీ సేవ వమ్మగునే లోకజనని"
అని గౌరిఁ బ్రార్థించి యైదువరాంద్ర
వినయ విధేయతల్ వెలయఁ బూజించి
దీవెనలంది యా దేవ్యాలయమ్ము
నావరణమువీడి యటనుండి బయలి
భూభాగముం జేర, భూపతు లామె
శోభనాకారమ్ముఁ జూచి భ్రాన్పడిరి

## శ్రీకృష్ణుఁడు రుక్మిణిని తన రథమున నిడి గొంపోవుట

ఆ యవసరమున న య్యాలివేణి
మాయామనుజవేష! మా చిత్తతోష!
భవదీయ రూపమ్ము ప్రత్యక్ష మగుట
భువనమోహను నిన్ను మోహించి యరద
మెక్కఁ దలంప న య్యింతి యింగితము
మక్కువ గమనించి, మమతను జూపి
యరివీరనృపనివహము చూచుచుండ
కరిరాజువలె మందగమనమ్ము తోడఁ
జనుదెంచి, నీవు రాజన్యుల లెక్క
గొనక యా రుక్మిణిఁ గొనివచ్చి రథము
పైనిడికొని బువి బయలు నిండంగ
ఘనశబ్దమొప్ప శంఖమ్ముఁ బూరించి 3000
బలభద్రుఁడును భటవర్గమ్ము నడువ
విలసన్మహోత్సవ విభవమ్ము తోడ
ద్వారకాపురిఁ జేరఁ బయనించి తయ్య
నీరజదళనేత్ర, నీ కెదురెవరు?

## జరాసంధాదులు కృష్ణు నెదిరి మరలిచనుట

ఆ రీతి నీవు నిరాటంకవృత్తి
నారీమణిని రాజనందన, గొంచుఁ
జనుచుండ భవదీయ సాహసచర్యఁ
గని యోర్వలేని మాగధముఖ నృపులు
అదిగొ గోపకులు సింహమ్ములకీర్తి
మదమునఁ గొని భయంపడి పాఱుతెంచు
ననద మెకములట్లు యబల రుక్మిణిని
గొనిచనుచున్నారు క్రొవ్వున నుబ్బి
మన మూరకుండిన, మన యాయుధములు
మన పరాక్రమములు మంటఁ గాల్చుటకె?
యా తన్వి విడిపింప మైతిమా! మనల
భూతలమ్మున జనమ్ములు నవ్వకుంద్రె!"
అనుచు వారెల్ల మహాక్రోధబుద్ధి
"మనము యాదవ విజృంభణము నణంత
మని హెచ్చరికలతో నందఱుఁగూడి
ధనుబాది యుద్ధసాధనములు దాల్చి 3010
చతురంగ బలవిలసన మొప్పునటుల
నతిరయమున మిమ్మునంటి నిలుండు
నిలుఁ"డని ధిక్కృతి నెరయుంగఁ బలికి
పలుసాయకముల మీ భటులపై వైవ
మీ బలగమున కమిత్ర సంహతికి
ప్రాబల్యయుద్ధ మేర్పడె వాసుదేవ!

ఆ మహాసంగ్రామ మట్టె వీక్షించి
యేమియుఁ దోఁచక యేమనలేక

"అరివర్గమునకు జయమ్మగునేమొ
దురమున" నని భీతితో నినుఁ జూచు
నబల రుక్మిణికి ధైర్యము గల్గునట్లు
ప్రబలారివీర విధ్వంసక. కృష్ణ!
పలికితి "జలజాక్షి! భయపడనేల!
తిలకించుచుండు మాతీరెట్టు లగునొ
యదువీరశేఖరు లరి సమూహమ్ము
మద మణఁగింతురు: ప్రమందింపఁ గలరు"
అని యామె నోదార్చి తంత యాదవులు
మునుకొని చెలరేఁగి ముక్కడి పగఱ
మూఁకల శరవర్షమున ముంప వారు
తేఁకువమాలి నల్దెసలకుఁ బాఱ 3020
మాగధముఖులును మగిడి చలించి
వేగఁ బర్వెత్తుచు వేరొండుచోట

జరాసంధాదులు శిశుపాలు నోదార్చుట

వగచుచు నాలిఁ గోల్పడినట్టి వాని
వగ వగర్చెడు శిశుపాలుని గాంచి
"పగవారి చేతిలోఁ బడక జీవముల
నగపడి తీవు చైద్యా! శుభమయ్యె
బ్రదుకవచ్చునుగదా. ప్రాణమ్ములున్న
బ్రదికిన భార్యలు పదివేలు గలరు
బ్రదికితి మేలయ్యె భార్యలకేమి
వదలు మా విషయమ్ము భగవంతుఁ డెఱుఁగు
వగపు మానుము శిశుపాల! నీ వింక
వగచి పొందెడు నట్టి ఫలము శూన్యమ్ము

అదియునుగాక స య్యాదవతతికి
నిది మంచికాల మా కృష్ణుని బాహు
బలమున ద్రిభువన ప్రథిత వీరులను
గెలిచిరి మనలను గెలువమె మనము
మన కనుకూల సమయమైన యపుడు
ఘనశక్తి వైరివర్గమ్ముఁ జుల్కనగ
నీ రీతిఁ బల్కి నరేంద్రు లెల్లరును
కారుణ్యమునఁ జైద్యుఁ గడు నూఱడించి 3030
తమ భూములకుఁ దాము తరలఁ జైద్యుడును
కుములుచుఁ జనె సేనఁగొని తన పురికి

## రుక్మి కృష్ణు నెదిరి పరాభవము నొందుట

అంతట రుక్మిణి యన్నయౌ రుక్మి
దంతివరద! నీవు తన సహోదరిని
గొనిపోవుట యెఱింగి కోపాన రేఁగి
నిను జయింపఁగ నెంచి నిజరథం బెక్కి
సారథీ! కంటె భీష్మకుపుత్రు నన్ను
శూరు లెక్కింపక చోద్యమ్ముగాఁగ
నాదు చెల్లెలిని నిందరు చూచుచుండ
మీఁదెఱుంగక కొని మిడిసి యా గొల్ల
వాఁ డదె చనుచున్నవాఁ డాముతోడ
నేఁడు చూపెదను వానికి నాదు శక్తి
నరదమ్ము వేగమ యరుగని మ్మతని
గరువ మ్మణంతు నా ఘనసాయకముల”
ననుచుఁ గృష్ణా! నీ మహామహిమలను
గనక నీ వెంటాడి “కష్టాత్మ! యొక్క

నిముసమ్ము నిలువుము నీ గర్వ మణంచి
ప్రమదమ్ముఁ గూర్తు నా బంధుల కెల్ల
నని మూఁడువాఁడి సాయకములు విడిచి
నిను నొవ్వఁజేసి వెండియు నిట్టు లనియె 3040

## రుక్మి శ్రీకృష్ణుని తూలనాడుట

"ఓయి! వెళ్ళకు నిలుమోయి గొల్లండ!
యీ యక్రమము నీకు నెటు తగునోయి
మా పాపఁ గొనిపోవ మాసరి వాఁదె?
యేపాటి నీ స్థితి? యెద్ది నీ కులము?
యెచట జన్మించితొ యెచటఁ బెరిగితొ,
ప్రచురమ్ముగాదు నీ వర్తన మెందు
మానమర్యాద లేమాత్రమ్ము లేవు
పూనుదు వేకార్యమునకైన మాయు
నరులవర్గముపై నిజాకృతిఁ బోవు
ధరణీశుఁడవు గావు తప్పదు వావి
కాన, బాలికను బింకముమాని విడిచి
మానమ్ముతో నీదు మార్గానఁ బొమ్ము
విడువకుంటివ! యుద్ధవీథి నీ గర్వ
మడఁగింతుఁ దెలిసికొమ్మా నాదు శక్తి"
అని విఱ్ఱవీఁగు నా యనయువర్తనుని
వనజాసనాది దేవ వినుత పాద!

## శ్రీకృష్ణుఁడు రుక్మిని అవమాన పఱచుట

అరిభయంకర! నీవు హాస మ్మొనర్చి
కఱకు బాణమ్ములఁ గ్రమముగఁ బఱపి

వాని ధనువుఁ ద్రుంచి వర్మంబుఁ జీల్చి
మేను నొప్పించి యమ్మెయిని రథమ్ము 3050
విఱిచి రథ్యమ్ముల విదళించి, సూతుఁ
బరిమార్చి మిగుల దుర్బలు నొనర్చితివి
కాని యాతం డొక ఖడ్గమ్ముఁ జేతఁ
బూని నీపయిఁ బడ మునుకొనిరాఁగ
వానిశిరము తెగిపడఁగొట్ట ఖడ్గ
పాణివై నడచు నీ పాదముల్ వట్టి
బాలిక రుక్మిణి భయభక్తు లొలయఁ
బలికె నీతోడ "నో బంధుసంరక్ష!

## రుక్మిని మన్నింపుమని రుక్మిణి కృష్ణుని ప్రార్థించుట

"ఓ దయామూర్తి, మహోజ్జ్వలకీర్తి,
వేదవేద్య! సురేశవినుత పాదాబ్జ!
నిన్ను నీశ్వరు గమనించు విజ్ఞాన
మెన్నంగ లేనట్టి యితఁడు మా యన్న
యొనరించె నీ యెడ నోర్వరానట్టి
ఘనతరదోషమ్ము, కరుణ నా పైనిఁ
జూపి, మన్నింపుమా సుజనార్తి హరణ!
నీ పాదములె దిక్కు నిగమసంచరణ!
మా తలిదండ్రులు మాధవుఁ డింక
మా తనువుల్ పొంగ మా యుల్లుఁ డయ్యె
నని యుబ్బుచున్న వారనఘ! నీ వితని
ననయుఁ దునిమితేని, నతి పుత్రశోక
మున మున్గుదురు వారు మునిజనశరణ! 3060
కినుక పూనకుము పక్షికులేంద్రగమన"

అని ప్రొక్కఁగా నామె యభ్యర్థనమ్ము
విని రుక్మినిం దెగవ్రేయుట మాని
నీవు హేళనగ వానిని జూచి నవ్వి
'బావ ర' మ్మని చీరి పట్టి బంధించి
చిబుకమ్ము, మీసమ్ము, శిరము రేవులుగ
గబగబ గొఱిగి వికారరూపునిగ
గావించితివి శత్రుగర్వాపహరణ!
నీ వీరచరితమ్ము నిరుపమానమ్ము

## బలరాముఁడు రుక్మి బంధమును విడిపించి రుక్మిణి నోదార్చుట

అంత హతప్రాణుఁడై యున్న రుక్మి
చెంతకు మీ యన్న సీరి విచ్చేసి
వాని బంధనములు వదలించి నీకు
మానితమ్మగు ధర్మమార్గముల్ దెల్పి
వైదర్భితో నామె వ్యథ తీరునట్లు
సాదరమ్మునఁ బల్కె నచ్యుతా! యిట్లు

"అమ్మ రుక్మిణి! భవదగ్రజన్మునకు
ని మ్మెయి భంగపా టేర్పడె నంచు
నెడద దుఃఖించి మా కృష్ణు నెగ్గాడఁ
గడఁగకుమా, తొంటికర్మలఁ బట్టి 3070
జీవికిఁ జెందెడిఁ జెడుగొ, శ్రేయమ్మొ
భావింపఁ జెడుపఁ, గాపాడ నన్యుండు
లేఁ డితండును కర్మలేశమ్ము వలన
నేఁ డిట్టి యవమతినిం బొందెనమ్మ

అజ్ఞాన జనితమైనట్టి శోకమ్ము
విజ్ఞానదృష్టిచే విడుమమ్మ నీవు
ప్రజ్ఞావతివి గానఁ బరికింప నీకు
నజ్ఞాను లట్టుల నడలంగ వలదు ''
అని పెక్కు ధర్మమ్ములా హలి దెల్ప
మనమున వగమాని మానినియుండె

## రుక్మి మూర్ఖత్వము

హీనసత్త్వుఁడు నికృష్టుఁడౌ రుక్మి
ప్రాణావశిష్టుఁడై బంధమ్మునుండి
బలరాము పూర్ణకృపాకటాక్షమునఁ
దలఁగింపఁబడి: నాఁడు తనకు నేర్పడిన
వికృతరూపమునకు వెక్కసపడుచుఁ
బ్రకటిత నిజ పరీభావదుఃస్థితికి
నెరియుచుఁ గృష్ణు జయించినఁ గాని,
పురిఁ జొరనని కడు మూర్ఖుఁడై ప్రతిన
యొనరిచి తన్నగరోపకంఠమ్ము
మనికిపట్టుగ నుండె మాత్సర్యబుద్ధి 3080

ఈలాగు సకలమహీపాలకాళి
నాలమందునఁ గెల్చి యతిప్రాభవమున
నిను వరించిన రుక్మిణీకన్యతోడ
ఘన జయలక్ష్మినిఁ గైకొని వచ్చి
ద్వారకాపురి బంధువర్గమ్ము మెచ్చఁ
జేరుకొంటిని సరసీరుహనయన!

## శ్రీకృష్ణుఁడు రుక్మిణిని బెండ్లియాడుట

అంతట బందుగు లార్యులు చేరి
స్వాంతముల్ పొంగ శుభంకరలగ్న

మొక్కటి నిర్ణయ మొనరించి చెప్పఁ
జక్కనిఁ యా శుభసమయమ్ము నందు
మిగుల వేఁడుకగ రుక్మిణికిని నీకు
జగము మెచ్చఁగ పెండ్లి జరిగె శ్రీకృష్ణ!
సతులతోఁ బౌరులు చనుదెంచి మీకు
నతుల బహూకృతు లర్పించి రపుడు
కురుసంజయ విదర్భకుంతి నరేంద్రు
లరయఁ గైకేయక యదుభూమిపతులు
పరమసంతోషమ్ము వడసి మీ పెండ్లి
దరిసింపవచ్చిరి తమకమ్ము హెచ్చ
గోవర్ధనోద్ధార, గోవింద, కృష్ణ!
నీ వీ విధిని రుక్మిణీకన్యఁ దెచ్చి 3090
పెండిలియాడుట విని రాజులెల్ల
నిండు వెఱఁగునొంది, నిక్క మీకృత్య
మతి దుష్కరంబని, యచ్యుతా! నీదు
చతురిమఁ బొగడిరి సకలదిక్కులను
వసుదేవతనయ! భవద్వివాహమ్ము
వసుధకు మంగళప్రదమయి తనరె —

భవబంధపరిహార! పాపవిదూర!
నవనీత దధిచోర! నందకుమార!
కువలయదళనీల! కుంజరపాల!
రవిశశినేత్ర! నిర్జరనుతిపాత్ర!
యదుకులోద్భవ! కృష్ణ! యవనిమానవుల
హృదయ తత్త్వములు వేర్వేరుగ నుండు
ఆదిదేవుండవయ్యా నీవు! లక్ష్మి
వైదర్భియగును, భవజ్జననములు

"ధర్మసంస్థాపనార్థము'' సాధుతతికి
శర్మమ్ము చేకూర్చు సత్కృతికొఱకు
నెప్డు డేయవతారమెత్తినఁ గాని
తప్పదు మీ దివ్యదాంపత్య మెందు
జననాదిమానవ సహజధర్మములు
మునిజననుత! మీరు పొందరుగాని. 3100
మానవజగతికి మార్గదర్శకము
గా నటియింతురు, కరుణాసముద్ర!
ఈ రహస్యమ్మెల్ల నెఱిఁగియు లోకు
లారయ మూర్ఖులై యతిమదవృత్తి
నిను లోకసామాన్యునిగ నెంచి తుదకుఁ
గనరు సుఖమ్ము నెక్కాలమం దేని
జ్ఞానులు నిను బుద్ధిఁ జక్కఁగా నెఱిఁగి
మాననిభక్తి నీ మన్నన వడసి
తమయభీష్టమ్ములు తనివోవనొంది
విమలమనస్కులై నెలయుచు నుంద్రు.
కుండినపురి భీష్మకుని బంధుజనము
నిండుమోదమ్మున నీకు వైదర్భి
నిచ్చి పెండిలిసేయ నెంచఁగా రుక్మి
యిచ్చగింపక మతిహీనుఁడై "యామెఁ
జేదీశునకు నిచ్చి చేయింతుఁ బెండ్లి
నాదు సంకల్పమ్మునకు నడ్డులేదు''
అని విఱ్ఱవీఁగె నేమయ్యె నతండు?
తనదు ప్రయత్న మంతయు వమ్ముగాఁగ
నేనాఁడు గాని. మఱెవ్వరేఁ గాని
యేనాఁటఁ బొందని హీనమౌ స్థితిని 3110

పొందె: బంధుజనమ్ము పూనిక తుదకు
సందియమే లేక సాగె శ్రీకృష్ణ!
వైదర్భి వినిచిన వార్తఁ గైకొనుచు
నీ దాపునంజేరి నీ సేవచేసి
నీదు మన్ననలకు నెమ్మది వొంగ
మోదించినట్టి యా భూసురుఁ డెంత
పున్నెమ్ము తొలి పుట్టువునఁ జేసినాఁడొ
కన్నాకుగద వాని కైంకర్యపథము —
చిననాటనుండి నీ శ్రీకరరూప
గుణశీలబలముల గూర్చి యెఱింగి
తన మనమ్మున నిన్ను ధవునిగా నెంచి
ఘనకాంక్ష నుండిన గరిత రుక్మిణికి
నడుమ నేర్పడిన విఘ్నములెల్లఁ దొలఁగఁ
కడువడి నీవె యా కంజాక్షి చెంత
కరుదెంచి యామెను కరుణఁ గొంపోయి
యరు దరుదని జగ మానంద మొంద
గరిమఁ బెండ్లాడి తా కన్య మోదింప
హరి నీదు సాహస మత్యద్భుతంబు
నమ్మినవారి తృష్ణలు దీర్చుటన్న
నిమ్మగదా నీకు నిభరాజవరద! 3120
శ్రీలక్ష్మి రుక్మిణి చెల్లునే మనకు
నా లలితాంగిఁ బెండ్లాడుట యనక
అనయుఁడు శిశుపాలుఁ డత్యాశ గలిగి
మనుజనాథులలోన మానమ్ము వోవ
నాలిగోల్పడినట్టు లడలెనేగాని,
యే లాభమును బొందె? నేమి సుఖించె?

మాగధుఁ డాది దుర్మార్గులు నీదు
చేగ యెఱింగియుఁ జెడుబుద్ధితోడ
నీ కపకృతిసేయ నెమ్మది నెంచి
మూఁకలై చనుదెంచి పోరాడి తుదకు
సపజయమ్మును బొంది యటనుండి మరలి
త్రప వీడి చనిరి యెంతయు వగనొంది

దామోదరా! జగత్త్రాణపారీణ!
సామగానవిలోల! సామజపాల!
నందకుమార! కృష్ణా! యదువీర!
బృందావిహార! గోవింద! ముకుంద!
మాగధచైద్యాది మనుజేశ్వరాళి
లాగున నా కవలక్షణాల్ పెక్కు
గలవు. రుక్మికివలె గర్వగుణమ్ముఁ
గల దెంతమాత్రమ్ము కడమ లేకుండ 3130
ఆ లక్షణమ్ముల నన్నింటి మాన్పి.
నీ లీలల నెఱుంగు నియమమ్ము నేర్పి
నను నీదు దాసజనమ్మునఁ జేర్చి
యనయమ్ము నీ కరుణాతిరేకమ్ము
నా పయి వెలయించి ననుఁ బ్రోవుమయ్య
శ్రీపతీ! నీకుఁ జేజే లొనరింతు
హరి! పద్మనాభ! లోకావననిరత!
సరసిజ సంభవ సన్నుత చరిత! 3134

దశమస్కంధము — పూర్వభాగము

సమాప్తము

# శ్రీ ప్రార్థనా భాగవతము

## దశమస్కంధము

### ఉత్తరభాగము

### ప్రద్యుమ్న చరిత్రము

శ్రీకృష్ణ! వాసవార్చిత దివ్యపాద,
గోకుల సంచార, గోపికామార,
అక్రూరవరద, మురాంతక, శౌరి,
చక్రి, బలిధ్వంసి, శార్ఙ్గి, కంసారి!
ఈ జగన్నాటక మేర్పడ నడచు
నోజ యంతయు భవదూహమాహాత్మ్య
మవుఁగద దేవ! యట్లయ్యును గొన్ని
యవసరముల నించుకైన మఱేమి
యెఱుఁగని యట్లుందు వెందుకో స్వామి!
పరమపూరుష! జగత్పావనచరిత!

హరుకంటిమంట దగ్ధాంగుఁడై మరుఁడు
సిరికి మాఱటయయి చెలఁగు రుక్మిణికిఁ
బొడమి ప్రద్యుమ్నాఖ్యఁ బొందె నా శిశువు
పొడముట విని తన్నుఁ బొలియించు శత్రు
వాతఁడే యని శంబరాసురుఁ డనెడు
దైతేయుఁ డొక్కఁ డంతకుమున్నె తాను
వినియుంట భయపడి వేగమ వచ్చి
తనమాయఁ బ్రకటించి తల్లి పొదిగిట
నిదురించుచుండు నా నిసువుఁ గొంపోయి
యుదధిలోఁ బడనూకి యులుకెల్ల మాని

తన గృహంబునకేగెఁ దప్పెఁ జా వనుచు
వనజనాభా! భావివర్తన మెటులొ!

తదుపరి జలధి మత్స్యమ్మొండు చెలఁగి
కదిసి గ్రసించె. నక్కందుఁ బ్రద్యుమ్ను
జలనిధిఁ గొందఱు జాలరుల్ చేరి
వలల సాయమునఁ జేఁపలు వట్టుచుండ
బాలుని మ్రింగిన వైసారిణమ్ము
జాలలఁ దగిలి బెస్తలచేతఁ బడియె
వారల మ్మీను శంబరునకు భక్తి
మీఱఁ గానుకగ నీయ మెచ్చి యతండు
దానిని వండి తేఁ దన వంటవాని
కానతిచేసె: మహానసమందు
సూపకారుఁడు దానిఁ జురకత్తిఁ గోయ
పాపఁ డొక్కండు గన్పడియెఁ దత్కుక్షి
సంతకుమున్నె పంచాస్త్రుండు నీదు
కాంత శ్రీ రుక్మిణి గర్భజుఁ డగుట
కూళ శంబరుసేత గురుమీన మొండు
బాలు మ్రింగుటయు దేవముని మూలమున
రతి యెఱుంగుట నామె ప్రాణేశుఁ డవల
నతిమనోహరరూప మందు నటంచు 20
శంబరునిల్లు వాసముగాఁగఁ జేసి
పంబిన ప్రత్యయభావమ్ముతోడ
మాయావతి యనెడి మారునామమునఁ
బాయుని శీలసంపత్తితో నుండె

మీను గర్భంబున మెదలుచున్నాఁడు
కూనఁడొకండు నాకుం జోద్య మయ్యె"

నను బానసీని వ్యాహారమ్ము లెల్ల
విని రతీదేవి యా పిన్న వాఁడే మదనుఁ
డని నిశ్చయించి పుత్రార్థిని యటులు
దనుజు శంబరుని ప్రార్థనచేసి, యతని
సమ్మతి వడసి వెసంజని బాలు
నెమ్మిగ దెచ్చి మన్నికఁ బెంచుచుండె
దినదినవృద్ధిఁ జెందెను బాలకుండు
కను గొనఁ బ్రాయంపుఁ గలిమియు నిండె
నాతని సౌందర్య మంగనాతతికి
చేతముల్ గరఁగఁ బెంచెను మోహబుద్ధి
ఆ పంచశరుని మాయావతి గాంచి
యాపఁగరాని మోహాబ్ధి మునింగి
సురతమ్ముఁ గోర నా సుందరిఁ జూచి
కర మనిష్టముగ నా కాముఁ డిట్లనియె 30
"నా పుత్రుఁ డితఁడను న్యాయమ్ము వీడి
స్త్రీ పవిత్ర గుణమ్ముఁ జెడుదారిఁ బెంచి
మాతృభావమ్మును మంటలోఁ గలిపి
నాతో సుఖింప స్వాంతమ్మున నెంతె?
మాత! యిదేటి ధర్మము చెప్పుమమ్మ?
యా తీ" రనఁగ రతి యతని కిట్లనియె
"విను, నీదు చరితమ్ము వినిపింతు నీకు
మును జన్మమున నీవు పుండరీకాక్షు
సుతుఁడవై మదనాఖ్య శోభిల్లినావు
హితమతి భార్యగా నే నుంటి నీకు
నే రతియనుదాన, నీ జన్మమందు
నారయఁ బురుటింటి యర్భకు నిన్ను

మాయావియైన శంబరుఁడు గొంపోయి
తోయధి వైచెఁ నందుననున్న యొక్క
మీను నిమ్రింగెఁ న మ్మీనోదరమ్మె
యీ నీదు జన్మకు హేతువై యొప్పె
గతమిదిః మీదటికార్య మెట్లనినఁ
జతురుఁడు మాయావి శంబరాసురుఁడు
నిను వీఁ డిటులఁ దెచ్చె నీ తలిదండ్రు
లనయమ్ము పుత్రశోకార్తులై యెట్లు 40
మనియున్నవారొ, యీ మాయావి ముందుఁ
దునుమాడు మంచుఁ బ్రద్యుమ్నున కామె
సర్వశత్రువుల నాశ మ్మొనరించు
దుర్వారమహిమ పృథులమగు నొక్క
మాయామహావిద్య మంత్రయుక్తముగ
నాయెడ బోధింప, నతఁ డంత రేఁగి
సకలాయుధములు హస్తములందుఁ దాల్చి
ప్రకటిత బలపరాక్రమముల వెలసి
క్రూరు శంబరు నెదుర్కొని వానితొంటి
నేరముల్ వివరించి, నిలుమని కదన
మందున వానిని హత మొనరించె.
సుందరి రతికి నిస్తులమోద మయ్యె

అంతట నారతి యాత్మేశుఁ గొంచు
వింతగాఁ దనమాయ వెలయ విన్వీథి
నేతెంచి ద్వారకఁ గృష్ణః వైదర్భి
శాతకుంభమయ ప్రశస్తాలయమును
జొచ్చి యంతఃపుర సుదతులకెల్ల
నచ్చెరువుగ గత మంతయుఁ దెల్పె.

నీరజభవనుత! నీకు రుక్మిణికిఁ
బారమ్ముమీఱిన ప్రమదమ్ము గలిగె. 50
తామరసాక్ష! నీ తత్త్వ మెట్టిదియొ
యే మానవుండేని నెఱుఁగడు స్వామి!
ఏ కార్య మెవనిచే నెటుగావలయునొ
యా కార్య మతనిచే నటులఁ జేయింతు
వాదిదేవా! శంబరాసురుఁ డీల్గ
నేదిమార్గమ్మొ నీ కెఱుకయై యుంట
వానిచావునకు లవమ్ము యత్నమ్ము
పూనని యట్లుంటి పురుషవరేణ్య!
మరుఁడు ప్రద్యుమ్నుఁడై మరుపుట్టు వొంది
పరమసంతోషసంపద రతి పొందఁ
గరుణించితివి సాక్షిగానుండి కృష్ణ!
మురహర, పురహరపూజితచరణ!

క్రూరశంబరుని లాగునను నాలోన
నోరువరాని దురూహలు గలవు
వాని నన్నింటి శ్రీవల్లభా! మాన్పి
నీ నామభజనమ్ము నియమమ్ము నేర్పి
కాపాడుమా నన్ను ఖగరాజగమన!
నీ పాదములె దిక్కు నీరధిశయన!

## స్యమంతకమణి వృత్తాంతము

### జాంబవతీసత్యభామల శ్రీకృష్ణుఁడు పరిణయముచేసికొనుట

శ్రీయదునందన, శ్రితపారిజాత,
కాయజజనక, జగజ్జాలనేత, 60

దామోదరా, గిరిధారి, మురారి,
సామజపాల, కృష్ణా, చక్రధారి!
జగతిమానవులు సంశయ చిత్తు లగుచు
దగవుమాలుచును సత్యముఁ గనఁబోక
పరులపై నిందలు పడవైచుచుందురు
మరల సత్య మెఱింగి మది విచారమ్ముఁ
బడయుచుండుదు రట్టివారలఁ గూడఁ
గడుదయఁ జూతువు కమలాక్ష! నీవు.

అవని సత్రాజితుఁ డనువాఁడు మున్ను
రవిని సేవించి యా గ్రహరాజువలనఁ
బ్రతిదిన మెనిమిది బారువల్ పసిఁడి
నతిచిత్రముగ నిచ్చునట్టి స్యమంత
కమ్మను మణిఁ బొంది కంఠమ్మునందు
నిమ్ముగఁ దాలిచి యెసఁగు తేజమున
ద్వారకఁ జేరెఁ! దత్పట్టణవాసు
లా రమ్యమణికాంతి కచ్చెరువొంది
దాని మాహాత్మ్యమంతయు వా రెఱింగి
జ్ఞానస్వరూప! కృష్ణా! నీకుఁ దెలుప
శ్రీదయితా! నీవు చింతించి మణిని
యాదవవిభున కిమ్మనుచును గోర 70
తా నీయ ననియె సత్రాజితు దాని
మానితి వాకోర్కి మాధవా, నీవు

అంతటఁ గొన్నాళ్ల కా స్యమంతకము
సంతసమున గళస్థలిని ప్రసేనుఁ
డనువాఁడు సత్రాజిదనుజుఁడు దాల్చి
వనికేగె మృగయేచ్ఛ, వాని నొక్కండు

పంచాస్యము వధించి, భాసిల్లు మణిని
గొంచేగ, దానిని గూల్చి యమ్మణినిఁ
గని జాంబవంతుండు గైకొనిపోయి
తన గుహఁజేరి యాత్మజ జాంబవతికిఁ
బ్రమదమ్ముతో నాటబంతిగా నిచ్చె
కమలనయన! కొంతకాలమ్ము గడచె.

అనుజుఁడైన ప్రసేనుఁ డగపడఁ డంచుఁ
దన స్వాంతమందు సత్రాజితుఁ డార్తి
నొంది "మా సోదరుఁ డుత్సాహపడుచుఁ
బొందుగా మణిఁ గంఠమునఁ దాల్చి వేఁట
తమకమ్ముతోడఁ గాంతారమ్ము చేర
సమయము గని వానిఁ జంపి కృష్ణుండు
మణిఁ గొనె, మర్యాద మానె" నటంచు
నిను దూఱ మొదలిడె నిర్మలచరిత! 80

ఆ దూఱు నీ కసహ్యమ్మయి మిగుల
వేదన గల్గింప, వెస విపినమ్ముఁ
జేరి యెల్లెడల ప్రసేనుని వెదకి
నీరదాభశరీర! నీ వొకచోట
చచ్చినయట్టి యశ్వమ్ముఁ బ్రసేను
న చ్చేరువనె యొక హర్యక్ష శవముఁ
గని, యా కుఱంగట గాఢాంధకార
మున నున్న గహ్వరమును బ్రవేశించి
యందొకబాలిక కాటాడఁ దగిన
కందుకమ్ముగ బ్రేలఁగట్టి యున్నట్టి
మణిఁగని దాని నెమ్మదిగఁ గైకొనెడు
ననువు యోచించి నీ యడుగుల మెల్ల

మెల్లగా నిడి బాల మెలఁగెడు చోటి
కల్లనఁ జేరితి వయ్య శ్రీకృష్ణ!
అంతట నిగ్గాంచి యా బిడ్డదాది
స్వాంతమ్ము చెదర సాధ్వస మొంది యఱచె
నా రవమ్మును విని యతివేల బాహు
సారవంతుండగు జాంబవంతుండు
త్వరితమ్ముగా గుహాంతరముననుండి
యరుదెంచి, నిగ్గాంచి యలుకను బెంచి 90
నిను కృష్ణ! సామాన్యునిగ మదినెంచి
తన దైవమని మదిఁ దలఁపక దురము
నీ తోడ సలుపంగ నిలిచె నత్తఱిని
శ్రీ తరుణీ ప్రియ! శ్రితజనగేయ!

బవరమ్ము నీతోడ భల్లూకరాజు
సవతు గానని బాహుసంపద మెఱయఁ
గావించె; విజయమ్ము గాంచ నెమ్మదిని
భావించెఁ గాని గోవర్ధనోద్ధార!
భవదీయ ముష్టి సంప్రహరముల్ వాని
యవయవమ్ముల నొంప, నతఁ డోర్వలేక
భీతాత్ముఁడై పోరు విడిచి నిగ్గాంచి
యీ తెఱంగునఁ బల్కె నిందిరానాథ!

"ఆదిదేవా! జగదాధార! శౌరి!
ఆదినారాయణ! అఖిలాధినేత!
విశ్వాత్మకుఁడ వీవె, విష్ణుఁడ వీవె
విశ్వమ్ము నీవె, నీవే నాదు వేల్పు
జలధి బంధించి, రాక్షసులఁ బోకార్చి,
ఖలు రావణునిఁ జంపి, ఘను విభీషణుని

రాజుగా నిల్పిన రాముఁడ వీవు
నా జన్మ తరియించె నా దేవుఁ గాంచి 100
నీవె రాముఁడవను నిజ మరయమిని
గావరమునఁ దప్పు గావించినాఁడ
నాదు దోషమ్ము లెన్నక త్రోసిపుచ్చి
నీ దయ నన్ను మన్నింపుమో దేవ!"
అని వేఁడ కృష్ణ! నీ వతని కిట్లంటి
"విను జాంబవంత! యీ విమలమౌ మణిని
కపటచిత్తమున నే గ్రహియించి నట్టు
లపవాదు నా పయి నందఱు మోప
నా వాదు తొలగించు యత్నమ్ముతోడ
నీ వాసముంజేర నే వచ్చినాఁడ"

ఆ పల్కులను విని యరుసమ్మునంది
పాపదూరుఁడు జాంబవంతుండు మణిని
తనసుత రూపసుందరి జాంబవతినిఁ
గొనివచ్చి నీకు మక్కువ కానుకలుగ
నిచ్చెః నాతనిపయి నెనలేని ప్రేమ
హెచ్చెను నీకు సురేశ్వరవంద్య!

అంతటఁ గృష్ణ! నీ వచ్చటినుండి
కాంతతోఁ మణితోడఁ గ్రమ్మఱి పురిని
జేరి సత్రాజితుఁ జీరి, బందుగులు
పౌరు లున్నట్టి సభామధ్యమందు 110
నీ దూఱు తొలఁగంగ నిజ మేర్పడంగ
మోదమ్ముతో నీవు పూనినయట్టి
యత్నమ్మునుం దెల్పి యంద ఱెఱుంగ
రత్నమ్ము నిడితి సత్రాజిత్తుచేత

నాతఁడు లజ్జ గృహమ్మున కేగి
చేతమ్ము కళవళస్థితిఁజెందఁ దనదు
సాహసమునకుఁ బశ్చాత్తాప మంది
శ్రీహరి చెలిమియే శ్రేయం బటంచు
మది నూహచేసి స్యమంతకమణిని
సదమలాంగిని పుత్రి సత్యను దెచ్చి
నందకుమార! ఆనందాన నీకు
బందుగుల్ గన సమర్పణము గావించెఁ
గాని యమ్మణి నీవు గైకొన కపుడ,
వానికే యొసఁగితి వసుదేవతనయ!
ఆ రీతి నీ పయి నాన్చిన యట్టి
దూఱు పోఁద్రోలి సంతుష్టితో నీవు
జాంబవతిని మఱి సత్యను గూడ
నింబుగాఁ బెండ్లాడి తీశ్వర! కృష్ణ!

నీ పయిఁ నిందలు నిర్నిమిత్తముగ
మోపె సత్రాజిత్తు మూర్ఖుఁడై మొదట 120
పదపడి సత్యమ్ము బాగుగ నెఱిఁగి
మదిఁ దనదుష్ట కర్మకు బాధ నొంది
తనతప్పు మన్నించి, దయఁ జూపు మనుచు
నిను వేఁడ నాతని నేరమ్ముఁ దడవ
కనుకంపతో వాని నాదరించితివి
నిను సర్వసామాన్యునిగఁ దలపోసి
యుని యొనరించిన యా జాంబవంతుఁ
గనికరించితి! వాని గడుసుదనమ్ము
మదిలెక్కవెట్ట వే మాత్రమ్ము మఱియు
ముదమంది తాతని పూజ్యభావనకు

నపవాదజీవిత మతిహేయ మనుచు
నపకారులైన నిజాపరాధముల
మన్నింపు మనివేఁడ మన్నించుగుణము
కన్నా కనుచు నీ జగ మ్మెఱుఁగంగ
నీ నాటకమున నీ విటుల నాడితివి
కాని, నిన్నంటునే కలుషముల్ స్వామి!

అరయమి నేఁజేసినట్టి దోషమ్ము
లరయఁ బెక్కులుగల వంబుజనాభ!
కాని, యా దోషముల్ గమనించి, నిన్ను
ధ్యానించి మన్నింపుమా స్వామి యనుచు 130
వేఁడెడు సద్బుద్ధి వెదకినఁ గాని
నా డెందమున లేదు నగధర! కృష్ణ!
శ్రీరమారమణ! నీ చిత్తమ్ములోన
నే రీతిఁ గాపాడ నెంచెదో నన్ను
నీ పాదములె దిక్కు నీరధిశయన!
నా పాలివేల్పవె నాగారిగమన!

## శతధన్వుఁడు సత్రాజిత్తును చంపి మణిని హరించుట

శ్రీమానినీమణీ చిత్తవిహార,
కామితఫలదాయకా, యదువీర,
నారాయణా, గోపనారీవిలోల,
దూరీకృతాఘ, నిస్తుల నిత్యభోగ!
చెడు పరబోధనల్ చెవి కింపు లగుటఁ
గడుఁబ్రీతి విని వానిఁ గలుషకార్యముల
నరులు గొంద ఱొనర్చి న్యాయమ్ము దెలిసి
తరువాతఁ బెక్కుబాధల నొందుచుంద్రు.

మరియును గొంద అమాయికప్రజల
దురితంపుఁ బనులకు దొరకొనఁజేసి,
కడుఁ జిక్కులంబడి గాసిని జెంది,
యెడఁద కలఁగఁ దపియించుచు నుంద్రు —
అట్టివారలఁగూడ నచ్యుతా! యెట్టు
లెట్టుల దండింతొ, యెటులు మన్నింతొ 140
ఆ యుపాయమ్ముల నవని నెల్లరకు
శ్రేయమ్ముఁగూర్చుటే శ్రీశ! నీతలఁపు.
అండజధ్వజ! నీవు హస్తిపురాన
నుండంగ, ద్వారకనుండు నక్రూర
కృతవర్మ లాప్తమైత్రీ బంధవృత్తి
శతధన్వుఁడను వాని సరసను జేరి
“కనుగొంటె తనసుతఁ గన్యను సత్య
మన కిత్తునని చెప్పి, మాటను దప్పి
దామోదరునకు సత్రాజితుఁ డొసఁగి
మోమోటమిని మాని మురియుచున్నాఁడు
ఖలు వానిఁజంపి యే కరణినినైన
నల శమంతకము గొమ్మా నీవు కడిమి”
అని తన్ను ప్రేరేప నా శతధన్వుఁ
డనయుఁడై కటికవాఁ డావును చంపు
రహి నిదురించు సత్రాజితుఁ జంపి
సహధర్మిణులు వాని సతు లేడ్చుచుండ
మణిఁగొనెఁ నమ్మాడ్కి క్రమందిన జనకుఁ
గని సత్య మిగుల నాక్రందించి యవల
కరిపురమునకు వేగమ వచ్చి నీకు
జరిగిన ఘోరవిచారకార్యమ్ము 150

వినిపించి, విలపింప, వేవేగ నీవు
వనిత నామెనుగొని, ద్వారకఁజేరి
శతధన్వుఁ జంపంగ స్వాంతానఁ దలఁప
నతఁడు నీ చేయు ప్రయత్నమ్మెఱింగి
ప్రాణభీతిని గృతవర్మ నక్రూరుఁ
బ్రాణబంధువులని భావించి తనకు
సాయమ్ముగోర నా శతధన్వుతోడ
నా యిరుగురు బంధు లనిరి యీలాగు
"జలజాక్షుఁ గృష్ణుని సామాన్యు గాఁగఁ
దలఁచితే యాతనిఁ దగిలి యుద్ధమున
కంసాది నృపులు, రాక్షసులు పెక్కండ్రు
హింసింపఁ బడరె: నీకేల యీభ్రాంతి?
వాసుదేవునితోడి వైరమ్ము తగదు
మా సాయ మనుమాట మఱచిపోవయ్య"

ఆ పల్కు లాలించి యతఁ డెదనిట్టి
యాపదవేళ త న్నాదుకొనంగఁ
దగు నాప్తు లెవ్వరుఁ దనకు లేరంచు
వగనొంది యక్రూరు వశమున మణిని
పదిలమ్ముగా నుంచి భయమున మనసు
చెదర గుఱ్ఱమునెక్కి చెచ్చెర నూరు 160
యోజనమ్ముల దూర మొక్కపట్టుననె
బేజారు నెఱుఁగక వెళ్లె నెచ్చటికొ,
శతధన్వుఁ డేగినజాడను బట్టి
యతుల వేగాన్విత స్యందన మెక్కి
జలజాక్ష! నీవును జని యొక్కచోట
నలసి యశ్వము డిగ్గి యార్తుఁడై పఱచు

నా రిపు శతధన్వు హత మొనరించి
వారిజేక్షణ! వాని వస్త్రమ్ములందు
మణిని గానక వేగ మరలి ద్వారకకుఁ
జనుదెంచి సత్యకు సర్వమ్ము దెల్పె.
యా మణి ద్వారకయందు నెవ్వాని
చే మాటువడెనొ చెచ్చెరఁ గనుఁగొందు
నని యామె నోదార్చె తచ్యుత! నీదు
ఘన ప్రయత్నమ్ము నాకర్ణించి, మఱియు
చక్రాయుధమ్ముచే శతధన్వు మృతియు
నక్రూరకృతవర్మ లాలించి, భీతి
ద్వారకానగరమ్ము వదలి యెచ్చటనొ
దూరప్రదేశమందునఁ జేరుకొనిరి.

అంతటఁ గొన్నాళ్ల కా ద్వారవతిని
వింత నుత్పాతముల్ పెక్కు లేర్పడియె. 170
వర్షపాతములేక, పంటలు లేక,
హర్షమ్ము ప్రజలలో నడుగంటి పోయె –
శారీరకమ్మగు సంకటమ్ములును
ఘోరమై ప్రజలకుఁ గుం దేరుపడియె
నాతీరుఁ గని పెద్ద లందఱుఁ జేరి
భీతాత్ములై యదువీర! నీచెంత
కరుదెంచి యా బాధ లన్నియుఁ దొలఁగు
తెఱఁ గిదియని నీకుఁ దెలిపి రీరీతి
"వనజాక్ష! కృష్ణ! యీ ద్వారకనుండి
యనఘుఁ డా యక్రూరుఁ డరిగిన పిదప
మనకిందు నింతటి మార్పులు దోఁచెఁ
గనని విననియట్టి కష్టమ్ము లయ్యె

సతఁ డున్నస్థలమున నమరు శుభమ్ము
లతఁడు లేని స్థలాన నడరు కష్టమ్ము
లతఁడు వచ్చిన వర్ష మప్పుడే పడును
వెతలెల్లఁ దొలఁగు ని వ్వీట నెల్లరకుఁ
గావున నాతనిఁ గరుణ రప్పించి
యీ వీట శుభముల నెసగింపుమయ్య!
అనివేఁడ వారల యభ్యర్థనమ్ము
విని యార్తరక్షణ బిరుదాంచితుఁడవు. 180
నీవు దూతలఁ బంపి నెమకించి పూజ్య.
పావను నక్రూరు ద్వారకాపురికి
రావించి, పూజించి, ప్రణయమ్ము చూపి
యీ విధమ్మున నంటి విందిరారమణ!

"శతధన్వుఁ డటువెళ్లు సమయమ్మునందు
హితుఁ డంచు మణిని నీ కిచ్చుట దెలిసె.
సత్రాజితుని మృతి జరిగె. నాతనికి
పుత్రసంతతి లేదు. పుత్రికల్ గలరు
వారె యాతనికయి వలయుకార్యములు
చేరి యొనర్చి యాస్తిని పంచుకొంద్రు
మణితెఱఁ గెఱుఁగ రా మానినుల్. వారు
నను సంశయింతు రెన్నఁడు వంచకునిగ
మరియు మా యన్న నమ్మఁడు నన్నుఁ: గనుక
కరము నా మాటపై గౌరవ ముంచి
మన బందుగులకెల్ల మణి నొకపారి
కనిపింపఁగాఁ జేసి, గ్రహియింపు మీవె"
అను నీదు వచనమ్ము లాలించి యతఁడు
తనదు వస్త్రమ్మున దాఁచియున్నట్టి

మణిని నీ చేనుంచెః మాధవా! దాని
గనుఁడని బంధువర్గమునకుఁ జూపి 190
మరల నాతనికె న మ్మణి నిచ్చితీవు
గరుడకేతన! కృష్ణ! కంజదళాక్ష!

అక్రూర కృతవర్మ లాప్తులు వోలె
నక్రమచర్యల నాచరింపంగఁ
బురికొల్పఁ గడు గర్వమున శతధన్వుఁ
డరయ సత్రాజిత్తు హత మొనరించి
మణిఁగొనెః నీ చేతఁ బ్రమందెః నాతనికి
మును రెచ్చగొట్టిన ముఖ్యు లేరైన
సాయపడిరె కష్టసమయమ్మునందు?
న్యాయ మేమూల నణంగెనో కృష్ణ!
మొదట దుర్బోధనల్ పొందుగాఁ జేసి
పిదప విపద్వేళ వెనుకంజ వేసి
శతధన్వు మృతి విని సాధ్వసంపడుచు
ధృతిసెడి యక్రూర కృతవర్మ లెటకొ
పారిపోయిరిః కాని వారలలోన
ఘోరాఘదూరు నక్రూరునివలన
ద్వారకఁ జెడుగులు దగ్గు నటంచు
పౌరులుసెప్ప న ప్పరమ పుణ్యాత్ము
రావించి. మన్నించి. ప్రజకు మోదమ్ము
గావించితివిః మణిగలచోటు చూపి 200
ప్రజల విశ్వాసమ్ముఁ బడయుటేగాక.
నిజముఁ దేల్చితివయ్య నీరజనయన!
నీ నేర్పు నీ తీర్పు నిఖిలలోకముల
కానందముంగూర్చు నయ్య ముకుంద!

శతధన్వువలె పరుల్ చాటు మాటలను
హితవాక్కులని నమ్మి యెగ్గు కర్జమ్ము
లొనరించితిని గాని, యున్నసత్యమ్ముఁ
గనినవాఁడనుగాను, కమలాక్ష! నేను
వక్రగుణములున్న వాని మన్నింప
అక్రూరునంత మహాత్ముండఁ గాను
నింతటియధము నన్నెటు కటాక్షింతొ?
దంతివరద, నీదు దాసుఁడ నయ్య
నిరతమ్ము నిన్ను ధ్యానించెద నయ్య
పరమపూరుష! నన్నుఁ బాలింపుమయ్య

## శ్రీకృష్ణుఁడు కాళిందీప్రభృతి కన్యకల పెండ్లాడుట

శ్రీవత్సచిహ్న, రాజీవాభచరణ,
కైవల్యసంధాత, కౌస్తుభాభరణ,
గోవింద! నీ భక్తకోటి యెందున్న
నీవె యచటికేగి నిఖిలభాగ్యములఁ
గోరినవెల్లను గొరలేనియట్లు
వారికిఁ గూర్తు వపారహార్దమునఁ 210
గావున నీ వెందుఁ గాలిడ నచట
భావుకములు నీకు వశమగుచుండు
నుపకార చింతనమున్న వారలకు
నెపుడు శుభంబులే యెసఁగుచునుండు

నీదు మేనత్త కుంతికిఁ బాండవులకు
ఖేదమ్ముమాన్పి మిక్కిలిగ మోదమ్ముఁ
గలిగింప: వారితోఁ గలసికొన్నాళ్ళు
లలి నివసింపఁ దలంచి యొకప్డు

తరలి వారుండు నింద్రప్రస్థపురముఁ
గరము సంతోషమ్ముగాఁ జేరుకొంటి
వత్తయు బావలు హర్షమ్ము నొంది
రత్తఱి నొక్కనాఁ డర్జునుఁ డడవి
వేఁటాడఁ జనుచుండ వేడుక నీవు
గాటంపుఁ బ్రేమతోఁ గదలితి వనికి

అ వ్విపినాంతరమందు మృగాళి
వివ్వచ్చుఁ డెసరేఁగి, వేఁటాడి యలసి
దగ గొని నీవు నాతఁడు చని యమున
దిగి, వార్చి, నీరమ్ము తృప్తిగాఁ ద్రావి
దరిఁజేరి సైకతస్థలి విశ్రమించి
సరస సంభాషణల్ సాగించుచుండ 220
న య్యమునా తరంగావళి నడుమ
తియ్యవిల్కాని చేతికటారిఁబోలు
సుందరి నొక్కతఁజూచి యాశ్చర్య
మందితి రిద్దఱు యదుకులాభరణ!

అంత నర్జునుఁడు నీ వనుప న క్కన్య
చెంతకు నరిగి వచించె నీ రీతి
"సుదతి! నీ వెవత విచ్చోటఁ గన్పడితి?
వెది నీదు కోరిక? యెద్ది నీ పేరు?
కనఁగ వైవాహిక కాంక్ష నీ విటకుఁ
జనుదెంచి నటుదోఁచెః సత్యమే యైన
భవదీయ జననాది భవ్యచరితలు
వివరింపుమా యరవింద దళాక్షి!"

ఆ పల్కులను విని యర్జునుతోడ
నా పువుఁబోడి యిట్లనియె నెమ్మదిగ

"ఓ నరవర! వినుమోయి! నా చరిత
మేను సూర్యునిసుత, నెల్లరు నన్ను
కాళింది యందురు కమలాక్షు విష్ణు
హాళి మీఱఁగ నస్మదాత్మేశుఁగాఁగఁ
జేసికో నెడఁద నిచ్ఛించి యీ నదిని
భాసుర భాస్కరాపాదితమైన 230
నిలయమందున తపోనిరతి నే నుందుఁ
దెలియఁ జెప్పితిని నా తెఱఁ గెల్ల మరియు
"సరసిజనాభుఁడు చనుదెంచు, నిన్ను
వరియించు, నీ కోర్కి ఫలియించు" ననుచు
నా పిత వచియింప నమ్మియున్నాను
ప్రాపించునే యట్టిభాగ్యమ్ము నాకు!

అప్పల్కులను నీకు నయ్యర్జునుండు
చెప్ప మోదించి, యచ్చెలువ శతాంగ
మున నిడికొనివచ్చి, పూజ్యు ధర్మజునిఁ
గని తెల్పితివి కృష్ణ! కన్యకాప్రాప్తి

విశ్వాత్మ! పాండవుల్ వేడుకపడఁగ
విశ్వకర్మను శిల్పవేది రావించి
వారి పురము త్రిదివమ్మటులుండఁ
దీరుపు మంటివి దివిజులు మెచ్చ
ఖాండవదహనమ్ము కాలమ్మునందు
పాండవమధ్యము వహ్నిదేవునకు
సాయమ్ము చేయ నాజ్ఞాపించి, యిప్పు
డా యగ్నివలననే యయ్యర్జుననకుఁ
దఱగనిదొన, నభేద్యంబగు జోడు
నరయ గాండీవాఖ్య నలరెడి ధనువు, 240

దివ్య రథంబునుఁ దెల్ల గుఱ్ఱములు
భవ్యం బటంచును బడయఁజేసితివి
మరియు ఫల్గునునకు మయునిచే నొక్క
యరుదు సభ లభింప నాజ్ఞచేసితివి
ఈ విధమగు శుభా లెలమి పాండవుల
కావహిల్లఁగఁ జేసి, యచ్చోటునుండి
వారల వీడ్కొని ద్వారకాపురము
సూరజతోఁ జొచ్చి శోభనమెసఁగ
నొకపుణ్యదినమున నుత్తమవేళ
సకల బంధుల సమక్షమునఁ నా కన్య
వికచాబ్జనేత్రను బెండ్లియాడితివి
యకలంకచరిత, మహాత్మ, శ్రీకృష్ణ!

## మిత్రవింద పెండ్లి

విందానువిందులు బృందవిహార!
బందుగుల్ నీకు నవంతికిఁ బ్రభులు
తమ యనుఁగున్ సహోదరి మిత్రవింద
నమలాంగి నీ మేనయత్త పుత్రికను
కమలాక్ష నీకొసంగక స్వయంవరము
కుమతులై చాటిరి క్షోణీశు లెఱుఁగ
ఆ స్వయంవరమున కరుదెంచి యచటి
భూస్వాము లెల్ల రబ్బురపడ వారిఁ 250
గలన జయించి యాకన్యకఁ దెచ్చి
విలసిత మోదానఁ బెండ్లియాడితివి

## నాగ్నజితి పెండ్లి

కోసలాధీశుఁడు గుణి నగ్నజిత్తు
వాసిగన్నాఁడు భూవర సమూహమున

నాతఁడు తనపుత్రియగు నాగ్నజితికిఁ
జేతమ్మునం బెండ్లి సేయంగఁ దలఁచి
మదమెక్కి వీరులౌ మనుజులఁ గన్న
బెదరక తన వీట విహరించుచున్న
యే డాలపోతుల నెవఁడు జయించు
వాఁడు నా పుత్రికి వరుఁ డగునంచు
పోటరులైనట్టి భూపతుల్ వినఁగ
చాటింపువేయించె సర్వదేశముల
నచటికి నీ వేగి యాలపోతులను
ప్రచురమౌ నీ బాహుబలమున నొంచి
వాసి మీఱగ గుణవతి నాగ్నజితిని
గోసలాధిపుఁడు నెక్కుడుగఁ గొండాడ
సత్సంప్రదాయ ప్రశస్తమార్గమున
నుత్సాహమునఁ బెండ్లి యొనరించుకొంటి.

## భద్రవివాహము

కేకయాత్మజ శ్రుతకీర్తితనూజ
ప్రాకటగుణభద్ర భద్రను నీదు 260
మేనమఱందలి మిక్కిలి పేర్మి
శ్రీనాథ పెండిలిచేసి కొన్నావు

## లక్షణవివాహము

చిరయశోనిధి బృహత్సేనుఁడు మద్ర
నరపతి తనపుత్రి నవకుసుమాంగి
యగు లక్షణకు వివాహము చేయఁ దలఁచి
గగనమ్మునందునఁ గన్పడకుండ

భువి నీటి నడుమను బొడగట్టునట్టి
నవమగు మత్స్యయంత్రమ్ముఁ గల్పించి
యెట్టివారలకేని యెత్తను దివియఁ
బట్ట వలనుగాని బలమైన ధనువుఁ
గులిశమ్మునకు సాటి కొఱలేనియట్టి
యలఘునారాచమ్ము నమరిచి వానిఁ
గుసుమగంధాక్షతల్‌గూర్చి పూజించి
వసుధఁ జాటెను స్వయంవరవార్త యిట్లు—
"ఎవ్వఁడీ విలునమ్ము లిమ్ముమై వాడి
నివ్వటిల్లెడు తననేరుపు తెలియ
నిమ్మత్స్యయంత్రమ్ము నిలఁబడివేయు
నమ్మగవాఁడె మదాత్మజవిభుడు

ఆ వార్త కడు వ్యాప్తమౌట నాలించి
భావముల్ నవవధూవరణేచ్ఛఁ దమ్ముఁ 270
బ్రేరేపఁ దమ బాహువీర్యముల్ సూపి
గౌరవమునఁ గన్యఁ గైకొంద మనుచుఁ
జనుదెంచి రాత్మవిశ్వాసమ్ము చెలఁగ
మనుజేశులెల్ల రా మద్రేశుపురికి
వచ్చిన వారికి వసుమతీశుండు
పెచ్చుసత్కారముల్ పేర్మిఁ జేయించె
జనపతుల్ ధనువుపజ్జకు నొక్క రొకరు
చనుదెంతురే గాని చాపమ్మునెత్త
నేమాత్రమును నేర్పు, హెచ్చుశక్తియును
సామర్థ్యమునులేక చనిరి సిగ్గిలుచు
భీమ, రాధాపుత్ర, విజయులుగూడ
నా మాడ్కి విఫలులై రబ్బురపడుచు

నా సమయమ్మున నటకేగి నీవు
భాసురమై చాల భారమైయున్న
చాపమ్ము పై కెత్తి శర మరిఁబోసి
చూపునఁ బడక నిస్తుల వేగమునను
చదలునం దిరుగు మత్స్యముఁ బడనేసి
ముదముగూర్చితి మద్రభూపరేణ్యునకు
నమితమోదము గల్గె నా రాజసుతకు
సమరులు గురియించి రలరులవాన 280
నంత లక్షణ తండ్రి యనుమతి వడసి
సంతసము విరిసరి నొండునీదు
కంధరమ్మున వేసి కడుఁపేర్మి చూపి
బంధువర్గముమెచ్చ వరియించె నిన్ను
సురల నిర్జించి విశ్రుతకీర్తితోడ
గరుడుఁడు పీయూష కలశమ్ముఁ గొన్న
చందాన సకలరాజన్యుల లక్ష్య
మందు నుంచక కన్య నక్కునఁ జేర్చి
కొనితెచ్చి రథమునఁ గూర్చుండఁ జేసి
ఘనవైభవమ్మునఁ గదలితి కృష్ణ!
నీదు సామర్థ్యమ్ము నీ ప్రాభవమ్ము
ఖేదమ్ము గూర్ప మిక్కిలి యీసునొంది
నిను లోకసామాన్యునిగఁ దలపోసి
యనయులు ప్రముక్కడి యవనీశులెల్ల
నిలుము పోనీయము నిన్ను మే మనుచు
పలుసాయకములు నీపైఁ బ్రయోగింప
దొరకొన వారల దోర్బలశక్తి
సరకుగొనక భవచ్ఛార్జ్గ విముక్త

శరవృష్టి ముంచి కష్టముల పాల్సేసి
పరిమార్చి తా శత్రువారమ్ముఁ గృష్ణ! 290
హతశేషులెల్లరు హాహారవములు
వెతనొందిచేయుచు వెఱపునఁ బాఱ
విజయివై లక్షణ వేడ్క గైకొంచు
నిజపురిఁ జేరితి నిఖిలలోకేశ!

అంత బృహత్సేనుఁ డామద్రవిభుఁడు
సంతసమున బంధుజాలమ్ముతోడ
ద్వారక కేతెంచి ధర్మముల్ దెలుపు
తెఱఁగున లోకమ్ముతీరున నీకు
నరణముతోడఁ గన్యక సమర్పించి
మరలి చనియె నిజమందిరమునకు
హరి! కృష్ణ! నీదు సాహస మనల్పమ్ము
కరుణాబ్ధి! నీ కెందుఁ గల్గు జయమ్ము
దామోదరా! భవత్కల్యాణచరిత
లామోద జనకము లఘువిదూరములు

ఈ రీతి వరుసగా నెలమి రుక్మిణిని
గారవమున శుభంకర జాంబవతిని,
సత్రాజితునిపుత్రి సత్య, కాళింది,
మిత్రవిందను పేరిమిగ నాగ్నజితిని
భద్ర, లక్షణను బెంపార నెన్మండ్ర
భద్రమానసలను బరిణయమాడి 300
ద్వారకాపురమున వారలఁ గూడి
గారవమున నుంటి కంజాక్ష! కృష్ణ!

నమ్మినవా రంచు నయువాదు లంచు
నిమ్ముదప్పి సుఖాన కెడయై రటంచుఁ

బాండవులంజూడ బంధుభావమున
నిండుప్రేమమ్మున నీవ పోయితివి
వారిపురమునకు వన్నె గూర్పించి
కూరిమి పార్థునకును సమరమ్ము
పరికరమ్ములు లభింపఁగఁ జేసి. యొక్క
యరుదౌ సభాభాగ్య మమరించి తీవు
దామోదరా! నీ యుదారభావమ్ము
సామాన్యమే. దాన సర్వవిధాల
నీ వెందు జనినను నీకె జయమ్ము.
పావనచరితలౌ పడఁతులతోడి
పరిణయప్రాప్తి యేర్పడె మంగళముగ
పరమపూరుష! గోపభామినీలోల!

పాండవులనుబోలు బంధుండఁ గాను.
నిండుమనమ్మున నిన్ను భజించు
భక్తుండగాను. దుర్వ్యసనమ్ములందు
రక్తిఁజూపితిని దుర్మతిని దుష్టుండఁ 310
గాని. యిప్పుడు భవత్కరుణాకటాక్ష
మే నాకు గతిగ నమ్మితిఁ గాన నీదు
భజనమ్ము మానఁ గృపామతి నన్ను
గజరాజసంరక్ష కాపాడుమయ్య

## ముర, నరకాసురులవధ

శ్రీకర, నవతులసీదళదామ
పాకారిసురముఖ ప్రార్థితనామ,
భక్తలోకశరణ్య. వరగుణగణ్య.
ముక్తిప్రదాత, త్రిభువనాధినేత!

అర్థిజనాకాంక్షయందలి ఋతము
వ్యర్థమ్ము గాకుండునటు నిల్పనెంచి
మాధవ! జగతి ధర్మస్థాపనమ్ము
సాధింతు వెంతదుష్కరకార్య మైన
దేవదేవా! భవదీయసంకల్ప
మా విధమ్మున భువి కరుసమ్ముఁ గూర్చు

“నరకాసురుఁడు భూమినందనుఁ డదితి
వరకుండలమ్ముల, వైజయంతి యను
వనమాలికను, మణిపర్వతోత్తమము
ననుపమ లలితసితాతపత్రమ్ము
నపహరించె” నటంచు నమరనాథుండు
తపనీయచేల, యెంతయు భక్తి నీకు 320
విన్నవింప గ విని, వెడలి తాఁక్రూరుఁ
గ్రన్నన దునిమి ధర్మముఁ బ్రతిష్ఠింప,
భవదీయ శత్రునిబర్హణకార్య
మవసరమయి చేయు నాప్రయాణమ్ము
సంబరముంగాంచి, సత్య నీ తోడఁ
బంబినకోరిక పలికె నీ రీతి,

దేవ! మనోనాథ! దితిసుతకోటి
నీవు లెక్కిడక విజృంభించి తునుము
సమయమందున నీదు సాహసచర్య
లమితపరాక్రమోద్యమము లెవ్విధమొ
కనులారఁ దిలకించి కడు సంతసించి
మన వీడు చేరి నీ మానినీతతికిఁ
జెప్పెద: నీ వెంటఁ జెల్మితో నన్నుఁ
దప్పక గొనిపొమ్ము తామరసాక్ష!

సతి కోర్కియెఱిఁగి యా సరసిజాననకు
నతిప్రేమదొలఁక నిట్లంటివి కృష్ణ!
"రమణిరో, విను మది రణరంగభూమి
ప్రమదల యుద్యాన వనభూమి గాదు
అరదమ్ము, లేనుంగు, లశ్వముల్, భటులు
గరిత! చూచినఁ జాలుఁ గడుభయం బొదవు 330
అరివీరఘోర ఖడ్గాదులఁ గాంచ
మిఱుమిట్టులేర్పడు మెలఁత! కన్నులకు
కలికి! యీపయనమ్ము కలనిపయనము
వలదు మానుము. వేగవత్తును నిలుము."

నీ పల్కులను విని నెలఁత యా సత్య
నీపయిఁ దనకున్న నెయ్యంపుఁ జనవు
బలిమి నిట్లనియె – "ఓ ప్రాణేశ! దైత్య
బలమెగా దా దైత్యవరు లున్ననేమి?
భవదీయ బాహువుల్ ప్రాపుగా నుండ
లవమాత్ర కీడుగల్గదు నాకు నిజము
అరుదెంతు, వలదని యనకు మా నాథ!
కరుణానిధీ! నమస్కారమ్ము నీకు?

## మురాసుర వధ

ఈ రీతి వేఁడు న య్యింతిఁ గౌఁగిటను
జేరిచికొని, చని, చిత్తము ప్పొంగ
ఖగకులపతి భుజస్కంధమ్ము నెక్కి
గగనవీథికిఁ జని, గ్రావ, శస్త్రాగ్ని,
జల వాయు దుర్గమస్థల మయి, మరియు
ఖల మురదైతేయు ఘనఘోరపాశ

పరివృతమైయున్న ప్రాగ్జ్యోతిషమ్ము
పరిసరమ్మునుఁ జేరి, పర్వతపంక్తి 340
గదఁగొని తుమురుగఁ గావించి; వాఁడి
ప్రదరముల్ వఱపి, శస్త్రమ్ముల కోటఁ
బడఁగొట్టి, జల శిఖి వాయు దుర్గముల
ఘోడలు చక్రాయుధమునఁ జెడఁజేసి,
మురుపాశముల ఖడ్గమునఁ ద్రుంచివైచి
పరవీరహృదయముల్ బ్రద్దలౌ నట్లు
పరమపూరుష! కృష్ణ! పాంచజన్యమ్ము
మొఱయించితివి, జగమ్ములు భ్రాంతినొంద

ప్రలయకాలాభ్ర గర్జనఁ బోలి భీతిఁ
గలిగించు నా ధ్వని కర్ణమ్ములందుఁ
బడినయంతన నిద్ర వదలి జృంభించి
యొడలు విరియ నీల్గి యుదకమ్మునుండి
తల లైదు గలిగిన దనుజుఁడు మురుఁడు
వెలువడివచ్చి, గోవింద, ముకుంద!
నినుఁ గాంచి కన్నుల నిప్పుక లురల
తన ఘోరపంచ వక్త్రంబులఁ దెఱచి
జగము లన్నిఁటి నొకేసారి గ్రసించు
వగ నట్టహాస సాధ్వసనినదమ్ముఁ
గావించుచును, నిన్నుఁ గదిసి కోపించి
పావక జ్వాలికా పటలమ్ముఁ జిమ్ము 350
తన శూలమున గరుత్మంతుని వైచి
ఘనగర్జ గావించెఁ గడలెల్ల నిండ

మురుశూలమును మూఁడు ముక్కలౌ నట్లు
కరముల నడుమనె గావించి, వాని

యెదుమోములనాటి వ్యథఁగూర్చునట్టి
యెదుతూపులు వేసి తచ్యుతా, నీవు
అసురుఁడు గదఁగొని యాగ్రహ మెత్తి
విసరె నీపయిఁ దాని వేయి ముక్కలుగ
నీ గద విసరి ఖండించితి! వసుర
యా గతి తాను నిరాయుధుఁ డగుటఁ
జలమునఁ దనదు హస్తములు పైకెత్తి
బలువడి నీపయిఁ బడరాగఁ గాంచి
యరిలోకదమన! చక్రాహతి వాని
శిరము త్రైదింటిని ఛేదించి తీవు
ఆ నరాశను మృతి నాలించి, యతని
సూను లేడ్గురు కడు శోకించి పిదప
పగఁ బెంచి యీర్ష్యతోఁ బలితంపు కినుక
దెగి, నరకుఁడు రేఁప దిట్టతనాన
వారలు నీ పయి వాఁడి శరాలు
ఘోరాయుధమ్ము లొక్కమ్మడి వైవ 360
శత్రుమర్దన! వారి సకలాయుధములఁ
జిత్రమ్ముగాఁ జిఱు చిద్రుపలొనర్చి
యసురుల వారల నందఱ నీదు
నసిధార కెరగాఁగ హత మొనర్చితివి
దనుజవిరామ, మాధవ, హరి, కృష్ణ!

## నరకాసురవధ

తనవారు నీచే హతమ్మౌటఁ దెలిసి
వెఱఁగంది రోషమ్ము పెఱుగుట రేఁగి
నరకాసురుఁడు తృణ ప్రాయముగను
నినుఁదన మదినెంచి నిందసేయుచును
దనుఁదాన కడుఁ బొగడ్తల మెచ్చుకొనుచు

వరకుండలాది దివ్యవిభూషణముల
ధరియించి వేదండతండముల్ ముందు
నడువంగ వచ్చి భండనము నీ తోడఁ
దొడరిసేయంగ నుత్సుకతతో నిలిచె

ఆ సమయమ్మున నబ్జాక్ష! కృష్ణ!
నీ సతి సత్య యున్నిద్రతేజమ్ము
ధైర్యమ్ము చెలువార దనుజసంహతుల
శౌర్య సాహసములు జన్యమ్ములోన
నడఁగింప నెంచి నీ యగ్రభాగమునఁ
గడు వీరసంభ్రమగరిమతో నిలిచె 370

ఆ రీతి రణకుతూహల యగు వీర
నారిని సత్య నందకుమార, నీవు
కని, యామె వీరశృంగార సమ్మిళిత
ఘనలక్షణములకుఁ గడు సంతసించి
"ఓలేమ! దనుజుల యుక్కడగింపఁ
జాలమా మే, మిట్టిసాహసమునకుఁ
బూనితి వేల? నీ పూనిక మాను,
మానవే, నిదె గొనుమా, దీని విల్లు"
అని సరసోక్తుల నామె యుద్యమము
ననుమతించినయటు లాదృతి చూపి
పరగర్వహరణమౌ బాణాసనమ్ము
హరిణాక్షి కొసఁగితి వమరేంద్రవినుత!

ఆ విల్లునంది మహాశక్తి బొంది
జ్యావల్లి బిగియించి, శరములఁ గూర్చి
వీరశృంగారముల్ వెలసెడునట్లు
నారసములను సంధాన మొనర్చి

దివియుట, విడుచుట తెలియరా నటుల
బవరమొనర్చె న భ్భామిని సత్య
అరివర్గమునకు భయం బగునట్లు
మురహర నీకు ప్రమోదమౌ నట్లు.— 380
ఈ రీతి సత్య విజృంభించి వేయు
నారాచముల తాకునకు నోర్వలేక
నరకదైత్యేంద్రు సైన్యము దైన్య మొంది
విఱిగి యా భూసుతు వెనుకకుఁ బాఱె.

ఆ తరుణమ్మున నబ్జాక్ష! నీవు
నీ తరుణీమణి, నీ ముద్దుగుమ్మ
సత్యను గని యామె సమరకౌశలము
స్తుత్యం బటంచు నిస్తులమోద మంది
అని నుండి యా సతి నాపు చేయంగ
మనమున నెంచి యిమ్మాడ్కిఁ బల్కితివి.
"రమణి మెచ్చెదవె, యా రక్కసుసేన
సమరమ్మునందోడి చనె నిటనుండి
ఘనవిజయమ్ము నీ కైవసమయ్యె
గొనుమ యిచ్చెద నీవు కోరు భూషణము
లెల్ల" నటంచు ప్రేమైకభాషణము
లుల్ల మా సత్యకు నుబ్బెడు నట్లు
పలికి, యా సతిచేతి వరశరాసనము
జలజాక్ష చేకొంటి సంతసం బెసఁగ,
ఆ రీతి విల్లంది యాలమ్ము సేయఁ
గోరి నిల్చిన నిన్నుఁ గుజనవినాశు 390
నరకాసురుఁడు గని నవ్వుచు మిగుల
పరిహాసవాక్కులఁ బల్కె నిమ్మాడ్కి

"మగవారి ముందఱ మగువ తా నిలిచి
మగతనములు చూప మాధవా! నీకు
మగతనమే యని మానుట: మేము
మగలకు మగలము, మగువలతోడఁ
బగఁబూని యుద్ధము పచరింపఁ బోము
నగుబాటు సుమ నీ వొనర్చినసేఁత.

ఆ పల్కులను విన నచ్యుతా, నీకుఁ
గోపమ్ము పెఱిగె: న క్కుమతితో నీవు
"ఓ నరకాసుర! ఉద్వృత్తి మాను
మీనాటి రణమందు నిప్పుడ నీదు
శిరము నేలంబడ ఛేదింతు: దివిజ
వరులకు మోదమ్ము పరగఁ గావింతు
కనుఁగొను" మని భయంకరమౌ 'శతఘ్ని'
యనెడు నస్త్రమ్ముచే నరియోధవరులఁ
బరిమారిచితివి సుపర్ణుఁడు గూడ
నుఱుమాడె పగతు నేన్గుల సమూహమును
ఆలాగు తనసైన్య మరులచేఁ జిక్కి
కూలుట గని చాల కోపమ్మునొంది 400
నరకుఁడు మదవారణమ్మెక్కి నిన్ను
గుఱివెట్టి తనచేతి ఘోరశూలమ్ము
నీ పయివేయఁ బూనిన యంతలోన
శ్రీపతీ! చక్రమ్ముచే వాని మూర్ధ
మవనిపైఁ దెగిపడునటు లొనర్చితివి
దివిజు లానందాంబుధిని దేలియాడ —

అత్తఱి భూదేవి యతిశాంతశీల
చిత్తజ జనక నీచెంత కేతెంచి

వినయవివేకముల్ వెలయుంగ మ్రొక్కి
కనకరత్నాంచిత కర్ణకుండలము
లాది వస్తువుల నీ కర్పించి భక్తి,
వేదవినుత! నిన్ను విశ్వప్రకాశు
తనభక్తికొలఁది ప్రార్థనము గావించి
వనజాక్షి! యొక విన్నపము ని ట్లొనర్చె

"దీనజనావన! దేవ! సర్వేశ,
మానాథ! యిటు చూడుమా కరుణించి
నరకదైత్యేంద్రుని నందనుఁ డితఁడు
కరము ని న్గని భీతి గల్గియున్నాడు
తనతండ్రివలె శౌర్యధనిగాఁడు, బాలుఁ
డనయవర్తనుఁడుగాఁ డందున వీని 410
కభయం బొసంగుమా యార్తశరణ్య,
శుభగుణ చారిత్ర! సుందరగాత్ర!"

ఆ విన్నపమ్ము న్యాయమ యంచు మదిని
భావించి, యా బాలు భగదత్తుఁ గాంచి
కరుణించి, యభయమ్ముఁ గడలేని సిరులు
నిరుపమానందమ్ము నెగడ నిచ్చితివి

తదనంతరంబ తద్దనుజుండు నరకు
సదనమ్ముఁ జొచ్చి విస్మయమును బొంది
యా రక్కసుఁడు చెఱయం దుంచియున్న
నారుల రాచకన్యకల పదాఱు
వేల సుందరులను వీక్షించి, మిగుల
లాలించి, మేలౌ విలాసవస్తువులఁ
గొఱలేక యిప్పించి, కోరిక లడిగి
వారలనందఱ ద్వారకాపురము

చేరంగఁ బంచితి జేజేలు వొగడ
కారుణ్యగుణధామ కల్యాణనామ
మరియును నదితికి మణికుండలములు
పెరిమతోడుత సమర్పించితి. వవల
శచితోడఁగూడి నిర్జరపతి సేయు
ప్రచురసత్కారముల్ వడసి యా పిదప 420

## పారిజాతాపహరణము

సతి సత్యభామ వాంఛాపూర్తి సేయ
నతివేగ నందనోద్యానమ్ముఁ జొచ్చి
పారిజాతముఁ దెచ్చి. పన్నగాశనుని
భూరిభుజస్కంధమున నుంచి. నీవు
సత్యతోఁగూడి. యా క్షణమ ఖగేంద్రు
నత్యుత్సుకతతోడ నారోహణమ్ము
గావించి పయనమై కదలెడి తఱిని
దేవలోకోద్ధార! దీనమందార!
మిగులఁ గృతఘ్నుఁడై మించుగర్వమున
నగవైరి తగిన సైన్యముతోడ నీకు
నెదురయి నిల్చి "ఓకృష్ణ! పోరాదు
వదలుమ యిపుడైనఁ బారిజాతమ్ము
వదలకుంటివ యేని బవరమ్ము నిజము
మది దలంపవొకొ యమర్త్యుల బలము"
అని నిల్వ వారల నందఱ గెల్చి
చనుదెంచితివి నిజసదనమ్ముఁ జేర.

ఆ రీతి విజయమహాభాగ్య మొప్ప
ద్వారకాపురిఁ జేరి ప్రాగ్జ్యోతిషమునఁ

జెఱఁబాపి నీవుదెచ్చిన పదార్వేల
గరితల నా రాచకన్నెల కెల్ల 430
నిలయముల్ వేర్వేర నియమించి, సత్య
లలితోపవని మహోల్లాసమ్ముతోడ
పారిజాతమునాటి ద్వారకాపురికి
పారమ్ము మీఱు శోభనుగూర్చి తీవు.
మరియొక దినమున మంచిలగ్నమున
నరవిందనేత్రల నా పదార్వేల
సురుచిరాంగనలను శోభనం బెసఁగ
పరిణయమాడితి, పావనమూర్తి.

నరకుని ఘోరదుర్నయకార్యములను
సురపతి వినుపింప, సుదతితోఁ గూడి
గరుడవాహన మెక్కి కడువేగ నరిగి
మురదానవుని ప్రాణములకుఁ బాపితివి
నరకునితోడ జన్యము సేయఁ గోరు
గరిత సత్యాదేవి కాంక్ష దీర్చితివి
నరకాసురుని జంపి నరులకు, దేవ
వరులకు మోదమ్ము వరలఁ జేసితివి
నరకుఁడు మోసమ్మునను గొనిపోయి
మఱువడదాఁచిన మఱికుండలముల
భూపతి నీ కీయ ముదముతో నదితి
కా సుభూషణముల నప్పగించితివి. 440
మరియును భూదేవి మనవి మన్నించి
నరకాసురుని పుత్రు నయగుణశీలు
భగదత్తు మన్నించి, భాగ్యమ్ము లిచ్చి
జగములుమెచ్చ నాశ్రయ మొసంగితివి

చెఱఁబడి కష్టముల్ చెందుచున్న
నరవరకన్యల నయగుణవతుల
నందఱఁ గొనివచ్చి, హర్షమ్ము గూర్చి
పొందిక వరియించి బుజ్జగించితివి
పారిజాతకుజమ్ము స్వర్గమ్మునుండి
పౌరమ్ముమీఱు భవద్బాహుబలము
వెలయించి తెచ్చి, నీ ప్రియు సత్య మిగుల
నలరంగ పూఁదోఁటయందు నాటితివి.

నీ మహామహిమలు, నీ సాహసములు
నీ మహోన్నతశక్తి, నీ మాతృభక్తి
నీ యాశ్రితావననియమమ్ము, నీదు
న్యాయవర్తన లిట్టి వనుచు నావంటి
జ్ఞానహీనుఁ డెఱుంగఁ జాలునే? స్వామి
జ్ఞానప్రకాశ, దుర్జనగర్వనాశ!
కడు మూఢమతిని దుష్కార్యాచరణుఁడ
నెడ నిన్ను నిలుపు నేర్పేమియు లేని 450
జడుఁడను నాకు రక్షకుఁడవు నీవె
విడువ నీ పాదముల్ విశ్వసంరక్ష,
శ్రీహరీ! కరుణ వీక్షింపుమా నన్ను
పాహి మాం పాహి గోపాల, గోవింద!

## బాణాసుర వృత్తాంతము – ఉషాపరిణయము

శ్రీకరలక్షణ, చిన్మయానంద,
శ్రీకంఠవినుత, రక్షిత భక్తబృంద,
పరమపూరుష, జగత్పావనచరిత,
కరుణాసముద్ర, పంకజదళనేత్ర!

ఏ పూజ లే దేవు నెద నిడి చేయు
నా పూజ లన్నియు నటులె యా దేవు
మూలానఁ నినుఁజేరు పొలుపుగః నీవె
వాలాయముగ నట్టివారి వాంఛితము
లెల్లఁ దీర్చుట యను నీ రహస్యమ్ము
నెల్ల రెఱింగియు, నేలొకో పెక్కు
దై వముల్ గలరని తారతమ్యముల
భావించి, నినుఁ దలంపకయు నీ తోడ
వై రమ్ముఁ బెంతురు వారలే చివర
కీ రహస్య మెఱింగి, యెడదఁ జింతింత్రు
భవదంశజులగు సర్వజ్ఞులు గూడ
వివరింప విభ్రాంతి వెట్టివా రగుచు 460
నిన్ను నన్యునిగ నెన్ని మనమ్ములందు
కన్నకష్టమ్ములు గల్ల, పెంపఱఁగ
నిజము నెఱింగి మన్నింప వేఁడుదురు
గజరక్ష, యివియెల్లఁ గడు విచిత్రములు,
ఎవరైన నేమి, ని న్నెడఁదఁ బ్రార్థింప
భవదూర, వారిఁ గాపాడుదు వీవు

బలిసుతుల్ నూర్వురు వారలలోన
తొలివాఁడు బాణుఁడు దుర్దాంతబలుఁడు
వేయిచేతులుగల వీరుఁ డెవ్వేళఁ
బాయక శివపూజ పచరించువాఁడు
పరవీరకానన పావకుఁః డమర
వరగణబల వారివాహానిలుండు
అతఁడు శోణపురీశుఁ, డాతని కొక్క
సుత గల దుష యను సురుచిరాకార

ఆ బాణదానవుఁ డభవు నీశ్వరుని
ప్రాబల్యయుత నిజభక్తి మాహాత్మ్య
మునఁ దనకును వశమ్ముగ నొనరించి
కొని, యెవ్వరిని లెక్కగొనకుండ నుండె

ఒక్కనాఁ డభవుని యొద్దకు బాణుఁ
డొక్కఁడు తానేగి యుత్సాహ మొప్ప 470
తాండవలోలు నా దర్పకారాతి
ఖండేందుధరు శివుఁ గఱకంఠుఁ గాంచి
నయవినయముల వందనము లొనర్చి
భయభక్తులను తాండవమునకుఁ దగ్గ
రీతి నారజము ధరించి, మ్రోగించి
యాతని ప్రియమంది యర్థించె నిట్లు
దేవ! మహాదేవ! దీనదయాళు!
పావనచరిత! నీ పాదపద్మముల
నమ్మిన భక్తుండ. నా మనోవాంఛి
త మ్మొండు వినుము, భూతపతి! గిరీశ!
గిరిసుతయును నీవు కృపతోడ నాదు
పురికోటవాకిటి ముందునఁ జేరి
కావలియుండి స గ్గాపాడుఁ డిదియు
నా వాంఛితమ్ము చంద్రకళావతంస!”
అని వేఁడ తనభక్తు నభ్యర్థనమున
కనుమతిఁ జూపుచు నద్రిజతోడ
శరజన్ముతోడ వృషభరాజుతోడ
పరివారమగు, భూతవారమ్ముతోడ
బాణు శోణపురమ్ము వాకిటఁ గాఁపు
గా నుండె భక్తకింకరుఁడు శంకరుఁడు 480

అంతటివైభవ మబ్బుట బాణుఁ
డెంతయు గర్వించి, యిభదైత్యదమను
చెంతకుఁ జనుదెంచి చేతులు మోడ్చి
స్వాంతమ్ము మిగుల నిశ్చలముగఁ జేసి
పరిపరివిధములఁ బ్రార్థించి తనకుఁ
బెరిమమౌ కోర్కి యి వ్విధమునఁ దెల్పె

"భూతేశ, శితికంఠ! భుజబల మొప్ప
నాతోడ నెదిరి జన్యము చేయఁజాలు
వీరుఁ డొకండేని వెదుక మందునకు
ధారుణి లేఁడయ్యె దర్పకభేది!
నా వేయి కరములందలి చివ్వదురద
యే విధమ్మునఁ బాయు వృషభేంద్రగమన!
సంగరభువిఁ దమ చతురతఁజూపి
పొంగని కరముల పొలుపు వ్యర్థమ్ము
కాన, నా తోఁ బోరఁగల యట్టి వాని
గానము నిను వినా ఘను నన్యు నెందు"
అని విజ్ఞప్తిఁగు న య్యసుర పల్కులకు
మనమున రోసి యమర్షమ్ము నొంది
మృడుఁ డిట్టు లనియె" నోరీ! మూఢచిత్త!
పుడమి నకారణమ్ముగ నీదు టెక్కె 490
మెపుడు పడునొ, యప్పుడే నీదు కరము
అపనయింపగఁజాలు అనివిక్రముండు
నా యంతవాఁడు జన్యము నీకు నిచ్చు
నీ యభిలాషయు నెరవేరు సుమ్ము"
ఆ పల్కులను విని యానంద మొంది
తాపము చల్లారఁ దన కేతనమ్ము

పతనకాలమునకై బాణాసురుండు
మతి పొంగ వేచి నిమ్మళముగ నుండె.

## ఉషా పరిణయ వృత్తాంతము స్వప్నము

ఒకరేయి యాత్మసౌధోపరి వేది
నొకతె బాణునిసుత, యుష మృదుశయ్యఁ
బవళించి, కూర్మి స్వప్నమునందుఁ దొల్లి
యెవరుఁజెప్పని విని యెఱుఁగని తానుఁ
గని, యెఱుఁగనియట్టి కమనీయమూర్తిఁ
గని, వాని నర్మిలి గలిసిన యట్టు
లనుభవమును బొంది, యంతట మేలు
కని, కనులను బాష్పకణములు రాల
నది కల గాదని, యరయ నిక్కమని
మదినెంచి కలఁగన్న మనుజుని రూపు
కనులఁగట్టినయట్లు గన్పట్టుచుండ
మనము కలంగ నమ్మానిని బయలు 500
బిగి కౌఁగిలించి తృప్తినిబొంద కిట్టు
లగపడె మన్మథు నలరుతూపులకు
మరియు నక్కన్యక మానక యెపుడు
విరహవేదనలచే వెతనొందుఁ గాని
తన మనంబునఁ గల దర్పకతాప
మును దెల్పదయ్యెఁ బ్రేముడి సకులకును

బాణమంత్రితనయ ప్రజ్ఞాధురీణ
జాణ, యుషకుఁ బ్రాణసఖి చిత్రరేఖ
ఆమె యుషాచేష్ట లన్నియుఁ జూచి
"యీమె యెవ్వరినో తా నెడఁబాసి యిటులు

విరహతాపము నొందెః వేరొండుగాన,
నెఱిఁగెద నిజ" మంచు నింతి నక్కన్యఁ
గని యిట్టు లనియె. "నా కన్నను నీకు
మనసిచ్చి మెలఁగు సమ్మాన్యలు గలరె!
ఏల యిట్టులు గృశియించెదు? నీదు
లాలస యెదియొ తెల్లముసేయరాదె.
అది యెట్టిదైన నో యబల! సాధింతు
మది దాఁచకను జెప్పుమా విన వలతు" —

చెలిపల్కు లమృతమ్ము చెవిఁ జిల్కినట్టు
లలరింప నుష కడు నానంద మంది 510
నానఁ నగవు మోమునను బొడసూప
ప్రాణసఖికిఁ దన స్వప్నవృత్తాంత
మంతయు వినుపించి. "యా స్ఫురద్రూపి
యింతకు నెవ్వండొ, యెచట నున్నాఁడొ,
యాతనిపొందు నా కమరకయున్న
నీ తను విఁక నిల్చు టెంతయు సున్న"
అనుచు నా చెలి విరహాగ్నిచేఁ గ్రాగి
కనుల నీరము కాల్వగాఁ బాఱ వగచె.

అతిహితకారిణి యగు చిత్రరేఖ
యతివ యుషాకన్య యశ్రువుల్ దుడిచి
"చెలియ నే నుండఁగాఁ జింతింతు వేల?
యిలఁగలరాజుల నెల్లను. మఱియు
బలిసద్మమందున, స్వర్గమ్మునందుఁ
గల ముఖ్యులను గూడ కలికి వేర్వేర
పటములందు లిఖింతు, వారలలోన
నిటు నీకు మోహమ్ము నెలయించి నటి

సుందరాకారునిఁ జూపుమా. వాని
సందియపడకు నీ సరసకుఁ దెత్తు".
అని యామె నోదార్చి. యా చిత్రరేఖ
తన చిత్ర లేఖన తత కౌశలమున 520
ముల్లోకములఁగల ముఖ్యులౌ వారి
నెల్లను లిఖియించి. యేర్పడునట్లు
కులగోత్రనామముల్ గుణము ల యుష్యషకుఁ
దెలియంగ వేర్వేరఁ దెలుపుచు రాఁగ
అనిరుద్ధు చిత్రమ్ము నయ్యుష గాంచి
మనము సంతోషాబ్ధిమగ్నమ్ము గాఁగ
"చెలి! చెలి! యితఁడె నా చేతోధనమ్ము
లలి తస్కరించిన లావణ్యమూర్తి
నా మనోహరు గుర్తునకుఁదెచ్చి నన్నుఁ
బ్రేమఁ గాపాడిన ప్రియసఖి వీవు
నినుఁ గొనియాడంగ నేర్తునే నేను
వనిత! యీ సుందరు విధ మేమొ చెపుమ"
అనుటయు నా సఖి యామెకు నిట్లు
వినుపించె సర్వ మ వ్వీరునిగూర్చి.

"సుదతిరో! వినవె యీ సుందరమూర్తి
యదువంశదుగ్ధరత్నాకరచంద్రుఁ
డనిరుద్ధుఁ డనువాఁడు హరికి మన్మండు
గణుతింప వీరవిక్రమ గుణయుతుఁడు
ఇదిగొ యీ క్షణమ నే నేగి య క్కొమరు
పదిలమ్ముగాఁ గొనివచ్చి నీ కిత్తు 530
నందాక సంతాప మందకు మమ్మ
యిందుముఖీ!" యని యింతి యా సకియ

గగనమార్గమ్మున గమియించి నీదు
నగరమ్ముచేరె కృష్ణా! యదువీర!

## చిత్రరేఖ అనిరుద్ధుని ఉష పడుకటింటఁ జేర్చుట

ఆ నిసి తనదు మాయను బ్రకటించి
జాణయై మారువేషము ధరియించి
అనిరుద్ధు కనకహర్మ్యముఁ బ్రవేశించి
యనుపమ మంజుశయ్యామందిరమ్ము
నందుఁ బ్రసూన శయ్యను బవళించి
కందోయి ముకుళించి గాఢమౌ నిద్ర
మునిఁగియున్నట్టి యా మోహనాకారుఁ
దన ఘనయోగవిద్యామహిమమున
గ్రహియించుకొని సమీరణరయంబునను
సహచరియైన యుషామందిరమ్ము
జేరి, యా సుందరి చివురుపానుపున
నా రూపరిని దించి, "అబ్జాక్షి! గనుమ
నీ మనోహరు, మానినీపంచబాణు,
నీ మరు లీఁక దీఱ నేఁ బోయివత్తు"
అనిన, యుషాకన్య యతిముద మంది
తన ప్రాణసఖితోడఁ దా నిట్టు లనియె. 540

"అతివ! నీ స్నేహమాహాత్మ్యమ్ముచేత
క్షితి నెవ్వరికిఁ గాని చెందనియంత
గొప్పభాగ్యము సమకూరె నా కిపుడు
చెప్పనొప్పను గదే చెలి నీదు నేర్పు
నా కలఁగన్న సుందరుఁ బటమందు
నీ కుశలత్వమ్ము నిండుదనమ్ము

పోయినజాడయుఁ బోల్పంగ రాదు
మాయయా! మదికి నిమ్మళ మెట్లు గుదురు"
అని యాదవులు వగనంది యే వార్త
వినెదమో యని చాల భీతిలుచుండ, 570
నొకనాఁడు నారదుఁ డురుతపోధనుఁడు
సకలలోకాధీశు సర్వేశుఁ గృష్ణు!
నిను భజింపఁగ వచ్చె నీరజనయన!
తన మనశ్శాంతికై ద్వారకాపురికి
ఆ మహామునికి నీ వాతిథ్యమిచ్చి
ప్రేముడి భాషించువేళ న త్తపసి
యనిరుద్ధు వృత్తాంత మంతయు వినిచి
చనె నిను వీడ్కొని, జలదమార్గమున
జగము లెల్లను నిండి సర్వకార్యములు
తగవున నడపించుదైవమ్ము నీవు
నీ వెఱుంగనిది యెందేనియుఁ గలదె?
భావియుఁగూడ నీ భావమ్ము గాదె
కాని సామాన్యుని కరణి నీ వుందు
వా నియమమ్ము రహస్య మే మయ్య?

## శ్రీకృష్ణుఁడు శోణపురమును ముట్టడించుట

అనిరుద్ధవృత్తాంత మంతయు దేవ
ముని దెల్ప నొక మంచిమూర్తమ్మునందు
పుండరీకదళాక్ష! ముచుకుందరక్ష!
దండు సాగించితి దైత్యేంద్రు బాణు
పురము ముట్టడివేయ ముఖ్యులౌ బంధు
వరులతోడను, వీరభటులతోఁ గూడి 580

దండుతో నా రీతిఁ దరలి దానవుల
గుండెలు జల్లని కుములంగ శోణ
పురము బహిర్ద్వారమునఁ జేరుకొంటి
పురుషోత్తమా! కృష్ణ! భుజగేంద్రశయన!

అంతటఁ జెలరేఁగి యాదవవీరు
లంతకంతకు హెచ్చు నమితశౌర్యమున
శోణపురమ్మును జొచ్చి సర్వమ్ము
నానావిధమ్ముల నాశమ్ముచేయఁ
గని బాణదైత్యుండు కడు నాగ్రహమున
ననికి బలమ్ము నాయత్తమ్ముచేసి
మీ కెదురయి నిల్చె మిగుల నుద్వృత్తి
పాకారినుత, దుష్టభంజన, కృష్ణ!

## శ్రీకృష్ణ శ్రీకంఠ పక్షముల బలములు ఒండొంటితో నెదిరిపోరుట

ఆ సమయమ్మున హరుఁడు శంకరుఁడు
వాసి బాణుని పుత్రవాత్సల్య మొప్పఁ
గాపాడుచుండును గాన, దురమ్ముఁ
శ్రీపతీ! నీతోడఁ జేయంగఁ దలఁచి
శరజన్ముఁడును భూతసమితియుఁ బ్రమథ
వరులు సర్వాయుధపాణులై రాఁగ
కేల శూలముఁబట్టి గిబ్బపై నెక్కి
మేలని యసురులు మెచ్చఁగా వచ్చె 590
నిరువాగులకు కల నేర్పడ నపుడు
హరుఁడు నీతోఁ బోర నాయత్తపడియె
మారునితోడఁ గుమారుండు దొడరె
సీరి దానవమంత్రిశేఖరుఁ డెదిరె

నీ లాగునన్ దమ కీడగువారిఁ
బోలిచికొని యదుముఖ్యబలమ్ము
దనుజబలమ్మును దలపడినంత
నని కడు బెట్టిదమయ్యె శ్రీకృష్ణ!
అత్తఱి మురహర! అసురబలమ్ముఁ
జిత్తజరిపు సేన చేడ్పడి రణము
వీడి పర్విడునట్లు విక్రమస్ఫూర్తి
వాఁడి బాణమ్ములఁ బఱపి యార్చితివి
నీ పటుశౌర్యము నిటలాంబకునకు
చూపోపమినిగూర్పఁ జురచుర మండి
యతఁడు నీ పయి నిశితాంబకములను
మితిమీఱుసంఖ్య గ్రమించఁగ నేయ
ప్రతిబాణముల వాని భగ్న మొనర్చి
ప్రతిగానరాని నీ ప్రతిభ చూపితివి.
అంతట నిలువక యహిభూషణుండు
పంతాన నీ పయి ప్రబలశస్త్రములు 600
పెక్కు దివ్యాస్త్రముల్ విడువ నన్నింటి
గ్రక్కునఁ ద్రుంచుచుఁ గంధిగంభీర!
సమ్మోహనాస్త్ర మా శంకరుమీఁదఁ
బమ్మినకోపానఁ బడవైచి తీవు
ఆ యస్త్రమహిమ మహాదేవుఁ డంత
కాయమ్ము మఱచి యుక్షమ్ముపై నొఱఁగె —
మురహర! నీ దివ్యమోహనాస్త్రమునఁ
బురహరుఁ డాస్థితిఁ బొందుటఁజూచి
దానవానీకమ్ము ధైర్యమ్ము వీడి
దీనత్వమునఁ బాఱె దిగ్భ్రాంతిఁ జెంది.

తనసైన్య మారీతి దైన్యమ్ముఁనొంది
వెనుకంజవేయుట వీక్షించి బాణుఁ
డడరెడు కోపాన నార్చుచు నుదుటు
విడువకుఁ డని చేయివీచి రాఁ బిలిచి
సాత్యకితోఁ బోరు సాగించె, వార
లత్యమర్షమున జయాభిలాషమున
తనువులు దెలియక ద్వంద్వయుద్ధమ్ము
దనుజ యాదవసైన్యతతి కబ్బురమ్ము
గలుగఁ గావించి రొక్కరికి వేరొకరు
తిలకింపఁగా వెనుదీయని మాడ్కి 610

ఆ రీతిఁ బోరుచు నధికరోషమున
నీరజేక్షణ! కృష్ణ! నీపయి రథముఁ
బఱపించి బాణుఁడు బాహుసహస్ర
గురుబలాటోపానఁ గ్రొవ్వి, గర్వించి
యేనూరు కరముల నేనూరు విండ్లు
పూని యొక్కొకదాన ములుకుల జంటఁ
జేరుచుచుండ, హృషీకేశ! వాని
ఘోరచాపముల నుగ్గుగఁ జేసి మరియు
సారథి, రథము, నశ్వములఁ జక్కాడి
పూరించితివి శంఖమును బెట్టిదముగ
నీ విక్రమమునకు నివ్వెఱనంది
దేవారి బాణుఁడు తేఁకువ మాలి
విన్నదనమ్ము, నిర్వేదమ్ము నొంది
మిన్నకయుండె నేమియుఁ జేయలేక
అ త్తఱి కోటర యను బాణుతల్లి
యుత్తలపడు పుత్రు నోమంగ నెంచి

దిసమొలతోఁ గురుల్ దిగజారి వ్రేల
వెస నీ కెదురువచ్చి, వికవికనవ్వ
ఆ రూపుఁజూడ కృష్ణా! నీవు రోసి
మారుమొగమువెట్ట మంచి వేళయని 620
తలచీరవీడ యాదవులు నవ్వంగఁ
దలఁగె బాణుఁడు రణస్థలినుండి యంత

## శివ వైష్ణవ జ్వరములు

మూఁడు మూఁడగు శిరమ్ములును పాదములు
గూడినరూపున గురుశివజ్వరము
నినుఁ గదియగ రాఁగ నిఖిలేశ, నీవు
పనిపితి దానిపై వైష్ణవజ్వరము
నా రెండునుం బోర నభవుని జ్వరము
పాఱె నోటమిఁ బొంది! వైష్ణవజ్వరము
వెన్నంటి దానిని వేధింప నద్ది
తన్నుఁ గాపాడెడు దైవమ్ము లేక
మురభేది! నీ పాదములపైని వ్రాలి
కరుణింపుమా నన్నుఁ గమలాక్ష! యనుచు
నీ మహత్వముల నన్నిటిఁ గొనియాడ
దామోదరా! జగత్పతి! నీవు దాని
పరితాపమును, పడుబాధలుఁ జూచి
కరుణించి యిట్లంటి, "కనుఁగొంటె నాదు
సాధన మహిమమ్ము: శరణంటి గాన
బాధపడకుమ మజ్జ్వరతీవ్రదాహ
వేదన నినుఁ బాయు విడువు శోకమ్ము,
మోదమ్ము నొందుము. పొమ్మింక" ననుడు 630

అమ్మహేశునిజ్వర మచ్చోటు వీడి
నిమ్మళంబుగఁ జనె నిండుమోదమున

ప్రాప్తపరాభవ వహ్నిచిత్తమ్ముఁ
దప్తమ్ముగావింప దనుజనాథుండు
బాణుఁడు నీపయిఁ బగఁబెంచికొనుచు
బాణతూణీరాది బహుళాయుధముల
మొల్లమ్ము నిజరథమ్మున సిద్ధపఱచి
బల్లిదమగు భటవారమ్ముతోడ
నే పారి యోటమి కృష్ణుని దనుచు
నేపారి రణభూమి కేతెంచి నిన్నుఁ
దాఁకి సహస్రహస్తముల శరాళి
వీఁకమైఁ బఱపి నొప్పింపఁగ వాని
శరపరంపర నర్ధచంద్ర బాణమున
నఱవరల్ గావించి, యంతట నీవు
భవదీయచక్రమ్ముఁ బఱపి య బ్బాణు
నవతు మీఱిన సహస్రకరమ్ములందు
నాలుగుమాని, మానక తక్కువాని
రాల నఱికితి పరాక్రమ మొప్ప
ఆ సమయమ్మున నద్రిజావిభుఁడు
నీ సమ్ముఖమ్మున నిలిచి హస్తములు 640
ముకుళించి భక్తితోఁ బురుషసూక్తమ్ము
నకలంకమతిఁ జెప్పి, యర్థించె నిట్లు

## శివుఁడు బాణుని మన్నింపుమని శ్రీకృష్ణుని వేఁడుట

"దేవకీనందన, దేవ, మహాత్మ,
గోవర్ధనోద్ధార, గోపికామార,

జగదుదయస్థితి సంహారమూల!
అగణిత శుభనామ! అరిలోకభీమ.
జగతిని దోఁచెడు సర్వదృశ్యములు
నిగమవందిత! చూడ నీదు రూపములు
బ్రహ్మాండమే నీదు భవ్యరూపమ్ము
బ్రహ్మాదిసురనుత పాదపంకేజ!
అంతటి నీదు బ్రహ్మాండరూపమ్ము
నంతయు దాఁచి లోకావననిరతిఁ
బూనిన యీ దివ్యపుణ్యరూపమ్ము
నేను నుతింపంగ నేర్తునే దేవ!
నీ వవ్యయుండవు. నీ వనంతుఁడవు
నీ వచ్యుతుండవు. నీవె సర్వమ్ము
అన్నిట నీవుందు: వన్నియు నుండు
నెన్న నీ యందు. నీ వెఱుఁగని దెద్ది!
కృపఁజూడ వీఁడు తగినవాఁడె యైన
నపరాధియనక. మహాత్మ! యి య్యసురుఁ 650
గాపాడుమా'' యనఁ గడు మోద మంది
శ్రీపతి! నవ్వుచు శివుని కిట్లంటి

"శంకర. నీ కోర్కి జరిపింతు నీవు
శంకింప వల దింకఁ జంపను వీని
అనఘచిత్తునకుఁ బ్రహ్లాదున కేను
మును "నీదు వంగడమునఁ బుట్టునట్టి
వారిఁ జంప'' నటంచు వర మిచ్చినాఁడ
కారణ మదిగాన. గౌరీ హృదీశ!
వీఁ డవధ్యుఁడు కాని. వీనిగర్వమ్ము
వాఁడిమి చెడ నాల్గుబాహువుల్ నిల్పి

తక్కిన బాహువుల్ దఱిగితి. వీఁడు
నిక్కముగా నింక నీ భక్తులందు
ప్రముఖుఁడౌఁ గాక! జరామరణములఁ
గుములక మనుఁగాక! గుణియగుఁ గాక!"
అని వరమ్ముల నిచ్చి తచ్యుతా. నీవు.
విని స్వాంతమందు దృప్తింగనె శివుఁడు

కరుణాజలధులు జగద్ధితమతులు
హరిహరరూపులు నగు భవదమృత
సల్లాపములు విని శాంతి వహించి
యుల్లాసపడి బాణుఁ డురుభక్తి నీకు 660
జోత లొనర్చి. మెచ్చుగఁ బురికేగి
యాతత ప్రేమ యుషానిరుద్ధులను
సకల మర్యాదల సంతసపఱచి
యకలంకమతి నీకు నానంద మెసఁగఁ
గొనితెచ్చి యర్పించె గోకులరక్ష!
జనితహర్షమ్మున సర్వులు వొగడ
అంతట నీవా యుషానిరుద్ధులను
స్వాంత ముప్పొంగఁగా ద్వారకఁ జేర్చి
బందుగుల్ మిత్రులు ప్రణుతింప, మోద
మందుచునుంటి కంజాక్ష! శ్రీకృష్ణ!

జగమంతయును నిండి జగతివర్తనము
తగ నడపించెడు దైవమ్ము నీవు
అనిరుద్ధుఁ డేల బాణాసురుచేత
నని నోడి బంధితుఁ డై యున్న వాఁడొ!
ఆతఁ డుషాకన్యహర్మ్యమ్మునందు
నే తీరునను జేరె? నేమి కారణము?

నీ వెఱుఁగవె! యదునివహమ్ముతోడ
నా విధ మెఱుఁగని యట్టుల నుంటి
మానవాకృతినుంట మానవతత్త్వ
మూని యుంటి వటంచు నూహింతు నేను 670
శర్వుండు బాణురక్షణకయి పూని
సర్వేశ్వరుని నిన్ను శత్రువుగాఁగ
భావించి నీతోడ బవర మొనర్ప
నా విరూపాక్షుని యజ్ఞాన మెల్ల
నపనయించితి నీ మహత్త్వమ్ముఁ జూపి
కృపకు నీ రూపమ్ము గేహమ్ము స్వామి
హరిహరుల్ వేరువే రనుచు బాణుండు
హరి నిన్నుఁ దలఁపక హరుని పూజించె.
కాని, యా పూజలు కమలాక్ష! నిన్ను
మానకచెందు న న్మర్యాద యెఱుఁగఁ
డావల నీదు దయావిశేషమ్మొ
భావిఁ దనకుఁ గడు భద్రమ్ముఁ గూర్చె
ననుట యెఱింగె, న య్యసురునిగూడ
కనికరించితివి శంకరు ప్రార్థనమున
నీ సర్వసమతయు, నీ సహనమ్ము
వాసిగాంచెను భువి భక్తమందార!
జ్ఞానియొ, లేక యజ్ఞానియొ, యెవ్వఁ
డైనను నీదు దయాదృష్టిఁ బడినఁ
జాలు, వానిని దిద్ది సర్వభద్రముల
మేలుగఁ గూర్చు స్వామివి నీవు నన్నుఁ 680
గరుణఁ జూచెదవని, కాపాడుదు వని
నెర నమ్మియున్నాఁడ నిక్కమ్ము మదిని

నన్నుఁ గాపాడు టెంతయు న్యాయమయ్య
నిన్ను నమ్మితినయ్య నిగమసంస్తుత్య.

## నృగమహారాజుచరిత్రము

శ్రీమానినీమణీ చిత్తాబ్జభృంగ,
దామోదరా, నీరదనిభ శుభాంగ,
పీతాంబరాచ్యుత, విహగేంద్రగమన,
వాతాశనశయన, వనజాతనయన!
ఎంతధార్మికుఁడైన నెంత యాచార
వంతుండు దానతత్పరుఁడైనఁ గాని
పొరపాటుచేఁ దాను బొనరించినట్టి
దురితమ్ముఫలముఁ బొందుట తప్ప దెందు
పాపమ్మునకుఁదగ్గ ఫలితమ్ముఁ బొందు
పాపికి నినుఁజూచు భాగ్యమ్ము గల్గఁ
జాలు నాతఁడు దోషజాలమ్ము వాసి
మేలు తా నొంది నెమ్మిగ నుండఁ గలఁడు

మునుపు నృగుండను భూపాలుఁ డాఢ్యుఁ
డనఘుఁ డిక్ష్వాకు వంశాబ్ధిచంద్రుండు
గలఁ డా విభుఁడు భువి గ్రమధర్మసరణి
వెలయుంగఁ బాలించు విబుధులు మెచ్చ 690
నతఁడు యోగ్యార్థుల కతిభక్తి నిచ్చు
వితతదానమ్ములు వివిధముల్; దాన
గోదాన మన లెక్కకు న్మిక్కుటమ్ము
మోద మాతనికి న ప్పుణ్యకార్యమ్ము

## నృగుఁడు బ్రాహ్మణునిచే శపింపఁబడుట

ఆ రాజు కశ్యపుఁ డనెడు విప్రునకుఁ
గూరిమి, భక్తియుఁ గుదురంగ దాన

మిచ్చిన ధేను వదెట్టులో మరల
వచ్చి యా రాజేంద్రు పసిఁ జేరుకొనియె.
గురుతింపలేక యా గోవును రాజు
పొరపడి వేరొక పుడమివేల్పునకు
దాన మొసంగఁగఁ దద్ర్బాహ్మణుండు
దానిఁగైకొని చన దారిఁ గశ్యపుఁడు
కని "ఇది నా గోవుగద, దీని నీవు
తనుగప్పి గొంపోవఁ గలదె న్యాయమ్ము"
అనవు డా బ్రాహ్మణు డయ్య! యీ గోవు
జనపతి దాన మొసంగె నా కిపుడు
'ఇది నాది' యంట నీ కెట్టులు చెల్లు
బెదరను నీ వెంత బెదరించితేని"
యనియెః వారాగోవుకయి య వ్విధమున
మనములఁ గ్రోధముల్ మలయఁ బోట్లాడి 700
చని యిద్దఱును నృగు సన్నిధిఁ జేరి
వినిచిరి తమ వాదువిధముఁ దెల్లముగ —

వారివాదమును భూపాలుఁ డాలించి
నేరము తనదని నెమ్మది నెంచి
మొదట దానముగొన్న భూసురుఁ గాంచి
"మొదవుల నొకలక్ష ముదము నీ కొంద
నిచ్చెదఁ గొనుము! మహీసురవర్య!
సచ్చరితా" యని సకలవిధాల
వేఁడ నాతం "డిట్టి వింత దానమ్ము
చూడ మెందెప్పుడు చూచితి మిచట
నీ యఘమునకు సదృశనారకమ్ము
పాయదు ని" న్నంచుఁ బలికి తాఁ జనియె.

రెండవ విప్రుఁ బ్రార్థింపఁగా నతఁడు
ఖండితోక్తిగ రాజుఁ గాంచి "యో యధిప!
విడువ దీనిని. నీవు వేయింటిమేలు
తొడుకుల నిచ్చిన తుష్టి నా కగునె?"
అని యచ్చోటును బాసి యరిగె నాతఁడును
మనుజనాథుండు కల్మషభీతి నొందె
పరమాత్మ! దోషి యెవ్వఁడో ఫలితమ్ము
తెలిఁ గెట్టిదియొ నీకుఁ దెల్లమ్ము గాదె. 710

కాలమ్ము నిండ భూకాంతుని నృగుని
కాలకింకరులు తత్క్షణమ గొంపోయి
పితృపతి ముందరఁబెట్ట నాతండు
క్షితిపతితోడ వచించె నీ రీతి
"మనుజేంద్ర! నీవు సమ్మాన్యుఁడ వమిత
ఘనదానధర్మముల్ గావించినాఁడ
వైనను స్వల్పమౌ యఘము నీ కబ్బె
దానిని భువిఁ బొంది, తదుపరి సుకృత
ఫల మందుమా. యిది పద్మజు నాజ్ఞ
తొలగింపరా" దని త్రోయించె భువికి
అంతట నృగుఁడు మహాదానరతుఁడు
వంతనొంది ధరిత్రిఁ బడి కర్మవశత
నూసరవెల్లియై యుర్వి నందందు
గాసిచెందుచు మెల్లఁ గదలుచు వచ్చి
ద్వారకాపురి సమీపమ్మున నున్న
పేరు బావింబడి వెత నొందుచుండె

## ఊసరవెల్లిరూపమున నున్న నృగుని శాపవిమోచనము

నందనందన. నీదు నందనుల్ గొంద
అందందుఁ దిరుగుచు నానందపడుచు

నగరోపవనము చెంతన నున్న పెద్ద
దగు నొకకూపమ్మునందు గుబ్బలికి 720
సవతుగానుండు నూసరవెల్లిఁ గాంచి
మివుల నచ్చెరువంది, మెల్లనదాని
వెలికి దీయగనెంచి, వివిధయత్నములు
సలిపి, తత్కార్య మసాధ్యమై తోఁప
నందఱు నీ చెంత కరుదెంచి సరట
చంద మంతయుఁ దెల్ప సరగున నీవు
జలశూన్యకూపమ్ము సరస కేతెంచి
యలఘు శరీరమ్ము నంది యున్నట్టి
యా కృకలాసము నతిలాఘవముగ
శ్రీకృష్ణ! వెడలించి ప్రియము సూపితివి

భవదీయ దర్శన భాగ్యమ్ము కతన
ప్రవిమల దివ్యకరస్పర్శ వలన
తొండరూపము మాని తొంటి రూపమ్ము
నిండుమోదమ్మున నృగరాజు పొంది
"కృష్ణ, దామోదర, కేశవ, వరద,
విష్ణుదేవ, మహాత్మ, విశ్వప్రకాశ!
నిన్ను దర్శించితి, నీ దయమంటి
నెన్నరానిపదవు లేర్పడఁ గంటి"
అని నిన్నుఁ గీర్తించి యచ్చోటనున్న
మనుజు లాశ్చర్య నిమగ్నులుగాఁగ 730
నిజ రథంబెక్కి యా నృపతి తాఁ జనియె
నజహరాద్యమర వంద్యపదారవింద!

నృగుని గోదానమ్ము నిరుపమానమ్ము
తగవుగఁ జేకుఱె తగిన పుణ్యమ్ము.

ఐన నేమాయె గోరంతదోషమ్ము
తా నొనరించుట తప్పెనే పాప
ఫలితము తొండరూప మ్మొందలేదె.
తలఁగింప రాదుగదా విధికృతము
పొదుకొనిన తన పాపచయమ్ము
నీ దర్శనమ్మున నీ కరస్పర్శఁ
దొలగంగ నా రాజు తొంటివిధాన
నలఘు సౌఖ్యమ్ముల నలరెను గాదె.
యన్నిఁటి కీవె సాక్ష్యమ్ము. నీ మహిమ
లెన్నంగ రాదు సురేంద్రాదులకును

అలతిదోషమ్మున కా నృగరాజు
తుల యిడరానట్టి దుర్గతి నొందె
జననమ్ము మొదలు దోషమ్ములే గాని
పొనరించి యెఱుగ నే బుణ్యకార్యమ్ము
కావున నాకు దుర్గతి తప్ప దనుచు
భావించుచున్నాఁడ పరమకృపాళు    740
కాన. నిన్గాంచు భాగ్యము నాకుఁ గూర్చి
దీనుఁ డంచును దయాదృష్టి వీక్షించి
నా పాపముల నెల్ల నాశ మ్మొనర్చి
నీ పాదపద్మ సన్నిధి నన్నుఁ జేర్చి
కాపాడవేఁడెదఁ గమలాక్ష! కృష్ణ!
ఆపదుద్ధార! దయాగుణాధార!

## పౌండ్రక వాసుదేవుని వృత్తాంతము

శ్రీ వాసుదేవ. నిర్జితపూర్వదేవ.
దేవకీసుత. కృష్ణ. దీనమందార.

నారదసన్నుత, నవనీతచోర,
నారాయణ, ముకుంద, నందకుమార!
తామసగుణులు దుర్దాంతగర్వమునఁ
బ్రేమస్వరూపుని విశ్వాత్ము నిన్ను
సామాన్యుఁ డంచు మాత్సర్యమ్ము పెంచి
తాముసు తమమిత్రతతియు నీ చేత
హతు లగుచుండుదు రవనియం దందు
నతజన పరిపాల, నందగోపాల!

మును కరూశవిషయమును నేలువాఁడు
ఘన బాహుబలశాలి గలఁడు పౌండ్రకుఁడు
వాఁడు చక్రగదాది పంచాయుధములు
పైఁడిచేలము, కౌస్తుభం బాది నగలు 750
కృత్రిమంబులు ధరియించి నీ పోల్కి
ధాత్రిని దిరుగుచుఁ దా వాసుదేవుఁ
డను నాఖ్య గలవాఁడ నని విఱ్ఱవీఁగు
మునిజననుత, కృష్ణ, ఫుల్లాబ్జనయన!

ప్రకటగర్వమున పౌండ్రక వాసుదేవుఁ
డొకనాఁడు తనకు ముఖ్యుండగు నొక్క
దూతను బిలిచి, మత్తుండయి, "యవని
ఖ్యాతమై వాసుదేవాఖ్య నా కొనరి
యుండఁ దన్నామ మన్యులకు నే రీతి
నుండంగఁ దగు" నని యుదుటున మిగిలి
యనుకొనునఁట కృష్ణుఁ డా వాసుదేవుఁ
డనయుఁడై యనయ "మీ వాతని కడకుఁ
జని, యట్టిభావమ్ము చయ్యన విడిచి
మనుట మేలని తెల్పి మరలి ర" మ్మంచుఁ

బనిపె: నా దూత శ్రీవత్సాంక, నీవు
ఘనవై భవమ్మునఁ గడుఁ బెద్దకొల్వు
దీరియుండంగ, నేతెంచి, నిన్గాంచి
గౌరవమేది, యిక్కరణి వచించె
వినవయ్య కృష్ణ! మా విభుని మాటలుగ
వినిపింతు, నవల భావింపుము భావి 760
“అవని రక్షింప, నే నవతార మొంది
భువి వాసుదేవాఖ్య బొంది యున్నాఁడ,
నట్టి నే నుండ సిగ్గావంతలేక
దిట్టవై నా నామధేయ చిహ్నముల
ధరియించి తిద్ది పంతమ్మె నాతోడ,
నరయ నర్హుఁడె పంతమాడ గొల్లండు
ఇంకనైనను తన్ను నెదిరి నెఱింగి
బింకము మాని యా బిరుదులు వదలి
ననుఁ గొల్చి బ్రదుకు టెంతయు మంచి” దనుము
వినకున్న ననిసేయ వెడలి రమ్మనుము”
అనుచు వాడు వచింప. నచ్చటనున్న
మనుజు లాలించి నెమ్మనములు గలఁగ
వింతనొందిరి: నీవు వెక్కసపడుచు
నంతవానికి నిట్టు లంటివి కృష్ణ!

“వినరోరి మూర్ఖ! నీ విభుఁ డన్నయట్టి
ఘనచిహ్నములు, నేను కదనానఁ జొచ్చి
తనమీదవైవ; గ్రద్దలకు గాకులకు
తిన ననువుగ వాని దేహమ్ము గూలు
నని చెప్పుమా, యిదె యరుదెంచువాఁడఁ
జనుము నీ” వన వాఁడు జడుపున వెళ్ళి 770

తెలిపె పౌండ్రకవాసుదేవున కెల్ల
నలుక యాతనిలోన నడరెడు రీతి.

## శ్రీకృష్ణుఁడు పౌండ్రకవాసుదేవుని తన్మిత్రుఁడగు కాశీవిభుని సంహరించుట

పిమ్మట నరిలోకభీకర! లోక
సమ్మోహనాకార! జగదేకవీర!
దండయాత్రోత్సుకతను నీవు పొంది
పుండరీకాక్ష! సంపూరితానేక
శాతాయుధంబును, స్వర్ణసుపర్ణ
కేతుసుందరముఁ, బ్రకృష్టాశ్వయుతము
నగు రథంబును సూతుఁడగు దారుకుండు
తగిన విధాన సిద్ధముచేసితెచ్చి
నీ ముందు నిలుప నున్నిద్రతేజమున
నామహనీయ రథారోహణమ్ము
గావించి యతిశీఘ్రగమన మొప్పార
దేవకీసుత! చేరితివి వాసి కాశి,
పౌండ్రకుండును రణావసర మేర్పడుట
తీండ్రమౌ తేజ ముద్దీపింపఁ గనలి
యక్షౌహిణీద్వితయమ్ముతోఁ బురము
నాక్షణమున వీడెః నతనికి సాయ
మక్షౌహిణీ త్రితయమ్ముతో వచ్చెఁ
గక్ష పెంచుచు కాశికాపురీవిభుఁడు. 780
ఆ రీతి నా ప్తసాహాయ్యమ్ముఁ బొంది
క్రూరాత్ముఁడై వచ్చు కూళఁ బౌండ్రకుని
నీ సమవేషుని నిందుఁ గాంచఁగనె
హాసహర్షములు నీ కయ్యె శ్రీకృష్ణ!

వానికి నినుఁ జూడ భయసంభ్రమములు
మానస మెరియు దుర్మానరోషములు
చాలఁగల్గుటఁ గడు శాతశస్త్రాస్త్ర
జాలము నీపైనఁ జలమున వాఁడు
విడువంగఁ గని వాని విడిచినవెల్ల
నడుమన ముక్కలౌనటు కడుఘోర
శరములఁ బఱపించి, శంఖనాదమ్ము
కరము భీకరముగ గావించి తీవు
మఱియు నా వైరి సమగ్రసైన్యమ్ము
కఱకు కోలలపాలుగాఁ జేసి తీవు

ఆ నీ విజృంభణ మా పౌండ్రకునకు
మానసాగ్రహము నిమ్మడిసేయ నతఁడు
నీపయిఁ బడరాఁగ నీవు తద్వైరి
చాపమ్ముఁ ద్రుంచి, యశ్వములఁ జక్కడఁచి
రథమును గూల్చి, సారథిని పోకార్చి
పృథుల శౌర్యమున న వ్వీరుఁ ద్రుంచితివి. 790
మఱియుఁ గాశీపతి మస్తక మ్మొండు
కఱకుటమ్మునఁ ద్రెంచి కాశికాపురము
నం దా శిరము పడునటులు సల్పితివి
నందనందన, కృష్ణ, నాగారివాహ!
నీ విక్రమమున కెందేనియు నడ్డు
భావింపఁ గలదె సర్వజగన్నియంత!
ఆ రీతి శత్రుసంహార మొనర్చి
భూరియశోలక్ష్మిఁ బొంది మోదమున
ద్వారకానగరమ్ము బంధువుల్ వొగడఁ
జేరి సుఖంబుంటి శ్రీయదుకృష్ణ!

అంత నక్కడ కాశి నవనిపునగరు
చెంతఁ గన్పడునట్టి శిరమును గాంచి
అది తమ విభు శిరమని పౌరజనము
విదితమ్ము సేయ న వ్విభుబంధుగణము

## కాశినుండివచ్చి ద్వారకపైఁబడిన కృత్యా వృత్తాంతము

వగచెను: పిదప న ప్పార్థివు తనయుఁ
డగు సుదక్షిణుఁడు మహాత్మ, శ్రీకృష్ణ!
నిను హత మొనరింప నెమ్మది నెంచి
తనపురోహితుని బోధన విని శివుని
పదసరసిజముల భక్తిఁ బూజించి
మదిలోని తనకోర్కి మనవి గావించి 800
యా మహేశ్వరు నాజ్ఞ యట్లభిచార
హోమ మొనర్చి, యందుండి వెల్వడిన
ఘోరకృత్యను గనుంగొని "నీవు వేగ
ద్వారకాపురమును దగ్ధ మొనర్చి
ర" మ్మని పనుప, నా రక్కసి నీకు
నిమ్మగుపురిఁ జేరి నెమ్మదుల్ గలఁగ
పౌరసమూహమ్ము వనజాక్ష! నిన్నుఁ
జేరి యార్తధ్వనుల్ సేయుచు, కృష్ణ!
పెనుభూత మొక్కఁ డివ్వీటిని, మమ్ము
ననలమ్ము పాల్సేయ నడరుచున్నయది
రక్షింపుమా! మమ్ము రక్షింపు మయ్య
రక్షకుఁ డీవె సర్వమునకు స్వామి!"

అని వేఁడ, వారల యార్తి నాలించి
మనమునఁ గృత్యసమాచార మెల్ల

నెఱిఁగి తద్ధనమ్ము నెడఁద భావించి
పురవాసులకు భీతిఁ బోగొట్ట. నరుల
హత మొనరించు చక్రాయుధరాజ
మతి భీతిదంబగు నా కృత్యపైని
విడువ. తా చక్రమ్ము వేచని కృత్య
కడలు గల్పించి. భీతావహఁ జేసి 810
పురినుండి గెంటి. యేపున వెంట నంటఁ
గరము భయమ్మునఁ గాశికాపురికిఁ
బరుగిడి యాకృత్య. పట్టణ ప్రజలు
వెఱపొంద నధ్వర్యు విసరమ్ము రాజ
తనయు సుదక్షిణు దగ్ధ మ్మొనర్చి
మునుపటి తన రౌద్రమును మానుకొనియె
అంత సుదర్శన మాపురి సొబగు
నంతయుఁ జెడఁగొట్టి యచ్చోటు వదలి
మరలి ద్వారకఁజేరి మాధవా! నీదు
సరసన నీ సేవ సల్పుచునుండె
సర్వేశ. నీ విశ్వశక్తికి నరయ
సర్వశక్తులును వశమ్ములౌ స్వామి!

వాఁతలు వెట్టుకోవచ్చును గాని.
యే తఱి నేఁ బులి యెట్లగు నక్క ?
నీ లాంఛనమ్ములు నీ పేరు దాల్చి
నీలాగునఁ జరించి. నిను స్వల్పదృష్టిఁ
జూచి. నిన్నెదిరి దుష్టుఁడు పౌండ్రకుండు
నీచవర్తనుఁ డయి నీ చేతఁ జచ్చె
గొట్టెదాటునఁ బౌండ్రకుని జాడఁ బోయి
విఱ్ఱవీఁగుచు. కాశివిభుఁడు నీ చేతఁ 820

హతుఁడయ్యె నట్టి నీ యద్భుతశక్తి
యతిరూఢ మగుచుండ నా సుదక్షిణుఁడు
పరులమాటలు నమ్మి పశుపతి నమ్మి
కరుణాస్వరూపు ని న్గారింప నెంచి,
యభిచారహోమమ్ము నందునఁ గృత్యఁ
బ్రభవింపఁజేసి, నీపైఁబంపి తుదకు
దానిచే మరణమ్ముఁ దాఁ దెచ్చుకొనియె
శ్రీనాథ! నీదు కీర్తి జగాన నిండె

పరమేశ, నతజనపాలనశీల,
కరిరాజసంరక్ష, కాంచనచేల!
నిను నిరసించెడు నీచమౌ బుద్ధి
వనజాక్ష! లేదు నా స్వాంతానఁ గాని
నిను ధ్యానమొనరించు నిశ్చలబుద్ధి
యణుమాత్ర మేని నా యందు శూన్యమ్ము
నా మది నీదు ధ్యానమ్మున నిల్పి
నే మవుగొనము మన్నించి నా కొసఁగి
నా పాపముల నెల్ల నాశ మ్మొనర్చి
నీ పాదయుగ్మ సన్నిధి నన్నుఁ జేర్చి
కరుణింపుమా లోకకల్యాణమూర్తి!
గురుతర మంగళగుణ చక్రవర్తి! 830

బలరాముఁడు ద్వివిదుఁడను వానరుని జంపుట

శ్రీ తరుణీప్రియ, శ్రితజనగేయ,
వాతాశనశయన, వారిజనయన!
మానవతత్వముల్ మహి వేరువేరు
కాన మొకే తీరు కమలదళాక్ష!

మంచివారును చెడుమార్గానఁ బడుట
కొంచెపువారును గుణవంతు లగుట
కొంద ఱుత్తములయ్యుఁ గులధర్మవిధుల
యందలి గుణముల నరయక చెడుట
కొంద ఱజ్ఞత మాని గురుబుద్ధి నెఱుక
పొందుట, తమ దోషముల దిద్దికొనుట
ఈ రీతి చిత్రమ్ము లెన్నెని్ఁ దోఁచు
వారిజోద్భవ భవవంద్య చరిత్ర!
గుణదోషముల లెక్కగొని వారివారి
తనుగుణ ఫలితమ్ము లరయంగ విడక
నీవు గూర్తువు లేక నీ ప్రసిద్ధాంశ
భవులచేఁ గూర్పింతు వైకుంఠవాస!

తొల్లి సుగ్రీవుమంత్రులలో నొకండు
బల్లిదుఁడను ఖ్యాతిఁ బరగినవాఁడు
రవికులతిలకు శ్రీరాముని బంటు
ప్లవగుఁడు ద్వివిదాఖ్య భాసిల్లువాఁడు 840

ఆ వానరుఁడు నరకాసురుతోడఁ
గావించె స్నేహమ్ము, గాన నా మిత్రు
పగదీర్ప మదినెంచి, వనజాక్ష! నీవు
తగవుమైఁ గాపాడు ధరణిలో నున్న
పల్లెలపురముల పసుల కొట్టముల
నెల్లతోఁటల దొడ్ల నేపైన తరుల
పైరు బచ్చులఁ జాలఁ బాడొనరించి
క్రూరకార్యమ్ము లెక్కుడు సేయుచుండె

ఒక్కనాఁ డాప్లవగోత్తము చెవులఁ
జక్కని మృదుగీతశబ్దమ్ము పడియె

నా గానమధురిమ కతఁడు మోదించి
వేగమ గంతులు వేయుచుఁ జెల గి.
రైవతకాద్రిఁ జేరంజని యచట
దేవేరులం గూడి తియ్యసల్లాప
ములతోడఁ బాచికల్ పొందిక నాడు
నల యనంతాంశజు హలపాణి. ముసలి
నమలసితాంగుని యతినీలవసను
విమలచేతోఘను. విబుధేశవంద్యు
భవదగ్రజుని కామపాలుని రాము
నవహితమతిఁగాంచి యట మ్రోలనున్న 850
తరువుపై నెక్కి త త్తరుశాఖ లూఁచి
కురుకురు మనుచును. కొమ్మకొమ్మకును
దాఁటుచు. వెక్కిరింతలతోడఁ బండ్లు
బైటఁబెట్టుచు గోళ్ల బరులు గోకుచును.
మరిఁ బెక్కువిధముల మర్కటజాతి
కొఱగాని చేఁతలఁ గొంకకచేయ
సీరి యా ద్వివిదుని చేష్టలుచూచి
దూరమ్మునకు వానిఁ దోలంగ నొక్క
గుండురాతినిగొని గుఱిచూచివైవ
గండఁడా ప్లవగ పుంగవుడు తద్ధతిని
తప్పించుకొని మధుద్రవపాత్ర మెత్తి
తెప్పున బలునిపైఁ దెగి వైచెఁ బగుల
మరియు నా హలియెడ మర్యాదలేక
మొఱకుబుద్ధిని వస్త్రములు చించుచుండ
నా రామదేవుఁ డత్యాగ్రహ మొంది
క్రూరు నా వానరు రూపుమాపంగ

హలము చేతంబట్టి యదలించె. వాఁడు
తొలఁగక యొక చెట్టుతో హలిఁ గొట్టె
నంత రాముఁడు ముసలాయుధ మెత్తి
పంతాన వానరు పటుకంధరమ్ము 860
వైవ నాతఁడు కొంతవడి మూర్ఛనొంది
చేవ చెడక కొంతసేపటిలోన
తెలివొంది నిలిచి యెత్తైన నొక్క పెద్ద
శిల వైచె. దానిని సీరి భేదించె
నీ రీతి తరులు రా లెసఁగుకోపమున
వారక ద్వివిదుండు వైచుచునుండ
వాని నన్నింటిని బలుఁడు తుత్తుమురు
గా నొనరింప న క్కపివల్లభుండు
పిడుగుఁబోలిన తన పిడికిట రాముఁ
బొడిచిన నాతఁడు ముసలమ్ము హలము
నానిచి కపిమెడ నదిమిపట్టంగ
వాని కనులగ్రుడ్లు బైలకు నుఱుక
నెత్తురుల్ గ్రక్కుచు నేలపై వ్రాలి
యత్తఱి న క్కపి యంతమ్ము నొందె
నా వానరుని మృతి కానందమొంది
దేవతల్ మిగులఁ గీర్తించిరి బలుని

## కౌరవులు సాంబుని బంధించుట

కరినగరేశుఁడౌ కౌరవజ్యేష్ఠు
వరసుత లక్షణ భద్రగుణాఢ్య
ఆ కన్నియకుఁ బెండ్లియగుచుండఁ గృష్ణ!
నీ కొమరుఁడు చేవనెలవు సాంబుండు 870

తన యరదమున నా తరళాక్షి నుంచి
కొని వచ్చుచుండ నా కురువీరులెల్ల
వీక్షించి "కంటిరే, పిన్నవాఁ డొక్కఁ
డీ క్షత్రియోత్తము లిటు చూచుచుండఁ
గ్రొవ్వున బాలికఁ గొంపోవఁ గలిగె
న వ్వెట్టి బాలు నహంకృతి మాన్ప
రండు రం డనుచును బ్రబలగర్వమున
గండుమీఱిన యట్టి కౌరవు లెల్ల
కర్ణుఁ డాదిగ మిత్రగణములతోడఁ
దూర్ణంబునం జని దుర్దాంతవీర్యు
సాంబుని మూఁగి మత్సరమున వాఁడి
యంబకమ్ములువైవ, నాతఁడు రేఁగి
యా సాయకమ్ముల నన్నింటిఁ బొడిగఁ
జేసి, వారలనెల్ల చీకాకు పఱుప,
వార లందఱు నొక్కపట్టున సాంబు
ఘోరంబుగాఁ జుట్టుకొని విరథునిగ
నొనరించి, బంధించి, యువిదతోఁగూడ
గొని హస్తిపురమునకుం జని రంత

నందనందన! కృష్ణ! నగధర! నీదు
నందను సాంబు బంధనమును గూర్చి 880
నారదముని వచనమ్ములఁ దెలిసి
వీరులు యాదవుల్ వేగిరపడుచు
యుగ్రసేనుని యాజ్ఞనొంది సైన్యమ్ముఁ
నాగ్రహమ్మునఁ గొని హస్తినాపురికి
వెడలుచునుండ నా విధము నెఱింగి
కడుఁ గరుణానిధి, కామపాలుండు

"కౌరవుల్ మనకు దగ్గరబంధుజనులు
వారిపై నెత్తిపోవఁగ నీతి యగునె?"
యని వారి వారించి యా క్షణంబునన
తనవారిఁ గొందఱఁ దనవెంటఁ గొనుచు
కనకరథంబెక్కి ఘనవైభవమునఁ
జనె హస్తిపురిఁ జేర సాధుచిత్తమున

రాముురాకకు ధార్తరాష్ట్రు లుప్పొంగి
ప్రేముడి యెదురేగి వివిధసత్కృతులు
గావించి మర్యాదగాఁ దోడితెచ్చి,
భావుకప్రశ్నలు భాషించి గద్దె
నాసీనుగాఁజేసి, యతనికి నెదుర
నాసీనులైరి వారంద ఱుత్సుకత
నప్పుడు బలరాముఁ డటనున్నవారి
మెప్పును బడయ నిమ్మెయి వచియించె 890
"వినుఁడు కౌరవులు! మా విభు నుగ్రసేను
పనుపు మీ రెల్లను బాటించు టొప్పుఁ
గాని, బాలకుని నొక్కని మీర లెల్లఁ
బూని బంధింతురే, పొసగ దీతప్పు
ఐనను మా విభుఁ డాత్మీయు లంచు
మీ నేరములు సైచె మేలయ్యె మీకు"

అనుడు సుయోధనుఁ డాభాషణములు
విని సభ్యులం జూచి వింటిరే మీరు
కాలమ్ము మార్పును గనఁజాల రెవరు
కాలిచెప్పులు తలకాయపై నెక్కె
మనము బందుగులని మన్నించుకొలఁది
ఘనరాజ్యభోగముల్ గడు హెచ్చుకొలఁది

మన సరివారుగా మదమెక్కి యిటులు
మనకు బోధింప సమర్థులైనారు
చాలు యాదవులతో సంబంధ మింక
పాలఁ బెంచిన విషప్రాణియే పాము:
గురు భీష్మ కర్ణులు, కురుయోధవరులు
చెఱఁగొన్నవానిని జిష్ణుఁడే యైన
విడిపింపఁ గలఁడె, యీ వెఱ్ఱిపల్కులకు
జడియువా రెవ"రని సరగున లేచి 900
కటకటపడుచు నా కౌరవరాజు
యటనుండి చనియె నిజాగారమునకు

## బలరాముఁడు హస్తిపురిని గంగలోఁ ద్రోయఁబూనుట

అటులు సుయోధనుఁ డాడినయట్టి
కటుభాషణములకుఁ గామపాలుండు
తన మానసమునఁ గ్రోధము నిండుకొనఁగ
కనులెఱ్ఱనయి నిప్పుకలు రాల్చుచుండ
తనబంధుజనుల యాదవవృద్ధజనముఁ
గని "మీరు వింటిరిగద రాజ్యవిభవ
గర్వాంధులగు వారి కఠినభాషణము
లుర్వి వీరలకెందు నొరు లెవ్వరేని
సాటిగారఁట! యిట్టి సంపదున్మత్తు
లేటికి విందురు హితవచనములు
సామముచే వీరిఁ జక్కఁజేయంగ
లే మింక తగదు తాలిమి వీరియెడల
వీరిఁ జంపఁగ యదువీరులు హరియు
రా, రావల దని ద్వారవతి వారలను

వారించితిని, బంధువాత్సల్య మొప్ప
వీరి యహంకార వృత్తి నే నెఱుఁగ
దుష్కార్యరతుల నీ దుష్టులఁ జంపి
నిష్కారవమ్ముగ నేఁ జేయకున్న 910
తీఱదు పగ" అని తెగి హలాగ్రమ్ము
వారణపురి కడ భాగానఁ జొనిపి
యాపురి విస్తారమగు బువి గడ్డ
నేపునఁ బెకలించి యీడిచి, గంగ
వాఁగునఁ బడఁద్రోయ బలుఁడు యత్నింప
సాగరమధ్యోర్మిఁ జలనమ్మునొందు
తరణిచందమ్మునఁ దత్పురి వడఁకి
యొఱఁగె నాక్షణమున నుత్తరదిశకు
నదికారణమ్ముగ నప్పురిప్రజలు
కుదురుగ బువి నడుగుల నిడలేక
తడబాటుపడుచు చిత్తములు గలంగ
నిడుమల జడిసి కుయ్యిడుచుండి రపుడు
మరి గోపురములు హర్మ్యములును గుళ్లు
తరువు లొఱఁగఁజొచ్చె తమ పట్టువీడి.
ఈ మహోత్పాతమ్ము లెల్ల వీక్షించి
కామపాలుఁడు కడుఁ గనలి, కావించి
నట్టివిగాఁ దమ యాత్మల నెంచి
యెట్టి ప్రతీకార మేనిఁ జేయంగఁ
జాలక కురువృద్ధజనము, కౌరవులు
చాల భయంపడి స్వర్ణాంబరములు 920
మణిమయభూషలు మంజువస్తువులు
గొని లక్షణను, సాంబుఁగూడఁ బ్రియమ్ము

వెలయంగఁ దోడ్కొని వేగమ వచ్చి
బలభద్రునకు సమర్పణము గావించి
చేతులు జోడించి శిరములు వంచి
యాతతభక్తిమై ప్రార్థించి రిట్లు

"రామ, యశఃకామ, ప్రబలారిభీమ,
కామపాల, యసిత కమనీయచేల!
పరమదుర్మార్గులఁ బరిమార్ప, భక్త
వరుల సంరక్షింప, వసుధభారమ్ము
తీఱుప, ధర్మస్థితిని ప్రతిష్ఠింప
ధారుణి కృష్ణావతారుఁడై యున్న
హరియు నీ యంశజుఁ డయ్య యనంత!
పరమాత్ముఁడును బరబ్రహ్మమ్ము నీవె
నీ వవ్యయుండవు, నీ వీశ్వరుఁడవు
నీవె నియంతవు నీవె సర్వమ్ము
నీ మహామహిమ లన్నియు నిట్టి వంచు
నీ మహి నేవార లెఱుఁగరు దేవ!
నినుఁ బొగడంగ నే మెంతటి వార
మనయుల మక్రమ మాచరించితిమి 930
మా దోషములనెల్ల మన్నింపుమయ్య
యో దయానిధి, జగదుద్ధారకుండ!"

ఈ రీతిఁ గౌరవు లెల్లఁ గీర్తింప
సీరాయుధుఁడు సంతసించి వారలను
గని యిట్టులనె "మీరు గావించినట్టి
యనయ కార్యమ్మున కలిగి యీ రీతి
చేసితి: నిప్పుడు చేకుఱె ముదము
త్రాసమ్ము వాసి, సంతసమును గనుఁడు

పొందుమీ" రన వారు పొంగి రయ్యెడను
నిండుమోదమ్ముఁజెందిరి పౌరులెల్ల
నంత సుయోధనుఁ డల్లునిఁ గూతు
స్వాంతమ్ము లుప్పొంగ సకలమర్యాద
లొసఁగి యా యిద్దఱ నొప్పించె, సీరి
కసమానబలునకు నందఱు మెచ్చ

కొడుకుఁ గోడలిని తోడ్కొని ద్వారవతికి
కడుమోదమునఁ జేరె కామపాలుండు
బలభద్రు విజయమ్ము బంధుజనమ్ము
తెలిసి సంతోషానఁ దేలె మిక్కిలిగ
నేఁడును గన రౌహిణేయుని శౌర్య,
మీడుగాననని బల మెఱుగంగఁ జేయ 940
సాకిరి యనునట్లు సామజపురము
ప్రాకటముగ యామ్యభాగమ్ము మిట్టు
వడచక్కి భాగమ్ము పల్లమై యుంట
పుడమిఁ బ్రఖ్యాతమ్ముఁ పురుహూతవంద్య!

దేవకీసుత, హరి, దీనమందార,
గోవింద, గోపాల, గోపకిశోర!
ద్వివిదప్లవగుఁడు త్రేతాయుగమున
భవదీయ శ్రీరామభద్రావతార
సమయాన సుగ్రీవు సచివుఁడై యుండి
విమలమతిని నిన్ను వినయమ్ము మీఱఁ
గొలిచెః నేఁ డాతఁడె కుమతియైనాఁడు
బలరామదేవుఁడు భగవదంశజుఁడె
యని యెఱిఁగియు నరకాసురుమైత్రి
ననయవర్తనుఁడయి, యా బలునెదిరి

యాతనిచేఁ జచ్చె నఖిలలోకేశ!
యా తీరు వింతయై యవనికిఁ దోఁచె
కౌరవపతి యహంకారచిత్తుండు
చెఱనుంచె సాంబుని, సీరిహితోక్తి
పెడచెవులంబెట్టెఁ, బృథ్వియాదవులు
కడు నల్పులనె వారు కౌరవజాతి 950
కరయంగ సాటిగా రని మదవృత్తి
పరుషోక్తులను బల్కె భయరహితముగ
సంతదురభిమాని యా సుయోధనుఁడు
దంతివరద! శత్రు దమన! శ్రీకృష్ణ!
బలరాము విక్రమ బలసాహసములు
తిలకించి వెఱచి యుద్వృత్తిని మాని
గుణవంతుఁడై తనకూతును, సాంబుఁ
గొనితెచ్చి యతనికిఁ గుతుకంబుగల్గ
నప్పన మొనరించి యర్థించె శరణ
మిప్పగిదియు గల దీ భువియందు
ఈ మార్పు లీ తీర్పు లెల్లను గాంచి
యేమి యెఱుంగ నట్లీవుందు గాని
నీ మానసమున కన్నియును వేద్యముల
యేమనవచ్చు నీ యెడ రహస్యమ్ము
ఆ యమూల్యరహస్య మఖిలమ్మునకును
శ్రేయమ్ముగూర్చు సుస్థిరకల్పకమ్ము

నిన్నుఁ గన్గొనుటకు, నీ మహిమమ్ము
లెన్నిగొల్చుటకు నీ యెనలేని పాడలు
మనమున నిల్పి, సంభావించి, యెఱిఁగి
యనుపమానందమ్ము నందుట కరయ 960

నిసుమంతయత్నమ్ము నేఁ జేయకుంటి
వ్యసనమ్ములను జిక్కి వ్యర్థుండనైతిఁ
గాని. యిప్పుడు తెల్విగంటిని నీదు
ధ్యానమ్ము మఱువ నెత్తఱినైన నన్నుఁ
గాపాడుమా కృష్ణ! కరుణాలవాల!
నీ పాదములె దిక్కు నిర్జరపాల!

## షోడశసహస్ర స్త్రీ సంగతుండైన శ్రీకృష్ణుని మహిమను నారదుఁ డరయుట

శ్రీకరాకార, లక్ష్మీచిత్తచోర,
పాకారినుతపాద, వనధి గంభీర,
పరమాత్మ, మాధవ, పరమేశ, శౌరి,
కరుణాకరా. హరి, కౌస్తుభధారి!
పరమతపోనిష్ఠ వరలెడు మౌని
వరులకైనను నీదు పరతత్త్వమహిమ
మరయంగ నచ్చెరువయి తోఁచుచుండు
నిరుపమాద్భుతములు నీ లీల లెన్న
సామాన్యమానవజాతి తల్లీల
లేమి యెఱుంగు సర్వేశ, శ్రీకృష్ణ!

"నరకాసురుని వధానంతర మతని
చెఱఁబడియుండిన స్త్రీలఁ బదాఱు
వేలను గొనితెచ్చి విభవంబు మెఱయు
జలజనాభుండు తత్సరసిజేక్షణల 970
కందఱకును దాన యన్నిరూపులుగ
సుందరాకారుఁడై చొప్పడఁ దోఁచి

పరిణయ మయ్యె: న ప్పద్మదళాక్షు
తెఱ గెట్టులుండు దద్విభవ మెట్లుండుఁ
గను గొంద” మని కడుఁ గాంక్షతో దేవ
ముని నారదుండు సన్మునివంద్య కృష్ణ!
ద్వారకాపురి కొక వాసరమందుఁ
జేరంగ వచ్చె హెచ్చిన వేడ్కతోడ.

వచ్చి తా నందొక భర్మహర్మ్యమున
మచ్చెకంటులు ప్రియంపడుచునుఁ గొల్వఁ
గుందనపుంగద్దెఁ గూర్చుండియున్న
నందాత్మజునిఁ గరుణామయుఁ గృష్ణు
నినుఁ గాంచి యానంద నీరధి మునిఁగి
తనుఁదాన మఱచె న త్తాపసో త్తముఁడు
అంత నీ వెదు రేగి యతని పాదముల
కెంతయు భ క్తితో నెఱఁగి నీ గద్దె
నాసీనుఁ గావించి యతివినయమున
హాసాంచిత ముఖాబ్జ మలర “నో మౌని!
యేమి కార్యార్థమై యేతెంచినాఁడ
వేమి పంతువొ దాని నేఁ జేయువాఁడ” 980
ననుడు నప్పలుకుల కలరి యమ్మౌని
యనెఁ ద్రిభువన మోహనాకార! శౌరి!
భవదవతార సంభావ్యభావమ్ము
భువి దుష్టనిగ్రహమ్మును గూర్చిగాదె!
విశ్వరక్షకుఁడవు విశ్వాత్మకుఁడవు
శాశ్వతుఁడవు నీకు సాధింపరాని
పను లున్నవే! యా ర్తబంధుండ వీవ
యనిశమ్ము నీ పదధ్యానమ్ము నాదు

మనము వాయనియట్లు మన్నించి నన్ను
కనికరింపవె" యని కడుభక్తివేఁడి
నిను నట వీడ్కొని నీదు మాహాత్మ్య
మును దెలియఁగఁ గోరు పూన్కి వేరొక్క
వనజాతలోచన భవనమ్ముఁ జేరి
నిను నటఁగని చెందె నిండుమోదమ్ము

ఆ యింట నీ చేసినట్టి సత్కృతుల
కా యతికుల ముఖ్యుఁ డానంద మొంది
యందుండి వేరు గృహమ్ముఁ దాఁ జేరి
యందు నందనునితో నానంద మొందు
నినుఁ గని యమ్మౌని నివ్వెఱగంది
తనియ కింకను నీదు తత్త్వమ్ముఁ దెలియఁ 990
దలఁచి యాతఁడు భవత్సతుల గేహముల
కలరు మానసమున నరుదెంచిచూడ"
సర్వమయుండవు సర్వేశ్వరుఁడవు
సర్వమ్మునకు నీవె సాక్షిభూతుఁడవు
నీ విట్టిఁడని చెప్ప నేర్చు నెవండు?
నీ విధు లూహింప నేర్పరి యెవఁడు?
నీదు మాహాత్మ్యముల్ నిగమవంద్యములు
నీదు లీలలు గన నిత్యనూత్నములు
ప్రతిగృహంబున నీవు ప్రతిభార్యతోడ
ప్రతిలేని యానందపరవశుఁ డవయి
ప్రతి వధువున కెద్ది వాంఛిత మగునొ
కుతుకంబుతోడ నక్కాలఁదితో నీవు
ఒక యింట మజ్జన మొక యింట భుక్తి
ఒక యింట శయ్య వేరొక యింట నెత్త

మొక యింట పౌరాణికోక్తి విలాస
మొక యింట పంచయజ్ఞోచితకర్మ
మొక యింట నిత్యసంధ్యోపాసనాప్తి
ఒక యింట వేణుగానోత్సాహనిరతి
ఒక యింట సుతసంయుతోల్లాసగోష్ఠి
ఒక యింట ధేనుదానోత్కట దీక్ష 1000
ఒక యింట ప్రణయోక్తి యొక యింట హాస
మొక యింట పాట వేరొక యింట నాట
ఈ లాగున ననేక హృద్యము లైన
లీలలు తత్పుణ్య లీలావతులకు
మోదమ్ము గూర్ప సమ్మోదమున నీవు
నాదవినోద! కృష్ణా! మానవత్వ
మంది వారలతోడ ననుభవానంద
మొందెడు భవదీయయోగప్రభావ
మారసి య మ్మౌని యాత్మలో నలరి
"శ్రీరమానాథ, హృషీకేశ, శౌరి,
నీ మాయ లెఱుగంగ నేర రెవ్వరును
నా మానసమున కానందమ్ము గల్గె
నీ మహిమలు గంటి, నినుఁ బొడగంటి
నా మనోభీష్ట మెంతయును ఫలించె
పని వినియెద నన్నుఁ బంపుమా దేవ!"
అని నిన్ను వీడ్కొని యరిగె న మ్మౌని.

గోవర్ధనోద్ధార, గోపాలబాల,
శ్రీవత్సలాంఛన, శ్రితజనపాల!
నారదమౌని యెన్నడు నిన్ను విడక
కోరి భజించెడు గురుమానసుండు 1010

కాన నా భక్తునికాంక్ష నీ వెఱిఁగి
దానిఁ దీర్పఁగ నెంచి, తపసి యే యింటి
కేతెంచి చూచిన నీ వందుఁ దోఁచి
ఖ్యాతమై వెలయు గృహస్థధర్మములఁ
బచరించుచుండ దేవతపస్వి నీదు
ప్రచురమౌ యోగ ప్రభావమ్ముఁ గాంచె.

నమ్మి కొల్చినవారి న్యాయమౌ కోర్కె
లిమ్ముగఁ గూర్చుటయేగద నీదు
దీక్ష, జగద్రక్ష! దివిజేంద్రవినుత!
పక్షివాహన! జగద్భద్రసుచరిత!
నారదువలె భవన్మహిమ లెట్టివియొ
యారసి ధన్యత్వ మందంగ నాకుఁ
గలదె యోగ్యత జగత్కల్యాణమూర్తి!
కలుషమానసుఁడ దుష్కార్యాభిరతుఁడ
కాన నీవే నాకు గతియని నాదు
మానసమ్మున నమ్మి మనుచున్నవాఁడ
నన్ను రక్షింపుమా నాగేంద్రశయన!
నిన్ను నమ్మినవాఁడ నీరజనయన!

## శ్రీకృష్ణుఁడు ధర్మజుచే రాజసూయంబు జరిపింప ఇంద్రప్రస్థమునకుఁ జనుదెంచుట

శ్రీయాదవాన్వయ క్షీరాబ్ధిసోమ,
తోయజనేత్ర, బంధుర నీలగాత్ర, 1020
నందనందన, కృష్ణ, నవనీతచోర,
బృందావిహార, గోపీజనమార!

ఆర్తులతొ సాధువు లంపినయట్టి
వార్తలు శ్రద్ధ సంభావించి వింట
మునిజన హిత వృద్ధ ముఖ్యభాషణలు
మనమున నమ్మి యమ్మాడ్కి వర్తింపఁ
దలకొంట, బంధుసంతతికి నుత్సాహ
మెలయింపఁ జనుట నీ కెంతయుఁ బ్రీతి
కరములౌ కార్యముల్ కారుణ్యధామ,
దురితవిరామ, నిస్తులపుణ్యనామ!

ఒకనాఁడు ద్వారక నొడ్డోలగమున
సకలబంధువులును, సన్మిత్రకోటి,
మంతురుల్ పెద్దలు మాగధజనము
ప్రాంతీయభూపతుల్ భటులును కవులు
గాయకుల్ మొదలుగాఁగల వార లెల్ల
పాయని భక్తిఁ గొల్వఁగఁ గొల్వుదీరి
శ్రీకృష్ణ! నీవు ధరిత్రీజనమ్ము
ప్రాకటశుభములు వడయు మార్గమ్ము
లందఱతోడ మహానంద మొప్పఁ
బొందికఁ బ్రస్తావమును జేయుచుండ 1030
నచ్చటి కొక వింత యవనీసురుండు
విచ్చేసి నీకు వివేకమ్ముతోడ
వందనము లొనర్చి భక్తి ని గ్గాంచి
యందఱు విన నిట్టు లనియె మహాత్మ!

"అవధరింపుమ, జగదవనైకదీక్ష!
వివరించుచున్నాఁడ విన్నప మొండు
అనుపమ బలయుతుఁ డగు జరాసంధుఁ
డనయుఁడు తనుఁ గొల్వనట్టి భూపతుల

పెక్కురఁ జెఱనుంచి వేధించుచుంట
నిక్కువ మ్మది కడు నేరమ్ము ఘోర
మా చెఱఁబడియున్న యవనిపు లెల్ల
నీచిక్కు మమ్మెప్పు డెడఁబాయునొక్కొ!
యని దిగులొందుచు నందఱుఁ గూడి
నను నీదు చెంత కన్పఁగ వచ్చినాఁడ
వా రిట్లు నీతోడఁ బల్కంగ నాకు
నేరిపి పంపిరి నిగమాంత సంవేద్య!
వినుమ యా పల్కుల, విశ్వేశ! నీకు
మనమునఁ దోఁచు న మ్మాడ్కిఁ గావింపు"

"వారిజనాభ! దుర్వారమదారి
వీరసంహార! త్రివిక్రమ! కృష్ణ!
ఆర్తులౌ మమ్ముల నరసి రక్షింపఁ
గర్త వీవేగద కారుణ్యరూప!
నీ పాదయుగ్మమే నిజముగ మాకుఁ
బ్రాపు, దీనుల మమ్ముఁ బాలింపుమయ్య
యీ వెఱుంగని యది యెం దెద్ది గలదు?
మా విపద్దశఁబాపి మముఁ బ్రోవుమయ్య"

అని బ్రాహ్మణుఁడు దెల్ప, యజ్ఞాక్ష! నీవు
వినుచుంటి, వింతలో వినువీథినుండి
నిను దరిసింపంగ నెమ్మదిఁ దలఁచి
చనుదెంచె నారద సంయమీంద్రుండు
అయ్యతివరుఁ గాంచి యార్యులు నీవు
చయ్యన లేచి హస్తము లెత్తి మ్రొక్కి
కనకాసనస్థితుఁ గావించి మిగుల
వినయ మొప్పార న వ్వేల్పుతాపసికి

సకలోపచారముల్ జరిపితి రవల
నకలంకమతి నిట్టు లంటివి నీవు —

"మునివర్య! నీ రాక ముదమునుగూర్చె
వినదగునవి యున్న వినిపింప వచ్చుఁ
బాండవు లిప్పు డేపగిది నెచ్చోట
నుండిరో వారల యునికిని దెల్పు 1050
మను నీదు పల్కుల నాలించి మౌని
వనజాక్ష! నీతోడఁ బల్కె నీ లీల

దేవ, జగత్పతి, దివిజార్తిహరణ!
నీవెగా యీసృష్టి నిర్మాణమునకుఁ
గర్తవు, సర్వజగద్వర్తనమ్ము
వర్తింపఁజేయు విశ్వమయుండ వీవె
అనలము దారువునంద లోలోన
నణఁగి వెల్గుచునుండునట్టులు సర్వ
మం దుందు వీవు నీ యసమాన మహిమఁ
గందోయి పండువుగాఁ జూడఁగంటి
నట్టి మహాత్ముఁడవగు నీకు దెలియ
నట్టివి గలుగునే, యైన విన్పింతు
వినుమయ్య! పాండుభూపతి పెద్ద కొమరుఁ
డనఘుఁడు రాజసూయమహాధ్వరమ్ము
గావించు యత్నమ్ము గల్గియున్నాఁడు
నీ విలసత్కృపా నియతియే యున్న
నతని కోరిక దీఱు: నాతఁడు నీకు
హితుఁడు, బంధుఁడె గాక, హెచ్చినభక్తి
నిను నమ్మియున్నట్టి నిష్కలుషాత్ముఁ
డనుపమ ధర్మ సత్య విశిష్ట శీలుఁ 1060

డా యిష్టి నీదు సాహాయ్యసంపత్తి
శ్రేయమ్ముగా సాగు క్షితిపసంఘమ్ము
మునిగణమును నీ యమోఘమాహాత్మ్య
మును గని యానందమును బొందఁ గల్గు"
నను నారదుని పల్కు లాలించి పొంగి
ఘను నుద్ధవుని నీవు గని యిట్టు లంటి

"విన్నావుగద, మౌని విమలబోధనము
పెన్నిధి మనకది పేర్మిగూర్చునది
యిప్పుడు కర్తవ్య మెద్దియో నాకుఁ
జెప్పుమా యుద్ధవ, శిష్టస్వభావ,
నీవు చెప్పినయట్ల నే నొనరింతు
భావిని గుర్తించి పల్కుమా మిత్ర"
యనుచు నీ వెఱుఁగని యట్టు లుద్ధవుని
వినుపింపు మీ కార్యవిధమంచుఁ గోర
నాతఁడు మిక్కిలి యానంద మొంది
నీ తోడ నిట్లనె నిశ్చయబుద్ధి

"దేవ పెద్దలు సమ్మతించెడు నట్టు
లే విన్నవింతు నా యెఱిఁగినకొలఁది
భవదీయబంధుండు భక్తుండునైన
యవనీశధర్మజు యాగపాలనముఁ
జేయుఁబూనుట కడు శిష్టమార్గమ్ము
శ్రేయమ్ము జగతి వర్ధిల్లుకార్యమ్ము
ఆ రాజసూయ మహాధ్వరకార్య
కారణమ్ముగఁ జేయఁగల దిగ్విజయము
వేళ జరాసంధు విదళించి భూమి
పాలుర చెఱబాధ వాపంగ వచ్చు 1070

నదియునుగాక, నాగాయుతసత్త్వ
మదమలినునిఁ గ్రూరు మాగధుఁ జంప
మన వాయుసుతుఁడు సమర్థుఁడౌ నితర
మనుజు లెవ్వరును సమర్థులుగారు
ఆ మాగధుండు బ్రాహ్మణు లెద్దివేఁడ
నే మాత్రమును జంక కిచ్చుచునుండుఁ
గాన, విప్రాకారకపట వేషములు
పూని య వ్వీరుని పురిఁజేరి యతని
సమర మర్థించి, నీ సన్నిధి గాడ్పు
కొమరునిచే వానిఁ గూల్పించు సేత
సకల ప్రయోజన సాధకం" బనుచు
నకలంకమతి నాతఁ డన నారదుండు
యాదవులును సభ్యు లంద ఱాలించి
మోద మందుచుఁ జాలఁ బొగడి రుద్ధవుని 1080

అంత నీవును ముద మంది పాండవుల
చెంతకుఁ బయనమ్ము సేయంగ నెంచి
నీదు తలంపు మౌనికి, బ్రాహ్మణునకు
నాదరమ్మునఁ జెప్పి, యనిపితి వారి
పదపడి భార్యలు బందుగుల్ సుతులు
ముదముఁగూర్చెడి మిత్రపుంగవుల్ నిన్ను
వెనుకొన శ్రీకృష్ణ! వెడలితి వీవు
కనకరథంబెక్కి కడుసంతసమునఁ
బాండవులంజూడ, వారివ్రతాలు
పండ నింద్రప్రస్థపట్టణమునకు

ఆ రీతి చనిచని యా నగరమ్ము
చేరువఁ జేరితి శ్రీకృష్ణ! నీదు

నాగమనము పాండవాగ్రజుం డెఱిఁగి
వేగమ యనుజులు విప్రవర్గమ్ము
బందుగుల్ మిత్రులు పరివారవార
మందలు తనవెంట నరుదేర వెడలి
నీ సంగడిం జేరి నిన్నుఁ గౌగిలించి
వాసి గౌరవయుత స్వాగత మ్మనియె
అంతట నీవు బ్రాహ్మణవర్గమునకు
సంతసమ్మున మ్రొక్కి, సకల బంధువుల 1090
నాదరమ్మునఁ గని యనిలజార్జునులు
మోదింప నాశ్లేషమునఁదేల్చి మాద్రి
తనయు లొనర్చు వందనముల కలరి
మునుకొన్న సంతోషమునఁ దత్పురమ్ముఁ
జేరి పాండవుల సుస్నేహబాంధవ్య
గౌరవమ్ముల హాయి గైకొనుచుంటి

పరమాత్మ! భవదీయ ప్రవిమలాశయము
లెఱిఁగి వర్ణింపంగ నేరికి తరము?
మాగధుచెఱఁబడ్డ మనుజేంద్రు లెల్లఁ
జేగ చెడి మిగులఁ జేడ్పాటునొంది
యా చెఱవాయు నన్యమ్ము మార్గమ్ము
తోఁచక నీపద తోయజద్వయమె
తమకు దిక్కని వారు ధాత్రీసురేంద్రు
విమలు నొక్కని నీ సవేశమ్మునకును
దమ్ముఁ గాపాడఁ బ్రార్థనచేసి రాఁగ
నమ్మి పుత్తెంచి, రా నరవరవ్రజము
చెఱఁబాపఁ దలఁచి యా శిష్ట విప్రునకు
గరుణ నీ మదిఁదెల్పి గారవించితివి

నారదముని బోధనము విని పాండు
ధారుణీశు సుతుండు ధర్మజుసేయు 1100
యాగమ్ముఁ గాపాడ నాత్మలో నెంచి
యా గురు కార్య ప్రయత్నమ్ముసేయ
తగినమార్గమ్ము నుద్ధవునిచే నెఱిఁగి
నగధర! నీవె పాండవులున్న పురికిఁ
జని వారలకు సంతసమ్మును మిగులఁ
బొనరించితివి జగత్పూజ్య! శ్రీకృష్ణ!

అంతటి నిర్మలినాత్ముండ వీవు
చింతింప భవదీయ చిత్తమ్ము మెప్పు
వడసెడు రీతిని వర్తింప లేను
చెడుగు జరాసంధు చెఱలోనఁ జిక్కి
నిరతమ్ము నెమ్మది నిన్ను సేవించు
నరనాథముఖ్యు లంతటివాఁడఁ గాను
పరికింప రాజులు పంపిన విప్ర
వరుని కీడగునట్టి వాఁడను గాను.
సురమునిపాదరజోలేశమునకు
సరిరానివాఁడ దుష్టస్వభావుఁడను.
గుణి నుద్ధవుని పలుకుటకేని బుద్ధి
యణుమాత్రమును లేని యధమాధముఁడను
మరి నన్ను హీనుని మన్నించి ప్రోవ
కరుణాసముద్ర! యొక్కరణిఁ దలంతొ! 1110
నిన్ను నమ్మినవాఁడ నీరజనయన!
నన్నుఁ గాపాడుమా నాగారిగమన!
కమలాక్ష, శ్రీకృష్ణ, కౌస్తుభాభరణ,
అమరేంద్ర వినుత దివ్యామలచరణ!

## శ్రీకృష్ణుఁడు భీమునిచే జరాసంధుని ప్రమందింపఁ జేయుట

శ్రీకమలాలయార్చిత దివ్యపాద,
వైకుంఠవాస, సద్భక్తసమ్మోద,
ఉత్తమ బంధుజనోద్దేశములను
రిత్తవోనట్లు దీర్పింప నెంచెదవు
ఆ యత్నముననె దుష్టారిభంజనముఁ
జేయింతు శరణన్న శిష్టజనమ్ము
నాదరింతువు సకలార్థమ్ము లొసఁగి
నీ దయాభావమ్ము నిరుపమానమ్ము
దేవదేవ, ముకుంద, దీనదయాళు,
పావనగుణధామ, భార్గవీకామ!

ఒకనాఁడు ధర్మజుఁ డురుతేజ మొప్ప
సకల బంధుజనమ్ము సచివోత్తములును
హితవర్గమును పురోహితులు సేవకులు
క్షితిపతులును నిజశ్రేయోభిలాషు
లెల్లరుఁ గొల్వఁగ నెలమిఁ గొల్వుండి
యుల్లమ్ము పొంగ నచ్యుత, కృష్ణ! నిన్నుఁ 1120
గని యిటులనె సభఁగలవారు వినఁగ
వినయవిధేయతల్ వెల్లడి గాఁగ.

"భువనరక్షణ, మహాద్భుత సచ్చరిత్ర,
దివిజవందిత, దివ్యతేజ, శ్రీకృష్ణ!
రాజసూయ మహాధ్వర మ్మొనరించి
నా జన్మ పుణ్యవంతమ్ముగఁ జేయఁ
దలఁచితి! నది భవత్కారుణ్యమహిమ
ఫలవంతమగుఁగదా బంధుసంరక్ష!

చిత్తాన నిను నమ్మి చేయు యత్నములు
రిత్తవో వెన్నుఁడు ! శ్రితపారిజాత !
నినుఁబోలు నాప్తుఁ డెందే నాకు లేఁడు
ననుఁ గృతార్థునిఁజేయ నర్మిలిఁ జూడు "

ఆ మాటలను విని యఖిలలోకేశ !
ప్రేమ దైవార నా పృథివీశుతోడఁ
బలికితి విట్టు " లో పాండుతనూజ !
తలఁచి తీ వుత్తమధర్మ సత్క్రియను
దాననౌ శుభసంపదలు నీకు మరియు
మానితకీర్తియు, మహితగౌరవము
అరివినాశము గల్గు నాలసింపకుము
త్వరపడు మింక తత్క్రతుకార్యమునకు 1130
నీ సోదరులు శత్రు నివహమ్ము గెల్చి
భాసిల్లు కీరితిఁ బడసి రాఁగలరు.
సకల దిగ్విజయమ్ము సాధించుకొఱకు
ప్రకటశూరుల వారిఁ బంపంగ వచ్చు"
నని యాదరమున నా యధ్వరయత్న
మును జేయ ధర్మజుఁ బ్రోత్సహించితివి.

అంతట నుద్ధవు నమృతహితోక్తి
స్వాంతమ్మునందునఁ జక్క చర్చించి
మత్తు జరాసంధు మ్రందింపఁ జేయ
నిత్తఱి మేలని యెంచి, నీ తోడ
భీమపార్థులఁగొని, వేగమ వెడలి
యే మాత్ర మితరుల కేర్పడనట్లు
వారును నీవును బ్రాహ్మణవేష
ధారులై మాగధధరణీశు పురముఁ

జేరితి రావల స్థిరభక్తి విప్ర
వారసత్కారతత్పరు జరాసంధుఁ
గంటిరిః పిదప నా ఘనశౌర్యధనున
కంటివి నీవు కృష్ణా! యివ్విధమున
"నరనాథ! యతిథి మనము గుర్తెఱింగి
కొఱలేక యిచ్చెడు గురుదాత మగధ 1140
విభుఁ డనియెడు వార్త విని నిన్నుఁ జూచు
నభిలాష నీ చెంత కరుగుదెంచితిమి
మా కోర్కె లాలించి మముఁ దృప్తిపఱచి
ప్రాకటయశమున వర్ధిల్లుమయ్య
అడిగినదాని లేదనక యర్థులకు
నిడువారి కీరితి యిల శాశ్వతమ్ము
బలి, శిబి, రంతిదేవ ముఖప్రదాత
లిలఁ గలరేః కాని యిల నున్నవారె
వారలకీర్తి శాశ్వత మయ్యె ధరణి
నీ రానిదొండు లేదెందు దాతలకు"

అనెడు నీ పల్కుల నాలించి మగధ
జననాయకుఁడు జరాసంధుఁడు మిగుల
నచ్చెరువొంది మీ యాకారములను
మెచ్చును గూర్చెడి మెయి సంపదలను
గుణకిణాంకములను గురుతించి చూచి
తన మనంబునఁ గొంతతడ విట్లు తలఁచె

అరయంగ వీరు బ్రాహ్మణవేషములను
ధరియించి వచ్చిన ధారుణీపతులు
గా, నా మనంబునఁ గలిగె సందియము
కానిచో నీ తెంపుగలదె విప్రులకు? 1150

వీరు కోరిన వస్తువితతియే గాదు
కూరిమి నసువులేఁ గొంకక యిత్తు
మును హరి వామనమూర్తియై వేఁడఁ
దనపదవి తొలంగు దశ వచ్చుననుట
తా నెఱింగియు మాట దప్పరా దనుచు
దానశీలుఁడు బలి దైత్యవల్లభుఁడు
భువనత్రయమ్ము నిమ్ముగ ధారవోసి
ప్రవిమలయశము సంపాదించుకొనఁడె?
మరియును నొక్క బ్రాహ్మణవరుకొఱకుఁ
బరికింపఁగా క్షత్రబంధుండు మున్ను
తనదు ప్రాణములను త్యాగమ్ము చేసి
యనుపమయశము సమార్జించుకొనఁడె
కాన, ననిత్యమౌ కాయమ్ముఁగూర్చి
మానసమ్మునఁ జింతమాని యశమ్ముఁ
బడయుట యుత్తమపద్ధతి యగుట
విడచెద నొడలిపై వేఱిడి భ్రాంతి"

ఈ రీతిని దలంచి యెసకమ్ముతోడ
ధీరుఁ డా మగధపృథ్వీపతి మిమ్ముఁ
గని యిట్టులనియె" నో ఘనమతులార!
మనమున నాకు నిమ్మడియయ్యె ముదము 1160
కోరుఁడు మీ కోర్కె కొఱవడ నటులు
దీరుచువాఁడ నంతియె గాదు నాదు
శిరము తఱిగియైనఁ జెచ్చెర నిత్తు
వరగుణులార! పావనమూర్తులార!"
అనఁగ నాతనితోడ నచ్యుతా, నీవు
విను మని మీ కోర్కె వినిపించి తిటులు

"ఓ జరాసంధ! నీ వుత్తమదాత
వాజిభిక్ష యొసంగుమయ్యా మా కిపుడు
ఇతఁ డర్జునుఁడు! భీముఁ డీతఁడు నన్ను
మతిఁ దలంపుము కృష్ణు మదరిపుహరణు
మాలోన నొకవీరు మార్కొని నిలిచి
యాలమ్ము సేయుమా! యదియ మా కాంక్ష"

అన మాగధుఁడు నవ్వి యహహ! నా తోడ
నని చేయఁజాలక యతిభీతి మధుర
నిలువక పరువిడి నీరధినడుమఁ
దలఁదాచుకొన్నట్టి ధైర్యవిహీను
నినుఁ గృష్ణు నెఱుఁగుదు, నీ వాఁడితనము
మునుగంటి నను నీవు మున్నెఱుంగుదువు
నీవు నాతోఁ బోర నిలువంగలేవు
కావునఁ దలఁగుట కడు మేలు నీకు 1170
ఈ యర్జునుఁడు శూరుఁడేగాని పిన్న
ప్రాయమ్ము వాఁడు! నా బలశౌర్యములకు
జోడగు నీ మరుత్సూనుండు వీని
తోడఁ బోరుదు నంచు దోర్యుగమెత్తి
వాతాత్మజుని బిల్చి వరగద నొకటి
నాతని కొసఁగి స్వహస్తమ్ము నందు
తా నొక గద దాల్చి తాకె నా పవన
సూను నతండు నుత్సుకత మాగధునిఁ
దగిలె! నీ రీతిగాఁ దలపడి వారు
తెగి పోరఁ జొచ్చిరి దివిజులు మెచ్చ

ఆ సమరమ్మున ననిలాత్మజునకు
గాసియు నలపును గలుగనియట్లు

బలమును జవమును బలిసెడునట్లు
జలజాక్ష! నీదు తేజమ్ముఁ దత్తనువు
నను నిల్పి మరి శత్రు నాశమార్గమ్ము
ననిలజుఁ డెఱిఁగెడునట్లుగా నొక్క
రెమ్మను గొని దాని రెండుగాఁ జీఱి
క్రమ్మర వేర్వేరుగా భువివైచి
తదియ శత్రునిఁ జంప ననుకూలమంచు
మదిఁ దద్రహస్యమ్ము మారుతాత్మజుఁడు 1180
కనుఁగొని కలన మాగధుఁ బడఁద్రోసి
ఘనశక్తి నాతని కాయమ్ము రెండు
వ్రయ్యలుగాఁ జీల్చి వసుధపై వైచె
నయ్యవనీవిభుఁ డసువులు వాసె

అంతట నీవు దయాళుఁడ వగుట
స్వాంతమందున ధర్మపథము యోచించి
సచ్చరితుని జరాసంధుని తనయు
మచ్చిక సహదేవు మన్నించి నీదు
సరసకుఁ జేర్చి వాత్సల్యమ్ము పేర్చి
ధరణీపతులు మెచ్చఁ దద్దేశమునకు
నొడయనిగాఁ బట్టి మొనరంగఁ గట్టి
గడియించితివి కీర్తి కమలదళాక్ష!
మరియు నంతకుమున్ను మగధరాజేంద్రు
చెఱఁబడియున్నట్టి క్షితిపుల నెల్ల
విడిపించితివి నాడు విప్రునితోడ
నుడివినయటులు సన్మునిలోకవంద్య!

చెఱనుండి విడివడి స్వేచ్ఛను బొంది
నరపతుల్ నీ పాద నలినముల్ సోక

తమశిరమ్ములు వంచి దండముల్ వెట్టి
విమలమనస్కులై వినుతించి రిట్లు 1190
"దేవ! దయానిధి! దేవకీతనయ!
నీవె మా కిక దిక్కు నీరజనేత్ర!
మాగధుఁడును దోరె. మా కారదీఱె
నీ గురుకృప జగన్నేత! ముకుంద!
మా కిట్టికష్టముల్ మరి యెప్పుడేని
రాకుండునట్లు వరమ్ముల నీవె.
పరమదయాకర. భక్తమందార.
సరసిజనయన. కృష్ణా! వాసుదేవ!"
అని వేఁడ వారల కభయం బొసంగి
పనిపితి. వా రాజవర్యు లెల్లరును
నిన్నుఁ గీర్తించుచు నిజదేశములకుఁ
గ్రన్ననఁ జనిరి జగన్నుతచరిత!

అంతట సహదేవుఁ డర్పించుపూజ
లెంతయుఁ బ్రీతి గ్రహించి. దీవించి
భీమపార్థులు నీదు వెంటరా. వచ్చి
భూమీశుఁ గౌంతేయముఖ్యు ధర్మజుని
గని. జరాసంధునిఁ గడతేర్చుటయును
మనుజేశులకుఁ జెఱమాన్పించుటయును
మొదలగువార్త లిమ్ముగ నీవు చెప్ప
ముదమంది రెల్లరు ముచుకుందవరద. 1200

భువనరక్షణ. జగత్పూజిత చరణ.
రవికోటితేజ. శ్రీరమణీమనోజ!
ఏవేళ కెయ్యది. యెవరిచే నెటులు
గావించు టురవౌ య క్కరణిని నీవు

భావింప నొక సాక్షివలె నూరకుండి
గావించుచుందువు గజరాజవరద!
నీవు కన్దెఱచిన నిముసమ్ములోన
జీవింపఁగలఁడె యీ క్షితి మాగధుండు
కాని వాని వధమ్ము కరువలిపట్టి
చే నొనరింపంగఁ జేయు టబ్బురము
పాండవేయుల బాహుబలసంపదయును
నిండుశౌర్యమ్మును నిఖిలరాజన్య
వార మ్మెఱుంగుట వరమని తలఁచి
యా రీతి నడపించి తని నేఁ దలంతు.
యమతనూజుండు సేయఁగఁ బూనుకొన్న
విమలాధ్వరము నెరవేర్పఁ బూనితివి
నీ బంధుహితమతి నిక్కమ్ము వరము
నీ బుధవాత్సల్యనియతి శ్రేయమ్ము.
చెఱఁబాపి నృపులకు స్వేచ్ఛఁ గూర్చితివి
హరి నీదు తలఁపు దివ్య మ్మమోఘమ్ము 1210
శత్రుపుత్రుఁడెయైన సహదేవు విభుగ
మైత్రి వెల్వఱచి సమాదరించితివి.
భవదీయశ్రితజన వాత్సల్యగుణము
స్తవనీయ మమలమ్ము జలజదళాక్ష!

హరి, కృష్ణ, నీదు మాహాత్మ్యముల్ పెక్కు
లరయ వాని నెఱింగి యతిభక్తి నిన్ను
మదినిల్పి నమ్మి సంభావించికొలువ
యదువీర! ధర్మజునంతటివాఁడ
నే గాను. నీ దయ యెటు లబ్బునాకు?
నాగారివాహ, బృందావనవాస!

కాని నీ పాదముల్ గట్టిగాఁ బట్టి
శ్రీనాథ, నన్ను రక్షింపవే యంచు
వేఁడెద నను( బ్రోవవే సురపక్ష!
చూడవే నను( గృప సుజనసంరక్ష!

## ధర్మరాజరాజసూయయాగము

శ్రీపుండరీకాక్ష, శ్రితజనరక్ష,
పాపసంఘ విపక్ష, పాండవపక్ష,
గరుడవాహన, పీతకౌశేయధారి,
వరద, చక్రాయుధ, పరమాత్మ, శౌరి!
భువనప్రసిద్ధమై బుధవర్గ మెల్ల
ప్రవిమలమని నమ్మి భజియించు నొక్క 1220
సత్యమ్ము జగతికిఁ జక్కగాఁ దోఁచి
యత్యుత్తమ స్థాన మంది యుండంగఁ
దామసగుణులు గొందఱు మద మెక్కి
యే మాత్ర మేని తదిత్థసత్యమ్ముఁ
గనుఁగొనఁ జాలక, కడ కూరకొనక
యనయులై దూషించు చాత్మనాశమ్ముఁ
బొందుదు రట్టి పాపులెయైనఁ గాని
ముందెన్నఁడేని నిన్ పూజించియున్న
నా పుణ్యమున వారి కతిదివ్యమైన
నీ పాదసన్నిధి నెలవు చేసెదవు
ఇట్టి నీ మహిమల నెఱిఁగి ప్రార్థింప
నెట్టి మహాత్ములకే నసాధ్యమ్ము

ఆదిదేవా! భవదనుమతిఁ బడసి
మోదమ్ముతో పాండుపుత్రాగ్రజుండు

రాజసూయ మహాధ్వరము సేయఁ బూని
భూజానులను బంధుముఖ్యులఁ బ్రజల
హితవర్గమును బురోహితులను మునుల
నతిమైత్రి వెలయ నాహ్వానించెః మున్నె
సవనోపయోగ ప్రశస్తవస్తువుల
వివిధమ్ములను బెక్కు వెలితి లేకుండ 1230
సవరించెః నొక శుభసమయమ్మునందు
నవనీసురోత్తము లాశీర్వదింప
దీక్ష వహించెః బుత్విజులు తత్క్రియల
దక్షులై జరప నధ్వర మొప్పు మిగిలె

ఆ యధ్వరముఁ గాంచి యష్టదిక్పతులుఁ
దోయజసూతి, సిద్ధులు చారణాది
సురగణమ్ములుఁ గడుఁ జోద్యమ్ము నొంది
యరరె! మున్నింతటి యద్భుతమైన
సవన మెవ్వారైన సాగించి రొక్కొ!
ప్రవిమలమతి ధర్మరాజువో ఘనుఁడు
అదిగాక, హరియుంట నధ్వరమునకుఁ
గుదిరె పవిత్రత గురువైభవమ్ము"
అనిరి ప్రేక్షకజన మానంద మొందె
జననాథు ధర్మజు జన్మ తరించె

క్రతుపూర్తి యగుడు ధర్మజుఁడు పెద్దలకు
నతిభక్తితోడ మర్యాదలు పూజ
తెలమిఁ జేయఁగ మది నెంచి సభ్యులను
"తొలిపూజ కర్హు లిందుల నెవ్వరొక్కొ!"
అని యడుగగ సభ్యులందఱు తమకు
మనసునఁ దోఁచిన మాదిరిఁ బలుక 1240

నా పల్కులెల్లఁ గాదని సహదేవుఁ
డాపి, యదూత్తముఁడవగు శ్రీకృష్ణు
భగవంతు నిను సభ్యవరులకుఁ జూపి
ఖగరాజగమన, యిక్కరణి వచించె

"వినుఁడు పెద్దలు మీరు, విశ్వేశు నితని
వనజనాభునిఁ దృప్తిపఱచితి మేని
భువనంబు లెల్లను బొందెడిఁ దృప్తి
నవతుగానని యట్టి సత్కార్య మిద్ది"
అని యంత ధర్మజు నతఁడు వీక్షించి
విను మని మఱియు నివ్విధమునఁ బలికె
"సర్వ ప్రపంచమీ సర్వేశ్వరుండు
సర్వ మీతని కటాక్షమ్ము వశమ్ము
ఇతని దయాదృష్టి నీ జగ మెల్ల
నతులితసంవర్ధమై యలరారు
నితఁడు కన్మొగిచిన నీవిశ్వమెల్ల
నతి తిమిరావృత మయి నాశ మొందు
నితఁడుగా కొరుఁ డెవ్వఁ డేనియుఁ గాని
క్షితినాథ! తొలిపూజ చేకొనఁ దగఁడు
కాన, నీ కృష్ణు శ్రీకరు పూజసేయు
మాను మన్యపథంబు మానవనాథ" 1250
అనిన నా సహదేవు నాలాపములను
విని మునుల్ పెద్దలు వేడుక పడుచు
నిది శుభంకరమార్గ, మిది సత్య మనిరి
ముద మయ్యె సభ్యసమూహమ్మునకును

అంత యుధిష్ఠిరుఁ డాత్మ నుప్పొంగి
దంతివరద, భవత్పదపంకజములఁ

ప్రక్షాళన మొనర్చి భక్తి తత్తీర్థ
మక్షుల నద్దికొం చనుజులుఁ గుంతి
ద్రౌపదియును దాను తలల ధరించి.
శ్రీపతీ. మోదమ్ము చెందిరి మిగుల
మరియు ధర్మజుఁడు గ్రమ్మర రత్నములను
వరభూషలను స్వర్ణ వస్త్రాదికములఁ
గొనితెచ్చి భక్తి నీకు సమర్పణమ్ము
వినయవిధేయతల్ వెలయఁ గావించె

## శిశుపాలవధ

ఆ విధమ్మున నీకు నచ్యుతా! నరులు
దేవతల్ పొగడెడి తెఱఁగున నాఁడు
జరిగిన లోకప్రశస్త గౌరవము
నరసి సహింపక యలుక లోఁబెంచి
తన గద్దె డిగ్గి హస్తము లెత్తి భీతి
యణుమాత్రమును లేక యందఱు వినఁగ 1260
పశుబుద్ధితోడ సభ్యతఁ దూలపుచ్చి
శిశుపాలుఁ డిట్లు వచించె దుర్వృత్తి.

"అరరె! కాలముమార్పు నరయంగ వశమె?
గురుజనమ్ములు బాలకుల భాషణములు
గురుతించి వేదవాక్కులుగ భావించి
పొరపడి చెడు పథమ్మునను వర్తింత్రె?
మునివరుల్ బ్రాహ్మణుల్ భూపతుల్ వృద్ధు
లనఘవర్తనులు బ్రహ్మముఁ గన్నవారు
పరమయోగీంద్రులు వ్రతశీలు రఖిల
వరధర్మవేదులు పలువు రిందుండ

వీరిఁ గైకొనక వివేకమ్ము లేక
నేరమం చనక వీనిని గోపబాలుఁ
బూజింప సమ్మతమును బొంది రెట్టు
లీ జగమ్మున ధర్మ మెచట డాగెనొకొ!
యజ్ఞశేషము నక్క కర్హమే పొంద?
విజ్ఞుల కింత వివేకమ్ము లేదె!
కులగోత్రములు లేవు గురువులు లేరు
తలిదండ్రులన సున్న. దైవమ్ము నాస్తి
వావి వరుసల నెంచు పద్ధతి లేదు
భావమ్ము మర్యాదపయి నిల్వఁ బోదు. 1270
అమరిన నిజవేష మది గనరాదు
సమయమ్ము నెఱిఁగి వేషమ్ములు మార్చు
జనియించినది మొదల్ జారచోరాది
యనయవర్తనలకు నలవాటువడిన
యట్టివాఁ డీతఁ డీ యగ్రపూజార్హుఁ
డెట్టులో" నంచు మరెన్నొ విధాల
నిను దూలనాడిన నీవు మహాత్మ!
మనమున శాంతమ్ము మానక యుంటి
నక్కకూఁతలను డెందమున సింగమ్ము
లెక్కించ దెప్పు డెల్లిదముగ నెంచు.
జ్ఞానహీనుని చైద్యు జల్పము లెల్ల
నా నిండు సభనున్న యార్యులు మునులు
జనపతుల్ విన నోడి, జానుగుల్ మూసి,
కొని, "వాసుదేవ, ముకుంద, గోవింద!
వీని నే గతికిఁ జేర్పింతువో" యంచు
వానిని శిశుపాలుఁ బదరుచునుండి.

రంతఁ గొందఱురాజు లా శిశుపాలు
నంత మొందింతమా యని యాయుధములఁ
గొని నిల్వ వాఁడును క్రూరాయుధములఁ
దన హస్తములఁబట్టి దర్పించి నిలిచి 1280
నిను నీదు బంధుల నీ పక్షచరుల
ననయుఁడై కడుఁ దూలనాడుచునుండ
నరిలోకనాశ! నీ వాగ్రహ మొంది
కటకుచూపుల వానిఁ గాంచుచు నిశిత
ధారాకరాళమై తనరు చక్రమునఁ
గ్రూరు నాతనిఁ బొరిగొంటి తత్క్షణమ.
అంతట నతనిదేహమునందునుండి
వింతగా నొకవెల్గు వెలువడి వచ్చి
నీ యందు వడిఁ జొచ్చె నిఖిలార్తిహరణ.
సాయుజ్యసంధాత! సర్వాధినేత!

చేదీశుఁ డంతమ్ము చెందె ధర్మజుఁడు
మేదినీసురులకు మిత్రమండలికి
సకలబంధువులకు సభ్యసంతతికి
నకలంకమతిని మర్యాద లొనర్చి
యవబృథస్నాన మహాభాగ్య మంది
యవనీశముఖ్యుఁడై యలరారుచుండె.
అక్రూరవరద. శ్రీహరి. రమారమణ.
శక్రాదిసురబృందసన్నుతచరణ!
ధర్మసుతుని మహాధ్వర విజయమ్ము
ధర్మవసన. నీ కృపావిశేషమ్ము 1290
కాని. సదస్యులకరణి సామాన్య
మానవునట్లు నెమ్మది నుంటి వచట

సర్వకార్యములకు సాక్షి వీవంచు
నార్యులు వల్కుదు రది సత్య మయ్యె
చేది భూపాలుఁడు చెలరేఁగి నిన్ను
సాదులు మౌనులు సకల భూపతులు
వినుచుండఁ గ్రొవ్వి వివేకమ్ము మాలి
యనయుఁడై దూషించె. నా రజ్జు లెల్ల
మనమునఁ గొనక నెమ్మది నూరకుంటి
వనజాక్ష. నీదు తత్త్వమ్ము స్తుత్యమ్ము
మునులును నృపతులు మూర్ఖు చేదీశు
ననయవర్తన కసహ్యమ్ము నాగ్రహము
నొంది "శ్రీకృష్ణ! మహోజ్జ్వలతేజ!
యిందీవరశ్యామ! యితని దండింపు"
మని కోర వానిని హతము చేసితివి
మునివంద్య! నీ మనమ్మునఁ గూడ వానిఁ
బొలియింపనుంటి వా పూన్కి యెవ్వరికిఁ
దెలుప విదియె నీదు దివ్యభావమ్ము
ఖలుడె చేదీశుఁడు కాని. యా నృపుఁడు
తొలిపుట్టువున భవత్పూజ సద్భక్తి 1300
సలిపెఁ గావున వాని సకల దోషములు
దులిపి. నీ యందుఁ బొందుగఁ జేర్చుకొంటి

ఓ దయాజలధి. యదూత్తమ. కృష్ణ!
నీ దయఁ బొందంగ నే నెప్పుడేని
యే పుట్టువుననైన నేర్పడ నిన్ను
"కాపాడుమా నన్ను కరిరాజవరద!"
అని వేడితినొ. లేదొ. యజ్ఞాని నగుట
కనుగొంటి నిప్పుడు కడతేరు తెరువు

నీ నామభజనంబు నిశ్చలభక్తి
మానక నొనరింతు మాధవా, నన్ను
రక్షింపు మయ్య, యోప్రణతార్తి హరణ,
పక్షీంద్రగమన, కృపాగుణాభరణ!

## సాల్వుఁడు తప మొనరించి శివుని మెప్పించి వరములు వడయుట

శ్రీ రమాహృత్సరసీజ పతంగ,
కారుణ్యభావసంకలితాంతరంగ,
దుర్జనశత్రు సందోహవిపక్ష,
నిర్జరపక్ష, మౌనిజనసంరక్ష!
నీ మహామహిమలు నీ యసామాన్య
సామర్థ్యచర్యలు సర్వమ్ము వినియుఁ
గనియును మదవృత్తిఁ గడుఁ జెలరేఁగి
నిను జయింపఁగ నెంత్రు నీ కన్న వేరు 1310
దైవముల్ గలరని తలఁచి తద్ధితము
భావమ్మునను నమ్మి, ప్రాణాంతకమ్ముఁ
దెచ్చికొందురు దేవదేవ, సర్వేశ,
మచ్చరమ్మున మూఢమానవుల్ శ్రీశ!

యదువంశతిలక, మహాత్మ, యుపేంద్ర,
సదమలచరిత, కృష్ణా! నీవు మున్ను
శ్రీ రుక్మిణిని పెండ్లిచేసికొనంగఁ
గోరి తెచ్చెడువేళ, క్రోధమ్ముఁ బెంచి
ని న్నెదిరిచి యోడి నిలువక వెలిచి
చన్నవారలలోన సాల్వనృపుండు

చేది భూపాలుఁడౌ శిశుపాలుసఖుఁడు
యాదవవంశ మీ యవని లేకుండ
నొనరింతు" ననుచు మహోద్వృత్తిఁ బ్రతిన
నొనరిచి, ప్రతిదిన మొకపిడికెండు
భూరజ మాహారముగఁ బుచ్చికొనుచు
ఘోరతపమ్ము భర్గుని శివు గూర్చి
యొక యేఁడు చేయ నా యుగ్రతపమ్ము
నకు నీశ్వరుండు మనమ్మున మెచ్చి
వానికి దర్శనభాగ్యమ్ము నిచ్చి
"భూనాథ! నీ కోర్కె పొల్లుగాకుండ 1320
నిత్తును వేఁడు మదెట్టిదేయైన
నిత్తటి" నని వచియించెఁ బ్రేమమున
ఆ సాదరోక్తుల కలరి సాల్వుండు
దాసపోషకు చంద్రధరు శివుఁ గాంచి
అతిభక్తి జోతల నర్పించి వినయ
మతిఁ దనకోర్కె యి ట్లాడ్కి విన్పించె—
"దేవ, మహాదేవ, దీనశరణ్య!
నా విన్నపము విని నను( గరుణించి
నా కోర్కె దీర్పుమా! నాగేంద్రభూష!
నీకు నమస్కృతుల్ నిఖిలసంసేవ్య!
గరుడ గంధర్వ రాక్షస నిర్జరేంద్ర
వరుల కెయ్యెడ సాధ్యపడక, నేఁ గోరు
స్థలముల కభ్రపథమ్మునఁ దిరుగఁ
గల వాహనమ్ము నొక్కటి లోకు లెల్ల
రపురూప మిదియని యచ్చెరువొందఁ
గృప నొసంగుమ నాకు వృషభేంద్రగమన"

అని వేఁడ నాతని యభ్యర్థనమ్ము
విని శంకరుఁడు మయుఁ బిలిపించి సాల్వ
ధరణీశు కోర్కెకుఁ దగ్గ విమాన
మరసి నిర్మింపుమా యని యాజ్ఞచేయ. 1330
నతివిస్తృతమ్ముఁ లోహమయమ్ముఁ గామ
గతియుఁ గల్గఁగ నొక్క ఘనవిమానమ్ము
మయుఁడు నిర్మించి నామము సౌభక మన
నియమించి యా సాల్వనృపతికి నిచ్చె.

## సాల్వుఁడు ద్వారకను ముట్టడించుట

ఆ సాల్వవిభుఁడు మహానంద మంది
వాసి మీఱంగ తద్వరవిమానమ్ము
నారోహణ మొనర్చి. యత్యహమ్మతిని
ద్వారకానగరమ్ముపై దండు విడిసి
వీతయాదవము గావించెద ననుచు
చేతమ్మునం దెంచి. చెలఁగి తత్పురము
కోటలు గోపురాల్ గూలిచి. గుళ్లు
బాటలు బావులు పాడు గావించి
పరిఘలు పూడిచి. వప్రముల్ ద్రోసి
వరసువర్ణాంచిత ధ్వజములు విఱిచి
యుపవనమ్ములు ధ్వంస మొనరించి. మేల్మి
తపనీయ ప్రాసాదతతి మట్టిఁ గలిపి
తన విమానముతోడఁ దా మింటి కెగసి
ఘనశిలల్ వృక్షముల్ కడు భీతిదముగఁ
గురియించి ప్రజకు మిక్కుటమగు వెతలు
కఱకుడెందముతోడఁ గావించుచుండె. 1340

ఆ సమయమ్మున నచ్యుతా, నీవు
వాసవ సన్నిభుల్ పాండవుల్ సేయు
రాజసూయ మహాధ్వరముఁ జూడఁబోయి
యా జన్నము సమాప్త మగునటుల్ చేసి
యా పాండవులు గోర నచటఁ గొన్నాళ్లు
ప్రాపితా నందసంపద నెమ్మి నుంటి
హరి! నీవు ద్వారకయందున లేని
తఱి గాన, నీదు శాత్రవుఁడు సాల్వుండు
కడుఁ జెలరేగి నిష్కరుణ పౌరులకు
నిడుమలు గూరిచి హింసింపఁ జొచ్చె

ద్వారకాపురికి నేర్పడిన కష్టములు
ధీరచిత్తుఁడు భవదీయపుత్రుండు
ప్రద్యుమ్నుఁ డారసి, ప్రజల నోదార్చి
ఖద్యోతనప్రభఁ గాదను దివ్య
తేజము మిగుల ప్రదీపింప, సాల్వ
రాజదుర్వారగర్వధ్వాంత మణఁప
ఘోరాయుధమ్ములు గొని, రథమెక్కి
శూర యాదవబలస్తోమమ్ము తోడ
రణభూమిఁ జేరె, శాత్రవవీరుభటుల
మనముల భీతి సంభవ మగునటులు 1350
యాదవసాల్వ సైన్యసమూహ మప్పు
డేదని శౌర్యవిజృంభణ మొప్ప
చలముఁ బెంచుచుఁ, బరస్పర మెదుర్కొనుచు
గలహ మొనర్చె నుగ్రస్ఫూర్తి వెలయ
నిరువదేఁడు దినంబు లెసఁగు రోషమున
నిరుతెగలును విజయేచ్ఛఁ బోరాడ

విజయ మెవ్వరికొ గన్పించుట లేదు
గజిబిజి యవ్విటఁగల ప్రజ కయ్యె
ఆ యుద్ధ మపుడు దేవాసురయుద్ధ
మా, యని యనిపించె నవని నెల్లరకు

## శ్రీకృష్ణుఁడు సాల్వుని సంహరించుట

అండజవాహన! ఆ సమయమున
పాండవులను వీడి బంధులఁ గూడి
ద్వారకాపురిఁ జేర వచ్చెడి నీకు
దారి దుశ్శకునముల్ తద్ద గన్పడియె
అంత వేగంబ నీ వటనుండివచ్చి
వింతగా సాల్వుండు వెఱపేమిలేక
ద్వారకాపురముపై దండును విడిసి
పౌరుల హింసలపాలు గావించి
సౌభకం బెక్కి యాశ్చర్యమ్ముదోఁప
ప్రాభవ మొప్ప నభంబునఁ జేరి 1360
పెక్కుమాయలఁ బ్రజావిసరమ్ము మిగులఁ
జిక్కులు వెట్టుచుఁ జెలరేఁగుచుండ,
నాతని వీక్షించి, యామున నీకు
నాతఁ డొనర్చిన యపకృతు లెల్లఁ
గని, యొరుల్ సాధింపఁగారాని వాని
ఘన విమానంబును గనుఁగొని నీవు
మునుకొంటి వాతనిఁ బోర సాధింప
నినుఁ గని యతఁడును నిలిచె బాధింప.

జగదేకవీర! కృష్ణా! రణశూర!
పగతు సాళ్వుని నీవు పటుగదతోడ

మోద నాతఁడు మూర్ఛ మునిఁగి తత్క్షణమ
సేదదేరుట తెల్విఁజెంది సౌభకము
తోఁ దా నదృశ్యుఁడై తొలఁగె నచ్చోటు
యాదవకులదీప! అతులప్రతాప!
ఆ సమయమ్మున నార్తుఁ డొక్కరుఁడు
నీ సమీపమునకు నింగియందుండి
చనుదెంచి, నీ పాద సరసిజములకు
వినయమ్మునను మ్రొక్కి "వినుమయ్య మనవి
నీ పిత బంధించి, నీ వంశమునకుఁ
బ్రాపింపఁజేసె నపప్రథ సాల్వుఁ 1370
డీ వార్త వేగ నీ కెఱిగింపు మనుచు
దేవకి ననుఁ బంపె తెలియుమీ," వంచుఁ
బలికి వాఁ డేగె నీ స్వాంతమ్ము మిగుల
చలియింప నీవు విషాదమ్మునొంది
"అక్కట! మాతండ్రి యమరుల కైనఁ
జిక్కనే! యిది చాలచిత్రమే! యొక్క
హీనునిచేఁ జిక్కె నేమన వచ్చు
కానికాలము చాల గడుసు కాలమ్ము.
ఏ విధమ్మునసైన, నెవ్వరికైన
దైవనిర్ణయమును దప్పింప నగునె"
అని విచారమ్ము నీ వందుచునుండ
మునుపటివాఁడె నీ ముందటఁ దోఁచి
వసుదేవునిం బోలువాని నొక్కరుని
వెస మాయఁ గల్పించి, "వీడె నీతండ్రి
కనుచుండు మీతని కంఠమ్ముఁ ద్రుంతు
మొనగాఁడవైన మాన్పుమ చూత" మనుచు

నత్తఱి వేగ మాయావసుదేవు
కుత్తుక ఖడ్గానఁ గోసి తచ్ఛిరముఁ
గొని మింటి కెగసి గ్రక్కున సౌభకమ్ము
నను బ్రవేశించె వింతగఁ జూచుచుండ. 1380

అంతట నీవు కృష్ణా! వాసుదేవ!
స్వాంతమ్మునందు విచారమ్మునొంది
తదుపరి నీదు కర్తవ్య మెట్టిదియొ
మది నీకు దోఁపమి మౌనమ్ముతోడ
క్షణ ముండి. యా మరుక్షణమున శోక
మణచి. యంతయు నసత్యమ్మని. సాల్వు
మాయయే యని నీదు మది నెంచి తీవు
మాయలాఁడవు నీవు మాయ ముగ్గుదువె?
ఆ యెడ నా దూత. హతుఁడైన వ్యక్తి
మాయ మయిరి గద మా మనోరమణ!

అంతఁ గొందఱమును లచ్యుతా. నీదు
చెంతకుఁ జనుదెంచి చేతులు మోడ్చి
వందనమ్ము లొనర్చి వరద. లోకేశ.
యిందిరాప్రాణేశ. యీ ప్రపంచమున
మనుజులు సంసారమన్యతోయధిని
మునుఁగుచుఁ దత్తీరమును జేరుకొఱకు
నే దారి గానక. యీశ్వరా! నీదు
పాదపద్మమ్ముల భజనమ్మె దారి
గా నెంచి. భజియించి కడతేరుచుంద్రు
జ్ఞానస్వరూప. ఈశ్వర. సుప్రకాశ. 1390
అట్టి మహాత్ముఁడవైన నీ వేడ
యిట్టి శోకభయాదు లేడ సర్వేశ."

అని స్తుతియించి, వా రరిగిరి, యంత
మునుకొంటి నీవు నీ పూన్కి సాధింప
అంతట నా సాళ్వుఁ డత్యాగ్రహమునఁ
బంతముల్ వల్కి నీ పయి ఘోరశాత
శరములు వేయంగ సాగె, నీ వతనిఁ
బరిమార్ప మదినెంచి పటుసాయకములఁ
బఱపి యా శత్రుచాపమ్ము, వర్మమ్ము,
వరకిరీటమ్మును వ్రక్క లొనర్చి
ఘనగదాహతి సౌభకమ్ము నలంతి
తునియలుచేసి, సింధువుమధ్యమందుఁ
బడఁజేసితివి, సాల్వపతి కోర లూడ్వఁ
బడిన పడగదారి వడువున, సర్వ
ముడుగుట నొకక్షణ మూరకయుండి
కడువడిఁ దెంపున గద చేతఁబట్టి
నినుఁ గొట్ట నుంకింప, నీ వా కరమ్ముఁ
దునిమి యా సమయమందుననె తచ్ఛిరము
ఘనశక్తిఁ ద్రుంచితి కాళియదమన,
మును వజ్రి పవి వృత్రుఁ బొలియించినట్లు 1400
శ్రీకృష్ణ, మాధవ, శ్రితపారిజాత,
పాకారినుత, జగద్భవ్యసంధాత!

## దంతవక్త్రుని మరణ వృత్తాంతము

అంతట నీదు మేనత్త పుత్రుండు
దంతవక్త్రాఖ్యుఁ డధర్మానువర్తి
పరమాత్మ! నీ చేత పౌండ్రక సాల్వ
ధరణీశ శిశుపాల ధారుణీపతులు

పలువురు తన హితుల్ పరిమార్పఁ బడుట
తెలిసి మిక్కిలిగఁ జింతిల్లి, కోపమ్ము
నీ పయినిం బెంచి, నిను నొవ్వఁజేసి
యా పయి శాంతిఁ దా నందఁ దలంచి
గదఁ గేల ధరియించి, కడు వేగ వచ్చి
మదమున నిన్ను ని మ్మాడ్కి నిందించె

"నాదు భాగ్యవశమ్మునంజేసి నీవు
యాదవ! నా దృష్టియందునఁ బడితి
మాతులేయుఁడ వని మన్నింప నిన్ను
నీతి బాహ్యుఁడ నీకు నిధనమ్ముగూర్తు
మిత్రాపకృతి ధర్మమే బంధురూప
శాత్రవ! నిన్ను నేఁ జంపి నీ చేత
మరణమ్మునొందిన మన్మిత్రఋణము
కొఱఁతవడక దీర్చుకొనియెద నిపుడ 1410
అనుచు వాఁ డత్యుగ్రహమ్మునఁ దనదు
పెనుగద సారించి బెట్టుగ నీదు
శిరముపై మోదె, నచ్చేడుగు బందుగుని
దురభిమానమును శత్రుధ్వంస, నీవు
పరికించి వేగమ పరిమార్ప నెంచి
కరము కర్కశమగు గదఁ గొని వాని
యురముఁ బగిల్చితి వుగ్రుండ వగుచు
హరి! భవదీయసాహస మమోఘంబు
అక్కు వగులఁగ వాఁ డపుడు నెత్తురులు
గ్రక్కుచు బువిఁ బడి ప్రాణముల్ వదలె
నంతట వానిదేహమ్మున నుండి
వింతని ప్రజలన వెడలిన సూక్ష్మ

తేజ మొక్కండు నీ తేజమ్మునందు
నో జగద్రక్షక! యొయ్యనఁ గలిసె.

క్రూరుఁడౌ దంతవక్త్రుని మరణమ్మ
నా రాజు కాయమునం దుండి తేజ
మొక్కండు వెలువడి యొయ్య నీ లోనఁ
గ్రక్కునఁ జేరుటఁ గాంచి జేజేలు
భవదీయ శౌర్య ప్రభావసంపదలు
దివినుండి పొగడుచు దివ్యప్రసూన 1420
ముల గురియించిరి మోదమ్ముతోడ
జలజాక్ష, భక్తవత్సల, వాసుదేవ,

గోవింద, గోపాల, గోపికానంద!
నీ విక్రమంబును నీదు మాహాత్మ్య
మీ విశ్వ మంతయు నెఱుఁగును: సాల్వుఁ
డే విధంబునఁ జెడె? నేమన వచ్చు?
నిను గెల్వ మది నెంచి నీ కన్న మిగుల
ఘనదైవ మనుచు శంకరునిఁ బ్రార్థించి
యపురూపమగు వ్యోమయానమ్ముఁ బడసి
విపరీతమాయల వెలయించి తుదకు
దనుజనాశ, భవద్గదాఘాతవశతఁ
దనవిమానముతోడఁ దాఁ గూలె ధరణి
నీ యత్తకొమరుఁడు నీకు బందుగుఁడు
నీ యాదరమ్మును నెమ్మి పొందంగఁ
దగినవాఁ డయ్యును దంతవక్త్రుండు
ఖగవాహ! నిను వైరిగాఁగ భావించి
నీవు చంపిన తన నెయ్యురఁ దృప్తి
గావించుటే తన కర్తవ్య మంచు

భావించి నీతోడ వైరమ్ముఁ బూని
కావరమ్మున నినుఁ గలనికిఁ బిల్చి 1430
తన చావు నీచేతఁ దాఁ దెచ్చుకొనియె
చెనఁటి గనునె మంచిచెడుగు లెట్టివియొ!
ఇవియ యజ్ఞానుల హీనమార్గమ్ము
లవని వారికిఁదోప వార్యమార్గములు.

శ్రీనాథ, కారుణ్యసింధు, ముకుంద,
దీనజనావన, త్రిదశేశవంద్య!
ననుఁ బోలు నజ్ఞాని నావంటి నీచ
మనుజుఁ డెందేని నిమ్మహి నుండఁబోఁడు
నినుఁ గొల్చు టెట్టులో, నీ దయఁ బడయ
ననుకూల మగుమార్గ మది యెట్లొ యెఱుఁగఁ
గాని, సాల్వునివలెఁ గమలాక్ష! నిన్ను
మాని యన్యుల నమ్మ మరి దంతవక్త్ర
మానవాధముమాడ్కి మరి నిన్ను మఱచి
హీనబుద్ధిని జరియింపంగఁ బోను
నీ పాదములఁ బట్టి నీవె దిక్కనుచు
నా పాపనివహ మ్మణంచుమా యనుచు
నిన్నుఁ బ్రార్థించెద నీరజనయన,
నన్నుఁ గాపాడుమా నాగేంద్రశయన!

## బలరాముని తీర్థయాత్రా విశేషములు

శ్రీకరాకార, హృషీకేశ, శౌరి,
ప్రాకటవరదాత, భద్రసంధాత! 1440
పుండరీకాక్ష, దామోదరా, శార్ఙ్గి!
యండజవాహ, మహాత్మ, యుపేంద్ర!

జగమునందునఁ బ్రాణిజాలవర్తనము
నగరిపువంద్య, యెంతయు విచిత్రమ్ము
మానవులకు ధర్మమార్గమ్ముచూపు
జ్ఞానులునుం గొన్ని సమయమ్ములందు
పొరపాటునను గోపము నణంచ లేక
యరయమి పాపకార్యముల నొనర్చి
పిదపఁ బశ్చాత్తాపభీతిఁ జింతించి
సదమలమతులయి సత్కృతుల్ శాస్త్ర
వేత్తలు చెప్పిన విధమునఁ జేసి
చిత్తశాంతిని బొంది శ్రేయమ్ము గంద్రు.
దేవకీసుత, భవదీయాగ్రజుండు,
పావనచరితుఁడు బలుఁడు రాముండు
తనకుఁ బాండవులును ధార్తరాష్ట్రులును
మనమున కించు సమాన బంధువులు
కాన నా రెండు కక్షలు సేయు రణము
తాను వీక్షింప నెంతయు నిష్టపడక
చనె తీర్థయాత్రలు సల్పు వ్యాజమునఁ
దన హితభృత్య బృందము వెంటరాఁగ — 1450
చనుచు మార్గమున నా సంకర్షణుండు
ఘనభక్తి తీర్థముల్ గని గ్రుంకు లిడుచు
వివిధ దానమ్ముల వేర్వేర నిడుచుఁ
బ్రవిమలనిష్ఠతోఁ బయనించుచుండె.

## బలరాముఁడు నైమిశమున మునుల సముఖమ్మున సూతుని జంపుట

ఆ రీతిఁ జనుచు న య్యనఘుఁడు సీరి
చేరె నైమిశము ప్రసిద్ధస్థలమ్ము

ఆ నైమిశారణ్యమందు న త్తఱిని
మౌనిబృందమ్ము సమ్మతమునఁ జేయు
ఘనదీర్ఘ సత్రయాగస్థలమ్మునకుఁ
జనియె నాతఁడు గడు సంతసపడుచు –
నా మునులెల్ల హలాయుధుఁ గాంచి
యామోదమున నెదు రరిగి స్వాగతముఁ
జెప్పి తోడ్తెచ్చి యాసీనుఁ గావింప
నప్పు డా హలి ముద మందెను. గాని
యా సభ నొక యున్నతాసనమందు
నాసీనుఁడై తన యాగమనమ్ముఁ
గనియు లేవక పూజ గావింపకున్న
యనఘు సూతునిఁగని యతని మాహాత్మ్య
మెఱుఁగక కోపించి యెల్లరు వినఁగఁ
బరుషవాక్యంబులు వలికె నీ రీతి 1460

కంటిరే వీఁడు న స్గనియును లేవ
కుంటకు కారణ మూహింప లేము
ప్రతిలోమజాతుఁ డీ భ్రష్టుఁడు వీఁడు
యతిలోకపూజ్యుఁడౌ వ్యాసునివలనఁ
గథలు గాథలు గొన్ని గఱచి గర్వమునఁ
బ్రథిత మునీంద్రసభామధ్యమందుఁ
దాన ముఖ్యుండని తలఁచి యెవ్వరిని
గాని లెక్కింప కి క్కరణి నున్నాఁడు
అల్పులవిద్య లహంకారగుణముఁ
గల్పించు. స త్త్వమ్ము గల్పింప వెపుడు
అవనిధర్మము నిల్పు నవసరంబునకు
నవతరించిన మాకు నతిముఖ్య మిట్టి

దురితవర్తనులను ద్రుంచుట యనుచు
సరగున తనదు హస్తమ్మందు నున్న
దర్భచే సూతు హతమ్ముగావించె
నిర్భీతిఁ దనవిధి నెరవేర్తు ననుచు
సూతుని మరణమ్ముఁ జూచి యమ్మునులు
భీతి హా హా యని బిట్టుగ నఱచి
మనములు సంతాపమగ్నమ్ము లగుట
విను మని సీరికి వినిపించి రిటులు 1470

"అనఘ! ఈతనికి బ్రహ్మాసన మేము
తనర నిచ్చితిమి యెంతయుఁ దగునంచుఁ
గాన, లేవఁడు నిన్నుఁ గనియు నితండు
తాను నిరపరాధి తథ్య మిమ్మాట
దేవ! అనంతాంశదివ్యస్వరూప!
యీ వెఱుంగని ధర్మ మెందేనిఁ గలదె?
యెఱిఁగి యెఱిఁగి చేసి తీ బ్రహ్మహత్య
తరమె యీ దురితమ్ము తప్పుకొనంగ
నీవు ప్రాయశ్చిత్త మేర్పడఁ జేయు
మా వెరవున పాప మంతరించెడిని
ధర్మమ్ము నిలిపెడి ధర్మివి నీవు
ధర్మమ్ము విడని వర్తన చూపవలయుఁ
గాన దీనికిఁ బ్రతీకార మియ్యెడను
బూని యొనర్పుమా పుణ్యస్వరూప!"
అనెడు వారలపల్కు లాలించి రాముఁ
డనియె వారు వినంగ నతిధర్మబుద్ధి

## బలరాముఁడు తాను సూతుని జంపినందుకు పశ్చాత్తాప మొంది మరల నాతనిఁ బ్రదికించుట

నా తామసగుణమ్ము నా చేతనిట్టి
పాతకమ్మును ఘోరభంగిఁ జేయించె

నీ పాప మే పుణ్య మెట్టు లొనర్చి
పాపికోఁ దగునొ యేర్పడఁ జెప్పుఁడయ్య 1480
అసువులు సత్త్వజవాదు లీతనికి
నొసఁగెద మీ కెల్ల నుత్సాహ మగునె?
అగుచో మదీయ మాహాత్మ్యము వలన
జగము మెచ్చఁగ నటుల్ సరగఁ గావింతు
ననఁగ నమ్మునులు మహాత్మ! నీ చేయు
ఘనయోగమాయచేఁ గలుష మెవ్వరికిఁ
బొనరనియట్టు లీ పుణ్యకార్యమ్ము
నొనరింపు మని రంద ఱుత్సాహపడుచు

అత్తఱి బలదేవుఁ డాత్మయోగమ్ము
చిత్తమ్మునం దాల్చి సిద్ధిని బొంది
యందఱు విన నిట్టు లనియె "నీ సూత
నందను డిపుడు ప్రాణమ్ములతోడ
జవసత్త్వములతోడఁ జరియించు గాక!
భువి నీతనిఁ బ్రసిద్ధి పొదలెడుఁ గాక!"
అనునంత నా సూతుఁ డసువులు దాల్చి
మునిజనమ్ముల కెల్ల మోదమ్ముఁ గూర్చె

## బలరాముఁడు పల్వలుఁడను రాక్షసుని సంహరించుట

పదపడి శ్రీకృష్ణ! భవదగ్రజుండు
సదయాత్ముఁడయి మునిసంఘమ్ముఁ గాంచి
యనియె "ఓ మునులార! అనఘాత్ములార!
యనుమానపడక మీ యభిమత మింక 1490
యేదైనఁ గలదేని యెఱిగింపుఁ డయ్య
కాదనకుండ నేఁ గావింతు దాని"

ననవు డా మునులెల్ల హర్షమ్మునొంది
యనిరి "ఓ హలధర! యసుర యొకండు
ఇల్వలుండను రాక్షసేంద్రునిసుతుఁడు
పల్వలుం డనువాఁడు పాపకర్ముండు
ప్రతిపర్వదినము తప్పక యేగుదెంచి
యతిభీతిదముగ నీ యజ్ఞవాటికల
మలమూత్రశోణిత మాంసముల్ గురిసి
కలఁగించు మమ్ము నక్కటికమ్ములేక
ఆ దానవునిజంపి, యరుసమ్ముగూర్చి
నీ దయ మాపయి నింపి యాపైని
చనుమయ్య యిటనుండి సజ్జనవినుత!
యనఘ! యెయ్యెడల నీ కగును శుభమ్ము
సకలతీర్థముల మజ్జన మొనరింప
నకలంకచరిత, యి య్యఘము దొలంగు"
నని మును లన రాముఁ డట్ల గావింతు
ననెఁ నంత పర్వసమాగమ మయ్యె

మునిసమూహము యజ్ఞములు సేయఁబూనఁ
గని పల్వలుండు వేగమ చనుదెంచి 1500
తొలుతటిరీతిఁ దత్పుణ్యవాటికల
మలమూత్రశోణితమాంసముల్ గురిసి
భూరజమ్మును జల్లి పొడిరాలు విసరి
ఘోరంపు సుడిగాలిఁ గుజములఁ గూల్చి
వినువీథిఁ దిరుగుచు విఱ్ఱవీఁగుచును
మునులఁ గష్టమ్ముల ముంపఁ దొడంగె.
ఆ రక్కసుని ప్రలంబాసురాంతకుఁడు
వీరుఁడు రాముండు వీక్షించి తనదు

హలమును చాచి యా యసురకంఠమ్ము
మెలఁకువఁ దగిలించి మిన్నున నుండి
పుడమిఁబడఁగ నీడ్చి ముసలాన వాని
నడునెత్తి మొత్తె నా నక్తంచరుండు
కడువడి నెత్తురుల్ గ్రక్కి ప్రాణములు
విడిచెః మునులభీతి వీడె నా క్షణమ

అంతట మునివరు లా బలరాము
స్వాంత ముప్పొంగఁగ సత్కృతుల్ పెక్కు
గావించి, రాతఁడుఁ గడు మోద మంది
యా విప్రతతి వీడి యటనుండి వెడలి
తీర్థరాజమ్ములఁ దిరిగి సేవించి
యర్థవంతముచేసె నా తీర్థయాత్ర 1510
నారాయణా, కృష్ణ, నాగారివాహ,
క్షీరాబ్ధిశయన, లక్ష్మీప్రాణనాథ!
మణివోలె సర్వభూమండల మాత్మ
ఫణములపైఁ దాల్చి, పరమాత్మ నీకుఁ
బాయని శయ్యయై పరఁగెడు నట్టి
యా యనంతుని యంశమందునఁ బుట్టె
బలరామదేవుండు, బహుళశాస్త్రార్థ
ములఁ గనుగొని జ్ఞానమూర్తియై వెలిఁగె
చుట్టాలజగడాలఁ జూడ నే ననుచుఁ
బట్టుగా తీర్థసేవలు సేయ వెడలె
నా మహాత్ముఁడె నైమిశాటవియందుఁ
దామసగుణమునఁ దనుఁ దాన మఱచి
పాపకృత్యము పొరపాటునఁ జేసెఁ
గోపమ్ము దుఃఖమ్ముఁ గూర్పక యున్నె?

యైన నా సిరి మహాత్ముండు గాన,
తానుచంపిన సూతుఁ దక్షణమ్ముననె
బ్రదికించెఁ బల్వాలు ప్రాణముల్ దీసి
ముదము తాపస సంఘమునకుఁ జేకూర్చెఁ
దనకు నంటిన దురితమ్ముల దులిపి
యనఘచరిత్రుఁడై యలరె విశ్వమున 1520
నీ రీతిగా వింత లెన్నియో జగతి
సారసదళనేత్ర! జరుగుచునుండు

కరుణాలవాల, శ్రీకర, రమాలోల,
పరమాత్మ, కేశవ, వైకుంఠవాస!
బలభద్రుఁడే పొరపడిన చిత్తమున
కలుషకృత్యమ్మును గావించె నంట
నే నతిమూఢుఁడ నీతిదూరుండ
శ్రీనాథ, పాపముల్ సేయకుండుదునె?
చేసితిఁబో వానిఁ జెచ్చెర దులిపి
వాసికెక్కెడు ప్రభావము నాకుఁ గలదె?
కావున నీ పాదకమలముల్ పట్టి
కావుమా యనుచును గమలాక్ష, నిన్ను
స్తుతియింతు నిది నాకుఁ దోఁచినత్రోవ
పతితపావన, నన్నుఁ బాలింపుమయ్య

## కుచేలోపాఖ్యానము

శ్రీకౌస్తుభవిభూష, శ్రితజనపోష,
పాకారిముఖసురవర్గసంతోష,
పరమపూరుష, భవద్భక్తుల చరిత
లరయ విచిత్రము లతిపుణ్యదములు

తనకు లభించినదాన సంతృప్తిఁ
గనుచు యాచ్ఞావృత్తిఁ గాదని బ్రదుకు 1530
నీ మెచ్చుభక్తుఁడు నినుఁ గోరకున్న
నా మహాత్మున కిత్తు వధికసంపదలు
అతిలేశ మేయైన నయ్యేడుఁగాక
మతి నిన్నుఁ దలఁచి సమర్పణసేయ
నద్దాని మేరువునట్లు భావించి
తద్ద ప్రీతిగఁ గొని తనియుచుండుదువు
నిను మైత్రితోఁగొల్చు నిరుపేదలైన
ఘనవైభవంబులు గలిగిన వారె
నీ భక్తవర చిత్తనియమముల్‌, నీదు
ప్రాభవోన్నత శుభాస్పద భావగుణము
లజహరవాసవాద్యమర పూజ్యములు
వృజినదూరమ్ములు విశ్వప్రకాశ!

శ్రీకృష్ణ! నీదు నెచ్చెలి, బాల్యమందు
నీ కుద్దియగుచు సాందీపనియొద్దఁ
జదివినవాఁడు, ప్రశస్తశాస్త్రార్థ
విదుఁడు కుచేలాఖ్య వెలసినవాఁడు —
అతఁడు రాగాదుల నాశల నణఁచి
యితరుల నడుగక యేవేళ కెద్ది
తనకుఁ దాన లభించు దాని మేరువుగ
మనమున నెంచి నిమ్మళముగ నుండు. 1540
దారిద్ర్యబాధ కొంతయు లెక్కగొనక
దారసుతులఁ గలదానఁ బోషించు
నతఁడు బ్రహ్మజ్ఞానియగుట నా రీతి
వెతలకు లోఁగాని విధమునఁ దనదు

సంసారధర్మంబు జరపుచు నిన్ను
హంసేందునయన, కృష్ణా! నమ్మియుండు.

## కుచేలుఁడు శ్రీకృష్ణునిఁ జూడ ద్వారకకుఁ జనుట

ఆ పుణ్యసతి మహాసాధ్వి సచ్ఛీల
వాపఁగరాని లేవడి బాధపడుచుఁ
దనదు సంతు క్షుధాగ్నిఁ దపియించి, పెదవు
లను దడుపుచు వెన్నులకుఁ బొట్టలంట
కనులలో దైన్యమ్ము గన్పడ వచ్చి
"జననీ! పిడికెడేనిఁ జాలును బువ్వ
తినఁ బెట్టి యాఁకలి దీర్పవా!" యనుచుఁ
దన చుట్టునుం జేరి తహతహపడుచుఁ
గరముల పత్రముల్ కంచముల్‌వట్టి
పరితాపపడి పల్కుపల్కులు చెవుల
సూదులు గ్రుచ్చిన చొప్పైన నామె
వేదనపడుచుండు వెర వేమిలేక

అయ్యింతి యొక్కనాఁ డాత్మేశుఁ జేరి
యొయ్యన నిట్లనె "ఓ ప్రాణనాథ! 1550
తలమున్క లగుచుఁ బేదఱికము మనలఁ
కలఁగింప నద్దానిఁ గడద్రోయువిధము
నెప్పుడే మదినెంచవేల? యిట్లుంట
చెప్పెద నొకమాట చెవియొగ్గి వినుము
నీకు బాలసఖుండు నిగమగోచరుఁడు
శ్రీకృష్ణుఁ డాతనిఁజేరి. తత్కరుణ
నంది. లేమిడివాపి. హర్షమ్ము మేము
పొంద మమ్ముద్ధరింపుమ. జీవితేశ!

మరియొక్కమాట. యా మాధవుఁ డార్త
పరిరక్షకుండు కృపాస్వభావుండు
కలలోననైనఁ దన్గాననియట్టి
కలుషాత్ముఁ డాపద గలిగినవేళ
తనొక్కక్కపరి భక్తిఁదలఁచినఁ జాలుఁ
దనైనన నిచ్చు ముదమ్మున మెచ్చి
నిజముగ నిశ్చలనియతితోఁ దన్ను
భజియింప నీయఁడె వాంఛితార్థములు ?
కాన. వేగమ ద్వారకాపురికేఁగి
శ్రీనాథుఁ గృష్ణు దర్శించుట మేలు.

అను సతిపల్కుల కలరి కుచేలుఁ
డనఘుఁడు యోచించి యా కృష్ణుఁ జూడఁ 1560
జనుటయె యిహపర సాధన మనుచు
మనమునఁ దలఁచి య మ్మగువ కిట్లనియె.
"గరిత. నీ వన్నట్లు గమలాక్షుఁ గృష్ణు
దరిసించివత్తు. నా దామోదరునకుఁ
గానుకగా నీయఁగల వస్తు వెద్ది
యేనిఁ గలదె కొని యేను చనంగ"
ననుచుండఁగనె విని. యామె ప్రాణేశు
చినిఁగిన చేలమ్ము చెఱఁగునఁ గొన్ని
యడుకులు ముడిచి నెయ్యమ్మునఁ బంపఁ
గడుమోదమున నిన్నుఁ గాంచు నుత్సుకతఁ
జనుదెంచె నతఁడు కుశస్థలిఁ జేరఁ
దన మనంబున నిట్లు తలపోసికొనుచు
"ఏ రీతి ద్వారక నేఁ జేరఁ గలనొ ?
కారుణ్యనిధిఁ గృష్ణుఁ గాంచ నా కగునొ ?

ద్వారపాలకులు న న్వారించి యిందు
నీ రాకకును గల నిజ మెద్ది? యెవఁడ?
వనుచుఁ బ్రశ్నింప నేదైనను వారు
తనియునట్లుగ కొద్దిధనమైన నిచ్చి
చొత్తుమన్నను ధనశూన్యుండ నగుట
న త్తఱి నీ నా ప్రయత్న మేమగునొ? 1570
యైనను నా భాగ్య మా కృష్ణు కరుణ
యీ నాఁడెటులొ, యటులే యగుఁగాని,
యాతఁడు న న్నలక్ష్య మ్మొలచేయు?
నీ తలపోతల నేమియు జరగ,

### కుచేలుఁడు శ్రీకృష్ణ మందిరముచేరి సత్కారములు వడయుట

దని యెంచి ద్వారక నాతఁడు చొచ్చి
మనము పొంగఁగ రాజమార్గముల్ గడచి
చనిచని పెక్కుకక్ష్యలు దాఁటి యవల
కనకహర్మ్యంబులు గాంచి యందొక్క
యిందుకాంతోపలగృహమధ్యమందు
సుందరీజనములు సూరెలఁ జేరి
చామరమ్ములు వీవ శయ్యాతలమున
ప్రేమాస్పదంబగు ప్రియతోడ నీవు
కడువినోదముల సుఖంబుండ నిన్ను,
వెడఁదనేత్రంబుల విలసిల్లువాని
ఘనఘనశ్యాముని కాంచనాంబరుని
యనుపమలావణ్యు నచ్యుతుఁ గృష్ణుఁ
గని చేరువకు మెల్లగాఁ జనుచుండ
వనజాక్ష! నీవు తద్బ్రాహ్మణవర్యు

చిననాటిమిత్రు సచ్ఛీలుఁ గుచేలుఁ
గని, సెజ్జపైనుండి గ్రక్కున డిగ్గి 1580
యెదురేగి కౌఁగిలినిడి తోడితెచ్చి
ముదమార నీ తల్పమున నుపవిష్టుఁ
గావించి యాతని కాళులు గడిగి
యా విమలాంబువు లతిభక్తిఁ దలను
దాలిచి తాళవృంతమ్ముల విసరి
చాలిన సత్కృతుల్ సలిపి స్వాగతముఁ
బలికితి, వా విప్రవర్యుఁ డానంద
జలధి నోలాడె తత్సందర్భమందు
నీరజముఖి రుక్మిణీదేవి తనదు
కరకంకణమ్ములు ఘలుఘల్లు రనఁగ
వీవనతో మెల్ల వీవఁ దొడంగె
నా విప్రు శ్రమవాసి హాయి యేర్పడఁగ

అంతఃపురాంగన లా విప్రుభాగ్య
మంతయుఁ గాంచి మహాద్భుతం బంది
"ఏమితప మ్మితఁ డెటు తనతొంటి
జామునఁ జేసెనో వచియింపలేము
వరయోగి జనగణోపాసకుఁ డగుచు
వరలు నీ యీశ్వరు పర్యంకమందు
వసియించియున్నాఁడు: వరమునీశ్వరులు
వసుధ నీతనిసాటివారలు గారు 1590
తనసతి ముచ్చటల్ తా నంతమాని
వనజాక్షుఁ డీ పేదపాఱున కెదురు
చని కౌగిటంజేర్చి స్వాగతం బడిగి
వినయమ్ము మీఱంగ వివిధసత్క్రియలు

గావించుచున్నాఁడుగద, వివరింప
నీ వసుధామరుఁ డెంతపుణ్యుండొ":
అని యనుకొనుచుండి రాత్మలయందు
మునిజనసన్నుత, ముక్తిప్రదాత!

## శ్రీకృష్ణ కుచేలుల పరస్పర సల్లాపములు

అయ్యవసరమున నబ్జాక్ష! నీవు
నెయ్యుఁ గుచేలు ననిందితచరితు
హస్తమ్ము భవదీయ హస్తమ్ముతోన
నిస్తులప్రేమ సంధిల్లగాఁ గలిపి
నీవు నతండు సాందీపనియింట
భావముల్ గలియంగ వర్తించినట్టి
చరితముల్ గొన్ని ప్రస్తావనచేసి
మరియు నిట్లంటివి మైత్రి పెంపార.
"భూసురోత్తమ! కడు పుణ్యుండ వీవు
నీ సతి, భవదీయనిర్మలచరిత
కనుకూలవర్తిని యగుఁగద. నీకు
ధనధాన్య సంతాన దారాదులందు 1600
మనసువో నటులు నస్మన్మానసమునఁ
గనఁబడుచుంట నిక్కము మఱి వినుము
లోకభద్రమ్ము నాలో నేను దలఁచి
యే కరణిని కర్మ లెసఁగఁ జేయుదునో
యా కరణిని గొంద ఱతిలోభమతులు
గాక, యుక్తంబులౌ కర్మ లొనర్చి,
ప్రకృతిబంధమ్ములు వాసి, సంతృప్తి
నకలంకమతు లయి యలరుచు నుంద్రు

గురుఁడు సాందీపని గుఱితించి చెప్ప
నెఱిఁగితి మెన్నియో యెఱుఁగంగఁ దగిన
గురు ధర్మములు వాని గొప్పతనమ్ము
మఱువవుగద నేను మఱవ నెన్నటికి
మన గురువరుఁడు బ్రహ్మమ్ము నెఱింగి
మనమున మోదించి మను నుత్తముండు
జగతి మానవులకు జ్ఞానప్రదుండ
నగు నేను గురుసేవ యతిముఖ్యధర్మ
మని యొనర్చితిని; బ్రహ్మజ్ఞాన సంఘ
మున నేను మిక్కిలి ముఖ్యుఁడ నగుచు
సకల వర్ణాశ్రమ సద్ధర్మములను
బ్రకటించి జ్ఞానమ్ముఁ బ్రజలకుఁ గూర్చి 1610
యరయ దేశికుఁడను నాఖ్య నెల్లెడల
ధరణిఁ జరింతు నుత్తమవర్తనమున
వరదేశికుండనై వర్తిల్లు నాదు
గురుబోధనమ్మును గుర్తించువారు
భవజలనిధి సులభంబుగ దాటి
ప్రవిమలానందమ్ముఁ బడయంగఁ గలరు
అదిగాక గురుసేవ నతిభక్తిఁజేయు
సదమలాత్ముల నేను చాల ప్రేమింతు —

నని గురుస్థానమ్ము నగ్గించి మరియు
మును మీరు గురు గృహమ్మున నున్నయెడను
మి మ్మింధనార్థమ్ము మీ గురుపత్ని
పొమ్మనుటయు, వనమునకు మీ రఱిగి
శ్రమపడుటయును మీ సద్గురుఁ డంత
మిముఁ గని చింతించి, మీకు దీవెనల

నిచ్చట మొదలుగా నేర్పడఁ గొన్ని
ముచ్చటల్ ప్రస్తావమును జేసి, వాని
మఱవవుగద యని మాధవా, నీవు
పరమాదరమ్మునఁ బల్క, నీ మిత్రుఁ
డనియె "దామోదర! హరి! వాసుదేవ!
మన మిర్వురము గురుమందిరమందు 1620
వసియించియుండినప్పటి విశేషమ్ము
లసదృశామోదావహములు తలంప
నవి యటులుండని మ్మాశ్రితవరద!
భువనత్రయమునకు మొదటిగురుండ
వీవు నీ కొకగురుం డెందేనిఁ గలఁడె?
శ్రీవల్లభా! నీవు శిష్యుఁడ వగుట
గురువుగా నెంచి యొక్కొరుని సేవించు
టరయ కారణమాత్ర మగుఁగదా నీకు"
ననవు డానందమ్మునంది నీ వతనిఁ
గని యిట్టు లంటివి కరుణాలవాల!

"ధరణీసురేశ! యి త్తఱి నన్నుఁ జూడ
నరుగుదెంచితివి నా కర్పణసేయ
నే పదార్థముఁదెచ్చి తిట కెఱిఁగింపు?
మా పదార్థము లేశమైన మేరువుగ
భావింతు, గ్రహియింతు, భక్తిప్రధాన
మా వస్తువునకన్న నని మదినెంతు—
నటుగాక భక్తిహీనాత్ముఁడు నీచుఁ
డెటులేని హేమాద్రి కెనయగు వస్తు
విచ్చినఁ గాని, నాయెడ దానిఁ గొనఁగ
నిచ్చగింపదు భూసురేంద్ర, నిక్కముగ. 1630

చిత్రముగా దొండు చెప్పెద వినుము
పత్రమొ పుష్పమొ ఫలమొ నీరమ్మొ
నన్నుఁ గొల్చువా రర్పణము చేసిరేని
యెనలేని పరితృప్తి నే స్వీకరింతు"
నని నీవు ప్రేమ పెంపారఁ బల్కినను
విని కుచేలుఁడు తన వెంటఁ దాఁ దెచ్చి
నట్టి యడుకుల దా నర్పింప నోడి
యట్టిట్టు లేమియు నన కూరకుండె

## శ్రీకృష్ణుఁడు కుచేలుఁడు దెచ్చిన యడుకుల నారగించి యాతని ధన్యుం గావించుట

అంతట న వ్విప్రుఁ డబ్జాక్ష, నీదు
చెంతకు నరుగుదెంచిన కార్య మేమొ
నీదు మదిం దోఁప నీ "విత్తఁ డెంత
పేదయయ్యు నొరుల వేఁడఁడు; గాని
తన సతీమణికి సంతసమును గూర్ప
ననుఁజూడఁ జనుదెంచి నాఁ డింద్రునకును
బడయంగరాని సంపద లనేకముగ
నిడెద నంచుఁ దలంచి యిభరాజవరద!
యతఁడు చినుఁగుబట్టయందున ముడిచి
యతిభక్తిఁ దెచ్చిన యడుకుల ముడిని
గని, యిదియే మని క్రన్నన దాని
వనజలోచన, భవత్పాణి పద్మముల 1640
విడిచి యా యడుకుల వీక్షించి యందుఁ
గడుమోదమునఁ గొన్ని కరమున నెత్తి
"పరికింప నన్ను, భువనముల నివియు
పరితృప్తి నొందించు బాగుగా" ననుచు

నారగించితివి మహాత్మ, వెండియును
తీరని సంతృప్తి తెలియ మఱొక్క
పిడికెడుగొన, నిన్ను వీక్షించి లక్ష్మి
కడువడి నీ కరకమలమ్ము వట్టి
"చాలుఁ జాలు మహాత్మ, సకల సంపదలు
మేలుగాఁ గలిగె నీ మిత్రున, కింక
భక్షింప వల" దంచు వారించె, లోక
రక్షక, సర్వభద్రంకర, కృష్ణ!

ఆ నిశ యావిప్రుఁ డతి కౌతుకమున
నీ నిలయమ్మున నిఖిలపదార్థ
యుతహితభోజన మొప్పఁగఁ జేసి
యతిమృదుశయ్యపై హాయిగాఁ గూర్కి
మఱునాటి ప్రొద్దున మఱి మేలుకాంచి
సరవి కాలోచితసత్కృతుల్ దీర్చి
నిను వీడుకొని నిజనిలయమ్ముఁ జేరఁ
జనుచు నీ దివ్యదర్శనభాగ్యమునకు 1650
మనము మహానంద మగ్నమ్ముగాఁగఁ
దనకుఁ దా నిట్టులు తలపోసికొనియె

## కుచేలుఁడు మరలి నిజపురమునకు వచ్చుట

"నా పుణ్య మేమందు నలినాక్షు, శ్రీశుఁ,
బాపదూరునిఁ, గృష్ణుఁ, బరమాత్ముఁ గంటి
నరయంగ నల్పుఁడనైన నే నేడ?
సిరిమగఁడైన యా శ్రీకృష్ణుఁ డేడ?
నను నాదరమునఁ జెంతకుఁ జేరఁ దీసి
తన సోదరునియట్లు తగ గారవించి

దైవమ్ముఁ బోలె స్వాంతమ్మున నెంచి
వీవన చేఁబట్టి విసరి నా శ్రమము
వాపి, నా పాదముల్ వట్టి, వాత్సల్య
మేపార, నా జన్మ మిటు ధన్య మయ్యె
నా రీతిగా నాకు ననురాగ మొప్ప
గౌరవసత్క్రియల్ గావించెఁ గాని,
ధనము నొసంగఁ డా దామోదరుండు
కనుఁగొంటి నేను తత్కారణ మిపుడు

"ధనము నొసంగ మదమ్మున నితఁడు
నన్నుఁ జేరఁదగిన యత్నము మాను" ననుచుఁ
దలఁచెఁ గాఁబోలు నతండు లేకున్న
నలఘుసంపదల న న్నలరింపకున్నె ?" 1660
అని వితర్కించుచు నా కుచేలుండు
తనపురిఁ జేరు పథమ్మును బట్టి
చనిచని ముందట సకలసంపదలఁ
దనరి లక్ష్మీదేవి స్థానమో యనఁగ
పొలుపొందు నొక సౌధమును గని యెవని
నిలయమో యిది యని నివ్వెఱనుండ
తెఱగంటి పూఁబోండ్ల తెఱఁగున నుండు
తెఱవలు గొందఱు తెప్పున వచ్చి
యా రమణీయ సౌధాంతరమునకు
కూరిమి వెలయంగఁ గొనిచని రతని

## శ్రీకృష్ణుఁడు తనపై చూపిన ఆదరమునకు కుచేలుఁడు సంతసించుట

ఆ విప్రుభార్య మహాసాధ్వి మోద
మావహిల్లెడు మది నాత్మేశు నతని

గని మ్రొక్కు లిడుచు డగ్గరఁజేర నతఁడు
కనక రత్నాంచిత కమనీయభూష
ణాదులు ధ్వాల్చి మహాలక్ష్మివోలె
మోదమ్ముగూర్చు న మ్ముదితను జూచి
యింతటి వైభవ మింతటి మారు
పంతయు శ్రీకృష్ణునాదృతి ననుచు
నణువైన సద్భక్తి నర్పింపఁ గోటి
గుణితముగా దానిఁ గొను దేవుఁ డనుచు 1670
మది నిను నమ్మి, యేమఱక నీ దివ్య
పద వనజమ్ముల భక్తిఁ గొల్చుచును
తన మానసమ్ముఁ దొల్తటియట్టు లుంచి
మనుగడ పరిశుద్ధమార్గాన జరపి
వరమునీశ్వరులేని పడయంగ రాని
పరమపదమ్మును బడసె నంత్యమున

నారాయణా, జగన్నాయక, దేవ,
సారసనయన, కృష్ణా, వాసుదేవ!
పేదయయ్యును నొరు వేఁడుట మాని
యాదర్శజీవియై యలరె కుచేలుఁ
డాతఁ డాశాదూరుఁ డనఘవర్తనుఁడు
వీతరాగుఁడు తృప్తి విలసిల్లువాఁడు
తన సతి మిగుల ప్రోత్సాహమ్ము సేయ
నినుఁ జూడఁ జనుదెంచెనేగాని యతఁడు
ధనముఁ గోరెనె? భవద్దర్శనముననె
మనమున మోదించె, మమతలు డించె
నినుఁ దృప్తిపఱుపఁ బెన్నిధులేల స్వామి?
యణువైనఁ భక్తి సమర్పింపఁజాలుఁ

గోరకున్నను భక్తకోటికి నీవు
గూరుతు వెందు నెక్కుడు వైభవములు 1680
నీవు కుచేలుని నెయ్యమ్ము నెంచి
పావనమైన తద్భక్తి, నిష్కామ
కర్మలఁ గాంచి, యా ఘనతత్త్వవేది
నిర్మలమతి దేనినిం గోరకున్న
నాతనిఁ గడు సత్క్రియాదులఁ దన్పి
యాతతసంపద లమరఁ జేసితివి
నీ మిత్రవాత్సల్య నియమమ్ము పెంపుఁ
గామాది శత్రుషట్కము గెల్చినట్టి
వరభక్త జనగౌరవ ప్రపత్తియును
దరమె నుతింప నెంతటి వారికైన

కమలామనోహర, కాంచనచేల,
సుమశరజనక, యచ్యుత, సత్యశీల!
దుష్కర్మలనుజేయు దుష్టుండఁ గాని
నిష్కామకర్మలు నేఁ జేసి యెఱుఁగ
కలలోననైన నిగ్గనుఁగొనునట్టి
తలఁపు నాలోన నెత్తఱిఁ బుట్టలేదు
నిక్కమా భక్తితో నీ కెప్పుడేని
నొక్కచుక్కజలమ్ము నొసఁగి యే నెఱుఁగ
నే పుట్టువననేని, నెందేని నీదు
దాపుప్రాపులను బొందని దరిద్రుండ 1690
నిట్టి యల్పుండ నే నిప్పుడు నీదు
గుట్టును మట్టును గొంచె మెఱింగి
నీ నామభజనమ్ము నే చాలనమ్మి
మానకచేయు నెమ్మది నెంచినాఁడ

నాదు దోషముల నెన్నక వాని మఱచి
నీదు దయాదృష్టి నెఱపి మన్నించి
ననుఁ బ్రోవుమయ్య దీనజనసంరక్ష!
కనికరింపవె లసత్కంజదళాక్ష!

## మృతులైన తన పుత్రులఁదెచ్చి చూపుఁడని దేవకి శ్రీకృష్ణ బలభద్రులఁ గోరుట

శ్రీకరనవతులసీదామభూష!
పాకారిముఖ సుపర్వగణ సంతోష!
మాధవ, భవదీయ మహిమల పెంపు
వేధయు నెఱుఁగడు విశ్వప్రకాశ!
అఘటనాఘటన మహాశక్తిఁ జూపు
దఘదూర, భక్తులయాత్మ లుప్పొంగ
నీ మాతృభక్తియు, నీ ధర్మరక్ష,
నీ మహామహిమము, నీ సాహసమ్ము
జగదభినుతములు సరసీరుహాక్ష!
నిగమ నివహరక్ష, నిర్జరపక్ష!

నీ తల్లి దేవకి నిర్మలచరిత
ఘాతుకుం డయినట్టి కంసునిచేతఁ 1700
గోలుపోయిన తన కొడుకులగూర్చి
చాలఁ గుములుచుండి, శరధిలోఁ బడిన
గురుపుత్రుఁ దన పుత్రకులు, నీవు రాముఁ
డరు దరుదనఁ దెచ్చినట్టి చరిత్ర
జనములు సంస్తుతి సల్పుచునుంట
విని యామె మిమ్ముల విశ్వాత్మకులను
గని బాష్పజలములఁ గార్చుచు తనదు
వనట మీతోడ ని వ్వడువునఁ దెల్పె

"నా ముద్దుసుతులార. నా తండ్రులార.
మీ మహామహిమలు మిగుల శ్లాఘ్యములు
జగదుదయస్థితి సంహారములను
దగ మీరు గూర్తురు తటి దప్పకుండ
మీ కవి లీలలు మీ ప్రభావములు
నాకు విశ్వాసముల్ నందనులార!
ఎన్నఁడో మృతినొంది యినసుతునింట
నున్నబాలుని మీ గురూత్తము తనయు
నసువులతోఁ దెచ్చి యరయ నా గురున
కొసఁగితి రఁట యతఁడుత్సాహ మొంద
నా పోల్కి కంసుచే హతులైన వారి
నా పుత్రకులఁ దెచ్చి నా ముందు నుంచి 1716
నా మనోబాధ నంతము చేయుఁడయ్య
మీ మహామహిమలు మెఱుగులు దేఱ"

## శ్రీకృష్ణ బలభద్రులు పాతాళమున బలిచక్రవర్తిం గాంచుట

ఆ దేవకీదేవి యభ్యర్థనమ్ము
సాదరమ్మున విని జనని వాంఛితము
నెఱవేర్ప శ్రీకృష్ణ, నీతోడ రాము
వరయోగబల మహత్త్వమునఁ గైకొనుచుఁ
బాతాళభువిఁజేరి బలిదానవునకుఁ
ఖ్యాతి దర్శన మిచ్చి కరుణచూపితివి
మిము రామకృష్ణుల మేటిదైవముల
ప్రముదితస్వాంతుఁడై బలి గని మీకు
నెదురయి జోహారు లేర్పడఁ జేసి
పదపడి తోడ్తెచ్చి భద్రాసనముల

నుపవిష్టులుగఁ జేసి, యుచితసత్కృతుల
నపురూపమగువాని నన్నియొనర్చి
నీ పదపద్మముల్ నెమ్మి నొత్తుచును
శ్రీపతీ, నిన్నుఁ గీర్తించె నీ రీతి

"పరమాత్మ, కేశవ, భక్తార్తిహరణ,
పురుషోత్తమా, కృష్ణ, మునివంద్యచరణ,
నందనందన, జగన్నాథ, రమేశ!
వందనమ్ములు నీకు పాపవినాశ! 1720
అరయు రాజస తామసాత్ముల కెపుడు
పరమాత్మ, నినుఁ జూచు భాగ్యమ్ము లేదు
ఉత్తమ సత్త్వగుణోత్తరులైనఁ
జిత్తముల్ నీ మాయఁ జిక్కుట యొద్ది
సత్యమో యెఱుఁగంగఁ జాలక యుంద్రుఁ
నిత్యమ్ము తామసాన్వితులగు వార
లెఱుఁగఁ జాలుదురె నిత్యైకసత్యమ్ము
పరమపూరుష, భక్తపాలనశీల!
నీ పాదములచెంత నివసించు పదవి
యే పవిత్రపథమ్ము నెప్పుడు విడక
యనుసరించిన లభ్యమగు నా పథమ్ము
కనికరమునఁ జూపి కావవే దేవ,
స్వామి నీ దర్శనభాగ్యమ్ము కతన
నా మనమున మలినమ్ములు దొలఁగె
నేను నీ దాసుఁడ నేమి నీ యాజ్ఞ
యానతీయవె మహాత్మా! యొనరింతు"
నని యతఁ డన విని హర్షమ్ము నొంది
ననజాక్షఁ డతనితోఁ బలికితి విటు —

## శ్రీకృష్ణ బలభద్రులు బలిచెంతనున్న తమసోదరులఁదెచ్చి దేవకికిఁ జూపుట

బలిదానవేంద్ర! నా పల్కులు వినుము
తొలియుగమందు నిస్తుల తపోధనుఁడు 1730
ఘనుఁడు మరీచ్యాఖ్య గల్గినవాఁడు
మునిజనమ్ములలోన ముఖ్యుఁడు గలఁడు
అతనిపుత్రకు లార్వు రజుఁడు శపింప
పతితులై మొదట పెంపఱ హేమకశిపు
తనయులై పుట్టిరి. తదుపరి వార
లనుపమ యోగమాయా ప్రభావమున
నరయ దేవకి గర్భమందునఁ బుట్టి
దురితాత్ముఁడగు కంసధూర్తుఁడు చంప
నీ యింట నిప్పుడు నెలకొని మిగుల
శ్రేయముల్ సౌఖ్యముల్ చెందుచున్నారు.
మా తల్లి దేవకి మఱువంగ రాని
యాతత పుత్రశోకానల తప్త
యై నిజాత్మజుల తెండని మమ్ముఁ బంపెఁ
గాన వచ్చితిమి. రాకకు హేతు విదియ"
అని వారిఁగొనివచ్చి యచ్యుతా. నీవు
జననికి చూపితి జగము మెచ్చంగ
తన తనయులఁజూచి తల్లి దేవకియు
ననుపమానందాబ్ధియందు మునింగె—

## శ్రీకృష్ణుఁడు మృతులైన విప్రసుతులం దెచ్చిన కథ

నలినాయతాక్ష! కృష్ణా! ద్వారవతిని
గల యొకవిప్రునిగరితకు సుతుఁడు 1740

జనియించి మరునిముసమునందె మరణ
మును బొందె. నంత నా భూసురవరుఁడు
ఘనపుత్రశోకాగ్నిఁ గ్రాగి యాక్షణమ
తనయుని దెచ్చి తత్పట్టణ రాజ
నిలయమ్ము ముందుంచి, నేత్రాల బాష్ప
జలములు గాఱ నసహ్యమౌ శోక
మెడఁద బాధింప విధీ, యిటు దుఃఖ
జడధి న న్ముంచెడు చలమేల నీకు?"
అని విధి దూఱుచు, నాక్రందనమ్ము
నొనరించుచును నటనున్న జనులను
వినుఁడని యిటులనె "విప్రవిద్వేషి,
ఘనశాస్త్రపద్ధతుల్ గాదనువాఁడు,
పాపాత్ముఁడును క్షత్రబంధుండునైన
భూపాలకుని దోషపుంజమ్ముచేత
పుట్టినప్పుడె నాదు పుత్రుండు గిట్టె
కట్టః యేమనవచ్చుఁ గాలమ్ము మహిమ
క్రూరులై హింసకుఁ గొంక కన్యాయ
కారులై విషయసుఖంబుల మఱిగి
యున్న రాజుల భూమినుండెడి ప్రజకు
సున్న శుభములంట చోద్యమ్ముగాదు 1750
జనులార" యంచు నచ్చటువాసి పోయె
తన గేహమునకు నా ధరణీసురుండు.

ఇవ్విధంబున సుతు లీల్గుచునుండ
నవ్విప్రపుంగవుఁ డా మృతసుతుల
ధరణీశు మందిరద్వారమం దుంచి
పరిపరివిధములఁ బ్రభు దూషణమ్ము

గావించుచును బెక్కుగాథలు వల్కి
పోవుచుండెను దుఃఖమును వీడలేక
ఆ రీతి విప్రసుతాష్టక మోలి
దోరెనుః నవమపుత్రుఁడుగూడ మరణ
మొంద వానిని గూడ నుర్వీశునగరు
ముందుంచి బాపఁడు మునుపటియట్ల
విలపించుచుండఁగా విన్వచ్చుఁ డతనిఁ
దిలకించి. హేతువు దెలిసి యిట్లనియె

## అర్జునుఁడు బ్రాహ్మణునకుఁ బుట్టు బాలుర బ్రదికింతునని ప్రతిన చేయుట

"భూసుర. నీ విట్లు పొగులుచు నుండ
నీ సరసను జేరి నీ వెతఁ బాప
నోపిన శౌర్యధుర్యుండగు ధన్వి
యీ పురి లేఁడయ్యె నిది చాలవింత.
సుతులను గోల్పోయి. శోకానఁ గుందు
నతగుల రక్షింపనట్టి భూవరుఁడు 1760
పరికింప నటుఁడుగా భావింపఁ బడుచుఁ
బరిహాసమునకు నాస్పదుఁ డగుచుండు
మదిలోని నీ వగ మానుము విప్రః
బ్రదికింతు నీదుపుత్రకుల నే నింక
నిటమీఁద నానంద మెసఁగెడి నీకు
నటు చేయనేని నే ననలమ్ముఁ జొత్తు

అనవుఁ డా పల్కుల నాలించి విప్రుఁ
డనియె నరునునితో నచ్చెరువొంది

"ఏల పల్కెదు పార్థ! యీ వెఱ్ఱిపల్కు
లాలకింతురె యెట్టి యజ్ఞానులైన
బలరామకృష్ణులు వారి పుత్రకులు
బలశాలులగు యాదవప్రముఖులును
బూనని యీ కార్యమును నీవు చేయఁ
బూనుట హేళనమ్మునకు మూలమ్ము
చాలింపు మీపూన్కి చనుము నే త్రోవ
నీలాగువల్కకు మిఁక నెందునేని"
అన విని పార్థుం డహంకారబుద్ధి
ననియె విప్రునితోడ నందఱు వినఁగ.

"ఏను బలుఁడగాను, కృష్ణుండగాను
మీనాంకుఁడనుగా నమిత్రుల నెల్ల
గాండీవనిర్ముక్త ఘనశరాహతుల
ఖండనమ్మునఁ జెండు పార్థుండ సుమ్ము
త్రిపురాంతకునితోడఁ దెగి పోరినాఁడ
విపుల వేద్యమ్ము మద్విక్రమక్రమము
తెలియువైనను, మృత్యు దేవత నణఁచి
సులభముగా నీదు సూనులఁ దెత్తు
నని నమ్మఁబలుక నా యర్జును ప్రతిన
మనమున నమ్మి బ్రాహ్మణుఁ డూరడిల్లి
నతనిఁ గీర్తించుచు నాత్మమందిరముఁ
గుతుకంబుతోఁ జేరి కొన్నాళ్లు గడవఁ
దన భార్యకుఁ బ్రసూతితరుణ మేర్పడఁగఁ
జని యతఁ డర్జునుసన్నిధిఁ జేరి
వినిపించె నవ్వార్త: వివ్వచ్చుఁ డంత
మునుకొన్నసంతోషమున శంభుఁ గూర్చి

1770

ప్రార్థించి, యస్త్రదేవతలఁ దలంచి
యర్థి గాండీవాది యాయుధాళ్ దాల్చి
యాతని వెనువెంట నరిగి బాణముల
సూతికాభవనమ్ముచుట్టు, నాకాశ
మందున దిక్కుల నరికట్టి, మిత్తి
కెందుఁగాని ప్రవేశ మెటులేని యటులఁ 1780
గావించి, జాగరూకత వహియించి
కావలియుండె నా ఘనశౌర్యధనుఁడు —
అంత పాఱుతగనె నర్భకు, నచటి
కాంత లా బాలకుఁగని, పుట్టెఁ బోయె
నని బొబ్బ లిడుచుండు నంతలో శిశువు
చనె మాయమయి యాకసమున కబ్రముగ
నప్పుడు బ్రాహ్మణుఁ డమితశోకమునఁ
జప్పునఁ బఱచి, నీ సరస కేతెంచి
విలపించుచును నీకు వినిపించెఁ దనకుఁ
గలిగిన కష్ట మిక్కరణి శ్రీకృష్ణ!

## బ్రాహ్మణుఁడు అర్జునుని యసమర్థతను శ్రీకృష్ణునితోఁ జెప్పుట

"నందనందన! కృష్ణ! నగధర! శౌరి!
బృందావిహార! గోవింద! మురారి!
యవధరింపుము నాదు నంగలా ర్పెల్ల
వివరింతు నీతోడ విశ్వాత్మ, దేవ!
పౌరుషహీనుఁడౌ పార్థు రజ్జులను
నేరక బేలనై నెఱనమ్మి నాదు
తనయుని గోల్పోయి, తాలిమి మాలి
వనట మునింగితి వనజాయతాక్ష!

ఎక్కడి యర్జును డెక్కడి ధన్వి.
యెక్కడి గాండివ. మెక్కడి యస్త్ర: 1790
మెక్కడిశపథ మిం దేదియౌ సత్య
మక్కటా! యన్నియు నరయ జల్పములు"
అని వందురుచుఁ బల్కు నా విప్రుపల్కు
లను విని పార్థుండు లజ్జాళు వగుచు
మనమున శాంతి యే మాత్రమ్ములేక
తన ప్రతిజ్ఞను నిల్పఁ దలఁచి వేవేగ
వరుస దిక్పాలుర వాసమ్ములకును
సురగేహములకుఁ జక్షుశ్ర్శవోనిలయ
ములకును జని రోసి భూసురాత్మజుల
పొలఁకువల్ దెలియక పుడమికి వచ్చి
తన పల్కు లెల్ల వ్యర్థములౌట వగచి.
యనలమ్మునంబడు యత్న మొనర్చె

## శ్రీకృష్ణుఁడు అర్జునుని దోడ్కొని వైకుంఠమునకుంజని బ్రాహ్మణబాలురఁ దెచ్చుట

అజహరవందిత! యత్తఱి నీవు
విజయువైరాగ్యమ్ము. విప్రుశోకమ్ముఁ
బాపి వారలఁ దృప్తిపఱుపఁగా నెంచి
చూపెద నీ విప్రసుతులను నీకు
ననఘ. యీ యాత్మహత్యాకృత్య మేల!
యని యగ్నిఁబడకుండ నర్జును నాపి.
నీ వెంట నా మిత్రునిం గొని రుచికిఁ
దావయి శోభిల్లు తపనీయరథము 1800
నారోహణ మొనర్చి యరిగి ధరిత్రి.
వారినిధులఁ జక్రవాళపర్వతము

మేరునగము నాక్రమించితి. వవల
కారుచీఁకటి శతాంగము ప్రవేశించె —
నా తమోమండలమందు రథ్యములు
కాతరమున నెటుఁ గదలక నిలిచె
నంతఁ జక్రమ్ము నీ వాత్మఁ దలంచి
ధ్వాంత మణంపఁగాఁ బంపఁ దత్కాంతి
దట్టమౌ చీఁకటి తలఁగె. వెలుంగు
పట్టపగ లనంగ భాసిల్లె. హరులు
ముందున కతివేగమునఁ బర్వులెత్తె
నందకుమార! స్యందన మటుపోయి
చటులోర్మిభీషణ సాగరమందు
పటువేగమునఁ జొచ్చి పరఁగ నా నడుమ
భానుసహస్రశోభల వెలుఁగొందు
జానగు నొకదివ్యసదనమ్ముఁ జేరె —
ఆ దివ్యసదనమ్మునందు భోగీంద్ర
మేదురశయ్య సంప్రీతిఁ గూర్చుండి
యాదినారాయణుఁ డప్రమేయుండు
వేదోక్తవిధి మునిబృందమ్ము సేవ 1810
లొనరించుచుండ మహోన్నతవిభవ
మున నుండె భక్తసమూహముల్ పొగడ —
నంతట మీ రిర్వు రయ్యాదిదేవు
చెంతకుఁ జని నమస్కృతు లాచరించి
వినయవిధేయతల్ వెలయ నుతించి
యనుపమానందమ్మునంది నిల్చుండ

అయ్యాదిమూర్తి దయాదృష్టిఁ బఱపి
నెయ్యము మీ పయి నిల్పి వీక్షించి

చిఱునవ్వు మోమునఁ జిందులుద్రొక్క
పరమాదరమ్ము సువ్యక్తమౌ చుండ
"ధరణీ భారము మాన్ప, దైత్యులఁ జంప
వరభక్తజనుల సాధ్వసమును బాప
ధర్మము ధర శాశ్వతమ్ముగ నిల్ప
శర్మమ్ము జగతికి సవరింప మీర
లవనిని నరుఁడు నారాయణుఁ డనఁగ
నవతరించితిరి నా యంశమ్మునందు
నియతి దప్పక ధరణికి మేలుగూర్చ
నయవర్తనుల జగన్మాన్యుల మిమ్ముఁ
గనఁ గోరి రిమ్మునల్ గాన భూదేవు
తనయుల నిట కగత్యముగఁ దేవలసె
వీరె యా బాలురు విప్రునిసుతులు
మీరు గొంపోం డిఁక మీ కడ్డులేదు"
అని వీడుకొల్పఁగా న య్యర్భకులను
గొని వచ్చితిరి మీరు కుతుకమ్ము మీఱ
నంతట నినుఁ గొనియాడి పుత్రులను
సంతసమునఁ గొనిచనె బ్రాహ్మణుండు
తన యహంకారవర్తనకు నర్జునుఁడు
మనమున సిగ్గిలి మరుమాటలేక
భవదీయ మహిమకుఁ బ్రణతులొనర్చి
యవధానమతి నిన్ను నర్చించుచుండె

దేవకీసుత, కృష్ణ, దీనమందార!
నీ వివేకమ్మును నీ మాతృభక్తిఁ
బాతాళభువి కీవు బలిఁ జూడఁబోయి
నీ తల్లి చూడ వాంఛించిన సుతులఁ

దెచ్చి యా యమకోర్కిఁ దీర్చుట జగతి
మెచ్చి కొండాడె స్వామీ, వాసుదేవ!
పాఱుని సంతస పఱుపఁగా విజయు
గౌరవమును నిల్పఁగా మది నెంచి
వైకుంతమున కేగి వైకుంఠు కృపను
ప్రాకటముగఁ బొంది, బాలురఁ దెచ్చి 1830
భవదీయ సన్మిత్ర భక్తవాత్సల్య
మవని వెల్లడిచేసి తంబుజనాభ!

నీ మహామహిమలు నీ సాహసములు
సామాన్యములె జగజ్జాలసంరక్ష!
వానిని మదినెంచి ప్రార్థనసేయ
నైన యోగ్యతలేని యధముఁడ నేను
ననుఁ ద్రోసిపుచ్చక నా యవివేక
మును లెక్కసేయక ప్రోవుమా నన్ను
సరసీరుహాక్ష! నీ శరణు చొచ్చితిని
కరుణింపు మయ్య భక్తజన సంరక్ష!

## సుభద్రా పరిణయము

శ్రీనాథ, కారుణ్యసింధు, సర్వేశ,
జ్ఞానస్వరూప, నిర్జరగణపక్ష,
సరసిజనాభ! నీ సంకల్పముననె
జరగుచునుండు నీ జగతివర్తనము
కాని యేమియు నెఱుంగని యట్లు నీవు
మానవజాతిధర్మమున నుండుదువు
అట్టి నీదు రహస్య మరయుంగఁ గలరె
యెట్టి వారైన మౌనీంద్రసంస్తుత్య!

పుండరీకదళాక్ష, భువనైకరక్ష
పాండుసుతుఁడు నీకు బంధు వర్జునుఁడు 1840
తీర్థయాత్రలు సేయఁ దివిరి యెల్లెడల
నర్థిమైఁ దిరుగుచు, నఖిలతీర్థముల
వరమన నొప్పు ప్రభాసతీర్థమున
కరిగి తాఁ గొన్నినాళ్లచ్చట నుండె
దామోదరా, సుభద్రయు నర్జునుండుఁ
బ్రేమలు మనములఁ బెంచుకొంచుండి
ర క్కారణమ్మున నామెను జూడ
మక్కువపడియుండె మది విజయుండు

"ద్వారకఁ గౌరవపతికి సుభద్ర
సీరి యొసఁగి పెండ్లిచేయఁ దలంచె
నను వార్త వెల్వడెః నవ్వార్త నరుఁడు
విని, యామెనుం జూచు వేడుకతోడ
ద్వారక కేగి త్రిదండివేషమ్ము
నేరుపుతోఁ దాల్చి, నిఖిలజనమ్ము
తను నమ్మి సేవింపఁ దత్పురియందు
దినములు గడపుచుఁ దిరుగుచునుండె.

## అర్జునుఁడు సుభద్రను శ్రీకృష్ణునాజ్ఞను గొని ఖాండవప్రస్థమునకుం దెచ్చుట

కపటత్రిదండిగాఁ గవ్వడి నెఱిఁగ
కపరిమితానంద మంది తాలాంకుఁ
డాతని తన నిలయమ్మునఁ జేర్చి
ప్రీతియు భ క్తియు వెలయంగ భిక్ష 1850

యిచ్చుచు నుండె నా యింద్రాత్మజుఁడును
మెచ్చి గైకొనుచు నెమ్మిగ నటనుండి
యా హర్మ్యమందున నలరువిల్కాని
మోహనాస్త్రమ్మన, మోహిని యనఁగ
సంచరించుచు నున్న చాన సుభద్రఁ
గాంచి మదను బాణఘాతముల్ దగులఁ
జలితమనస్కుఁడై సతతమ్ము తనదు
తలఁపెల్ల నా తలోదరియందు నిలిపె
నా సుందరియు మన్మథాకారు నతని
భాసుర మునివేషుఁ బరికించి చూచి
యతఁడు పార్థుండని యాత్మ భావించి
యతనుసాయక చలితాత్మయై భీతి,
మురిపెమ్ము, మోహమ్ము ముప్పిరిగాఁగ
కరము లజ్జాగుణగరిమ తా నుండె
నా విధంబున సుభద్రార్జునుల్ ప్రేమ
భావముల్ గల్గినవారయి యుంట
నీ వెఱుంగుదు గాని నిఖిలేశ! యన్య
లేవారలు నెఱుంగ రేమాత్రమేని

ఒకనాఁడు దేవీమహోత్సవమునకు
నా కన్నియ సుభద్ర యప్పురి వెలికి 1860
నరుగుదెంచిన సమయమ్మున పార్థుఁ
డరవిందనయన! కృష్ణా! నీదుముదలఁ
గైకొని తాను న క్కాంత వెన్వెంటఁ
దేకువచని యామెఁ దేరున నుంచి
కొనిపోవుచుండె నెక్కడు సంతసమునఁ
దనకడ్డులేదను ధైర్యమ్ముతోడ —

నాదృశ్యమును గని, యధికరోషమున
యాదవసైనికు లర్జునునెదుర
నాతఁడు వారల నందఱ ఘోర
శాతబాణమ్ముల సంకటపఱచి
విజయమ్ముఁగొని తన ప్రియతోడఁ గూడి
ప్రజమెచ్చ ఖాండవ ప్రస్థమ్ముఁ జేరె.
హలి యా విచిత్రకార్యవిధమ్ము నెఱిఁగి
ప్రలయకాలాగ్నికైవడి ప్రజ్వలించి
కోపింప బంధులగూఁడి నీ వతని
దాపునఁజేరి తత్పాదపద్మముల
కంజలి గావించి యాతనిమనసు
రంజిల్లునట్టులఁ బ్రార్థింప నతఁడు
గతమును మఱచి యాగ్రహమును వీడి
యతిప్రీతి విజయుని నందున నిలిపె. 1870

జగదేకవీర, కృష్ణా, వాసుదేవ
నిగమగోచర, నీకు నిఖిలమ్ము వేద్య
మగునుగదా: సుభద్రార్జును లెలమిఁ
దగ మనంబులఁ బ్రేమఁ దవిలియుండుటయు,
ద్వారకఁ గపటత్రిదండియై నరుఁడు
చేరివసించు ప్రసిద్ధకారణము
నీ వెఱుంగుదు, కాని, నిక్క మెయ్యదియొ
రేవతీపతికే నెఱింగింప: వతని
భావమ్ముఁ దెలిసియు వలదని యనవు
నీవు నందఱియట్ల నేర నట్లుంటి.
కాని, యదనుఁగని కవ్వడిఁజూచి
యానతి నొసఁగితి వబలఁ గొంపోవ

రాముఁడు కోపింప బ్రార్థించి యతని
తామసగుణమును దప్పింపఁ జేసి
నరునిపై నతని కెన్నంగను బ్రేమఁ
బొరయింపఁ జేసితి పురుషవరేణ్య!

ఈ విధమ్మున భువి నెచ్చటఁగాని
యే విధమున నెప్పు డేకార్యమేని
జరగవలెనొ, దాని సక్రమరీతి
జరిపించుచుందువు సాక్షిగా నుండి 1880
ఆ కార్యములయందు నణుమాత్ర మేని
నీకు జోక్యమ్ములేని విధాన నుందు
నీ సహచరులైన నీ పరిపాల
నా సముద్యమమునందలి రహస్యమ్ము
నెఱుఁగజాల రటన్న నించుకయేని
యెఱుగంగఁ గలనె యే నిభరాజరక్ష!
కాని నీ మహిమలు కథలుగా వినుచు
నీ నామభజనమ్ము నిరత మొనర్తుఁ
గాన నీదయ నాదు కలుషముల్ మాన్పి
జ్ఞాన మొసంగి సచ్చరితుఁ గావించి
నన్నుఁ గాపాడుమా నాళీకనయన!
నిన్ను నమ్మినవాఁడ నీరధిశయన!

## శ్రీకృష్ణుఁడు ఋషిసమేతుఁడయి మిథిలకుఁ జనుట

శ్రీతరుణీప్రియ, శ్రితపారిజాత,
పాతకహర, బర్హిబర్హావతంస!
ధరణీశులైన, బేదలె యైన నీవు
వరభక్తులైనచో వారలయెడలఁ

దరతమభావముల్ తలపెట్టఁబోక
యరయంగ సమదృష్టి నాదరించెదవు
మఱియు సద్భక్తులమందిరమ్ములకు
పెరిమమ్ము మీఱఁగా విచ్చేసి కరుణ 1890
దరిసెనమిడి వారు ధన్యులౌ నటులు
వరముల నిత్తువు వారిజనాభ!

జగతి విదేహదేశమ్మున మిథిల
పొగడిత గాంచెను పురరాజ మనఁగ
నా పురిగలఁ డొక యవనీసురుండు
నీ పాదభక్తుఁ డనిచ్ఛాగతమ్ము
కాసైనఁ బదివేలుగా నెంచువాఁడు
వాసి వేదవిదుండు పరమశాంతుండు
శ్రుతదేవుఁ డనెడు విశ్రుతనామధేయుఁ
డతఁడు గృహస్థధర్మాదిసత్క్రియల
విడువక పాటించి విజ్ఞానగతులు
పుడమి మానవులకు బోధించుచుండు
నా పురమును బహుళాశ్వాభిధాన
భూపతి పాలించు భూజనుల్ పొగడ
ఆ రాజు నిష్కలుషాంతరంగుండు
నై రాజ్యపాలనమందు ధర్మములు
నేమముల్ మఱువక నెమ్మదిఁ బ్రజల
సామభాషణముల సంతసపఱచు

మిథిలానగరవాసులగు బహుళాశ్వ శ్రుతదేవులు
శ్రీకృష్ణుని కెదురుగాఁజని తోడ్కొని వచ్చుట

ఆ విప్రవర్యుని యా రాజతిలకు
నీవు చూడఁగఁ గోరి నీ వెంట మునులఁ 1900

దోఁకొనిపోవుచుఁ ద్రోవలో నడుమ
ప్రాకటభక్తి భూపతులిచ్చు కాన్క
లాదరమ్మునఁ గొంచు, నర్థి వారలకు
మోదమ్ముగూర్చుచు ముందుకుఁ జనుచు

మిథిలాపురమ్ము సమీపమ్ముఁ జేరి
తధికహర్షమ్ము మహర్షులు వొంద
మీ యాగమనవార్త మిథిలేశు కర్ణ
పేయ మగుట వేడ్క వివిధోపహార
తతిఁ గొంచు సుభటబృందమ్ము సేవింప
శ్రుతదేవుఁడును దాను సురవంద్య. మీకు
నెదురయి మునులకు నెఱిగి సద్భక్తిఁ
బదపడి నీ దివ్యపాదపద్మములు
శిరము లంటఁగ మ్రొక్కి చేతులు మోడ్చి
కరము వినమ్రులై "కమలాక్ష! నీవు
నీమునిసందోహ మెక్కుడు కరుణ
మా మందిరములకు మాతోడ వచ్చి
యనురక్తి మా పూజ లందుకొం"డనుచు
వినుతింప వారియభీష్టముల్ దీర్ప
నెడఁద నుద్దేశించి యేకకాలమునఁ
దడయక వారిసద్మములకు నీవు. 1910
మునులు నేగితిరి ప్రమోదభావముల
ఘననీలగాత్ర. యర్కసుధాంశునేత్ర!

## బహుళాశ్వుఁడు శ్రీకృష్ణునికి మునులకు అతిథ్యమిచ్చి పూజించుట: శ్రీకృష్ణుఁడనుగ్రహించుట

అంతట నా నృపుఁ డచ్యుతా, నిన్ను
దాంతులౌ మునుల సద్భక్తితో మేల్మి

పైఁడిపీఠమ్ములు పఱచి కూర్చుండ
వేఁడి. మీపాదముల్ విమలోదకములఁ
గడిగి తత్తీర్థమ్ముఁ గరమర్థిఁ దనదు
పడఁతియు. తానును బంధువర్గమ్ము
శిరములఁ దాల్చి. పూజించి సమస్త
పరిచర్య లొనరించి పరితృప్తి భుక్తిఁ
గుదిరిచి. భవదీయ కోమలపద్మ
పదముల నొత్తుచుఁ బలికె నీరీతి.
"అఖిల భూతమ్ముల యాత్మలయందు
నిఖిలేశ! సాక్షివై నీ వుందు వెపుడు
నీదు భక్తులతోడ నీరజసంభ
వాదులైనను బోల రందు రమ్మాట
నిక్కమౌనట్టులు నీ శుభనామ
మెక్కడ నెప్పుడో యే లేశమాత్ర
ధ్యానమ్ముగల. యస్మదావాసమునకు
హీనుఁడు వీఁడని యెంచక వచ్చి 1920
నీ భక్తవాత్సల్యనిరుపమ తత్త్వ
మీ భువిఁ జాటితి విభరాజవరద!
నీ నామభజనమ్ము నిరత మ్మొనర్చు
మానవుల్ మఱువ రామహనీయ నియతి.
నరయంగ శాంతాత్ములైన యోగీంద్ర
వరుల వాంఛితములు వమ్ము గానీక
మన్నన. గావించి మరియాదఁ జూపి
నిన్నెన్న నిత్తువు నీరజనయన!
శ్రీకృష్ణ. మాధవ. క్షీరాబ్ధిశయన.
పాకారినుత. దివ్యపాదారవింద!

మునులతోఁగూడ నిమ్ముగ నీవు కొన్ని
దినము లిందుండఁ బ్రార్థించుచున్నాఁడ
నీ పదరజము నా నిలయమ్ము సోఁక
తాపసవంద్య, నేధన్యుఁడ నగుదు”
ననివేఁడు నా రాజు నభ్యర్థనమ్ము
వినియుంటి కొన్నాళ్లు వేడ్క నయ్యింట.

## శ్రుతదేవుడు శ్రీకృష్ణుని, మునుల పూజించుట, శ్రీకృష్ణుఁ డనుగ్రహించుట

శ్రుతదేవుఁడును, మునిస్తోమమ్ము, నిన్ను
నతిభక్తి తనదు గేహమ్మునఁ జేర్చి,
దర్భాసనమ్ములఁ దగినట్లుగూర్చి
నిర్భరానందమ్ము నెలకొన నీదు 1930
పదములు గడిగి తత్పావనజలము
ముదమున సతి తాను మూర్ధమ్ములందు
దాలిచి విరుల సద్భక్తి పూజించి
యాలయ మంతయు నా దివ్యపాద
తీర్థముఁ జిలికించి, తృప్తి తా నప్పు
డర్థిఁ బత్రఫలాదు లర్పించి: నీవు
తనయింట భుక్తి నెంతయుఁ బ్రీతిఁ గొంట
తనదు జన్మము కృతార్థత నొందె ననుచుఁ
దన మనంబున నెంచి తనుఁ దాన మఱచి
యనుపమానందమ్ము నందుచునుండె.

మఱియు నా పాఱుఁడు మాధవా, నీదు
చరణమ్ము లొత్తుచు సద్భక్తి ననియె

"హరి, కృష్ణ, నాదు భాగ్య మ్మతులమ్ము
హర పద్మసంభవాద్యమరులే నైన
నినుఁ జూచి యెఱుఁగరు నేఁ జూడఁ గంటి
ననఘమౌ నీ మూర్తి హత్తె నా యెడఁద
నీ పూజ చేయుచు నీ కథల్ వినుచు
నీ పాదసేవలు నీ నామభజన
లెడపక చేయుచు నెల్లవేళలను
గడు భక్తితోఁ దమ కాయముల్ శ్రద్ధ 1940
భవదధీనములుగ వర్తించువారి
ప్రవిమల హృదయదర్పణములయందుఁ
గనబడుచుందు, సత్కర్మహీనులకు
మనములనుండియు మఱుఁగగు చుందు.
వాదిదేవ, మహాత్మ, అఖిలలోకేశ,
వేదవినోద, గోవింద, రమేశ!
నన్ను నేపనికి నాజ్ఞాపింతు, దేవ!
నిన్ను నెమ్మదినిల్పి నేఁ జేయువాఁడ"
అని వేఁడ నాతని నాదరబుద్ధిఁ
గని యిట్టు లంటివి కంజదళాక్ష!

"పరమ తపశ్శక్తి వరలిన మునులు
నిరుపమ నిజపద నీరేజరేణు
తతి జగమ్ముల పవిత్రముచేయుచుందు:
రతిలోకమాన్యులై యలరారుచుంద్రు.
వారు నా వెనువెంట వలయునెడలకుఁ
జేరవచ్చుచునుంద్రు. చెప్పెడి దేమి?
నీ యదృష్టము పేర్మి నీ గృహమ్మునకు
నీ యదనున వచ్చి రెలమి నందఱును

ఈ మహాత్ములపూజ లెడపక సేయు
భూమి సురేశ! నీ పుణ్యమ్ము పెరుగు 1950
వీరియాత్మలనేను విహరించుచుందు
వీరు నా యాత్మలో విలసిల్లుచుంద్రు
కావున మునులను గడుభక్తితోడ
నీవు పూజింపు "మా నిర్మలపూజ
నన్నుఁజేరుచుండును నా కద్ది ప్రీతి"
యని యానతిచ్చితి వంబుజనాభ!
అంత బ్రాహ్మణుడు మహర్షులపూజ
సంతతమ్మును భక్తి సల్పుచునుండె

ఈ విధమ్మున మిథిలేశ భూసురుల
భావజజనక, కృపాదృష్టిఁ జూచి
యసదృశసౌఖ్యమ్ము లాత్మ కానంద
మెసఁగెడి వరము లనేకమ్ము లొసఁగి
వారి వీడ్కొని మునివరులతో నీవు
చేరుకొంటివి శుభస్థితి కిరవైన
ద్వారకఁ బౌరులు తద్దయుఁ బొగడ
శ్రీరమాలోల, యాశ్రితజనపాల!

ఒక పట్టణముననె యొక్కఁడు భూపుఁ
డొకఁడు పేదయు వారి యున్నతస్థితిని
హీనస్థితిని నొగి నించు కేనియును
మానసంబునఁ దలంపక యిరుగురుని 1960
క్రమమగు భక్తి ముఖ్యమ్మని యెంచి
సమభావమునఁ జూచి సంతసించితివి
బహులాశ్వ శ్రుతదేవ భక్తద్వయమ్ము
గృహముల కీవుగా నేగి వారలకు

పొరయించి తానందమును నందతనయ,
కరుణాకరా, లోకకల్యాణనిలయ!
సౌధములైనను జవికలే యైన
మాధవా, నీకు సమానము లయ్యె
సరసపదార్థముల్ జలఫలాదులును
సరిసమానము నీకు శాంతి స్వరూప!
అంతటి సమభావు నంతదయాళు
నంతటి భక్తగణావనశీలు
నిను మెప్పఁజెప్పుట నీ కృపఁ గనుట
నిను వేఁడి కాంక్షల నెఱవేర్చికొనుట
కడు సులభమ్ము నిక్కముగ నిన్ భక్తి
విడువక పూజించు విమలచిత్తులకు
నా వంటి మూర్ఖజనమ్ముల కద్ది
యే విధంబున లభియింపదు దేవ!
కాని, నీ దయ కొంత కలిగినఁ జాలు
నే నరుఁడేని నీ హృదయము మెచ్చు 1970
భక్తుఁడై నీ చెంత వసియింపఁ గలఁడు
ముక్తిలోకేశ, సంపూర్ణప్రకాశ!
కాన నన్నెటులైనఁ గరుణించి, నిన్ను
ధ్యానించు భక్తుని యటుల మన్నించి
కాపాడుమా జగత్కల్యాణదాత!
నీ పాదములె గతి నిఖిలాధినేత!

## శివద్రోహంబు సేయంబూనిన వృకాసురుండు విష్ణుమాయచే మడియుట

శ్రీమానినీప్రియ, శ్రితజనగేయ,
సామగానవినోద, సాధుప్రమోద!

జగతివర్తనమున జరుగు లోపములఁ
దగదీర్చి దుష్టవర్తనుల శిక్షించి
యుత్తములకుఁగల్గు నులుకుఁ బోఁగొట్టి
యెత్తఱి నేకడ నెట్టిలోపమ్ము
ధర్మపద్ధతికిఁ జెందనియట్లు దిద్ది
శర్మమ్ము సృష్టికి సవరింతు వీవు
సత్యమూర్తివి జగత్సాక్షివి నీదు
తత్త్వ మెఱుంగ రెంతటి ఘనులైన

పురుషోత్తమా, జగత్పూజ్య చరిత్ర,
దురితమేఘ సమీర, దుష్టసంహార!
వృకుఁడను నసుర దుర్వృత్తిగలాఁడు
సకల సజ్జనబాధ సల్పగా నెంచి 1980
యొకనాఁడు తెరువున నొదిగి శ్రీవిష్ణు
సకలాత్ముఁ బాడుచుఁ జనుచున్నదేవ
ముని నారదునిగని మ్రొక్కి "ఓమౌని!
నను గరుణను జూచి నా మాట వినుమ
హరిహరబ్రహ్మల నర్చింప నెవఁడు
త్వర వరములనిచ్చి దయఁ బ్రకటించు
నా దేవుఁ దెలుపుమా" యన నవ్వి మౌని
యా దానవునితోడ ననియె నీరీతి.

సుగుణదుర్గుణములఁ జూడ నొండెందు
నగపడు నచట దయా కోప ఫలము
లతిశీఘ్రమునఁ జూపు నట్టిదైవమ్ము
శితికంఠుఁడగు సుమా, చెప్పెద వినుము.
ఆ విధ మెఱిఁగి మహాశూరులైన

కడుభక్తి నాదేవుఁ గఱకంఠుఁ గొలిచి
వడసిరి సామ్రాజ్యవైభవోన్నతుల
నా రీతి భక్తి నీ వమ్మహాదేవుఁ
గోరి భజింప నీ కోర్కె లీడేరు.

అని వినిపింపఁగా న మ్మునిబోధ
విని సంతసించి యా వృకదనుజుండు 1990
తడయక యేగి కేదారతీర్థమ్ము
కడఁజేరి తపము శ్రీకంఠునిగూర్చి
యొనరించుచును సాహసోద్వృత్తి నగ్నిఁ
దనమేనికండలు దఱిగి యాహుతిగఁ
బడవేసి, శర్వుఁ డప్పటికిని దనకు
బొడగానఁ బడఁడని బుద్ధి నూహించి
సప్తమ దినమున జడియక తనదు
మస్తకముం ద్రుంప మానసమందుఁ
దలఁచి గొడ్డలిని చేతంబట్టి యెత్తి
తలపై విసరఁబూనఁ దత్క్షణంబుననె
యనలకుండమునుండి యభవుండు వచ్చి
దనుజు కరమునాపి దర్శన మిచ్చి
చాలింపు మింక నీ సాహసోద్యమము
చాల మెచ్చయ్యె నీ సల్పినతపము
కోరుము వరములఁ గొఱలేక యిత్తు
శూర, వృకాసుర, సురనగధీర"
అనవుడు రాక్షసుఁ డానంద మొంది
మునివినుతునకు శంభునకు వందనము
లొనరించి ఓ శివ, యో యిందుమకుట,
యనఘచారిత్ర, నాహస్త మెవ్వాని 2000

శిరమున నుంతుఁ దచ్ఛిరము వ్రక్కలయి
సరగున నాతఁడు చచ్చెడునట్లు
వరమీయవే'' యని ప్రార్థింప శివుఁడు
దరహాస మొనరించి తడయ కావరము
మునుచూపుఁగనక యిమ్ముగ వాని కిచ్చె
ఘనులు వల్కినమాటఁ గాదని యనరు.

వరమును బడసి తద్వరమహిమమ్ముఁ
బరికింప నెంచి గర్వమున వృకుండు
హరుశిరమ్మునఁ దనహస్తమ్ము నుంప
దర మించుకయులేక దరియంగ బోఁగ
"తన మెప్పు ముప్పయి తనపైనిఁ బడియె''
నని మది శివుఁ డెంచి, యటనుండి తన్ను
విడనాడ కసురుండు వెన్నంటి తఱుమ
కడువడి భీతి జగత్త్రయ మ్మందుఁ
బరుగిడ. మునిసురవర్యులుగూడ
వెఱచిరి గాని, యా బెడదఁ దప్పించు
ప్రతివిధానమ్ముమార్గ మెఱుంగలేమి
యతిబాధ నొందిరి యభవు దుఃస్థితికి.

ఆ మాడ్కిఁ బాఱుచు నభవుండు సకల
భూముల కవ్వల పొలుపారు నదియు 2010
రవిశశిప్రభలు సొరంగరానిదియు
ప్రవిమల సహజశోభల వెల్గునదియు
యోగీంద్రదగమ్యమై యొప్పారు నదియు
వాగీశ. భోగీశ వంద్యమై నదియు
విమలకాంచనమణీ విభవసంపత్తి
నమల హర్మ్యముల నలరారు నదియు

పరమాత్మ శ్రీశు నివాసమ్మునైన
పరమపావనమగు వైకుంఠపురముఁ
గని తత్పురమ్ముచెంగటఁ జేరుకొనఁగఁ
జనియె యోచనచేసి సత్వరగతిని

అలోన సర్వభూతాత్మనివాసి
యై లోకభద్రమ్ము నాత్మ నెంచుచును
పన్నగభోగతల్పమునఁ గూర్చుండి
యున్న త్రిలోకపూజ్యుండు విష్ణుండు
పురహరుఁ డరయక పూర్వదేవునకు
వర మొసంగుటయును. వాఁడు శంకరుని
తలమీఁదఁ గరముంపఁ దఱుముచుంటయును.
గలఁగి శివుఁడు త్రిలోకములఁ దిర్గుటయుఁ
దనదివ్యదృష్టి నంతయును దా నెఱిఁగి.
యనఘు శంభునిస్థితి నరయంగఁ దలఁచి 2020
నల్లనిమేను స్వర్ణమయ ముంజియును
తెల్లనిజందెముఁ దెలిపట్టుగొడుగు
గిండియు. దండముఁ గృష్ణాజినమ్ము
నిండునామంబును నెఱి వ్రేలు సిగయు
వేలిమిబొట్టును వ్రేల దర్భలును
మేలు పసుపుచాయ మెఱయు గోచియును
దనరంగ వటువేషధారియై వచ్చి
యనయు దుష్టాత్ము నయ్యసురుని జేరి
కైతవంబున నమస్కారముల్ చేసి
యాతని యెదకుఁ బ్రత్యయ మగునట్లు
మృదుమధురోక్తుల మెల్లన మిగుల
సదయాత్ముడుం బోలెఁ జల్లగ ననియె

"ఇంతమార్గాయాస మేల చెందంగ?
నెంతదూరమునుండి యేతెంచి తీవు
ధర సౌఖ్యములకు నిదానమౌ తనువుఁ
గరము కష్టముల పాల్గాఁ జేయఁ దగునె?
కొంతతడవు శాంతిఁగొను: విశ్రమింపు.
మింతకు నీ శ్రమ కెద్ది కతమ్ము?
వినిపింపఁ దగునేని వినిపింపు నాకు
మనసునఁ గపటమ్ముమాని దైత్యేంద్ర" 2030
అను నీదు పల్కుల నా వృకాసురుఁడు
విని మనంబునఁ గడువేడ్క జనింపఁ
దనదు ప్రయత్నమంతయు నెఱిఁగింప
ననఘుఁ డా వటురూపహరి దరహాస
మొనరించి వానితో "నో యసురేంద్ర:
మును దక్షశాపమ్ముఁబొంది శివుండు
తనదు మాహాత్మ్య మంతయు గోలుపోయి
ఘనులు సురల్ దన్నుఁ గడకుఁ ద్రోయంగ
భూతేశుఁడయి సదా బొంకుట మరగె
యాతని చెయిదంబు లన్ని చిత్రములె
నిజమాడియున్నచో నీ యత్నమునకు
గజిబిజి తా నొందు కారణ మేమి?
యది యబద్ధంబౌట నపవాదు తనకు
నొదవు ననెడిభీతి నుఱుకుచున్నాఁడు
పట్టఁజాల రశుచిఁ బడ్డవా రతనిఁ
బట్టనెంచితె: యొకపద్ధతి వినుము
కరచరణంబులు గడికికొ మ్మవల
స్థిరభక్తి వార్చి చెచ్చెరను నీ వతని

వెనుదగిలితివేని వెంటనే యతఁడు
దనుజేంద్ర, నీదు హస్తములకుఁ జిక్కు" 2040
అన విని నీదు మాయకుఁ జిక్కి వాఁడు
మనము భ్రాంతిం జెంద మరునిముసమున
తామసమతి వార్చి తన హస్త మెత్తి
యేమరి శిరముపై నిడుకొని, నూరు
వ్రక్క లగుచుఁ దల వగుల ప్రాణములు
గ్రక్కున వదలి ధరంబడి చచ్చె
వాని చావును సురవారమ్ము గాంచి
యానందముం బొంది హరిపైని విరులు
చల్లిరి, యాడి రచ్చరలుః గంధర్వు
లెల్లఁ గీర్తించి రా యిభరాజవరదు

అంతట ఫణితల్పుఁ డాఫణి భూషు
చెంతకుఁ జని యనె, "శ్రీకంఠ, వీఁడు
క్రూరుఁడు నీ కెగ్గుఁగోరి తాఁ దుదకు
దోఁకెను జగతియందునఁ దప్పు దిద్ది
అనఘుల కపకార మాచరింపంగ
మనముల నెంచిన మనుజుల కెందు
శుభములు గలుగవు చూడంగ నీకు
నభవున కీశున కాదిగురునకు
చెడుగుఁ దలఁచి వీఁడు చెడినాఁ డటన్న
పుడమి చిత్రముగాదు భుజగవిభూషః 2050
కట్టిడివారలఁ గరుణతోఁ జూచి
యిట్టివరము లిచ్చు టెంతయుఁ దగదు

ఈ రీతి వచియించి యిందిరేశుండు
గౌరీశు వీడ్కొని [illegible]

ముదమంది య య్యాదిమూర్తిఁ గీర్తించి
పదపడి చనెఁ దన భవనమ్ముఁ జేర

వనమాలికాధర, వారిజనేత్ర,
సనకాదిమునిజన స్తవనీయచరిత,
వృకదానవాధము హృదినున్న తలఁపు
సకలచరాచర జంతుసంతతికి
నిడుమఁ గూర్చెడినని యెఱుఁగలేఁ డయ్యె
మృడుఁడు: వానితపమ్ము మెచ్చి యాకూళ
కోరినవర మిచ్చి గోడొంది దానిఁ
దీరుచుకొనుదారి తెలియక పాఱె
నాతఱి నీకు నయ్యసురుని చావు,
భూతేశు సాధ్వసమ్మును బాపుటయును
జగతికి భద్రమ్ము సమకూర్చుటయును
ఖగవాహ, యనివార్యకార్యమ్ము లయ్యె
అంతట నీవు మాయావటురూప
మంతలోనన తాల్చి యన్నికార్యములు 2060
తగఁ గూర్చి ధర్మమ్ము ధరణి నిల్పితివి
నిగమగోచర, జగన్నేత, గోవింద!
నీ సమయస్ఫూర్తి, నీ సాహసమ్ము
వాసవాదులకైన వర్ణింపఁ గాదు

జగతిలోపములను జక్కచేయంగ
తగినదైవము నీవె తామరసాక్ష!
నీవు సంకల్పింప నెఱవేరనట్టి
దీ విశ్వమునలే దుపేంద్ర, ముకుంద,
కావున నన్ను నిష్కలుషాత్ముఁ జేయ
పావన భవదంఘ్రి పద్మముల్ గొలుచు

నీ సేవకునిగ మన్నింపంగః నీదు
దాసునిగాఁ జూచి తప్పక ప్రోవ
నీవె తగుదువని నిను నమ్మినాఁడ
దేవదేవ, రమేశ, దీనశరణ్య,
గరుడవాహన, జగత్కల్యాణమూర్తి!
కరుణింపుమా సురగణచక్రవర్తి!

## భృగుమహర్షి త్రిమూర్తుల ప్రాశస్త్యంబుం బరీక్షించుట

శ్రీసమన్విత, సురసేవ్య, వైకుంఠ
వాస, బ్రహ్మాది సుపర్వ సంతోష!
జగతి మానవ మానసమ్ములఁ బట్టి
త్రిగుణాత్మకముగ వేర్వేరు దైవములు 2070
గల రనేకముగ నిక్కము పరికింప
జలజాక్ష, కేశవ, సత్త్వగుణమ్మ
స్థిరరూపమొందిన తీరున నుండి
కరము ముఖ్యమ్మయి, గణనీయమైన
దైవమ వగుదీవు తపనీయచేల,
దేవాధిదేవ, సుస్థిర సత్త్వశీల!

వర తపశ్శక్తి సంపన్నులు మునులు
పరమనిష్ఠను సరస్వతి తీరమందుఁ
గ్రతువు లందఱుఁగూడి గావించుచుండి
శితికంఠ, లోకేశ, శ్రీపతులందు
నధికుండనెడు ఖ్యాతి నలరినవాఁడు
ప్రథమదైవంబనఁ బరగినవాఁడు
పరికింప నెవఁ డంచు స్వాంతమ్ములందు
కరము విచారించి కనుఁగొనలేక

యెఱిఁగి రమ్మని భృగు నెల్లరుఁ బనుపఁ
బరమ మోదమున నా వరమునీంద్రుండు
చనిచని ముందట సత్యలోకమ్ముఁ
గని బ్రహ్మసభఁ జేరి కలయంగఁ జూచి
యతని సత్త్వగుణమ్ము నరయుట కొఱకు
నతినుతుల్ మాని, మిన్నక నిల్చియుండె. 2080
నా తపోధనుఁ గాంచి యజుఁడు కోపించి
యాతఁడు తనపుత్రుఁ డనెడుభావమున
ఘన కోపవహ్నిచేఁ గ్రాగెడికనులఁ
దనశాంతజలముచేఁ దడిపి చల్లార్చె.

ఆ సభవీడి మహర్షి భృగుండు
భాసిల్లు కైలాసపర్వతమునకుఁ
జనియెఁ న గ్గిరిపయిఁ జంద్రశేఖరుఁడు
తనసతి పార్వతి, తాను విశ్రాంతిఁ
గనుచుండి, యచటికిఁ గాంచనగర్భు
తనయుఁడు రాఁగ, నాతనిఁ గని యతఁడు
సోదరమైత్రినిఁ జూపుచుఁ దన్ను
సాదరమున బిగియైనఁ గౌఁగిటను
జేరుచునని యెంచి చెచ్చెర నతని
చేరువఁజేర, నా శివు సత్త్వగుణము
నరయంగఁ దలఁచుట న మ్మౌనివరుఁడు
హరుని లెక్కింపనియటు లూరకుండె.

మునిచూపినయలక్ష్యమునకు రుద్రుండు
తనకది తద్దయు తలవంపుగాఁగ
మనమున నెంచి యమర్షమ్ముఁ బెంచి
తనచేతిశూలాన తాపసముఖ్యు 2090

నురము వ్రేయుఁగఁ బూన, నౌహో! మాను మిద్ది
కరము పాపముఁ గూర్చుకార్యమ్ము స్వామి"
అని పార్వతీదేవి యభవుకోపమ్ము
ననునయాలాపమ్ము లాడి వారించె.
న మ్మువి యంతట నచ్చోటు విడిచి
నెమ్మి శ్రీవై కుంఠునిలయమ్ముఁ జేరెఁ
జేరి య మ్మునిగణశ్రేష్ఠుండు హేమ
సారసాంచిత దివ్యశయ్యపై నున్న
శ్రీరమారమణు నాశ్రితపారిజాతు
వారిజలోచను వక్షఃస్థలంబుఁ
దనపాదమునఁ దన్నెఁ దలఁ కేమిలేక
మునిమహామహిమంబుఁ బొగడంగ వశమె?

ఆ తన్నుతోడన హరి పాన్పుడిగ్గి
యా తతభక్తిమై య మ్మునిఁజేరి
పాదములకు మ్రొక్కి "పరమ మునీంద్ర!
నీదు రాక యెఱుంగనేరక తప్పు
గావించితిని నన్నుఁ గరుణ మన్నించి
యీ విలసితరత్నహేమపీఠమ్ము
నందు నాసీనుఁడ వగుము. మదీయ
మందిర మసమానమహిమమ్ము నొంద.
నను. లోకపాలుర, నా కుక్షి జగము
లను నీదు పాదజలజముల్ పునీత
ములుగ నొనర్చె. సన్మునిచంద్ర. నీదు
నలఘుపుణ్యోపేతమగు పాదజలజ
హతి మదురోంతరమందున భూష
గతినొప్పి నాకు శృంగారమ్ముఁ గూర్చె.

మునినాథ! నీ వంటి పుణ్యులరాక
ననువంటివారి కెంతయు మేలుఁగూర్చు
నేను ధన్యుఁడనైతి నీ రాకవలన
మౌనీంద్ర, నాదు నమస్కృతుల్ గొనుమ”
అని మధురోక్తుల నయ్యాదిమూర్తి
యనునయింపఁగ గడు నానందమొంది
మునివంశతిలకుఁ డమ్మూర్తి లోకేశు
వనజనాభుని జగద్వంద్యు నుతించి
తద్దేవువీడ్కొని తాఁ జనె మునుల
యొద్దకు వేగ నత్యుత్సాహమతిని
అనఘుఁ డా భృగుముని యత్తాపసులకుఁ
దనపోయిన విధమ్ముఁ దాఁ గనుఁగొన్న
మువురుమూర్తులభావములు దేటపడఁగ
వివరింప వీనుల విందుగా వారు 2110
విని మనమ్ములయందు విస్మయ మ్మొంది
ఘను మునివరు భృగుఁ గడు గౌరవించి
తమ శంకలను మాని “దామోదరుండె
కమలాసతీశుఁడే కనకాంబరుండె,
నారాయణుండె యెన్నఁగ ముఖ్యదైవ
మారయఁ దెలిసె సత్యస్థితియంచు
తమ డెందములనెంచి తద్దేవదేవు
విమలమనస్కులై వినుతించి రపుడు
నిఖిలతాపససురనిచయ సంస్తుత్య,
అఖిలాండకోటి బ్రహ్మాండస్వరూప!

వివరింప నజహరుల్ పెద్ద వేలుపులె,
భువనసృష్టికి దానిఁ బొలియించుటకును

సౌరిది కర్తలె గాని చోద్యమ్ము వార
లరయ భూతము భవిష్యము, వర్తమాన
మును దలంపక క్రోధమును బెంచి మొదటి
ఘనదైవతములంచు గణన సేయుటకుఁ
దగని వారైరి. మాధవ, నీవు చూడ
భృగునాగ్రహమ్ము నీ విమల సత్త్వమ్ము
నన మాన్పి, యతనిమానసమును ద్రిప్పి
ఘన సత్త్వగుణవంతుఁగాఁ జేసి, నీవె 2120
దైవములందుఁ బ్రధానదైవముగ
భావింపఁబడితి ప్రపంచమ్మునందు
నీ మహామహిమము నీ శాంతగుణము
తామసగుణులయాత్మల కెట్లు దెలియు ?
ననుఁబోలినట్టి యజ్ఞానులు భువిని
గనఁగలరో, లేరో, కంజదళాక్ష !
ననుఁ గృప మన్నించి జ్ఞానిగఁ జేసి
నిను స్మరియించెడి నియతిని నేర్పి
కాపాడుమా దయాకర, నీలగాత్ర !
నీ పాదములె గతి నీరజనేత్ర !

దశమస్కంధోత్తరభాగము సమాప్తము

——— ——— ———

# ప్రార్థనా భాగవతము

## ఏకాదశస్కంధము

### యాదవుల శాపవృత్తాంతము

శ్రీవాసుదేవ, దాసీభూతసకల
దేవ, జనార్దన, దీనార్తిహరణ!
భవదీయ సంకల్ప బల మనల్పంబె
త్రిభువనరక్ష, యీసృష్టియద్దాని
కనుకూల మార్గంబు లందంద భువిని
గనఁబడుచుండును ఖగపతిగమన!
స్వపరభేదంబుల జాడలఁబోక
యపరాధశిక్షణ మాత్మ నెంచెదవు
సర్వకార్యములకు సాక్షిగా నుండి
నిర్వికారుఁడ వయి నిర్వహించెదవు
నీదు మాహాత్మ్యమ్ము నిఖిలజగమ్ము
పాదుకొనినభక్తి భజియించుచుండు

శ్రీకృష్ణ! యదుకుల క్షీరాబ్ధిచంద్ర!
గోకులానంద, ముకుంద, గోవింద!
యాదవవీరుల కపజయ మ్మెందు
లే దెవ్వరును గెల్వలేరు వీరలను
వీరిని బరిమార్ప వేరుదైవములు
లే రెందునను, భూస్థలిని నేను దక్క
వీరిలో వీరికి ద్వేషమ్ము పెరిగి
పోరాట నెల్లరుఁ బొలిసెడునట్లు

గావింతు నదియె చక్కనిమార్గ "మంచు
భావించితివి నీవు భద్రసంధాత!

## నారదాది మునులు శ్రీకృష్ణునింజూడవచ్చుట

ఒకపరి నినుఁజూచు నుత్సాహ మొదవ
నకలంకమతులు మహాతపోనిధులు
నారదాదిమునులు నగధర! కృష్ణ!
శ్రీ రమానాథ వచ్చిరి. ద్వారవతికి.
వచ్చిన మునులకు వారిజనాభ!
పెచ్చు మర్యాదలు పేర్మి చేసితివి
వారు నీ యాదరభావమ్ము మెచ్చి
బారులుదీరి నీ పజ్జఁ గూర్చుండి
"వనజోదరా! నిన్నుఁ బ్రార్థింపనట్టి
దినములు వమ్మౌై తిరుగుచునుండు
వనములయందుఁ దపంబుననున్నఁ
దనువు లెన్నఁడు శాశ్వతమ్ములుగావు
నీ పాదసేవ పెన్నిధి భక్తతతికి
శ్రీపతీ! నినుఁగొల్వఁ జేరు పున్నెములు
ఒక్కెడ నణువున నొదిగి గన్పడుదు
వొక్కెడ జగమంతయును నీవె యగుదు
పెక్కురూపమ్ముల వెలయుదు మిగుల
నక్కజం బగును మహాత్మ! నీ పెంపు 20
నీ నామభజనంబు నిఖిలరోగముల
మానుపఁ గల మంచిమందు ముకుంద"
అని పెక్కువిధముల యతివరుల్ నిన్ను
వినుతింప నీవు గోవింద యిట్లంటి

"యతివరులార! మీ యాగమనమ్ము
కుతుకమ్ము గూర్చె నెక్కుడుగ నా మదికి
నేమికార్యార్థమై యిటకు మీ రాక?
యా మహాముఖ్య కార్య మదెట్టి దగుఁనొ?
యే నేమి చేయుదు? నెద్ది మీ కోర్కి
యానతీయఁగ వచ్చు హర్ష మేనొంద"
అనుడు మునీంద్రులు "హరి! భవత్పాద
వనజముల్ దర్శించు వాంఛ వచ్చితిమి
దరిసించితిమి కడు ధన్యుల మైతి
మరయ దీనినిమించు నట్టిదౌ యన్య
వరకార్య ముండునే వారిజనాభ!
పరమపూరుష! భక్త పాలన నిరత!"
అని నిన్ను వీడ్కొని యమ్మునివరులు
చనిరి పిండాకర సత్తీర్థమునకు

## మునులు యాదవకులము నాశనముచేయు ముసలము పుట్టునని శపించుట

యాదవవటులు చూలాలి వేషమ్ము
మోదమ్ముతోడ సాంబునకుఁ గల్పించి 30
పిండాకరమ్మందు విశ్రాంతిఁ గనుచు
నుండు మునులముందు నుంచి నవ్వుచును
పరిహాసబుద్ధి గన్పడ మ్రొక్కు లిడుచు
"వరమునులార! యీ పడఁతి గర్భమునఁ
గలబిడ్డ బాలుండొ! కాక బాలికయొ
తెలుపుఁ డటంచుఁ బ్రార్థింపఁగ మునులు

యదుడింభకులఁ గని యాగ్రహ మొంది
"యదుకులమును హతముగునట్లుసేయు
ముసలమ్ము పుట్టు నీ ముగుద గర్భమున
వెస, నింక, జాగేల, వెడలుఁడు మీర
లని ఘోరముగఁ దిట్ట నర్భకు లెల్ల
మునివరతతి శాపమునకు భీతిల్లి
సరగున సాంబు బొజ్జకుఁ గట్టియున్న
యురువస్త్రముల గ్రంథి నొయ్యన విప్ప
నందుండి ముసలమొం డావిర్భవించి
యంద ఱబ్బురపడ నవనిపైఁ బడియె

## యాదవులు కృష్ణునాజ్ఞపై రోఁకలిని చూర్ణ మొనరించి సముద్రమునఁ గలిపివచ్చుట

ఆ రోఁకలింగొని యందఱు నీదు
చేరువ కేతెంచి శ్రీకృష్ణ! నీకు
దానివృత్తాంత మంతయును విన్పింప
జ్ఞానస్వరూప! నీ సంకల్పమహిమ 40
యరయ నట్లగుట నీ యాత్మ నీ వెఱిఁగి
యెఱుఁగ నటుల నంటి విటుల వారలకు
"బుద్ధులుచెడి గర్వమునఁ జెలరేఁగి
బద్ధుమాటలు మునివరులతో నాడి
కులనాశకరమగు ఘోరశాపమ్ము
తెలిసి మీరే పొందితిరి వెఱ్ఱులార!
వరమునీంద్రుల శాపఫణితి వారింప
హరిహర బ్రహ్మలకైనను గాదు

తొలిజన్మకర్మముల్ ద్రోవ నెవ్వరికి
వలనౌనె చింతింపఫలములేదింక
జలధితీరమ్మున శైలమొకండు
గల, దందు నొకపెద్ద కఠినపాషాణ
మున్నది. దాన నీ ముసలమ్ము రాచి
గ్రన్నన దానిచూర్ణ మ్మర్ణవమునఁ
గలిపిరం డిటనుండి కదలిపొం" డనుచు
జలజాక్ష! వారి నాజ్ఞాపించి తీవు
వారటులె యొనర్చి వారిజనాభ!
యా రోఁకలికిఁ గ్రింద నమరిచియున్న
యినుపముక్కను కొంచెమేని లెక్కిడక
వసనిధిఁ బడవైచి వచ్చి రమ్ముక్క 50
మీన మొండు గ్రసించెః మెలఁకువతోడ
దాని నొకండు లుబ్ధకుఁడు జాలమునఁ
బట్టి తదుదరమ్ము వ్రచ్చియందున్న
గట్టి లోహపుముక్కఁ గైకొని తనదు
కోలకు ముల్కిగాఁ గూరిచికొనియె
శ్రీలలనానాథ. చిత్ర మీచరిత

యదువంశజులు నీకు నాత్మీయులైన
మదమెక్కినారని: మహి నపజయముఁ
గనరని: వారినిఁ గడతేర్పఁ దగిన
మనుజులు లేరని. మతినెంచి తీవు.
తపసులరాక. యాదవబాలగణము
కపటనాటకముః లా ఘనమునివరుల
కోపమ్ము శాపమ్ము గోవింద! నీదు
నేఁపగు తలఁపున కేర్పడినట్టి

యనుకూలమైన కార్యమ్ములు దేవ,
వనమాలి, నీ యూహ వమ్ము గాదయ్య!

దామోదరా! నీదు తలఁపుల కెందు
నేమాత్ర మాటంకమే యుండఁబోదు
నీ యనుగ్రహమున నిండుశుభాలు
నీ యాగ్రహమ్మున నిలుచుగష్టాలు 60
జగతి కేర్పడుచుంట సత్యమై తోఁచె
నగవైరి రక్షణ, నాగేంద్రశయన,
ననుఁ గృపఁజూడ మనమ్మున నెంచు
మనఘచరిత్ర, నా కపుడ మేలైన
గౌనములు గలుగు, నీ కొలువు లభించు
ననుపమానంద సౌఖ్యములు చేకూరు
అజహరాద్యమర సమర్చితపాద,
గజరాజవరద, భక్తజనసమ్మోద!

## శ్రీకృష్ణనిర్యాణ కథ

శ్రీవత్సలాంఛన, శ్రీకరవక్ష,
దేవదేవ, మహాత్మ, త్రిదశసంరక్ష,
పరమాత్మ, శ్రీకృష్ణ, భవదవతార
పరమ సంభావ్య శశ్వత్క్రియలెల్ల
నెఱవేర్చి తీవింక నిత్యమైనట్టి
పరమపదముఁజేర భావించుచుంటి
వదియు జగద్ధర్మ మనుసరింపంగ
మదినెంచితీవు రమామనోరమణ,
పరమాత్మ, నీ మహాప్రస్థానయాత్ర
యరయంగ నీ యూహ యట్టులె జరిగె —

## బ్రహ్మాదిదేవతలు శ్రీకృష్ణుని వైకుంఠమునకు నాహ్వానించుట

ఒకనాఁడు పద్మభవోగ్ర దిక్పతులు
సకలదేవతలును సన్మునీంద్రులును. 70
ద్వారకాపురిఁజేరి పరమాత్మ. శ్రీశ
నీరజదళనేత్రు. నిన్ను శ్రీకృష్ణుఁ
గని మ్రొక్కి నుతియించి కడు భక్తి నిలిచి
మనవి యొనర్చిరి మ్మాడ్కి నందఱును
"అభవుఁడ వీవు మహాత్మ. సర్వేశ.
ప్రభవించితివి. భూమిభారమ్ముఁదీర్పఁ
పరమాత్మ. నూటయిర్వదియైదుసమలు
జరిగెను కాలమ్ము జాగేల రమ్ము
వైకుంఠపురి కీవు స్వాగతమిదియ
శ్రీకమలాలయ చిత్తాబ్జభృంగ"

అనవుఁ డ ప్పల్కుల నాలించి. మంచి
దని నీదు సమ్మత మటు వ్యక్తపఱచి
"యాదవులందు వైరానుబంధమ్ము
పాదుకొనంజేసి వారల వారె
హతము చేసికొనెడు నటులు గావించి
క్షితిభారమును మాన్పి చెచ్చెఱ వత్తు
నరుగుఁడు మీ" రని యంప వారెల్ల
హరి నిన్నుఁ బొగడుచు నటనుండి చనిరి.

## ద్వారకయందుఁ గన్పడిన యుత్పాతములు

అంతట ద్వారకయందు నెల్లెడల
వింతయుత్పాతముల్ విరివిగాఁ దోఁచె 80

కాకఘూకములు పగళ్ళనె యిండ్ల
శోకధ్వనులుచేసెఁ జూడనశ్వముల
వాలమ్ములందున వహ్ని జనించె
చాలుగా మోసులు సాదాలఁ మొలిచె
విన నపస్వరములు వినిపించెఁ జిల్క
లును శారికలు చెవు ల్వ్రచ్చెడు నట్టు
లిట్టివి మరికొన్ని దృశ్యమ్ము లచట
నెట్టనఁ గన్పడి నెగులు గల్పించె.
వానిని గని యదువరులు భీతిల్లి
శ్రీనాథ! కృష్ణ! నీ చెంతకు రాఁగ
వారితో "నిందుండవలదు మీ రింక
ఘోరకష్టములు మీకుం గల్గవచ్చుఁ
ద్వరగఁ బ్రభాసతీర్థమునకు మీర
లరుగుట మే"లని యానతిచ్చితివి
నీదు పల్కులు విని నెమ్మది నమ్మి
యాదవు లాత్మభార్యాపుత్రమిత్ర
బల, పశు, గజ, హయవారమ్ముతోడ
నలఘు మోదమ్మున నరిగి రచ్చటికి

## ఉద్ధవుఁడు శ్రీకృష్ణుని యుపదేశమును విని బదరికావనము చేరుట

ఇద్ధచరితుఁడు నీ హితుఁడు విజ్ఞాని
యుద్ధవాఖ్యుండు నీ యుద్దేశములను 90
మనమున నెఱిఁగి నమస్కృతుల్ నీకు
నొనరించి నయవినయోక్తి నిట్లనియె



దేవదేవా! వసుదేవతనూజ!
నీవు యదుకులమ్ము నిర్మూలనమ్ము
గావించి చనిన నెక్కరణి మాశేష
జీవితంబులు సాగు? స్థిరమెద్ది మాకు?
నీ సహచరులమై నిండుమోదమున
నాసన శయన విహారాదికములు
మజ్జన భోజన మంత్రముల్ నీదు
పజ్జను జరపిన భాగ్యమ్ము లెట్లు
మఱువంగ వచ్చును? మా కేదిమార్గ
మెఱిఁగింపవే యన నిట్లంటి వీవు

వినుమ యుద్ధవ! దేవబృందమ్ము వేఁడ
జనియించి దుష్టశిక్షణము గావించి,
వసుధభారమ్మును బాపి శాంతమ్ముఁ
బొసగించితిని సర్వమును భద్ర మయ్యె
ద్వారక యింక సప్తమదివసమున
నీరధి మున్గు మాన్పింపలే రెవరు
యదువంశ మంతతో హతమయి పోవు
నది మొదల్ కలియుగ మవతరించెడిని 100
కలిని మానవులు దుష్కర్మాభిరతులు
కలుషాత్ము లగుదురు గాన నీ వింక
బంధుమిత్రాదుల బాంధవస్నేహ
బంధాదులను వీడి, భక్తిమై తీర్థ
యాత్రలు సలుపుచు నహమును మాని
ధాత్రి. గన్పడువస్తుతతి నశ్వరముగ
నెమ్మది నెఱిఁగి యింద్రియవికారముల
కెమ్మెయి లోనుగా కీషణత్రయముఁ

ద్యజియించి నీదు స్వాంతముఁ జక్కపఱచి
భజియింపు నను నీకు భద్రముల్ గలుగుఁ
జను మిఁక బదరికాశ్రమమున కీవు
ఘనసాంఖ్యయోగమార్గము నాశ్రయించి
కలియుగాంతమ్ము నిష్కలుషజీవితము
సలుపు" మంచతని కాజ్ఞ యొసంగి తీవు
నీ యాజ్ఞ నాలించి, నిండుమోదమున
నా యుద్ధవుండు నీ యడుగుల కెఱఁగి
హృదయాన నీరూప మేర్పడ నిలిపి
బదరికాశ్రమమున వసియింపఁ జనియె.

## యదువంశనాశము

ఆ విధానమున నన్యాయవర్తనుల
నీవు నిర్మూలించి నీతివర్తనులఁ 110
గాపాడి, పిదప నగ్రజసహితముగ
పాపవిధ్వంసక! ద్వారకాపురిని
వదలుట గని యాదవప్రకరమ్ము
మదిరను గ్రోలి యున్మత్తులై పోర
గమకించి, యంతటఁ గడుఁ జెలరేఁగి
సమరమ్ము గావించి చచ్చి రందఱును.

## బలరాముఁడు అనంతునియం దైక్యమునొందుట

ద్వారవతిని వీడి వనజాక్ష, నీవు
సీరియుఁ జని చని చేరితి రొక్క
స్థలమున నచ్చోట సంకర్షణుండు
నిలువక తా నొకండే వేఱుమార్గ

మందునఁ జని, యోగమంది, యనంతు
నందున నప్పుడ యైక్యమ్ము నొందె.

## శ్రీకృష్ణుని కోలతోఁ గొట్టిన లుబ్ధకుఁడు కైవల్యము నందుట

సరసిజనయన! కృష్ణా! నీవు గూడ
మరియొక త్రోవ నెమ్మదిఁ బోయి పోయి
యొకదట్టమగు పొద యోలమ్ముఁ జేరి
యకలంకమతితోడ హాయిఁ గూర్చుండి
పాదమొక్కం డన్యపాదమ్ముపైని
నూది చలింపఁ జేయుచు వినోదించు
తఱి నటకొక్క లుబ్ధకుఁడు వేఁటాడ
నరుదెంచి యటు నిటు లన్నిదిక్కులును 120
వెదకి వెదకి చాల వేసారి తుదకు
పొదరింటిమఱువున పొడగట్టునట్టి
పరమపావన భవత్పాదపద్మమ్ము
హరిణకర్ణమ్ముగా నాత్మలోఁ దలఁచి
మును దాను ఝషగర్భముననుండి కొన్న
ఘనలోహ ఖండసంఘటితమైనట్టి
శరమునువేసెఁ దచ్ఛరముతాకునకు
హరి, కృష్ణ, నీవు 'హా! హా!' యని యఱచి
కదలుచునుండ నీ కడకు నా మృగయుఁ
డదరి పర్విడి వచ్చి యచ్యుతా, నిన్నుఁ
గని నీవు సర్వజగన్నేత వనుచుఁ
గనుఁగొని "స్వామి, నేఁ గఠినచిత్తుండ
పాపిని నపరాధిఁ బరమాత్మ! నన్నుఁ
గాపాడుమా "యని కనుల నీ రొలుక

పరితాపమున నిన్నుఁ బ్రార్థింప, వానిఁ
గరుణించి యిట్లంటి కమలాక్ష! నీవు

"ఓయి లుబ్ధక! బాధ నొందకు మయ్య
యీయది మత్పురాకృత కర్మఫలము
తొలికర్మఫలములఁ ద్రోసిపుచ్చంగ
నలవిగా దెంత మహాత్ముల కైన
కారణమాత్రమే గద నీదు చర్య
వారింపరాదు దైవమునిర్ణయమ్ము"
అని నీవు వాని కాప్యాయనోక్తులను
వినిపించినను వాఁడు విని తృప్తిపడక
ఘనులకు ద్రోహమ్ము గావించినట్టి
యనయులు నాశమ్ము నందుదు" రనుచు
స్వాంతమ్మునందుఁ బశ్చాత్తాప మంది
యంతఃకరణశుద్ధి నలవరించుకొని
ప్రాయోపవేశానఁ బ్రాణముల్ వీడి
పాయనికీర్తి నిర్వాణమ్ము నొందె 130

## శ్రీకృష్ణ వైకుంఠ ప్రాప్తి

దారుకుఁ డంత శ్రీధర, నిన్నుఁ గృష్ణు
నారాయణుని, జగన్నాథుని గాంచి
యతులితసద్భక్తి నంజలిచేసి
పతితపావన! యిట్లు పలికె నీతోడ
"నినుఁజూడ, వినఁ, బల్క, నీ పాదతులసిఁ
గొని మూరుకొనఁగ నీకు సపర్యచేయ
నట్టి పంచేంద్రియవ్యాపార మెల్ల
వట్టిబూటకమును వ్యర్థమ్ము నగును

నను( గృప వీక్షించి నా చేయు మనవి
విని నాదు కర్తవ్య విధి( దెల్పు మయ్య 140
యాదవు లడ(గిరి యాప్తులు మిత్రు
లాది జనమ్మెల్ల నటు నిటు( జనిరి
ఏను ద్వారక కే(గి హితుల కేమందు ?
దీనజనావన, తెలుపవే నాకు!
ననుచుండ నీదు దివ్యాయుధంబులును,
ఘనరథరథ్యముల్ గనుపట్ట వయ్యె
అపుడు దారుకున కీవంటి "ద్వారకకు
నిపుడేగు, మీ వార్తలెల్ల నక్రూర
విదురులకుం దెల్పు విప్పచ్చు( గాంచి
పదిలమ్ముగా స్త్రీల, బాలుర, వృద్ధ
జనులను, గురుల నచ్చట నుండనీక
కొని పొమ్మనుము వేగ( గుంజరపురికి(
దడయకు" మనవు(డు దారుకు డంత(
గడు వేగ(జని, ద్వారకాపురి( దెల్పె
వనజోదరా! నీదువాక్యము లటులె
యొనరించునంతలో నుదధి యప్పురిని
జనులకు( జొర(గ నసాధ్యమౌ నటుల(
గనుచుండ( గనె ముంచె( గడు భీతిదముగ

పరమేశ్వరా! జగద్బాంధవ, కృష్ణ,
గరుడవాహన, భక్తగణరక్ష, నీవు 150
శతకోటిసూర్యతేజమ్మున( గదలి
చతురాననాది నిర్జరులును, మునులు
జయజయశబ్దముల్ సల్పుచు రా(గ
పయనించి నీ సత్యపదము చేరితివి

నారాయణా! జగన్నాథనామమున
నీ రమ్యరూపమ్ము నీరధి చెంత
నెలకొనియున్నది నిఖిలభక్తులకు
నలఘుసంపదలిచ్చి యాదరించుటకు
పరమాత్మ, ప్రహ్లాద వరద, కృపాళు,
కరిరాజసంరక్ష, కారుణ్యజలధి!
నీదు సంకల్పముల్ నిఖిలశరణ్య!
మేదిని వితగాక మృగ్యమ్ముగాక
ప్రత్యక్షమయి జగద్వర్తనమునకు
సత్యమార్గమ్మును జాటుచునుండు
నా రహస్యసరణి నంద తెలుంగ
నేరుతురే! జగన్నియమ నిర్ణేత!
చతురాననాది నిర్జరులును, మునులు
పతితపావన! నిన్ను వైకుంఠమునకుఁ
బిలువ వచ్చుటయును, వింత యుత్పాత
ములు ద్వారవతి ఘోరముగఁ బొడముటయు 160
భవదీయహితబోధ బదరికాటవిని
ప్రవిమల సాంఖ్యవర్తనుఁ డుద్ధవుండు
వసియించుటయు బలభద్రుండు రాముఁ
డసమాన యోగ మాహాత్మ్యంబువలన
ననఘు డనంతునియందుఁ జేరుటయుఁ,
నినుఁ గోలతోఁ గొట్టి నిర్వేద మొంది
బోయఁడు నీ దయ ముక్తి నందుటయుఁ
దోయధిపొంగునుఁ, దోయరుహాక్ష!
నీ తలంపులె, వాని నెరవేర్చినావు
భూతధాత్రిని ధర్మమును నిల్పినావు

వరభక్తగణము సేవలుగొనఁ గడలి
దరి నీదు రూపమ్ముఁ దగ నిల్పినావు
అన్నియుఁ దీఱిచి యమరులు మునులు
సన్నుతింపఁగ భవత్సత్యపదమ్ముఁ
జేరుకొంటివి, హరి, శ్రీరమారమణ.
నారాయణా, కృష్ణ, నతజనపాల!
నీ మహిమ లెఱింగి నిను భజియింప
నే మాత్రమేనియు నెఱుఁగని యట్టి
మందజ్ఞుఁడను నన్ను మన్నించి నీదు
సుందరపాదవిశ్రుతభక్తి నాకు 170
నలవడఁజేసి శ్రేయముఁ గూర్పుమయ్య
జలజాక్ష! భవదీయచరణముల్ వట్టి
వినుతించుచున్నాఁడ విశ్వసంరక్ష!
కనికరింపుమ నన్నుఁ గంజదళాక్ష!

ఏకాదశస్కంధము సమాప్తము

———

# ప్రార్థనా భాగవతము

## ద్వాదశస్కంధము

### పరీక్షిజ్జనపాలుని నిర్వాణ కథ

శ్రీధర, కారుణ్యసింధు, గోవింద,
పాథోధిశయన, నిర్వాణప్రదాత.
నీరజదళనేత్ర! నీదు నిర్ణయము
ధారుణిఁ గడు శాశ్వత మ్మమోఘమ్ము
మనుజులుసేయు కర్మములను బట్టి
పొనఁరించుచుందు విమ్మగ ఫలితముల
నవి తప్ప వెందున నా నిర్ణయముల
భువి దైవనిర్ణయము లని వాకొంద్రు —

ముని శృంగిప్రేరణమునఁ దక్షకుండు
ఘనుని బరీక్షితుఁ గడతేర్పనెంచి
పొఱునిరూపున వచ్చుచునుండి.
దారి సర్పవిషమ్ముఁ దలఁగించు నేర్పుఁ
గలిగిన నొకవిప్రుఁ గాశ్యపాభిఖ్యుఁ
దిలకించి యాతఁడు దృష్టి వహింప
నపరిమితధనంబు లర్పించి, వాని
నృపుని చెంతకుఁ జేరనీయక మరలి
చనున ట్లొనర్చి, తాఁ జని పరీక్షితుని
గని యా నృపునిచెంతఁగల వారిచేత
ఫలమొం డొసంగి, యా పట్టుననుండి
తలఁగెఁ నంతట వారు తత్ఫల మపుడు

క్షితినాథుడౌ పరీక్షిజ్జనపతికి
నతిప్రియంబున నీయ నాతఁ డా ఫలముఁ
జవిచూచుచుండఁ దత్క్షణమ యందుండి
లవమాత్ర క్రిమిగ వెల్వడి యంతలోన
నతిభయదాకృతి నహి యయి రాజు
శితదంష్ట్ర దష్టుగాఁ జేసి తత్క్షణమ
చనెఁః దద్విషాగ్నిచే జననాయకుండు
కనుచుండఁగనె బూదిగా దగ్ధ మయ్యె
నా రాజుమృతికి హాహారవంబులను
బోరున గావించెఁ బుడమిజనమ్ము

## జనమేజయుఁడు జరుపుచున్న సర్పయాగమును అంగీరసుఁడు మాన్పించుటః

జనకునిమృతి విని జనమేజయుండు
కనలుపెల్లున భుజంగమజాతి ప్రళయ
మౌ నటుల్ మదినెంచి. యజ్ఞమ్ము సేయ
నానాసహస్రపన్నగములు వ్రందెఁ
గాని తక్షకుఁడు నాకమున మహేంద్రు
తో నుంట యెఱిఁగి యస్తోకమాహాత్మ్య
మంత్రరాజముల బ్రాహ్మణులు పఠింప
మంత్రబలమ్మున మఘవుఁ డాక్షణమ
యా తక్షకునితోడ నధ్వరవహ్నిఁ
గాతరుఁ డగుచు వేగమ పడుచుండ 20
న త్తఱి నచటికి నాంగీరసుండు
త త్తరిల్లుచువచ్చి తన్మఖక ర్త

జనమేజయునిగాంచి శాంతవాక్కులను
వినిచి యాగమ్ము మాన్పించె నంతటను
ఆ మంగళాంత కార్యమ్మును గాంచి
ప్రేముడి విరివాన విబుధబృందమ్ము
గురియించె. శాంతించి కువలయేశుండు
కరము మోదమ్మునఁ గరిపురిఁ జేరె
సర్వలోకమ్ముల శాంతి చేకూరె
సర్వమ్ము కల్యాణ సంస్తుత్య మయ్యె

## ప్రార్థనా భాగవత ప్రశస్తి

అనుదినప్రార్థన కనుకూల మగుచు
ననుపమానందాప్తి కాకర మగుచు
నపవర్గమార్గ బోధాత్మక మగుచు
నపరిమితాఘమేఘానిల మగుచు
వసుధ నీ ప్రార్థనాభాగవతమ్ము
నసి మానవోత్తమ సంప్రార్థ్య మగుచు
నారవి తారక మయి వేంకటేశు
కారుణ్యదృష్టి భాగ్యము నొందుఁగాక 29

## కవి : గ్రంథ ప్రశస్తి

శ్రీకర వేంకటాద్రికి దక్షిణాశ
ప్రాకట కీర్తిసంపదలఁ జెల్వొంది
"అనృణసరోవర" మనియెడు పేరు
గను "అప్పళయగుంట" గ్రామమ్మునందు
కనమలూరన్వయ కలశాబ్ధివిధుఁడు
ఘనుఁడు విద్వన్నుతఖ్యాతయశుండు

నైన వేంకటసుబ్బయాఖ్య కవీంద్రు
సూనుండు సునయుండు, సుజనమాన్యుండు
శివరామనామప్రసిద్ధిఁ గన్నట్టి
కవితల్లజుండు వేంకటనాథుకరుణ
విజ్ఞులు మెచ్చంగ ద్విపదకావ్యముగఁ
బ్రజ్ఞావిశేషాన రచియించినట్టి
ప్రథగన్న ప్రార్థనాభాగవతమున
ప్రథమభాగానంతరమ్మున నిద్ది
దశమమ్మునుండి ద్వాదశి తుదిగాఁగ
విశదభావస్ఫూర్తి వెలయఁ జేయుచును
స్కంధత్రయమ్మున జానొంది మిగుల
బంధురమై మలిభాగమై, పూర్ణ
కావ్యమై, పుణ్యసంగతమై, బుధార్య
సేవ్యమై, హృద్యమై, చెల్లె నాంధ్రమున. 39

ద్వాదశస్కంధము సమాప్తము

మంగళమ్

— —

# శోధనిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 56 | 17 | మనమ్ము | మనము |
| 77 | 18 | భూజమ్ములన్ని | భూజములన్ని |
| 77 | 21 | ఆవిపద్దశ | అవమతినటు |
| 79 | 16 | నీదుసంకల్పముల్ | నీమహిమంబులు |
| 79 | 19 | క్రూరుఁడతండు | కుటిలుఁడతండు |
| 150 | 25 | ధర్మకర్తలకు | ధర్మకర్మలకు |
| 154 | 2 | భజియించి | భుజియించి |
| 168 | 1 | అనియీామె | అనియామె |
| 225 | 7 | జూచనే | జూచెనే |
| 225 | 14 | రోషమున | రోషమును |
| 235 | 15 | యెంచుచున్న | యెంచుచునున్న |
| 276 | 10 | సంతసము | సంతసమ్మున |
| 282 | 24 | ?రకాసురుఁడు | నరకాసురుండు |
| 297 | 10 | పంప | పంపె |
| 336 | 8 | సంవేద్య | వేద్య |
| 345 | 20 | నిమ్మిడి | నిమ్మడి |



